# వీక్షణం

రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక

సంపుటి : 10 సంచిక : 7 హైదరాబాద్ 132 జూలై 2012 పేజీలు : 68 రు. 15

- ఉప ఎన్నికల్లో గెలిచిందెవరు?
- అంబేద్కర్ కార్టూన్ వివాదం
- ఇథనాల్ పేరుతో మద్యం తయారీ
- ముస్లిం రిజర్వేషన్‌లు - రాజ్యాంగం
- పన్నుల ఎగవేత, నల్లధనం సమస్య
- 2020 తరువాత ఏం జరగబోతోంది?
- ఈజిప్ట్ పరిణామాలు

132

# వీక్షణం

రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక

జూలై 2012
సంపుటి : 10
సంచిక : 7



## లోపలి పేజీల్లో...





ప్రింటర్స్
**డక్కన్ ప్రెస్ /**
**చరితా ఇంప్రెషన్స్**
ఆజామాబాద్, హైదరాబాద్
ఫోన్ : 040 - 27678411

డిస్ట్రిబ్యూటర్స్
**ఆనంద్ ఏజన్సీస్**
హైదరాబాద్
ఫోన్ : 98484 28516
92468 26191

'వీక్షణం' పేరిట ఎం.ఓ.లు, చెక్కులు, డి.డి లు పంపాల్సిన చిరునామా

**వీక్షణం**

మైత్రీ రెసిడెన్సీ, 3-6-394,
స్ట్రీట్ నెం. 3, హిమాయత్‌నగర్,
హైదరాబాద్ - 500 029.
ఫాక్స్, ఫోన్ : 040-66843495

Email : veekshanam2003@gmail.com
www.veekshanam.wordpress.com

**వీక్షణం చందా వివరాలు**

| | సంస్థలకు / లైబ్రరీలకు | వ్యక్తులకు | విద్యార్థులకు |
|---|---|---|---|
| విడి ప్రతి | రు. 15 | రు. 15 | రు. 15 |
| సంవత్సరం | రు. 180 | రు. 150 | రు. 120 |
| మూడు సంవత్సరాలు | రు. 500 | రు. 400 | రు. 350 |
| ఐదు సంవత్సరాలు | రు. 800 | రు. 650 | – |
| పది సంవత్సరాలు | రు. 1500 | రు. 1300 | – |

వీక్షణం అకౌంట్ నెంబర్ – **013911011002175**
ఆంధ్రాబ్యాంక్, గగన్‌మహల్ బ్రాంచ్, హైదరాబాద్
ఇతర బ్యాంకులలో వేసేవారు **ANDB 000/0139** నెంబర్ రాసి వేయవచ్చు.

**మిత్రులకూ, శ్రేయోభిలాషులకూ కృతజ్ఞతలు**

**వీక్షణం ఆర్థిక స్థితి గురించి విజ్ఞప్తికి ప్రతిస్పందనగా మే నెలలో అందిన విరాళాలు, సహాయాలు**

*నల్వా ప్రభాకర్, టీచర్, జనగాం రు. 1000; ఎ. మధు, త్రిలోచన్‌పూర్, కలహండి, ఒడిశా రు. 1000; జి.కె.ఎస్. రాజా, హైదరాబాద్ రు. 2500; చేలూరి రమాదేవి, హైదరాబాద్ రు. 4000*

**వీ**క్షణం తొలి దశాబ్ది సందర్భంలో శుభాకాంక్షలు. పత్రికా రంగంలో నిజాల్ని నిర్భయంగా చెబుతూ, ఎవరి కొమ్మూ కాయకుండా, ప్రలోభాలకు లొంగకుండా, నమ్మిన సిద్ధాంతానికి, ధ్యేయాలకు కట్టుబడి పది సంవత్సరాలు మనడమంటే, అదీ మన్నికతో, మన్ననతో, ఈ రోజుల్లో గొప్ప విషయమే. సుదూరాల నుండి పత్రిక గురించి రాసే అనేకమంది అభిప్రాయాల్ని చదివితే నిజాయితీ గల పత్రికలకు ప్రజల్లో గల అభిమానం, ఎదురుచూపు గమనిస్తే, సత్యానికి ఇంకా ప్రాధాన్యత ఉంది అనిపించి ఊరట కలుగుతుంది. పత్రిక దశాబ్ది సంచికను తీర్చిదిద్దడంలో రచయితల, మేధావుల, నిర్వాహకుల సరసన చేరలేనందుకు చింతిస్తూ ఉడతాభక్తిగా చిన్న విరాళాన్ని మాత్రం పంపగలుగుతున్నాను. నేను గతంలో చెప్పిన విషయమే, మన పత్రికలో గతకాలపు అమూల్యమయిన సాహిత్య పరిచయాలు చేస్తే బావుంటుందన్న సూచన మరోసారి గుర్తుచేస్తూ, జూలై 8న జరిగే సమాశానికి హాజరు కాగలనని తెలియజేస్తున్నాను.

– ***జి.కె.ఎస్. రాజా,*** *హైదరాబాద్*

**వీ**క్షణం జూన్ 2012 సంచికలో 'రాజ్యం–ప్రజా ఉద్యమం–బందీలు' వ్యాసంలో పలు సందర్భాలలో నక్సలైట్లకు, ప్రభుత్వానికి మధ్యవర్తిగా వ్యవహరించిన రచయిత ప్రొఫెసర్ జి. హరగోపాల్ తమ స్వీయ అనుభవాలను, అభిప్రాయాలను వివరంగా పాఠకులతో పంచుకున్నారు. సుదీర్ఘకాలం పాటు ప్రభుత్వానికి అత్యంత సన్నిహితంగా మెలిగిన ఐఏఎస్ అధికారులకు సైతం ప్రభుత్వ నిగూఢ, కపట బుద్ధి గురించి బోధపడని విషయం ఈ వ్యాసంలో స్పష్టంగా కనిపిస్తుంది. ఇదే సంచికలో ప్రచురితమైన 'పాలనా విధానాల వికృత శిశువు అవినీతి' వ్యాసం ఆలోచింపచేసే విధంగా ఉంది. ఇటీవల కాలంలో దేశంలో ప్రభుత్వ భాగస్వామ్యంతో చోటుచేసు కుంటున్న లక్షల కోట్ల రూపాయల విలువ చేసే అవినీతి కుంభకోణాల గురించి తెలియపరుస్తూ సాగిన ఈ వ్యాసంలో ప్రజా సంపదను కొల్లగొట్టేందుకు, బహుళజాతి కంపెనీలకు ధారాదత్తం చేసేందుకు సుదీర్ఘకాలంగా ప్రభుత్వాలు అవలంబిస్తున్న బరితెగించిన ధోరణి గురించి నిరంతరం నిరాటంకంగా, వేగవంతంగా పెరిగిపోతున్న విచ్చలవిడితనం గురించి తెలుసుకోవచ్చు.

– ***ఎస్. కిశోర్ కుమార్,*** *హైదరాబాద్*

**నా**సిరకం, డూప్లికేటు విత్తనాలు బహిరంగంగా, అత్యధిక ధరలకు అమ్ముతున్నారు. బాగా పబ్లిసిటీతో రైతులను నమ్మించి, వంచించి పత్తి విత్తనాలను అమ్ముకొని సొమ్ము చేసుకుంటున్నారు. దురదృష్టవశాత్తు వ్యవసాయ అధికారుల ప్రమేయం, పరీక్షలు, తనిఖీలు అసలు ఉండవు. దాంతో విత్తనాల ఖరీదుకు, ఎరువులకు ఎక్కువ మొత్తంలో పెట్టుబడులు పెట్టి అవి విఫలం అయి, బలి అవుతున్నారు. అప్పులు తీర్చలేక ఆత్మహత్యలు చేసుకుంటున్నారు. ఇది విషాదకరమైన పరిస్థితి. విత్తనాలు తయారు చేసుకొనే విజ్ఞానం, నిధులు, సదుపాయాలు, శిక్షణ, ప్రేరణ కల్పిస్తే, తమ కొరకు తాము పంటల సక్సెస్ కొరకు కృషి చేసి మంచి విత్తనాలు తయారు చేసుకొంటారు. ఇది అద్భుతమైన ఆలోచన, పథకం. డా. కోలా రాజమోహన్ 'విత్తన తయారీ హక్కు రైతులదే' చక్కగా వివరించారు. ఇది బాగా రైతులలోకి వెళ్లాలి. తగిన ఏర్పాట్లు చేయాలి. డా. కోలా గారికి కృతజ్ఞతలు.

– ***డి. దుర్గాంబ,*** *మిర్యాలగూడ, నల్లగొండ*

**వీ**క్షణం జూన్ సంచికలో వచ్చిన 'రాజ్యం– ప్రజా ఉద్యమం– బందీలు' అనే వ్యాసం బాగుంది. రచయిత రాజ్యానికి, మావోయిస్టులకు, మావోయిస్టుల తరఫున మధ్యవర్తిగా మూడుసార్లు వెళ్లిన తన అనుభవాలను చాలా వివరంగా వివరించారు. మావోయిస్టులు ఒక ప్రభుత్వ ఉద్యోగినో లేక ఒక ప్రజాప్రతినిధినో కిడ్నాప్ చేస్తే దానిని కార్పొరేట్ ప్రెస్, ఎలక్ట్రానిక్ మీడియాలు తాటికాయంత అక్షరాలతో పేపర్లలో, టివిలలో సామ్రాజ్యవాదుల, వారికి తొత్తులైన పాలక వర్గాల మెప్పుకోసం మావోయిస్టులపై, విప్లవోద్యమంపై, విప్లవ పంథాపై తప్పుడు ప్రచారం చేస్తూ అత్యుత్సాహం ప్రదర్శిస్తాయి. కాని కిడ్నాప్‌కు గల కారణాలను కూడా ప్రచారం చేయవు. ఇకపోతే అమలుకాని, అమలుకు పూనుకోని రాజ్యాంగాన్ని పట్టుకొని కొంతమంది బుద్ధిజీవులు, ఆలోచనాపరులు, మేధావులు, న్యాయ విశ్లేషకులు, టివి చానళ్లలో పూనకం వచ్చిన వారిలా ఇది అన్యాయం, అక్రమం, చట్టాన్ని చేతుల్లోకి తీసుకొనే హక్కు మావోయిస్టులకు ఎవరిచ్చారని ప్రశ్నిస్తుంటారు. పోలీసులు, పారామిలటరీ సైన్యం, గ్రేహౌండ్స్ (వేటకుక్కలు), కోబ్రాలు(నల్లత్రాచులు), భారత అర్ధసైనిక బలగాలు అడవిలోకి, ఆదివాసీల గ్రామాల్లోకి ఎందుకు వెళ్లుతున్నాయని, ఎందుకు పంపుతున్నారని, వాటికి అక్కడ ఏం పని అని ఎవరూ అడగరు. ఈ ప్రశ్న వారి ఆలోచనకు తట్టినా వారు రాజ్యాన్ని ప్రశ్నించరు. ఎందుకంటే వారు కట్టుకున్న గూడు చెదిరిపోలేదు. వారి కాళ్ల కింద ఉన్న నేల కబ్జా కాలేదు. అన్యాయానికి గురి కాలేదు. అందుకే వారు ఈ రాజ్యాన్ని ప్రశ్నించరు. వికృతి గురించి ఆలోచించేవారికి ప్రకృతి గురించి ఏం తెలుసు. తరతరాలు అడవిని అంటిపెట్టుకొని జీవిస్తున్న ఆదివాసుల దగ్గరికి వెళ్లి విప్లవోద్యమం మీకు ఏం ఇచ్చిందని అడిగితే వారు విప్లవోద్యమం మమ్ములను మనుషులుగా గుర్తించదని చెబుతారు. ఇది కొంత మందికి వింతగా ఉండొచ్చు. కాని అరవై ఏండ్లు నిండిన స్వాతంత్ర్య ఆదివాసుల దరిదాపుల్లోకి కూడా పోలేదు. కాని ముప్పై వసంతాలు నిండిన విప్లవోద్యమం ఆదివాసులను మనుషులుగా గుర్తించి తనదైన సర్కారును ఏర్పర్చి నూతన సమాజం వైపు నడిపిస్తోంది. నేడు ఆదివాసులు చావడానికైనా సిద్ధమే గాని సామ్రాజ్యవాదులకు లొంగమంటున్నారు.

– ***సృజన్,*** *కల్వకుర్తి, మహబూబ్‌నగర్*

---

వీక్షణం జూన్ 2012 సంచికలో డా. జి. లచ్చయ్య వ్యాసం 'విద్యార్థులకు చరిత్రను ఎలా బోధిస్తున్నాం?'లో 50వ పేజీలో ఎడమ కాలంలోని రెండవ లైనులో 'బొమిడివరం' బదులు 'బొమిడికం'గా చదువుకోగలరు. మూడవ పేరాలో 'ఇరోం షర్మిల' బదులు 'ఇరోం చాను షర్మిల'గా, మూడవ లైన్‌లో 'నవంబర్ 2009'ని 'నవంబర్ 2000'గా చదవగలరు. అలాగే, 40వ పేజీలో జాన్ బర్నబాస్ వ్యాసం 'జడ్జి ఊళ్లో వెట్టి చాకిరీ, సాంఘిక బహిష్కరణ' వ్యాసంలో మొదటి పేరా నాలుగోలైన్‌లో 'ఈడిగ (గాడ్)' బదులు 'ఈడిగ (గౌడ)'గా చదువుకోగలరు. – సం.

**అసహజ మరణాల సూచి జిల్లాల కరస్పాండెంట్లు**

ఆదిలాబాద్ – సి.ఎచ్. శ్రీమన్నారాయణ మూర్తి; హైదరాబాద్ – డి. విజయభాస్కర్; కరీంనగర్ – ద్యామర రేణుక; ఖమ్మం – సి.ఎచ్. గిరిజ; మెదక్ – ఎన్. భగవాన్‌రెడ్డి; మహబూబ్‌నగర్ – మహమ్మద్ ఎక్బాల్; నల్గొండ – గొడిశాల వెంకటేశ్వర్లు; నిజామాబాద్ – ఎం. నర్సయ్య; రంగారెడ్డి – వి. శంకరయ్య; వరంగల్ – ఎ.కుమార్; అనంతపూర్ – కె. నాగేశ్వరాచారి; చిత్తూరు – పలమనేరు బాలాజి; కర్నూలు – జి.వి. సుధాకర్ రెడ్డి; గుంటూరు – బి. అంజమ్మ ; నెల్లూరు – బాలగురువయ్య; విజయనగరం – డి. సుధాకర్; తూర్పు గోదావరి, పశ్చిమ గోదావరి, శ్రీకాకుళం – ఏకుల మల్లేశ్ (ఇంటర్నెట్ ద్వారా)

వీక్షణం

# వానలు లేవు, విత్తనాలు లేవు, మద్యం మాత్రం పుష్కలం!

ఇది రాసే సమయానికి వానకాలం ప్రవేశించి ఇరవై రోజులు అవుతున్నది. అంటే నైరుతి రుతుపవనాల ప్రభావంతో రాష్ట్రమంతటా విస్తారంగా వానలు పడి, వాగులూ వంకలూ పారి, చెరువులు నిండి, ఏరువాక సాగి, దుక్కులు దున్ని, విత్తనాలు చల్లి, ముమ్మరంగా వ్యవసాయ పనులు నడుస్తుండవలసిన స్థితి. కాని నైరుతి రుతుపవనాలు రాష్ట్రంలో ప్రవేశించడానికే పది రోజులు ఆలస్యమయింది. ప్రవేశించాక కూడ రెండు మూడు రోజులు వానలు పడి ఆగిపోయాయి. ఇప్పటికి రాష్ట్రంలో కురిసి ఉండవలసిన వర్షపాతంలో సగం కూడ కురవలేదు. మధ్యలో నేల తడిసిందని ఆశతో వేసిన విత్తనాలు మొలకెత్తే పరిస్థితి లేదు. రెండు జీవనదులు ప్రవహిస్తూ, అన్నపూర్ణ అని పేరు తెచ్చుకున్న ఈ రాష్ట్రంలో వలస పాలన తొలగి ఆరు దశాబ్దాలు గడిచిన తర్వాత కూడ మొత్తం విస్తీర్ణంలో మూడో వంతుకు కూడ రక్షిత నీటి పారుదల సౌకర్యాలు లేని దౌర్భాగ్యం కొనసాగుతున్నది. మిగిలిన మూడింటరెండు వంతుల వర్షాధార వ్యవసాయ భూభాగంలో రైతులు మృగశిర ప్రవేశించిన నాటినుంచీ రాని మేఘాలవైపు ఎదురుతెన్నులు చూడక తప్పడంలేదు. అత్యాధునిక పాలనా యంత్రాంగాలూ సాంకేతిక పద్ధతులూ ఎన్నో ఉన్నప్పటికీ తెలుగు సీమ రైతు ఇంకా ప్రకృతికి అధీనంగా, నిస్సహాయంగా తెలియని ఏ తీవ్ర శక్తులో నడిపిస్తే నడిచిన అజ్ఞానపుటంధ యుగంలోనే ఉండవలసి వస్తున్నది. అంతమాత్రమే కాదు, నాలుగు చినుకులు పడినచోట అదునుచూసి దుక్కులు దున్ని విత్తనాలు వేద్దామంటే ఆ విత్తనాలూ దొరకని స్థితి. తాము పండించిన దానిలోంచే విత్తనాలు దాచుకునే ప్రాచీన వివేకాన్ని రద్దు చేసిన పాలక, వ్యాపార వర్గాలు, ప్రతి గింజకూ దేశదేశాల బడా విత్తన వ్యాపార సంస్థల ముందు మోకరిల్లే దుస్థితిని తెచ్చిపెట్టాయి. ఆ వ్యాపారసంస్థలు కృత్రిమ విత్తనాల కొరత సృష్టించి రైతుల నిస్సహాయ స్థితిని ఇబ్బడిముబ్బడి లాభాలుగా మార్చుకుంటుంటే ప్రభుత్వ నియంత్రణ వ్యవస్థలు మౌనసాక్షిగా, అక్రమాల భాగస్వామిగా ఉండిపోతున్నాయి. సంక్షేమరాజ్య భావనలో భాగంగా మేలైన విత్తనాలు సరైన ధరలకు అందించడానికే ఏర్పాటయిన ప్రభుత్వరంగ విత్తన సంస్థలు ఉన్నాయో లేవో తెలియని స్థితి. బిటి పత్తి విత్తనాల సంచికి ప్రభుత్వం నిర్ణయించిన ధర రు. 930 కాగా, చీకటి బజారు వ్యాపారులు రు. 2000 నుంచి రు. 2500 వరకూ అమ్ముతున్నారని, ధరలు పెంచడానికి కృత్రిమ కొరతను సృష్టిస్తున్నారని వార్తలు వస్తున్నాయి. ఆ వ్యాపారసంస్థల మీద నియంత్రణ లేదు, నిఘా లేదు, విచారణ లేదు, శిక్షలు అసలే లేవు. ఈ స్థితిలో రాష్ట్రం నలుమూలల నుంచీ విత్తనాల కోసం రైతులు పడుతున్న ఇబ్బందుల, ఆందోళనల వార్తలు వస్తున్నాయి. హైబ్రిడ్, క్రాస్ బ్రీడ్, ఎక్కువ దిగుబడి వంగడాల వంటి ఆధునిక విత్తనాలు మాత్రమే కాక దేశవాళీ మామూలు విత్తనాల కోసం కూడ రైతులు పడిగాపులు పడవలసి వస్తోందనీ, రైతుల అవసరాలను తీర్చగలిగిన పరిమాణంలో విత్తనాలు లేవని వ్యాపారులు చెపుతున్నారనీ వార్తలు వస్తున్నాయి. పత్తి, వేరుశనగ, పొద్దుతిరుగుడు, సోయాబీన్ వంటి వాణిజ్య పంటల విత్తనాలు మాత్రమే కాదు, వరి, జొన్న, మక్కజొన్న, పెసర, మినుము, కంది, జనుము, ఆముదం వంటి సాంప్రదాయిక విత్తనాలకు కూడ రైతులు కొరతను ఎదుర్కొంటున్నారు. విత్తనాలను నిలువ చేసి ఎక్కువ ధరకు అమ్ముకుంటున్న ఉదంతాలు బయటపడుతున్నాయి. నామమాత్రంగా ఎక్కడో ఒకచోట దాడి చేసి విత్తనాల నిలువలను పట్టుకున్న వార్తలు వస్తున్నా, మొత్తం మీద అధికారులకూ అక్రమ విత్తన వ్యాపారులకూ లాలూచీ నిష్పూచీగా సాగి పోతున్నది. అటు వానలూ దైవాధీనమై, ఇటు విత్తనాలు, ఎరువులు కూడ నియంత్రణ లేక దైవాధీనంలా మారిపోయి తొలకరితోనే రైతాంగం ఆందోళనల పర్వం మొదలయింది. రాష్ట్ర జనాభాలో డెబ్బై శాతం ఆధారపడే వ్యవసాయరంగ దుస్థితిని సవరించడానికి ఎటువంటి చిన్నమెత్తు ప్రయత్నమూ చేయని ప్రభుత్వం మద్యం వ్యాపార నేర రాజకీయాలకు అదనపు అవకాశాలు కల్పించడానికి మాత్రం అత్యుత్సాహం ప్రదర్శించి కొత్త మద్యం విధానాన్ని ప్రకటించింది. ఒక్కొక్క గ్రామంలో, పట్టణంలో జనాభాను బట్టి మద్యం అమ్మకాలను అంచనావేసి, దాన్నిబట్టి లైసెన్స్ రుసుం నిర్ణయించింది. గతంలోని వేలం పాట ద్వారా మద్యం దుకాణాలను అప్పగించే పద్ధతి స్థానంలో ప్రస్తుతం లాటరీ పద్ధతి ప్రవేశపెట్టారు. దుకాణాలు పెట్టదలచుకున్నవారు రు. 25,000 రుసుం కట్టి దరఖాస్తు చేస్తే దరఖాస్తుదారుల పేర్లలో ఒకరి పేరును లాటరీ ద్వారా నిర్ణయిస్తారు. దరఖాస్తుదారులు మరొకరికి దుకాణం ఇవ్వగూడదని, మరొకరిని భాగస్వాములుగా చేర్చుకోవాలంటే అనుమతి తీసుకోవాలని ఆంక్షలు విధించి, తద్వారా బేనామీలను అడ్డుకోవచ్చునని చెపుతున్నారు. కాని ఈ ఆంక్షలన్నిటినీ అధిగమించి మళ్లీ పాత నేర రాజకీయ వ్యాపారులే మద్యం దుకాణాలను ఆక్రమించగలరని ఎవరయినా ఊహించగలరు. అసలు జనాభాను బట్టి తాగుబోతులు ఎంతమంది ఉండగలరో, ఎంత మద్యం అమ్మకం కాగలదో నిర్ణయించడమే దుర్మార్గం. లైసెన్స్ రుసుంకు ఆరు రెట్ల విలువైన మద్యాన్ని అమ్ముకోవచ్చునని, అంతకన్న ఎక్కువ అమ్మదలచుకుంటే కొనుగోలు మీద అదనంగా 8 శాతం పన్ను చెల్లించాలని కొత్త నిబంధన విధించారు. అంటే లైసెన్స్ ఫీ కన్న ఆరు రెట్ల విలువైన మద్యం అమ్మకాలు కనీసంగా ఉంటాయన్న మాట. పదివేల లోపు జనాభా ఉన్న గ్రామంలో లైసెన్స్ ఫీ రు. 32.50 లక్షలు. అంటే ఆ గ్రామంలో కనీసం ఒక కోటి తొంబై ఐదు లక్షల రూపాయల మద్యం అమ్ముకోవచ్చు. అంటే ప్రతిరోజూ ప్రజలు తమ చెమటా నెత్తురూ వెచ్చించి సంపాదించిన ధనంలోంచి యాభై వేల రూపాయలు మద్యానికే దుబారా అయిపోతాయి. ఈ నిర్ణీత కోటాకు మించిన అమ్మకాలు, కనీస గరిష్ట ధర కన్న ఎక్కువ అమ్మకాలు సరేసరి. ఆరోగ్య, సామాజిక, సాంస్కృతిక అనర్థాల ప్రస్తావన లేకుండానే సాగే ప్రజాధన నష్టం, బందిపోటు దొంగతనం ఇది. ఇంత పెద్ద ఎత్తున ప్రజాధన దోపిడీ విధానాన్ని ప్రభుత్వమే ప్రకటించడం, దాని ద్వారా పన్నుల ఆదాయం వస్తుందని, దానివల్ల ఆర్థిక వ్యవస్థ నడుస్తుందని బుకాయించడం పాలకవర్గాల దుర్మార్గానికి చిహ్నం. సాంస్కృతిక, నైతిక కారణాలతో మాత్రమే కాదు, రాజకీయార్థిక కారణాలతో కూడ మద్యనిషేధం అమలు చేయాలని ప్రజాఉద్యమం నిర్మించవలసిన అత్యవసర సందర్భం ఇది.

వీ

# రాష్ట్రపతి ఎన్నికల్లో అవకాశవాదానికే గెలుపు

రాష్ట్రపతిగా ఎవరు ఓడినా, ఎవరు గెలిచినా దేశానికి, దేశ ప్రజలకు ఒరిగేదేమీ లేదు. దేశ ప్రజల మౌలిక రాజకీయార్థిక సామాజిక సమస్యలు తీరబోవు. కాని, ప్రజలను తమ నిజమైన నిత్యజీవిత సమస్యలనుంచి, ఆ సమస్యల పరిష్కారం కొరకు జరపవలసిన పోరాటాల నుంచి పక్కదారి పట్టించడానికి ఈ దేశ పాలకులు పన్నిన అనేక వలలలో ఒకటి ఈ ఎన్నికల తతంగం. అటు యుపిఎ అభ్యర్థి ప్రణబ్ ముఖర్జీ గెలిచినా, ఇటు ఎన్‌డిఎ అభ్యర్థి పిఎ సంగ్మా గెలిచినా ఏమీ తేడా ఉండబోదు గాని ఈ అభ్యర్థిత్వాల విషయంలో, ఎన్నికల విషయంలో అన్ని పార్లమెంటరీ రాజకీయ పక్షాలు ఆడుతున్న ఆటలు రసవత్తరంగా ఉన్నాయి. ముదురు ఎరుపు నుంచి కాషాయం దాకా ఈ దేశ పార్లమెంటరీ రాజకీయ పక్షాలన్నిటికీ ఎటువంటి మినహాయింపులు లేకుండా అబ్బిన అవకాశవాద రాజకీయాలకు రాష్ట్రపతి ఎన్నికలు అద్దం పడుతున్నాయి. ఈసారి రాష్ట్రపతి ఎన్నికలో ప్రత్యేకంగా ఇంత పెద్ద ఎత్తున అవకాశవాద రాజకీయాలు కనబడడానికి నిర్దిష్టమైన సందర్భం ఉంది. దేశ రాజకీయ, ఆర్థిక వ్యవస్థలు భయంకరమైన సంక్షోభంలో కూరుకుపోయి ఉన్న భౌతిక పరిస్థితి వల్ల అన్ని పాలకవర్గ, పార్లమెంటరీ రాజకీయపక్షాల ఆచరణ ఇలా ఉండక తప్పదు. మరొకవైపు ఆ సంక్షోభం వల్లనే పాలకవర్గ ముఠా తగాదాలు నానాటికీ తీవ్రతరం అవుతున్నాయి. ఈ ముఠా తగాదాల వల్ల కేంద్రంలోనూ, రాష్ట్రంలోనూ భిన్న రాజకీయపక్షాల ప్రభుత్వాలు, వాటి మధ్య ఒకచోట మైత్రి, మరొకచోట ఘర్షణ కనబడుతున్నాయి. రాష్ట్రపతి ఎన్నికకు వోటర్ల నియోజకవర్గంగా ఉండే లోకసభ, రాజ్యసభ సభ్యులు, వివిధ రాష్ట్రాల శాసనసభ, శాసనమండలి సభ్యులు వేరువేరు రాజకీయ పార్టీలకు చెందినవారు కాబట్టి ఎవరు ఎటు వోటు వేస్తారో స్పష్టంగా చెప్పగల స్థితి లేదు. కేంద్రంలో ఒక కూటమిగా ఉన్న వారే రాష్ట్రాలలో వేరు కుంపట్లతో ఉన్నారు. ఒకే కూటమి వారందరూ ఒకేలా వోటు వేస్తారనుకున్నా ఈ ఎన్నికల ప్రత్యేక లెక్కింపు పద్ధతి సమస్యను మరింత క్లిష్టం చేస్తున్నది. ఈ నియోజకవర్గ వోటర్లందరి విలువలో సగానికన్న ఎక్కువ వస్తేనే గెలుపు ఖాయమవుతుంది. కాని ఏ ఒక్క కూటమికి కూడ సగానికన్న ఎక్కువ వోట్లు లేవు. అందువల్ల అభ్యర్థులిద్దరూ వారి వారి రాజకీయ, భావజాల నిబద్ధతలను పక్కనపెట్టి శత్రువులనూ, ప్రత్యర్థులనూ, మిత్రులనూ కూడ వోట్లు అడుక్కునే యావలో పడ్డారు. వోటర్లందరూ కూడ తమ రాజకీయ, భావజాల నిబద్ధతలను పక్కనపెట్టి స్వప్రయోజనాల కోసం ఎవరికి వోటు వేయాలో లెక్కలు వేసుకుంటున్నారు. కప్పల తక్కెడలో కప్పలు ఒక పళ్లెంలోంచి మరొక పళ్లెం లోకి దూకుతున్నాయి. అత్యున్నత పదవి, ప్రతిష్టాత్మకమైన పదవి, వివాదం చేయకూడని పదవి అంటూ గంభీరమైన అబద్ధాలతో తమ వైఖరులను సమర్థించుకుంటున్నాయి. ఆ పదవి అంత పవిత్రమైనదేమీ కాదని, ఈ దేశ పార్లమెంటరీ రాజకీయాల కుళ్లు అంతా ఆ పదవికి అంటి ఉందని, చరిత్ర చెప్పే నిజాన్ని ఇవాళ్టి ఎన్నికలు మరొకసారి నిరూపిస్తున్నాయి. వీ

# ఈజిప్ట్‌లో గెలుపు ప్రజా ఉద్యమానిదేనా?

ఏడాదిన్నర కింద ఈజిప్ట్ రాజధాని నగరం కైరోలో నైలు నదీ తీరాన తెహ్రీర్ స్క్వేర్‌లో ఎగిరిన స్వేచ్ఛాపతాక ఇవాళ ప్రజాస్వామ్య ఎన్నికల ముసుగు వేసుకున్న సైనిక పదఘట్టనల కింద నేలరాలుతున్నది. మూడు దశాబ్దాల పాటు నిరంకుశ ఏకచ్ఛత్రాధిపత్యం వహించిన అధ్యక్షుడు హోస్నీ ముబారక్ ను కూలదోసిన ఆ తిరుగుబాటు ఎలా పర్యవసిస్తుందా అని ప్రపంచ ప్రగతిశీల శక్తులన్నీ ఊపిరి బిగబట్టి ఎదురుచూశాయి. నియంతృత్వానికి వ్యతిరేకంగా ఉవ్వెత్తున ఎగసిన ఆ ప్రజా వెల్లువలో మతఛాందస శక్తులనుంచి విప్లవశక్తులదాకా అందరూ పాల్గొన్నందువల్ల, ఆ వెల్లువను తమ వైపు తిప్పుకోవడానికి సామ్రాజ్యవాదుల నుంచి పాత పాలకవర్గాల దాకా, సైనికాధికారుల దాకా ప్రతి ఒక్కరూ ప్రయత్నించినందువల్ల తెహ్రీర్ స్క్వేర్ ప్రజాఉద్యమంలో అంతిమంగా ప్రజలు గెలవకపోవచ్చుననే అనుమానాన్ని విశ్లేషకులు వెలిబుచ్చారు. ముబారక్ కుటుంబం దేశం వదిలి పారిపోవడం, ముబారక్‌ను బోనెక్కించి, విచారించి, శిక్ష విధించడం వంటి అనుకూల ఫలితాలను సాధించినప్పటికీ, ఈజిప్ట్ ప్రజాఉద్యమానికి నాయకత్వం వహించి దాన్ని నిజంగా ప్రజల విజయంగా మార్చగలిగినంత బలాన్ని ప్రగతిశీల శక్తులు సంతరించుకోలేదు. దానితో ఏర్పడిన ప్రతిష్టంభనలో సైన్యానిదే పైచేయి అయింది. ఈజిప్షియన్ సైన్యంలోని 21 మంది సీనియర్ అధికారులతో ఏర్పడిన సుప్రీం కౌన్సిల్ ఆఫ్ ఆర్మ్‌డ్ ఫోర్సెస్ (స్కాఫ్) దేశపు నిజమైన పాలకవర్గంగా మారింది. ప్రజాస్వామ్యం గురించి పైకి ఎన్ని ధర్మపన్నాలు పలికినా సామ్రాజ్యవాదులు ఈ స్కాఫ్‌కే తమ అండదండలు అందించారు. స్కాఫ్ పాలనా పగ్గాలను తన చేతుల్లోకి తీసుకుని పార్లమెంటును రద్దు చేసింది. రాజ్యాంగాన్ని రద్దు చేసింది. అధ్యక్షపదవికి, పార్లమెంటుకు ఎన్నికలు జరుపుతానని, ప్రజాస్వామిక పాలనను ఏర్పాటు చేస్తానని హామీ ఇచ్చింది. ఆ మాటకు కట్టుబడినట్టుగానే అధ్యక్ష ఎన్నికలు ప్రకటించింది. కాని రాజ్యాంగమే లేకుండా, అధ్యక్ష పదవి విధులు, బాధ్యతలు ఖరారు కాకుండా ఆ పదవికి అర్థమే లేదు. ఆ పదవికి ముబారక్ అనుచరుడు, మాజీ ప్రధాని అహ్మద్ షఫిఖ్, ముస్లిం బ్రదర్‌హుడ్ నాయకుడు మహ్మద్ మొర్సి, మరొక పది మంది అభ్యర్థులు పోటీ పడ్డారు. ఎవరు గెలిచినా సైన్యానిదే ఆధిపత్యం అని తెలుసుగనుక 43 శాతం మంది మాత్రమే పోలింగ్‌లో పాల్గొన్నారు. ఐదు కోట్ల మంది వోటర్లలో రెండుకోట్ల ముప్పై లక్షల వోట్లు పడగా, అందులో మొర్సికి 52 శాతం, షఫిఖ్‌కు 48 శాతం వోట్లు వచ్చి, మొర్సి అధ్యక్షుడయ్యాడు. తనది మతవాద ఛాందస పార్టీ కాదని, ఐక్యసంఘటన ప్రభుత్వాన్ని ఏర్పరుస్తానని వాగ్దానాలు చేస్తున్నప్పటికీ, ఈ కొత్త అధ్యక్షుడు సైన్యం చేతుల్లో, ఆ సైన్యాన్ని నడిపిస్తున్న సామ్రాజ్యవాద శక్తుల చేతుల్లో కీలుబొమ్మగా తప్ప స్వతంత్రంగా పాలన సాగించలేడు. ప్రజావెల్లువలు అప్రమత్తంగా లేకపోతే, లక్ష్య స్పష్టత లేకపోతే, ప్రజాదృక్పథంతో నడవకపోతే ప్రజాఉద్యమ కెరటాల మీద కూడ ప్రజావ్యతిరేకులు, ఇతరులు స్వారీ చేయగలరనే చేదు పాఠాన్ని ఈజిప్ట్ నేర్పుతున్నది. వీ







- **ఫ్రెంచి పాలనలో యానాం** – బొల్లోజు బాబా – 201 పేజీలు, 1/8 డెమీ, రు: 150, ప్రతులకు: బొల్లోజు బాబా, డోర్ నెం. 30–7–31, గొల్లల వీథి, సూర్యనారాయణపురం, కాకినాడ, తూర్పు గోదావరి; సెల్: 9849320443, ఈమెయిల్ : bollojubaba@gmail.com
- **ఆనందభైరవి** – కథలు – దేశెట్టి కేశవరావు – విఎన్ఆర్ బుక్ వరల్డ్ – 160 పేజీలు, 1/8 డెమీ, రు: 70, ప్రతులకు: విఎన్ఆర్ బుక్ వరల్డ్, చౌడెపల్లె, చిత్తూరు – 517 257; ఫోన్: 08581–256090, ఇమెయిల్ : vnrbookworld@gmail.com
- **ఆర్ద్రసంద్రం** – ఎన్వీ – సంపాదకులు: డా. అయినవోలు ఉషాదేవి, అగ్నిమిత్ర – 166 పేజీలు, 1/8 డెమీ, రు: 60, ప్రతులకు: అన్ని ప్రముఖ పుస్తక షాపులలో
- **సామాజిక రాజకీయ విప్లవం – బౌద్ధ సాంస్కృతిక నిర్మాణం** – డా. బి.ఆర్. అంబేద్కర్ – సంపాదకులు: డా. కత్తి పద్మారావు, లోకాయుక్త ప్రచురణలు – 182 పేజీలు, 1/8 డెమీ, రు: 100, ప్రతులకు: కత్తి స్వర్ణకుమారి, అంబేద్కర్ రీసెర్చ్ సెంటర్, 6–3–600/ఎ/2/1, ఎఫ్–5, తేజస్విని అపార్ట్‌మెంట్స్, హిల్‌టాప్ కాలనీ, ఎర్రమంజిల్, హైదరాబాద్ – 500082, సెల్:9849741695; ఇమెయిల్ : padmaraokathi@yahoo.co.in అన్ని పుస్తక షాపులలో
- **జ్ఞాపకాలు** – (అనుభూతుల సంకలనం) – డా. కె. సుబ్బనాచారి – జన విజ్ఞాన వేదిక – 88 పేజీలు, 1/8 డెమీ, రు: 25, ప్రతులకు: జి. మల్యాద్రి, కన్వీనర్, ప్రచురణల విభాగం, జన విజ్ఞాన వేదిక, 162, విజయలక్ష్మి నగర్, నెల్లూరు – 524004, సెల్:9440503061
- **ఫార్మ్ ల్యాండ్ ఫ్రాగ్రెన్స్** – అన్నవరం దేవేందర్, తెలుగు నుంచి ఇంగ్లిష్‌లోకి అనువాదం: పి. జయలక్ష్మి – యుగాది పబ్లిషర్స్ – 62 పేజీలు, 1/8 డెమీ, రు: 100, ప్రతులకు: రాజేశ్వరి, ఫ్లాట్ నెం. 406, మారుతి హెవెన్స్, భగత్‌నగర్, కరీంనగర్ – 505001; సెల్: 9440763479; ఇమెయిల్ : annavaramdev@gmail.com
- **కరీంనగర్ ఖాన్‌దాన్** – ప్రాచీన చారిత్రక వ్యాసాలు – సంపాదకులు: డా. నలిమెల భాస్కర్, అన్నవరం దేవేందర్ – సాహితీ సోపతి – 144 పేజీలు, 1/8 డెమీ, రు: 75, ప్రతులకు: నలిమెల సావిత్రి, ఇ.నెం. 9–5–218/1, ప్రగతినగర్, రాంనగర్, కరీంనగర్ – 505001, సెల్: 9704374081, 9440763479; ఇమెయిల్ : annavaramdev@gmail.com
- **సమ్మోహనం** – కోటం చంద్రశేఖర్ – కళాభారతి ప్రచురణలు – 173 పేజీలు, 1/8 డెమీ, రు: 50, ప్రతులకు: కోటం చంద్రశేఖర్, 4–2–120, విజ్ఞానపురి కాలనీ, తాండూరు, రంగారెడ్డి, సెల్:9492043348
- **రాత్రి పగలు... ఒక మెలుకువ** –కథలు – బి.వి.ఎన్. స్వామి – సంపాదకులు: కర్ర ఎల్లారెడ్డి – తెలంగాణ సాహితీ పబ్లికేషన్స్ – 104 పేజీలు, 1/8 డెమీ, రు: 85, ప్రతులకు: కర్ర విజయ, 2–5–426, అదాలత్ వెనుక, హనుమకొండ – 506001; విశాలాంధ్ర బుక్‌హౌస్, సహచర బుక్ మార్క్, దిశ పుస్తక కేంద్రం, నవోదయ బుక్ హౌస్, నవయుగ బుక్‌హౌస్
- **హంసధ్వని రెక్కలు** – ద్యావరి నరేందర్ రెడ్డి – కళాభారతి సాహిత్య సాంస్కృతిక వేదిక – 68 పేజీలు, 1/8 డెమీ, వెల లేదు, ప్రతులకు: ద్యావరి నరేందర్ రెడ్డి, 5–5–27/1, ధన్‌గర్‌గల్లి, తాండూరు, రంగారెడ్డి, సెల్:9848995597










## బిసిలకు ఉప ప్రణాళిక

బిసి కులాలు, సంఘాల రాష్ట్రస్థాయి ప్లీనరీ సమావేశం మే 20న హైదరాబాద్‌లోని జూబ్లీహాల్‌లో జరిగింది. వందల సంఖ్యలో ప్రతినిధులు పాల్గొన్నారు. ఆ సందర్భంగా జాతీయ, రాష్ట్ర స్థాయిలో బిసిల సంక్షేమం కోసం తీసుకోవలసిన కార్యక్రమాలపై ప్లీనరి 32 తీర్మానాలు చేసింది. చట్టసభల్లో, నామినేటెడ్ పదవుల్లో 50 శాతం రిజర్వేషన్లు, పదివేల కోట్ల రూపాయలతో ప్రత్యేక ప్రణాళిక, వచ్చే ఎన్నికల్లో అన్ని రాజకీయ పార్టీలు కనీసం వంద సీట్లు ఇవ్వాలి, దేశ వ్యాప్తంగా ఫీజు రియింబర్స్‌మెంట్ అమలు చేయాలి వంటివి ఈ తీర్మానాల్లో కొన్ని.

## హంపీ ఎక్స్‌ప్రెస్ ప్రమాదం

మే 22 తెల్లవారు జామున 3.20 నిమిషాలకు హంపీ ఎక్స్‌ప్రెస్ అనంతపురం జిల్లా పెనుకొండ రైల్వేస్టేషన్ చేరేముందు స్టేషన్ రెండో ట్రాక్‌పై ఆగి ఉన్న గూడ్స్ బండిని ఢీకొట్టడంతో ఇరవై ఐదు మంది చనిపోయారు. యాభై మంది గాయపడ్డారు.

## పెట్రోల్ ధర పెంపు

పెట్రోల్ ధరలపై నియంత్రణ ఎత్తివేస్తూ కేంద్ర ప్రభుత్వం 2010 జూన్ 25న నిర్ణయం తీసుకున్నాక ఈ రెండేళ్ల కాలంలో ఆయిల్ కంపెనీలు 13 సార్లు పెట్రోల్ ధరలు పెంచివేసాయి. పార్లమెంట్ సమావేశాలు మే 22న ముగిసాక ఆయిల్ కంపెనీల అభ్యర్థన మేరకు కేంద్ర ప్రభుత్వం పెట్రోల్ ధరను పెంచడానికి అనుమతిచ్చింది. ఈ ప్రభావంతో రాష్ట్రంలో 33 శాతం వ్యాట్ కలుపుకొని లీటర్ పెట్రోల్‌కు రు.8.30 పైసలు పెరిగింది. దీనిపై ప్రతిపక్షాలు, ప్రజాసంఘాలు, ప్రజలు తీవ్ర నిరసన వ్యక్తం చేశారు.

## టెన్త్ ఫలితాల్లో 87.84 శాతం ఉత్తీర్ణత

టెన్త్ ఫలితాలు మే 24న విడుదలయ్యాయి. రాష్ట్రవ్యాప్తంగా 10,49,689 మంది రెగ్యులర్ విద్యార్థులు పరీక్షలకు హాజరయ్యారు. వీరిలో 9,22,121 మంది ఉత్తీర్ణులయ్యారు. ఉత్తీర్ణులయిన వారిలో బాలికలు 4,54,642 కాగా, బాలురు 4,67,479గా ఉన్నారు. మొత్తంగా 87.84 శాతం ఉత్తీర్ణత నమోదు అయింది. ప్రైవేట్ విద్యార్థుల విషయానికి వస్తే 2,27,327 మంది పరీక్షలు రాయగా వీరిలో 1,01,930 (44.83 శాతం) మంది ఉత్తీర్ణులయ్యారు.

## చుక్కపల్లి పిచ్చయ్య కన్నుమూత

పాపులర్ షూమార్ట్ గొలుసు దుకాణాల అధినేత చుక్కపల్లి పిచ్చయ్య (84) మే 24న విజయవాడలోని ఒక ప్రైవేట్ ఆస్పత్రిలో కన్నుమూసారు. 1962లో విజయవాడలో ఆయన పాపులర్ షూమార్ట్ ప్రారంభించారు. అంచెలంచెలుగా ఎదుగుతూ పాదరక్షల వ్యాపారంలో అగ్రగామిగా నిలిచారు. ఆంధ్రప్రదేశ్, కర్ణాటక రాష్ట్రాలలో 195 పాదరక్షల షాపులను ఆయన నిర్వహిస్తున్నారు. 'మొట్టమొదటి సోషలిస్ట్ దేశం రష్యాలో కొద్దిరోజులు', 'ఆలోచించండి' శీర్షికన ఆయన రాసిన పుస్తకాలు లక్షల ప్రతులు పంపిణీ అయ్యాయి. ఆయన పలు అవార్డులు అందుకున్నారు.

## అక్రమ ఆస్తులను స్వాధీనం చేసుకోవాలి

ఆర్థిక నేరాలను ఉక్కుపాదంతో అణచివేయాల్సిందేనని రాష్ట్ర ఉన్నత న్యాయస్థానం తేల్చి చెప్పింది. జగన్‌ను ఐదురోజుల కస్టడీకి అప్పగించాలన్న సిబిఐ వినతిని మన్నిస్తూ జూన్ 2న జారీ చేసిన ఉత్తర్వుల్లో జస్టిస్ చంద్రకుమార్ పై విధంగా వ్యాఖానించారు. ఆస్తులు ఏ రూపంలో దాచినా వాటిని స్వాధీనం చేసుకొని ప్రజల విద్యా, వైద్యాల కోసం ఉపయోగించాలన్నారు. ఒకవైపు లక్షలాది మంది ప్రజలు ఆకలితో అలమటిస్తున్నారనీ, లక్షలాది మంది యువత నిరుద్యోగ సమస్యతో బాధపడుతున్నారని, మరోవైపు తీవ్ర ఆర్థిక నేరాలతో దేశ ఆర్థిక వ్యవస్థ మొత్తం కుదేలవుతోందని జస్టిస్ చంద్రకుమార్ వ్యాఖ్యానించారు.

## జగన్ అరెస్ట్!

జగన్ అక్రమాస్తుల కేసులో హైకోర్టు సిబిఐ దర్యాప్తుకు ఆదేశించింది. నాలుగు నెలలకు పైగా విచారించిన సిబిఐ ఎఫ్ఐఆర్ నమోదు చేసింది. ఇందులో వైఎస్ జగన్‌ను ముద్దాయిగా పేర్కొంది. గుర్తు తెలియని వ్యక్తులు, అధికారులు సహా 73 మందిని నిందితులుగా పేర్కొంది. జగన్‌కు చెందిన ఏడు కంపెనీలను నిందితుల జాబితాలో చేర్చింది. ఈ కేసుకు సంబంధించి సిబిఐ 3 చార్జిషీట్లు దాఖలు చేసింది. ఎ1 గా ఉన్న జగన్‌ను సిబిఐ మే 27 సాయంత్రం అరెస్టు చేసింది.

## కార్టూనిస్ట్ వెంకట్ మృతి

ప్రముఖ కార్టూనిస్ట్ సి.ఎచ్. వెంకట్ జూన్ 5న నాంపల్లి ఆస్పత్రిలో గుండె పోటుతో మరణించారు. విలక్షణమైన కార్టూన్లతో ఆయన తెలుగు సమాజానికి సుపరిచితులు. స్టేట్స్‌మెన్, న్యూస్‌టైమ్ పత్రికల్లో దశాబ్ద కాలం పాటు కార్టూనిస్ట్‌గా పనిచేశారు. తెలుగు, ఆంగ్ల భాషలపై పట్టు ఉన్న వెంకట్ వేల సంఖ్యలో కార్టూన్‌లు వేయడంతో పాటు రాష్ట్రంలో 'పొలిటికల్ కార్టూనిస్ట్ ఫోరం' ఏర్పాటులో విశేష కృషి చేశారు.

## ప్లాంట్ వద్దు.. కాలుష్యమూ వద్దు!

విశాఖ జిల్లా రాంబెల్లి మండలం సీతపాలెం గ్రామంలో రు. 334 కోట్ల వ్యయంతో ఏర్పాటు చేయతలపెట్టిన ప్లాంట్‌ను మా వూరికి రానివ్వమని చాటమెట్ట గ్రామస్తులు ఎదురు తిరిగారు. ప్రజాభిప్రాయ సేకరణకు వచ్చిన అధికారులను జూన్ 6న అడ్డుకున్నారు. రాంబెల్లి మండలం లాలంకోడూరు శివారు సీతపాలెం సమీపంలోని చాటమెట్ట వద్ద కాల్షినైట్ పెట్రోలియం కోక్ ప్లాంట్ (సన్‌వీరా ఇండస్ట్రీస్ లిమిటెడ్) ఏర్పాటుకు ఓ ప్రైవేట్ కంపెనీ యాజమాన్యం 77 ఎకరాలు సేకరించింది. 0.46 మెట్రిక్ టన్నుల కాల్షినేట్ పెట్రోలియం కోక్, 25 మెగావాట్ల విద్యుత్ ఉత్పత్తి లక్ష్యంగా ప్లాంట్ ఏర్పాటుకు తలపెట్టింది. దీన్ని వ్యతిరేకిస్తూ 36 గ్రామాల ప్రజలు ఆందోళన చేస్తున్నారు. వీ

## ముస్లిం, మైనారిటీలకు రిజర్వేషన్‌లు ఇవ్వాలి

కేంద్ర ప్రభుత్వ విద్య, ఉద్యోగాల్లో వెనుకబడిన కులాల కోటా కింద కేటాయించిన 4.5 శాతం రిజర్వేషన్ చెల్లదని రాష్ట్ర హైకోర్టు డివిజన్ బెంచ్ మే 28న తీర్పునిచ్చింది. ఈ విషయంలో కేంద్రం చాలా నిర్లక్ష్యంగా వ్యవహరించిందని వ్యాఖ్యానించింది. బిసిలకు కేటాయించిన 27 శాతం రిజర్వేషన్‌లోంచే సామాజికంగా వెనుకబడిన మైనారిటీలకు 4.5 శాతం సబ్ కోటా కల్పిస్తూ 22 డిసెంబర్ 2011న కేంద్ర ప్రభుత్వం ఒక ఆఫీస్ మెమోరాండం (ఒ.ఎం) ను విడుదల చేసింది. దీనిపై బిసి సంక్షేమ సంఘం రాష్ట్ర అధ్యక్షుడు ఆర్. కృష్ణయ్య, పెరిక విద్యార్థి వసతి గృహ ట్రస్ట్ మాజీ ప్రధాన కార్యదర్శి సి.ఎచ్. ఎలమంద, వీవర్స్ వెల్ఫేర్ ట్రస్ట్ ప్రతినిధి కె.స్వామి దాఖలు చేసిన పిటిషన్‌ను జస్టిస్ బి. లోకూర్, జస్టిస్ సంజయ్‌కుమార్ లతో కూడిన ధర్మాసనం విచారించింది. ఈ రిజర్వేషన్ అమలుకు సిఫారసు చేసిన జస్టిస్ రంగనాథ్ మిశ్రా కమిషన్ ఏర్పాటే చట్టబద్ధం కాదని అభిప్రాయ పడింది. ముస్లింలు, క్రిస్టియన్‌లు, సిక్కులు, బౌద్ధులు, జొరాస్ట్రియన్‌లను అందరినీ కలిపి 'ఒకే జాతి'గా పేర్కొనడం సరికాదని, వీరంతా 'వేర్వేరు జాతులు' అని వ్యాఖ్యానించింది. అయితే వాస్తవానికి హిందూ మతంలోని కులాల వెనుకబాటు ఆధారంగానే రిజర్వేషన్‌లు ఇస్తున్నారు. హిందూ మతం కాకుండా క్రిస్టియన్ మతాన్ని ఆచరిస్తున్న దళితులు తమ ఎస్‌సి రిజర్వేషన్‌ను కోల్పోయి బిసి సి (1 శాతం) రిజర్వేషన్‌ను పొందుతున్నారు. కొనసాగుతున్న రిజర్వేషన్‌లు మతపరంగానే అని చెప్పడానికి ఇది ఒక ఉదాహరణ. అందువల్ల మతం ఆధారంగా రిజర్వేషన్‌లు చెల్లవని చెప్పడంలో న్యాయం లేదు. మారుతున్న కాలంలో, మారుతున్న పరిస్థితుల్లో ప్రజాసమూహాల జనాభా దామాషాను అనుసరించి, వెనుకబాటును దృష్టిలో ఉంచుకొని రిజర్వేషన్‌లు ఇవ్వాలి. ఈ దేశంలో ముస్లిం, మైనారిటీలలో 90 శాతం మంది పేదలుగా, అతి పేదలుగా ఉన్నారు. వారికిచ్చే రిజర్వేషన్‌కు బిసిలలో ఇచ్చే రిజర్వేషన్‌లలో కాకుండా ప్రత్యేకంగా ఇవ్వాలి. మొత్తం జనాభా శాతంలో సగం శాతం మందికి వర్తించేలా ఇస్తున్న రిజర్వేషన్‌ల సామాజిక న్యాయాన్ని వెనుకబడిన ముస్లిం, మైనారిటీలకూ వర్తింపజేయాలి. అయితే బిసిలతో, ఇతర వెనుకబడిన ప్రజాసమూహాలతో వైరుధ్యాన్ని తెచ్చేలా మాత్రం కాదు.

## న్యాయంతో సహా అన్నీ కొనుక్కోవచ్చు!

ఓబుళాపురం ఇనుప ఖనిజం గనుల తవ్వకాలలో అక్రమాలు, అవినీతి వ్యవహారాలకు సంబంధించి రాష్ట్రంలోని సిబిఐ ప్రత్యేక కోర్టులలో విచారణ జరుగుతోంది. ఇనుప ఖనిజం అక్రమ తవ్వకాలతో కోట్లాది రూపాయలు సంపాదించుకున్న గాలి జనార్ధనరెడ్డి నిందితుడు. గాలి జనార్ధనరెడ్డికి మే 12న సిబిఐ ప్రత్యేక కోర్టు బెయిల్ మంజూరు చేసింది. హైదరాబాద్‌లో ఇటీవలి వరకు ఒకే సిబిఐ కోర్టు ఉండేది. అయితే కేసుల సంఖ్య పెరగడంతో మరో మూడు అదనపు కోర్టులు ఏర్పాటయ్యాయి. అందులో మొదటి కోర్టులో జడ్జిగా ఉన్న పట్టాభి రామారావు, రెండో కోర్టు జడ్జి సెలవుపై వెళ్లినప్పుడు, ఆ కోర్టు బాధ్యతలూ చూశారు. ఈ క్రమంలో గాలి జనార్ధనరెడ్డి బెయిల్ పిటిషన్ ఆయన ముందుకు విచారణకు వచ్చింది. విచారణ క్రమంలో భాగంగా పట్టాభి రామారావు మే 12న గాలి జనార్ధనరెడ్డికి బెయిల్ మంజూరు చేస్తూ ఉత్తర్వులిచ్చారు. గాలి జనార్ధనరెడ్డికి బెయిల్ ఇచ్చినందుకు పట్టాభి రామారావుకు ఐదు కోట్ల రూపాయలు లంచంగా ముట్టినట్లు సిబిఐ తన పరిశోధనలో తేల్చింది. ఆ క్రమంలో పట్టాభి రామారావు అరెస్టై జైలు పాలయ్యారు. కేసు దర్యాప్తులో ఉంది. మొత్తంగా గాలి జనార్ధనరెడ్డి తాను బెయిల్ పొందేందుకు, వివిధ స్థాయిల్లో చెల్లింపులు చేయడానికి అరవై కోట్ల రూపాయలు కేటాయించినట్టు వార్తలు వస్తున్నాయి. ఈ వ్యవస్థలో చాలా సందర్భాలలో న్యాయస్థానాన్ని చాలా ప్రత్యేకమైందిగా చూపించే ఒరవడి ఉంది. అయితే ఆ న్యాయస్థానాలు కూడా పాలకులకు, కుల, మత, వర్గ, లింగ ప్రలోభాలకు, ఆశ్రిత పక్షపాతాలకు అతీతంగా లేవని చాలా సందర్భాల్లో నిరూపణ అయింది. కోట్లాది రూపాయల ప్రజా ధనాన్ని, ప్రకృతి వనరులను మింగేసిన వాళ్లు, అన్నిటితో పాటు న్యాయాన్నీ కొనుక్కుంటున్నారు. మరోపక్క ఈ దేశంలోని అట్టడుగు వర్గాల ప్రజలు చిన్న చిన్న ఆరోపణలతో, చిన్న చిన్న నేరాలకు పాల్పడి, చిన్న చిన్న ఘర్షణలలో చిక్కుకొని, నిందితులుగాను, నేరస్తులుగాను ఏళ్ల తరబడి జైళ్లలో మగ్గుతున్నారు. అలా జైళ్లలో మగ్గుతున్న వారిలో ఎక్కువ మంది ముస్లింలు, దళితులు, ఆదివాసులే. వారితోపాటు తాము నమ్మిన సిద్ధాంతాల కోసం, అట్టడుగు వర్గాల ప్రజల కోసం పోరాడుతున్న ఉద్యమకారులూ 15-20 ఏళ్లకు పైగా జైలు కటకటాల వెనుక మగ్గుతున్నారు. ఇదీ మన ప్రజాస్వామ్య స్ఫూర్తి!

## రక్తం చిందించిన లక్ష్మింపేట దళితులు!

పదేళ్ల క్రితం శ్రీకాకుళం జిల్లాలోని సువర్ణముఖి నదిపై మడ్డువలస గ్రామ పరిధిలో డ్యాం కట్టారు. అందుకు అవసరమైన సుమారు మూడు వేల ఎకరాల భూమి చుట్టుపక్కల ఏడు గ్రామాల రైతుల నుండి ప్రభుత్వం సేకరించింది. రైతులకు ఎకరాకు రెండు లక్షల యాభై వేల రూపాయల చొప్పున నష్టపరిహారం చెల్లించింది. ఆయా గ్రామాలలో దళితులకు ఉన్న అసైన్డ్ భూములకు నష్టపరిహారం ఇవ్వలేదు. కొట్టిస, కొప్పర, దేవకవాడ, నరేంద్రపురం, గుడివాడ, లక్ష్మింపేట గ్రామాలు ముంపుకు గురయ్యే గ్రామాలుగా గుర్తించి వారికి వేర్వేరు చోట్ల గ్రామాలను నిర్మించారు. పాత ఇళ్లకు నష్టపరిహారం చెల్లించారు. అందులో కూడా దళితుల ఇళ్లకు ఏడు ఎనిమిది వేల రూపాయల చొప్పున, పలుకుబడి కలిగిన వారికి యాభై, అరవై వేల రూపాయల చొప్పున నష్టపరిహారం చెల్లించారు. ఈ విధంగా కొత్తగా రూపొందిన గ్రామాలలో లక్ష్మింపేట ఒకటి. లక్ష్మింపేటలో తూర్పు కాపు 85, మాల 72, మంగలి 2, సాలె 4, చాకలి 5, గోండ్ల 2 (చెరువులో చాపలు పట్టుకునేవారు), కోమటి 2 కుటుంబాల వారు జీవిస్తున్నారు. లక్ష్మింపేట పక్కనే ముంపుకు గురికాని భూమి 250 ఎకరాలు ఉంది. అందులో 190 ఎకరాలు కాపులు, 60 ఎకరాలు మాలలు సాగు చేసుకుంటున్నారు. మాలలు సాగు చేసుకుంటున్న భూమిని కూడా కాపులే స్వాధీనం చేసుకుందామనే ప్రయత్నంలో భాగంగా గత రెండేళ్లుగా ఆ ఊళ్లో ఘర్షణలు జరుగుతున్నాయి. ఈ భూమి సమస్యను నాయకులు ఎవరూ పరిష్కరించలేదు. కోర్టుకు వెళితే ఆ 250 ఎకరాల భూమిని సాగుచేయ వద్దని ఆదేశించింది. అప్పటి నుండి భూమి బీడు పడింది. అప్పటి నుంచి దళితులపై వేధింపులు మరింత తీవ్రమయ్యాయి. ఆ క్రమంలోనే జూన్ 12 ఉదయాన తూర్పు కాపు కులస్తులు మాలలపై దాడి చేశారు. ఈ దాడిలో చిత్తరి అప్పడు (35), బూరాడ సుందరరావు (32), నివర్తి వెంకటరావు (40), నివర్తి సంగమేసు (40) మరణించారు. ఆసుపత్రిలో చికిత్స పొందుతూ మరొక వ్యక్తి మరణించారు. ఐదుగురు మహిళలతో సహా మొత్తం ఇరవై మూడు మంది కాళ్లు చేతులు విరిగి, కనుగుడ్లు పోగొట్టుకొని విశాఖపట్టణం, శ్రీకాకుళంలో చికిత్స పొందుతున్నారు. భూమి, భుక్తి, విముక్తి, ఆత్మగౌరవాల కోసం ఈ దేశంలో దళితుల, ఆదివాసుల, అట్టడుగు వర్గాల ప్రజల పెనుగులాట కొనసాగుతూనే ఉంది. పరిష్కారాలు చూపించే ఉద్దేశం ఈ పాలకులకు లేదు.

వార్త - వ్యాఖ్య : డి.వి. రామకృష్ణారావు

వీ

ఆదివాసుల అడ్డు తొలగించుకోవడం సామ్రాజ్యవాదులకు, బడా పారిశ్రామిక వేత్తలకు, పాలకులకు తక్షణ కర్తవ్యంగా ఉంది. అందుకోసం ఆయా రాష్ట్ర ప్రభుత్వాలు సల్వాజుడుం, హర్మద్‌వాహిని, శాంతిసేన లాంటి కిరాయి సేనలను సృష్టించి ఆదివాసుల పైకి ఉసిగొల్పుతున్నాయి. ఆ హంతకమూకలు ఆదివాసీల గూడెలు తగులబెట్టడం, మహిళలపై సామూహిక అత్యాచారాలు, హత్యలు చేస్తున్నారు. మరోవైపు కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు సమన్వయంతో పారా మిలిటరీ దళాలను అడవుల్లో దించాయి. నాగా బెటాలియన్, గ్రేహౌండ్స్, కోబ్రా పేర్లతో ఆదివాసీ గూడేలపై పడి బీభత్సం సృష్టిస్తున్నాయి. మహిళలపై అత్యాచారాలు చేస్తున్నారు. మన రాష్ట్రంలో జరిగిన వాకపల్లి, భల్లుగూడ ఆదివాసీ మహిళలపై గ్రేహౌండ్స్ పోలీసుల సామూహిక అత్యాచారాలు అందుకు సాక్ష్యాలుగా మన ముందున్నాయి.

***సంపాదకీయం, కుల నిర్మూలన ద్వైమాసిక పత్రిక, మార్చ్-ఏప్రిల్ 2012***

ఈ 250 ఎకరాలూ ఒకే చోట ఉన్నాయి. కాపులు చేసుకుంటున్న 190 ఎకరాలు, మాలలు చేసుకుంటున్న 60 ఎకరాలూ అన్నీ కలిసే ఉన్నాయి. 'మా పక్కన మాల వాళ్లు భూమి సాగు చేయటమా, సహించటానికి వీల్లేదు' కాపులు నిర్ణయించుకున్నారు. గత రెండేళ్లుగా మాలల్ని బెదిరిస్తున్నారు. కొడుతున్నారు. ఆడవాళ్లనూ కొట్టారు. కేసుల్లేవు. దెబ్బలకు ఒకామె చనిపోయింది కూడా. 'కొట్టినా, చంపినా కేసుల్లేవు. వద్దని చెప్పినా వీళ్లు వినటం లేదు. ఇద్దర్నో ముగ్గుర్నో చంపేస్తే గాని ఈ భూమిని వీళ్లు వదలరు' అనే నిర్ణయానికి కాపులు వచ్చారు. ఈ గ్రామం వంగర మండలంలో ఉంటుంది. ఉండటానికి లక్ష్మింపేట సర్పంచ్‌గా చిత్తిరి సింహాలమ్మ ఉన్నది. ఆమె మాల కులస్తురాలు. అయితే ఏం లాభం? ఆమెను అయిదేళ్ల పదవీకాలంలో ఒక్క రోజు కూడా సర్పంచ్ కుర్చీ మీద కూర్చోనివ్వలేదు. పంచాయత్ సమావేశాల్లో పంచాయత్ సభ్యులందరూ కుర్చీల్లో కూర్చుని ఉంటే ఆమె గోడవార నిలబడాలి. అది కాపుల ఆజ్ఞ! పాపం! ఆమె ఏం చేయగలుగుతుంది?

***– బొజ్జా తారకం, 'దళితులు భూమి అడిగితే...',***
***ఆంధ్రజ్యోతి, 22 జూన్ 2012***

పార్టీ నాయకుడు పుచ్చలపల్లి సుందరయ్య గారికి టైపు, షార్ట్‌హ్యాండ్ వచ్చిన నా లాంటి వారి సహాయం చాలా ఉందని, కాబట్టి వచ్చి చేరమని సూచించారు. పార్టీ కోసం, ప్రజల కోసం, సర్వస్వం త్యాగం చేస్తూ వచ్చిన నాయకుల గురించి విని ఉండడం, కాస్త కలిగిన కుటుంబాల నుండి వచ్చిన వారు, వారి పొలం, పుట్ర అమ్మి నిధులను పార్టీకి అప్పగించడమే కాక, వచ్చి హోల్‌టైమర్లుగా పార్టీ కోసం పూర్తికాలం వినియోగిస్తుండడం చూడడంతో ప్రభావితుడనై, నూరు రూపాయల జీతం వచ్చే ఉద్యోగం వదిలిపెట్టి విజయవాడలో చేరా. అది నా జీవితంలో మూల మలుపు. ఆ మలుపు ఉద్యోగాల బాట వదిలి రాజకీయాల్లో ప్రవేశించడానికే కాక, నా పాత్రికేయ జీవితానికి కూడా పునాది వేసింది. ఒక పక్క రాజకీయ పార్టీ కార్యకర్తగా, మరోపక్క పాత్రికేయునిగా కొత్త అవతారం ఎత్తా. అయితే, మొదటి నాలుగైదేళ్ల పాటు రెండు పడవల మీద కాళ్లు పెట్టి ప్రయాణం సాగించినా. ఆ తరువాత పూర్తిగా పాత్రికేయుని వృత్తిలో కొనసాగా.

**– వి. హనుమంతరావు, 'జర్నలిస్టు అంతర్వీక్షణం',**
**డేటా న్యూస్ ఫీచర్స్ ప్రచురణ**

ఏదేమైనా, చట్టవిరుద్ధంగా వ్యవహరించడాన్ని సవాలు చేయకుండా ఉండాలా? ఆంధ్రప్రదేశ్ పోలీసులు జూలై 2010లో చేసిన సిపిఐ మావోయిస్టు పొలిట్‌బ్యూరో సభ్యుడు, అధికార ప్రతినిధి చెరుకూరి రాజ్‌కుమార్ (ఆజాద్), జర్నలిస్టు హేమచంద్ర పాండేల ఎన్‌కౌంటర్‌పై ఈ ఏడాది మొదట్లో దాఖలైన ప్రజా ప్రయోజన వ్యాజ్యంపై జస్టిస్ అఫ్తాబ్ ఆలం, జస్టిస్ ఆర్ఎం లోధాలతో కూడిన సుప్రీంకోర్టు ధర్మాసనం 'గణతంత్రం తన పిల్లల్ని తానె చంపడాన్ని అనుమతించలేదు' అని వ్యాఖ్యానించింది. ఆజాద్ కేసులో లాగే ఇప్పుడు కూడా అన్ని స్వతంత్ర సాక్ష్యాలు దీనిని హత్యగానే సూచిస్తున్నాయి. 'గతంలోని నేరాలకు శిక్ష పడకపోవడమే చట్టాన్ని ఉల్లంఘించి' కిషన్‌జీ హత్యకు కారణమైందని కనిపిస్తున్నది. ఒకవైపు నాయకత్వాన్ని ఒకరి తర్వాత ఒకర్ని చంపేయడం, అదే సమయంలో మావోయిస్టులు బలంగా ఉన్న ప్రాంతాల్లో ప్రజలకు అభివృద్ధి పేరిట వరాలివ్వడం ద్వారా ప్రధాని భావిస్తున్న 'అంతరంగిక భద్రతకు పెను ముప్పు'ని ఎదుర్కోవచ్చని కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు భావిస్తున్నట్టుగా కనిపిస్తున్నది.

***– ఎకనమిక్ అండ్ పొలిటికల్ వీక్లీ సంపాదకీయం,***
***లాంగ్‌మార్చ్ వ్యాస సంకలనం, తెలంగాణ జర్నలిస్టులు ప్రచురణ***

ఈ ప్రభుత్వం కుంభకోణాల కోసం, కుంభకోణాల చేసిన వారి కోసం అన్న 'ఖ్యాతి' సంపాదించింది. 2జీ స్పెక్ట్రం, సిడబ్ల్యుజి, కోల్‌గేట్, దేవాస్-ఆంట్రిక్స్, ఆదర్శ్ సొసైటీ, రక్షణ శాఖ భూములు, టెట్రా-వెక్ట్ర, పౌర విమానాల కొనుగోలు వేటిని చూసినా ఒకదాని కన్న మరొకటి పెద్దదే. 'కాగ్'లాంటి సంస్థలు ఇలాంటి కుంభకోణాలను బయటపెట్టడంలో తలమునకలై ఉన్నాయి. ఈ పరిస్థితి మునుపెన్నడూ లేదు. యుపిఎ వీటన్నింటినీ నిరాకరిస్తోంది. వీటిని బయటపెట్టిన వారిమీద దాడికి దిగుతోంది. ఈ కుంభకోణాల విలువను తగ్గించి చూపి అపహాస్యంపాలు చేస్తోంది. 'కాగ్' మీద ప్రజా పద్దుల సంఘం మీద దాడి చేస్తోంది. ఆ తర్వాత భాగస్వామ్య పక్షాలను నిందిస్తోంది. ప్రశ్నార్థకమైన మంత్రులను కాపాడే దగ్గరికి వచ్చేటప్పటికి యుపిఎ సకల హద్దులు మీరుతోంది. న్యాయస్థానాలు కలగజేసుకున్నప్పుడు ఆ మంత్రుల మీద వీలైనంత తక్కువ చర్య తీసుకుని సరిపెడుతోంది.

***బిజెపి జాతీయ కార్యవర్గ సమావేశం అవినీతిపై ఆమోదించిన తీర్మానం***
***జనసందేశ్, సామాజిక రాజకీయ పక్షపత్రిక, 10 జూన్ 2012***

రెండు దశాబ్దాలకు పైగా భారతదేశంలో అవిచ్ఛిన్నంగా అమలవుతున్న నయా ఉదారవాద ఆర్థిక విధానాలను తీవ్రంగా ప్రతిఘటించే సమయం ఆసన్నమైంది. ప్రతిఘటనలో భాగంగానే నేటికి 14 జాతీయ సమ్మెలలో ఉద్యోగ, కార్మిక వర్గం పాల్గొన్నది. ప్రభుత్వానికి సరైన గుణపాఠం చెప్పాలంటే ఒక్కరోజు సమ్మెలు సరిపోవని గత అనుభవాల నుండి అవగతమవుతుంది. కేంద్రం అనుసరిస్తున్న ఉద్యోగవర్గ వ్యతిరేక పోకడలను గమనించిన భిన్న భావాలు కలిగిన సంఘాలు క్రమంగా ఐక్యతకు దగ్గరయ్యాయి. 2012 ఫిబ్రవరి 28న జరిగిన జాతీయ సమ్మె సంఘటిత ఐక్యతను చాటింది. సకల ఉద్యోగ, కార్మిక సంఘాలు పాల్గొనడంతో ఉద్యమాలకు నూతన ఉత్తేజాన్నిచ్చింది. ఈ నేపథ్యంలో ప్రపంచ బ్యాంకు విధానాలకు అంకితమైన పాలకవర్గాల విధానాలలో మార్పు రాలేదు. వాటి అమలులో మాత్రమే ఆలస్యమైంది. దీనిపై ఉద్యోగవర్గం సంపూర్ణ విజయం సాధించవలసి ఉంది. నేడు సాధించిన సంఘటిత ఐక్యతను పదిలపరుచుకోవాలి. భవిష్యత్తులో చారిత్రక కర్తవ్యాలను నిర్వహించే క్రమంలో ఒక్కరోజు సమ్మెతో సరిపెట్టుకోకుండా అంతకు మించిన మిలిటెంట్ ఉద్యమాన్ని కొనసాగించాలి.

***సంపాదకీయం, ఎంప్లాయిస్ వాయిస్, ఉద్యోగుల మాసపత్రిక, జూన్ 2012***

తమకు నచ్చిన పత్రికలకు, మ్యాగజైన్లకు అక్కడి అధికారగణం లక్షలాది రూపాయల ప్రకటనలు అప్పనంగా విడుదల చేస్తారు. ఆ పత్రికలు మార్కెట్లోకి రెగ్యులర్‌గా వస్తున్నాయా లేదా అనేది ఆ అధికారులకు పట్టదు. సదరు పత్రికల యాజమాన్యం వారి అవసరాలకు అనుగుణంగా వ్యవహరిస్తే చాలు. ఇంకేం అవసరం లేదు. పైపెచ్చు రెగ్యులర్‌గా వెలువడుతూ ప్రజాదరణ కలిగిన పత్రికలను పూర్తిగా విస్మరిస్తారు. ఆ అధికారులకు ప్రకటన విషయంలో ఎన్నిసార్లు మొరపెట్టుకున్నా పట్టించుకోరు. ఏ ఐదు లేదా పదివేల రూపాయల ప్రకటన విడుదల చేసి చేతులు దులుపుకుంటారు. గట్టిగా నిలదీస్తే సవాలక్ష నిబంధనలు రాష్ట్ర సమాచార శాఖ వారు వల్లె వేస్తారు.

***బైస దేవదాస్, రాష్ట్ర చిన్న, మధ్య తరహా దినపత్రికల సంఘం ప్రధాన కార్యదర్శి,***
***నేటినిజం, 14 జూన్ 2012***

సందర్భం పెద్దకూర పండుగే అయినా సమస్య లోతు మాత్రం వ్యవస్థ మూలాలను కదిలించవలసిందే. బ్రాహ్మణిజం, హిందూత్వం రూపాలు, మతం, కులం, రాజ్యాంగ యంత్రాల్లో నిక్షిప్తమైనాయి. నేడు పీడితులపై సాగుతున్న సాంస్కృతిక దాడి, ఆర్థికంగా దోపిడీకై సాగుతున్న దాడికి అంతిమరూపంగా ఉన్నది భౌతిక దాడి మాత్రమే. భౌతిక శక్తిగా ఉన్న బ్రాహ్మణిజం భిన్న రూపాలను భావజాలం ద్వారా ఎదుర్కొంటూనే, పీడిత తాడిత కులాలు ఐక్యమవుతూ భౌతిక శక్తిగా ఎదగాలి. భౌతికంగానే ఎదుర్కోవాలి.

***నలమాస కృష్ణ, పెద్దకూర పండుగ, నడుస్తున్న తెలంగాణ, మే 2012***

# ఉప ఎన్నికలు ఏం చెబుతున్నాయి?

*ఆస్తినీ, అధికారాన్నీ కాపాడుకోవడానికే తప్ప, ప్రజా సమస్యలతో సంబంధం లేని ఉప ఎన్నికల తీరు తెన్నులను వివరిస్తున్నారు* **డి.వి. రామకృష్ణారావు**

**16** మే 2009న రాష్ట్రంలో కాంగ్రెస్ వరసగా రెండవసారి అధికారం చేపట్టింది. 2004 నాటి బలమూ, దర్పమూ 2009లో ఆ పార్టీకి లేదు. 2009 నుంచి 2012 మధ్య రాష్ట్రంలో ముగ్గురు ముఖ్యమంత్రులు మారారు. వైఎస్ రాజశేఖరరెడ్డి రెండవసారి అధికారం చేపట్టగానే ప్రత్యర్థులను బలహీనపర్చడంలో భాగంగానూ, తమవారిని తమ గూటిలో పదిల పరచుకోవడంలో భాగంగానూ 'ఆకర్ష్' లాంటి అనేక పథకాలు నడిచాయి. ఈ పరిణామాలు ఇంకా పూర్తిస్థాయి రూపం తీసుకోకముందే ఆయన హెలికాప్టర్ ప్రమాదంలో మరణించారు. ఆ తరువాతి క్రమంలో రాష్ట్రంలో అనేక రాజకీయ పరిణామాలు వరుసగా చోటు చేసుకున్నాయి. మూడేళ్లు పూర్తయ్యేసరికి కాంగ్రెస్ బలం తగ్గిపోయింది. ప్రధాన ప్రతిపక్షం తెలుగుదేశం బలం కూడా తగ్గిపోయింది. ఈ క్రమంలోనే తెలంగాణ ఆకాంక్ష బలపడడం, ఎన్నికల రాజకీయాలలోనూ ఆ ఆకాంక్ష వ్యక్తమవడం చూశాం. తండ్రి మరణానంతరం ముఖ్యమంత్రి పదవి ఆశించిన వైఎస్ జగన్మోహన్‌రెడ్డి భంగపాటుకు గురై తల్లి విజయమ్మతో సహా కాంగ్రెస్ పార్టీ నుంచి బయటకు వచ్చేశారు. వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీని మార్చ్ 2011లో ఏర్పాటు చేసుకున్నారు. వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీకి అనుకూలంగా వ్యవహరిస్తున్న అధికార పార్టీకి చెందిన పదహారు మంది ఎంఎల్ఏ లపై మార్చ్ 2న శాసనసభ స్పీకర్ మూకుమ్మడి అనర్హత వేటు వేశారు. ఈ నేపథ్యంలో జూన్ 12న ఉప ఎన్నికలు జరిగాయి. కాంగ్రెస్ పార్టీ తన అధికారాన్ని నిలబెట్టుకొనే క్రమంలో చిరంజీవి స్థాపించిన ప్రజారాజ్యం పార్టీని విలీనం చేసుకొని, తన బలాన్ని సుస్థిరం చేసుకుంది.

తండ్రి ఉన్నప్పుడు ఆయన అధికారం అండతో కూడబెట్టిన లక్షలకోట్ల రూపాయల విలువ చేసే ఆస్తులను కాపాడుకోవడానికి జగన్‌కు అధికారం అవసరమైంది. టాటాలు, అంబానీల వంటి వారు ఇప్పటివరకు పాలనను పరోక్షంగా శాసిస్తుంటే, ఆ ధోరణికి జగన్ కొత్త భాష్యం ఇచ్చారు. భూస్వామి, పెట్టుబడిదారుడు సామ్రాజ్యవాద పెట్టుబడిని కలుపుకొని, విదేశీ కంపెనీలకు దళారీగా వ్యవహరిస్తూ, అధికారాన్ని హస్తగతం చేసుకొనే క్రమానికి జగన్ కొత్త ఒరవడిని సృష్టించే ప్రయత్నం చేశారు. అధికారం ఇప్పుడు తమ ఆస్తులను కాపాడుకోవడానికి, తన వర్గాన్ని పెంచి పోషించడానికి, తమ ఆధిపత్యాన్ని కొనసాగించడానికి ఒక సాధనం. ఆ సాధనం వైఎస్ రాజశేఖర రెడ్డి కన్నా ఆయన తనయుడు జగన్‌కు ఎక్కువ అవసరమైంది. ఉపఎన్నికల ముందు అక్రమ ఆస్తుల కేసులో అరెస్టైన కొడుకును చూడ్డానికి వచ్చిన తల్లి విజయమ్మతో 'తోటకూర నాడే చెప్పి ఉంటే' అని అతను అనలేదు. తల్లి, చెల్లి, జగన్‌కు అధికారం సాధించి పెట్టడం కోసం, రాజన్న రాజ్యం, జగనన్న స్వామ్యం తేవడం కోసం రాష్ట్రమంతా తిరిగారు.

జగన్ అక్రమ ఆస్తుల కేసులో జగన్‌తో సహా 74 మంది సిబిఐ చార్జిషీటులో నిందితులుగా ఉన్నారు. నిమ్మగడ్డ ప్రసాద్ వంటి ప్రముఖ పారిశ్రామిక వేత్తలు, ఎంఎల్ఏలు, మంత్రులు ప్రత్యక్షంగానో, పరోక్షంగానో ఈ అవినీతితో సంబంధంలో ఉన్నారు. ఈ అవినీతి వలయాన్ని వీలైనంత విస్తరించడం, ప్రశ్నించేవారిని లేకుండా చేయడం ఈ వ్యూహం మొత్తంలో భాగం. అవినీతికి సమ్మతి సృష్టించుకొని, ప్రశ్నించే వారిని నిర్మూలించి తమ తమ పత్రికలు, టివి ఛానళ్ల ద్వారా అబద్ధాలను నిజాలుగా ప్రచారం చేసి, మళ్లీ మళ్లీ ప్రచారం చేసి తమకనుకూలంగా ఏకాభిప్రాయాన్ని కూడగట్టడం ఆధునిక తంత్రం. అయితే ఈ అక్రమ కేసుల గొడవ కాంగ్రెస్ అధిష్ఠానం కన్నెర్రతో ప్రారంభమైంది. రేపు జగన్ రాజీ చేసుకుంటే, ఆస్తులూ, అధికారమూ పంచుకోవడానికి 'క్విడ్ ప్రో కో' కు పాల్పడితే, మ్యాచ్ ఫిక్సింగ్ అయిపోతే క్షణాల్లో ఇవన్నీ సద్దుమణిగి పోతాయి. గొడవ ఏ కారణంగా ప్రారంభమైనా, ఎంఎల్ఏలు, ఎంపిలు, ఐఏఎస్‌లు, ఐపిఎస్‌లు, న్యాయమూర్తులు, పారిశ్రామికవేత్తలు అందరూ ఈ అవినీతిలో, ఈ అప్రజాస్వామిక చర్యలో భాగస్వాములేనని తేలిపోయింది.

ఇప్పుడు నాయకులుగా ఎదగడానికి ఏళ్ల తరబడి ప్రజల మధ్య ఉండి ప్రజా సమస్యల కోసం పనిచేయనక్కర్లేదు. పార్టీ నాయకత్వాలకూ, నిర్ణయాలకూ తలవంచనక్కర్లేదు. ఆర్థికంగా బలం పుంజుకొని రాజకీయాలను డబ్బుతో శాసించగలమని అనుకునే వాళ్లంతా రాజకీయ పార్టీలు పెడుతున్నారు. గాలి జనార్దనరెడ్డి అలాంటి ప్రయత్నంలో ఉండగానే అరెస్టయి తాత్కాలికంగా ఆ ప్రయత్నం వాయిదా పడింది.

అయితే ఇప్పుడు జగన్ మాత్రమే చెడ్డవాడు, మిగిలిన వారంతా మంచి వాళ్లని ప్రజలు ఏమాత్రం అనుకోవడం లేదు. ఆ సంగతి ఉప ఎన్నికల తీర్పుతో అర్థమవుతుంది. ఒక వేశ్యను కొట్టడానికి చుట్టూ ఉన్నవారు బయలుదేరినపుడు, ఏసుక్రీస్తు మీలో నీతిమంతులు మొదటిరాయి వేయండని అన్నాడట... రాయి వేయడానికి ఎవరూ ముందుకు రాలేదట. అవినీతిపరులు కాని వాళ్లెవరనే తత్వంతో, కష్టాలు (?) పడుతున్న తమ నాయకుడి గురించి ప్రజలు ప్రార్థించడంలో, గెలిపించడంలో ఆశ్చర్యమేమీ లేదు. క్షమించడంలోనూ, శిక్షించడంలోనూ ప్రజల విచక్షణ ఎప్పుడూ ప్రత్యేకమైనదే. పాములకూ పాలుపోసి పూజించే సంస్కృతి ఎలానూ ఉంది.

ప్రజల ఆకాంక్షలు, ప్రజల ఆక్రోశం ఒకలా ఉంటే, పాలకులు అవేమీ పట్టించుకునే స్థితిలో లేరు. కాంగ్రెస్ పార్టీ నుంచి ఎంఎల్ఏలు వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీలోకి వెళ్లిపోయిన క్రమంలో వచ్చిన ఈ ఉప ఎన్నికలు విశ్లేషకులు ఎవరికీ అందని అనేక ప్రశ్నలను ముందుంచాయి. ఎన్నికలలో డబ్బు, కులం, మతం, ప్రాంతం, లింగం వంటి అంశాలు మాత్రమే పనిచేస్తాయా, వాటిని మించినవి ఇంకా ఏమైనా ఉంటాయా అనేది కనుక్కోవడంలో ఇప్పుడు అందరూ తలమునకలయ్యారు.

ఎన్నికల ఫలితాలు చూస్తే 18 శాసనసభ నియోజకవర్గాలకు పోలైన ఓట్లలో వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీకి 46.85 శాతం ఓట్లు రాగా, తెలుగుదేశం పార్టీకి 24.23 శాతం, కాంగ్రెస్ కు 21.84 శాతం ఓట్లు వచ్చాయి. వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీ 15 శాసనసభ, ఒక లోక్‌సభ స్థానాన్ని సాధించింది.

కాంగ్రెస్ రెండు శాసనసభ స్థానాలను గెలుచుకుంది. పరకాలను టిఆర్ఎస్ గెలుచుకుంది. గెలుపు సంబరాలలో భాగంగా వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీకి చెందిన నాయకుడు రహమాన్ తన రివాల్వర్‌తో గాల్లోకి మూడు రౌండ్లు కాల్పులు జరిపి తన సంతోషాన్ని వ్యక్తం చేసి అరెస్టయ్యాడు.

వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీకి వచ్చిన ఓట్లు, కాంగ్రెస్, తెలుగుదేశం పార్టీలకు వచ్చిన ఓట్లు మొత్తంకన్నా ఎక్కువగా ఉన్నాయి. అంటే, కాంగ్రెస్, తెలుగుదేశంల అవినీతితో పోల్చుకుంటే వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీ అవినీతి తక్కువ అని ప్రజలు భావిస్తున్నట్లు విశ్లేషించు కోవాలేమో. ఇప్పటికీ ప్రజలపై వైఎస్ హయాంలో అందిన పథకాల ప్రభావం ఉంది. అది ఆరోగ్యశ్రీ కావచ్చు, వృద్ధాప్య పింఛను కావచ్చు, ఫీజు రీయింబర్స్‌మెంట్ కావచ్చు.

భయమో, భక్తో, లేక ఉత్పత్తి, ప్రత్యుత్పత్తుల కొనసాగింపులో విరామం లేని స్థితో కాని ప్రజలు ఎన్నికలను అంత ముఖ్యమైన విషయంగా తీసుకోవడం లేదని మాత్రం అర్థమవుతుంది. ఎన్నికల ద్వారా వ్యవస్థను మార్చగలమనే భ్రమలూ వారికి లేవు. ఈ ఎన్నికలు ఇప్పుడు ఒక జాతర లాంటి వ్యవహారం. పాలకులు ఒకందుకు ఓటు అడిగితే, తాము ఒకందుకు ఓటు వేశామనే పరిస్థితి నెలకొని ఉంది. ఇక పాలకులకు ఎన్నికలు తమ (అ)ప్రజాస్వామిక పాలనకు ఆమోద ముద్ర వేయించుకునే ఒక తంతు. ఈ ఆమోద ముద్రను పొందడం ప్రజల విచక్షణతో, అన్ని కోణాలలో ఆలోచించి, రాజకీయ పార్టీల మేనిఫెస్టోలు చర్చించి, ఎవరెవరు ఏయే విధానాలు ప్రకటించారో గమనించి జరుగుతున్నది ఎంతమాత్రమూ కాదు. ఓటు వేయనోడు చనిపోయినట్లు లెక్క అనే ప్రచారమూ ఉంది. పథకాలు, పింఛన్లు అందవనే భయమూ ఉంది. పాలకవర్గాలు, పార్టీలు పోటీ పడి పెడుతున్న ఖర్చు తప్పనిస్థితిలో ఓటరును పోలింగ్ కేంద్రానికి నడిపిస్తోంది. ఈసారి కూడా వేల లీటర్ల మద్యం పారింది. కోట్ల రూపాయల పంపకం జరిగింది. చీరలూ బహుమతుల, ప్రలోభాల కొనసాగింపు గానే ఎన్నికలు జరిగాయి. ప్రలోభాలకు రు. 300 కోట్లు, మద్యంపై రు. 100 కోట్లు, ఇతర ఖర్చులు రు. 300 కోట్లు వెరసి రు.700 కోట్లు ఈ ఉప ఎన్నికలలో ఖర్చు పెట్టినట్లు తెలుస్తోంది.

ఎన్‌టిఆర్ అధికారంలోకి వచ్చినప్పుడు ప్రజలు అతన్ని రాముడి గానూ, కృష్ణుడిగానూ ఆయన సినిమాల్లో నటించిన పాత్రల వల్ల ఊహించుకున్న పరిస్థితి ఉంటే, వైఎస్ఆర్ వేరే పద్ధతుల్లో ఆ ఆకర్షణను సాధించారు. ఇప్పుడు ఆకర్షణలూ, విధానాలూ పనిచేయడం లేదు. ప్రాంతీయ ఆకాంక్షతో బరిలో దిగిన తెలంగాణ రాష్ట్ర సమితి సాధించిన ఫలితం కూడా అంతు చిక్కనిదే. ఎందుకంటే, మహబూబాబాద్‌లో జగన్‌ను కానీ, కొండా సురేఖను కానీ అడుగు పెట్టడానికి అనుమతించని ప్రజలు ఉప ఎన్నికలలో అన్ని ఓట్లు వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీకి ఎలా వేశారో ఆలోచించాల్సిన విషయమే.

సమాజంలో ఇప్పుడు ఎంత సంపాదించావనే ప్రశ్న ఉంది తప్ప ఎలా సంపాదించావు అనే ప్రశ్న లేదు. ఇదివరకు ఎన్నికల సందర్భంలో ఎవరు అవినీతిపరులు, ఎవరు దొంగలు అని చూసుకునే పరిస్థితైనా కొంత ఉండేది. ఇప్పుడు ఎవరు అవినీతి పరులు కాదు అనే ప్రశ్న ముందుకొచ్చింది. ఒక టివి ఛానల్‌లో ప్రజాభిప్రాయ సేకరణలో భాగంగా ఒక సామాన్యుడు వైఎస్, చంద్రబాబు నాయుడుల గురించి తనదైన విశ్లేషణను అందిస్తూ 'చంద్రబాబు అప్పు తెచ్చారు. వందకు వంద తినేశారు. వైఎస్ఆర్ వంద తెచ్చి యాభై మాకు పెట్టారు' అని వ్యాఖ్యానించారు. ఒక సామాన్య మహిళను 'ఎన్నికల గురించి ఏమనుకుంటున్నారు' అని అడిగితే 'చేనులో పనిచేసిన దగ్గర నాలుగు వేరుశెనగ గింజలు తెచ్చుకుంటాం. నాలుగు పళ్లు తెంపుకొని తింటాం. ఇంత గోంగూర తెచ్చుకుంటాం. అది అవినీతా? వైఎస్ రాజశేఖరరెడ్డి వల్ల నా కొడుకు ఆరోగ్యం బాగైంది. జగన్ బాబు గెలవాలి' అని ఆమె అంది. అంటే అవినీతికి పాల్పడినా అది విషయం కాదనే సమ్మతి, తమకు ఏమైనా కొద్దిపాటి మేలు చేస్తే చాలనే వైఖరి ఇందులో ఉన్నాయి.

1952 మే 13న మన దేశ లోక్‌సభ మొదటి సమావేశం జరుపుకుంది. ఆ మొదటి సమావేశం జరిగి 13 మే 2012 నాటికి అరవై ఏళ్లు నిండిన సందర్భంగా పార్లమెంట్ ఉభయ సభలు సమావేశమై, ఘనంగా వజ్రోత్సవాలను జరుపుకున్నాయి. ఆ సందర్భంగా వివిధ రాజకీయ పక్షాల నేతలు తమ సందేశాలను వినిపించారు. ఈ సందర్భంలో ప్రతిపక్ష నేత భారతీయ జనతా పార్టీ నాయకురాలు సుష్మా స్వరాజ్ చేసిన వ్యాఖ్య గుర్తు చేసుకోవడం అవసరం. ఆమె పార్లమెంట్ వజ్రోత్సవంలో మహాభారతాన్ని గుర్తు చేస్తూ – 'పాండవులకూ, కౌరవులకూ ఎంత కలహం ఉన్నా బయటి వారితో వైరం వచ్చినప్పుడు మేము నూట ఐదుగురం అనేవారని, పార్లమెంట్ కూడా అలాగే'నని అన్నారు. ఆమె ఏ ఉద్దేశంతో అన్నా, పార్టీలు ఏవైనా, జెండాలు–ఎజెండాలు ఏమైనా, దేశ ప్రజలను మోసగించడంలో, దుర్మార్గమైన విధానాలను తీసుకురావడంలో పాలక, ప్రతిపక్షాల వారంతా ఒకటే అనేది అరవై ఏళ్ల పాలనలను తరచి చూస్తే అర్థమవుతుంది.

తెలుగు నేల ఎన్నడూ లేనివిధంగా ఉపఎన్నికలపై ఉపఎన్నికలను ఈ మూడేళ్లలో ఎదుర్కొంది. అత్యధికంగా 41 శాసనసభ స్థానాలకు ఈ మూడేళ్లలో ఉప ఎన్నికలు జరిగాయి. ఈ ఉప ఎన్నికలు జరిగిన 20 స్థానాలలో ప్రజలు తెలంగాణ వాదాన్ని, మిగిలిన శాసనసభ స్థానాలలో జగన్‌పై సానుభూతిని గెలిపించుకున్నారు. ఈ ఉప ఎన్నికలు గానీ, ఈ మూడేళ్ల పాలన గానీ ప్రజా సమస్యలను పట్టించుకున్న దాఖలాలు లేవు. ప్రజావ్యతిరేకమైన ఒప్పందాలు, నిర్ణయాలు అనేకం జరిగిపోతూనే ఉన్నాయి. నిత్యావసర వస్తువుల ధరల నుంచి నిత్య ఉపాధి వరకు సామాన్యులకు అన్ని ప్రశ్నలే.. సందేహాలే.

సోంపేట, కాకరాపల్లి, సింగరేణి ఓపెన్ కాస్ట్, కవ్వాల్ అభయారణ్యం, హైదరాబాద్‌లోని మతఘర్షణలు, తెలంగాణ కోసం 850 మందికి పైగా విద్యార్థుల, సామాన్యుల ఆత్మహత్యలు, రైతుల ఆత్మహత్యలు, నిరుద్యోగ సమస్యలు, విద్యార్థుల సమస్యలు, నలభై లక్షల మంది కౌలు రైతుల సమస్యలు... దళితుల పట్ల అంటరానితనం, వివక్షలు కొనసాగుతున్నాయి. బ్రాహ్మణీయ, హిందూ మతోన్మాద శక్తులు తమ ఆధిపత్యాన్ని, దౌర్జన్యాన్ని అడుగడుగునా చాటుతూనే ఉన్నాయి. ఇలా అనేక సమస్యలు జవాబు లేని ప్రశ్నలుగానే కొనసాగుతున్నాయి. నిన్నటికి నిన్న భూమి కోసం, ఆత్మగౌరవంతో బతకడం కోసం ఐదుగురు దళితులు కాపుల దౌర్జన్యానికి శ్రీకాకుళం జిల్లాలోని లక్ష్మింపేటలో బలి అయ్యారు. ఈ సమస్యలు వేటితోనూ ఈ ఎన్నికలకు గానీ, ఉప ఎన్నికలకు గానీ సంబంధం లేదు.

ప్రాజెక్టుల కింద పోయిన భూమిని దున్నుకోవడానికి లక్ష్మింపేట దళితులు ప్రాణాలు ఇస్తే, థర్మల్ విద్యుత్ ప్రాజెక్టులకు తమ భూమి ఇవ్వమని సోంపేట సామాన్య ప్రజలు ప్రాణాలిచ్చారు. కార్మిక సంఘం పెట్టుకుంటామని, మా హక్కుల కోసం పోరాడతామని తేల్చి చెప్పి యానాం రిజెన్సీ కార్మికులు యాజమాన్యంపై తిరగబడ్డారు. కవ్వాల్ అభయారణ్యం వద్దు, ఓపెన్ కాస్టులు వద్దు, మా తెలంగాణ మాకు కావాలంటు తెలంగాణ ప్రజలు తిరగబడుతున్నారు. తాగునీరు, సాగునీరు కోసం రాయలసీమ ప్రజలు అరవై ఏళ్లుగా ఎదురుచూస్తున్నారు. ఇదీ తెలుగు నేల ముఖచిత్రం. ప్రజలను ఎక్కువ కాలం ఎవరూ మోసం చేయలేరు. నిజమైన అభివృద్ధికి, అభివృద్ధి పేరిట వస్తున్న పథకాలకు ప్రజలిప్పుడు తేడాను గమనిస్తున్నారు. థర్మల్ పవర్‌ను పోరాటంతో అడ్డుకున్న సోంపేట ప్రజల పోరాట సాంప్రదాయాన్ని ఎత్తిపట్టడానికి మరోపక్క ప్రజలు సన్నద్ధులు అవుతున్నారు.

*(రచయిత వీక్షణం సహాయ సంపాదకులు)* వీ

# ప్రజలు ఓడారు, కార్పొరేట్ శక్తులే గెలిచాయి

***మద్యం, డబ్బు తదితర రకరకాల ప్రలోభాల మాటున జరిగిన ఉప ఎన్నికల తీరు తెన్నులను వివరిస్తున్నారు***

**విద్యాభూషణ్**

**రా**ష్ట్రంలో ఎన్నికల హోరు ముగిసింది. నువ్వా-నేనా? అనేంతటి ప్రతిష్ఠాత్మక స్థాయిలో అన్ని రాజకీయ పార్టీలు పాల్గొన్నాయి. చివరికి దోపిడీదే పై చేయి అయింది. అవినీతి చక్రవర్తుల ఉపక్రమణకు అడ్డుకట్ట వేయలేదు. ఎందుకంటే? అస్సలు రాజకీయం అంటేనే దొరికిన కాడికి సర్దేసుకోవడం అనే సామాన్య అభిప్రాయానికి వచ్చేసి, అవినీతి'ని జరనలైజ్ చేసేయడం జరిగింది. ఒక సందర్భంలో రాజకీయాల్లో దోచుకొనిదెవ్వరో? చెప్పండని నిలదీసిన అనుభవం సైతం ఉంది. తాము అధికారంలో లేనంత మాత్రాన సుద్దులు వల్లిస్తే నమ్మేదెవ్వరు. అంతటి సత్ప్రవర్తన కలిగిన వారే అయితే అక్రమార్జన ఆరోపణలపై కోర్టుల్లో స్టే ఉత్తర్వులకెందుకు పోవాలి. విచారణ జరుపుకోండని నిమ్మకు నీరెత్తి నట్టుండాలి కదా, ఇదో వాదన. ఇదీ వాస్తవమే మరి. ప్రస్తుతం రాజకీయాలను అనుసరిస్తున్న, ఆచరిస్తున్న ప్రపంచీకరణ విధానాలంటేనే అవినీతికి ఆజ్యం పొయ్యడం. జవాబుదారీతనం నుంచి మినహాయింపును పొందడం. అందినకాడికి దోచేసుకునే వ్యక్తి స్వేచ్ఛ'కు ఆహ్వానం పలకడం. ప్రజాధనాన్ని కార్పొరేట్ శక్తులకు ధారాదత్తం చేసెయ్యడం. మనసా వాచా కర్మణా ఈ విధి విధానాలను అనుసరిస్తూ, ఆచరిస్తూ అవినీతి గురించి అధికార, ప్రతిపక్షాలు గొంతు చించుకోవడం, దొంగే దొంగ... దొంగ... అని అరిచినట్టుంటుంది.

ఇక్కడ వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీ నేత జగన్ అవినీతి ఆరోపణలను ఎదుర్కొంటున్నారు. విచారణ జరుగుతోంది. అదీ సరిగ్గా ఎన్నికల సమయం నాటికే.. అదే ఆయనకు అనుకూలించింది. లక్షలాది కోట్ల ప్రజాధనాన్ని కైంకర్యం చెయ్యొచ్చు గాక... ఇన్నాళ్ల ఉపేక్ష ఆయనకు కలిసివచ్చింది. మాజీ ముఖ్యమంత్రి వై.ఎస్.ఆర్. దోపిడీకి ఓ శాస్త్రీయత నిచ్చి సామాన్యుడిని సంక్షేమ పథకాల మాటున నిద్రపుచ్చి, తన కార్యాన్ని తాను యథేచ్ఛగా సాగించుకున్నాడు. అపుడు మంత్రివర్గంలో ఉన్న భాగస్వామ్య సభ్యులంతా కిమ్మనకుండా, కుక్కిన పేనుల్లా పడి ఉండి ఈనాడు రాద్ధాంతం చేయడమూ ఓ వింతగానే ఉంది. నాడు వ్యక్తిత్వాలను కోల్పోయి జీవచ్ఛవాల్లా ప్రభుత్వ ఉత్తర్వులను జారీ చేసేస్తూ, పెట్టమన్న సంతకాలు పెట్టేస్తూ, విసిరేసిన ఎంగిలి మెతుకులకు కక్కుర్తి పడ్డ నేతలే ఈనాడు ధర్మ సిద్ధాంతాలను వల్లించడం వింతల్లో కెల్లావింతగా ఉంది. దోపిడీ నేత మృత్యువాత పడ్డాక, వారసుడిగా ముందుకొచ్చిన జగన్‌ను అధిష్ఠానం అంగీకరించకపోవడం, ఆయన వేరే కుంపటి పెట్టుకునేందుకు సానుకూలమైంది. నెహ్రూ వారసుడు ప్రధాని అయ్యేందుకు అభ్యంతరం లేకపోగా మా రాష్ట్రానికి నేనెందుకు ముఖ్యమంత్రిని కాకుడదన్నది ఈయన లాపాయింట్ కావొచ్చు. అధిష్ఠానం కనుసన్నల్లో మెదిలే వ్యక్తే రాష్ట్ర ముఖ్యమంత్రి అనేది కాంగ్రెస్ పార్టీ నిబంధన. వైఎస్ఆర్‌తో అనుభవాలు, జగన్ డిమాండ్‌ను ఆమోదింపజేయలే. వేరే పార్టీ పెట్టారు. సానుభూతిని ప్రోది చేసేందుకై శాయశక్తులా కృషి చేశారు. కాంగ్రెస్ నాయకత్వం ముందుగా మేల్కొని ఆయన అవినీతి సామ్రాజ్యంపై విచారణ మొదలిడినా బావుండేది. అలా చేయకుండా ఉపేక్షించి - విచారణను ప్రారంభించడం అనివార్యంగా వైఎస్ఆర్ కాంగ్రెస్‌కు అనుకూలించింది.

ఈ ఎన్నికలు రావడమే, వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీ ఏకపక్ష విధానాల మూలంగా వచ్చాయి. ఈ పార్టీకి మద్దతునిస్తున్న కాంగ్రెస్ నేతలే ఆ పార్టీలో చేరి, రాజీనామా చేసిన కారణంగా ఈ ఉప ఎన్నికలు. బలాబలాలు, సాధ్యాసాధ్యాలు తేటతెల్లమైపోయాయి. అయితే ఇందులో రాష్ట్ర ప్రజల ప్రమేయం ఏమేరకు? ఎంత మేరకు అన్నదే ప్రశ్న.

'ప్రపంచీకరణ పుణ్యమా అని రాజకీయ పార్టీలు ప్రజాధనాన్ని దోచుకుంటున్నాయి. లక్షల కోట్ల రూపాయలను అధిగమించిన బడ్జెట్లు సామాన్యుని సమస్యల్ని తీర్చడం లేదు. సంక్షేమ పథకాల ఆశల పల్లకిని చూపెడుతూ అధిక ధరలు, రైతాంగ గిట్టుబాటు ధరలు, ఉపాధి కల్పన స్థానంలో వందరోజుల పని దినాలు, అదీ సక్రమంగా అమలుకాక ప్రజలు హాహాకారాలు చేస్తున్నారు. అయినా ఎవ్వరికీ పట్టదు. ప్రజల్ని దోచుకొనే హక్కు కోసం మాత్రం ప్రతిపక్షాలు గళాన్ని విప్పుతుంటాయి. మేమే అధికారంలో ఉంటే ఇది చేస్తాం, అది చేస్తా'మని. తలనెత్తుకున్న విధి విధానాలు ప్రజా శ్రేయస్సు, ప్రజాక్షేమాన్ని ఎంత మాత్రం అనుమతించేవి కావు. కార్పొరేట్ శక్తుల ప్రాపకం కోసం ప్రోది చేయబడ్డ విధి విధానాలివి. పాలక, ప్రతిపక్షాల అధికార కుమ్ములాటలు చివరికి నిన్నటి ఎన్నికల సందర్భంగా ప్రజల ముందుకు వచ్చి ప్రజాతీర్పు నర్థిస్తాయి. ఎన్నికల తతంగం, జరుగుతున్న తీరు తెలిసిన మేధావి వర్గం నిర్లిప్తతను ప్రదర్శిస్తే, నోటుకి ఓటుకు అలవాటు పడ్డ సామాన్యుడు ఎన్నికల సందర్భంగానైనా తన కలలను సాకారం చేసుకునేందుకు దాసోహమవుతున్నాడు. ఎటు తిరిగి ఆశించిన స్థాయిలోనే ఓట్లు పోలవడం గమనార్హం.

నిన్నటి ఎన్నికలు ఏ స్థాయిలో జరిగాయన్న దానికి ఒకే ఒక్క ఉదాహరణ. 2009 నాటి శాసనసభ (294 స్థానాలు), లోక్‌సభ (స్థానాలు 42) ఎన్నికల్లో అక్రమ రవాణాలో పోలీసులకు పట్టుబడ్డ మొత్తం 38 కోట్ల రూపాయలు. నిన్నటి ఉప ఎన్నికలు 18 శాసనసభ స్థానాలు, ఒకే ఒక్క పార్లమెంటరీ స్థానానికి జరగ్గా అక్రమంగా పట్టుబడిన మొత్తం 42 కోట్ల రూపాయలు. ఇందుకు అదనంగా మరో 13 కోట్ల రూపాయల విలువ చేసే బంగారం, వెండి నగలు. ఈసారి ఎన్నికల్లో ఓటర్లకు పంచిపెట్టే డబ్బుతో పాటు బంగారం, వెండి నగలు జోడి కావడం గుర్తించదగింది. పట్టుబడినదే ఇంతగా ఉంటే పంపకాలు ఏ స్థాయిలో, ఎన్ని వందల కోట్లకు చేరి ఉంటాయో అంచనా వేయగలమా? ఇదంతా ప్రజాధనమే. ఈ రాజకీయ శక్తులు రూపొందించుకున్న నిబంధనల మేరకు, ఓటర్‌ను ప్రలోభ పెట్టేందుకై ప్రయత్నిస్తున్నట్టు

రుజువైతే అందుకు శిక్ష ఐదు వందల రూపాయల జరిమానా అట. ఇది వారివ్వజూపిందాంట్లో సగం కూడా కాదు. ఇలా ఉంటుంది ఈ ఎన్నికల నిబంధనల నిర్వాకం.

అధికారం కోసం అధికార, ప్రతిపక్షాల పోరు తీవ్రస్థాయికి చేరినపుడు రాజ్యాంగం దర్యాప్తులు, చట్టసభలు, కదలికనందుకుంటాయి. ఇందుకు సైదోడుగా మీడియా కూడా ముందుకొస్తుంది. ప్రపంచీకరణ విధి విధానాలంటేనే ప్రజా సేవల్ని కార్పొరేట్ శక్తులకు కాంట్రాక్టుకిచ్చేయడం. మౌలిక సదుపాయాల కల్పన కోసం, భారీగా మూలధనాన్ని సేకరించ డం. తక్షణ సమస్య పరిష్కారం అన్న మాటే ఉండదు. అంతా అరచేతిలో వైకుంఠమే. ఈ పెట్టుబడులు సిద్ధిస్తే ఫలితం అంతా మీదే అన్న భ్రమ పూరిత ధోరణి. రత్న గర్భ వంటి రాష్ట్ర సహజ వనరులను కార్పొరేట్ శక్తులకు ధారాదత్తం చేసేస్తూ, ప్రభుత్వ భూములతో పాటు బడుగు వర్గాల-గిరిజన మాన్యాలనూ కార్పొరేట్ కంపెనీలకు అన్యాక్రాంతం చేస్తున్న ధోరణికి మూలం ఈ సరళీకృత ఆర్థిక విధి విధానాలే. ఇలా ధారాదత్తం చేసేందుకు అధికార పార్టీకి ప్రజలు ఇచ్చిన అధికార హక్కు ఇందుకోసం దళారీ మూల్యాలే లక్షల కోట్ల రూపాయలలో ఉంటాయి. దాని పరాకాష్టే ఈనాటి వైఎస్ఆర్ పార్టీ నేత ఆర్థిక నేరాలు. అంటే నిన్నటి ఎన్నికలు పరోక్షంగా ఆయా కార్పొరేట్ శక్తులు జబ్బలు చరిచి ప్రోత్సహించినవే. వాస్తవాలను, విధి విధానాల లోపాయికారీ లోప భూయిష్టతను ప్రజలకు విడమర్చి చెప్పాల్సిన మీడియా, తమ యాజమాన్య విధానాలకు అనుగుణంగా ఎవరినో ఒకరిని భుజాన వేసుకుని మోయాల్సి (వస్తుంది) ందే. ఎందుకంటే నేడు మీడియా ఓ పరిశ్రమయిపోయింది కనుక. మీడియా లాభాలను ఆర్జించే ఓ వనరై పోయింది కనుక. ఈ విధంగా రాజకీయ పార్టీలు, మీడియా వెరసి ఏదో ఒక కార్పొరేట్ శక్తి నీడన/అండన ఉండాల్సిన పరిస్థితులు నేడు మన ముందున్నాయి.

వైఎస్ఆర్ అధికారంలోకి రావడానికి ముందు చంద్రబాబు ప్రభుత్వం కృష్ణా-గోదావరి ప్రాంతంలోని కెజి బేసిన్ సహజ వాయువును అంబానీకి చెందిన రిలయెన్స్‌కు అప్పగించాడు. వైఎస్ఆర్ అధికారాన్ని చేపట్టిన తరువాత గనులపై దృష్టిని సారించి వేదిలా హెక్టార్లు ఒబుళాపురం ఐరన్ ఓర్ వంటి నిక్షేపాలను గాలి సోదరులకు ఇనాంగా ఇచ్చేశాడు. ఇది ఎంత తప్పో, అదీ అంతే తప్పు. అయితే ఒకరి మీద ఒకరు బురద జల్లుకుంటూ ప్రజల కంట్లో కారం జల్లుతున్నారు. ఇదో ఉదాహరణ మాత్రమే. ఇదే సరళీకృత ఆర్థిక విధానమంటే. పెట్టుబడుల సేకరణ పేరిట, ప్రజల ఆస్తులను ఎరవేయడం జరుగుతుంది. ఉన్న అరెకరం పావెకరానికి అనూహ్య రేటును చూపి, నిర్వాసితులను చేసేందుకు వెనుకాడ్డం లేదు అధికారం. పోగొట్టుకున్న మీదట, హామీలు నీటిమూటలై కడగండ్ల పాలవుతున్నారు సామాన్యులు. అవినీతి ఇరుపక్షాలైన అధికార పెట్టుబడిదారీ కార్పొరేట్ శక్తుల మధ్యన పెత్తనం చెలాయిస్తూ ఉంది. పెట్టుబడి నుంచి అవినీతిని వేరు చేయడం దుస్సాధ్యం. మనుగడ కోసం ఈ విధి విధానాల అమల్లో అధికారం సైతం అవినీతిని ఆశ్రయించడం తప్పనిసరి.

లక్షలాది కోట్లు అక్రమంగా ఆర్జించిన వైఎస్ఆర్ కాంగ్రెస్ నేతను ప్రజలెలా గెలిపించారన్నది మన ముందున్న ప్రశ్న. ఈ ఎన్నికలను ప్రజాకోర్టు అని, ప్రజాతీర్పు అని పెద్ద పెద్ద విశేషణాలతో విశ్లేషిస్తున్నారు. దీనికంటే ముందు ఎన్నికలు వీటి విశ్వసనీయతను ఓసారి పరికించాలి. ఎన్నికలను నిర్వహించేందుకు ఓ అధికారక వ్యవస్థ ఉంది. దానికి కొన్ని నియమాలున్నాయి. ఈ ఎన్నికల కమిషన్ తను రూపొందించుకున్న నియమాలను సక్రమంగా నిర్వహిస్తూ - అందరికీ అమలు పరుస్తూ ఉంటుంది. లేకుంటే జనాభిష్టానికి అది వేదిక కానేరదు. యథాతథంగా మనచుట్టూ ఉన్న వ్యవస్థ మనగలుగుతూ, కేవలం నేతలను మాత్రమే మార్చడం జరుగుతుంది. ఎప్పుడో ఎన్నికల సంఘం ఏర్పడిన తొలినాళ్లలో రూపొందించుకున్న నియమ నిబంధనలతో కొనసాగుతూ ఉంటే అక్రమంగా పట్టుబడింది కోట్లు, బంగారు నగలే కాదు. రేపు వజ్రవైఢూర్యాలు ఉండొచ్చు.

ఎన్నికల్లో సామాన్యుడు అనునిత్యం ఎదుర్కొంటున్న సమస్యల ప్రస్తావన లేవు. పరిష్కారం లేదు. వారు ఇన్ని కోట్లు, ఇన్ని ఎకరాలు కైంకర్యం చేశారు. కోట్లకు పడగలెత్తిన వైనాలు, దార్యాప్తుల డిమాండ్‌లే తప్ప మరొకటి లేదా. గతంలో బోఫోర్సు కుంభకోణం పేరిట అభాసుపాలై రాజీవ్‌గాంధీ ప్రభుత్వాన్ని పడగొడితే, అదే రాజీవ్‌ని హత్యానంతరం కాంగ్రెస్‌ను పీఠమెక్కించారు జాలిగల మన ఓటర్లు. అదే తరహాలో, 2009 నాటికే రాష్ట్రంలో కాంగ్రెస్‌పై అసమ్మతి పేరుకుపోగా, ప్రజారాజ్యం పార్టీ వచ్చి ప్రతిపక్ష ఓట్లను చీల్చి కాంగ్రెస్‌కు అధికారం అప్పగించింది. తదనంతరం వైఎస్ఆర్ ప్రమాద మరణం. తరువాత జగన్ ముఖ్యమంత్రి డిమాండ్‌ను ఆమోదించనందున వేరు కుంపటి. అవినీతి ఆరోపణలు, దర్యాప్తులు, అరెస్టు, జైలు.. సరిగ్గా నేటి ఎన్నికల నాటికే. అదే ఆయనకు కలిసి వచ్చింది. తండ్రీ మరణించే... అందరూ ఏకమై నా కొడుకునిట్లా వేధిస్తున్నారన్న తల్లి వేడికోళ్లు కాస్తా సానుభూతిని కురిపించాయి.

అక్రమంగా ఆర్జించిన వేలాది కోట్ల రూపాయలు అనుహ్యంగా అతీతంగా చేతులు మారి... నోటు - ఓటు తరహాలో ఎన్నికల ప్రహసనం ముగిసింది. మద్యం ప్రవహించింది. ఎప్పటికన్నా ఓటింగ్ శాతం పెరిగింది. అనూహ్యంగా వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీ అత్యధిక స్థానాలను గెల్చుకుంది. విధి విధానాల్లో తేడాలేని పార్టీలు, అధికార పార్టీకి తోకలుగా మనగలగడం తప్ప వాటికంటూ ఓ ప్రత్యేకతను సంతరించుకోనంత కాలం ఇంతే... ప్రత్యామ్నాయ విధానాలను రూపొందించుకొని వాటి ప్రత్యేకతను ప్రజల ముందుంచాలి. అంతే తప్ప నలుగురితో పాటు నారాయణ'లా వర్తించకూడదు. గత చరిత్రను ప్రజలంత తేలిగ్గా మరిచిపోరు. అందుకని ముందుగా ప్రజల్లో విశ్వసనీయతను పెంచుకోవాలి. అందుకు తగ్గ కృషి చెయ్యాలి.

చావు తప్పి కన్ను లొట్ట పోయిందనటానికి అధికారం, సీట్ల సంఖ్యను లెక్కలు వేసి, సంతృప్తి పడరాదు. ప్రజా సమస్యలను ఉపేక్షించినందునే ప్రజలు ఓట్లు వేయలేదనే గ్రహింపుకు రావాలి. కేవలం సానుభూతిని గెలుపుకు కారణంగా చూపించకుండా, బాధ్యతాయుత పాలనను అందించి ప్రజలకు చేరువకావాలి. వైఎస్ హయాంలో జరిగిన అవినీతి నేరాలు నిగ్గుదేలేలా నిష్పక్షపాతంగా దర్యాప్తు జరిపించాలి. సంబంధం ఉన్న వారందర్నీ విచారణ పరిధిలోకి తీసుకురావాలి. (నాటి క్యాబినెట్ మంత్రులు, అధికారులతో సహా). నీతివంతమైన పాలనను అందివ్వ గలగాలి. వాస్తవాన్ని గుర్తెరగాలి. అప్పుడే ప్రజలకు చేరువకాగలుగుతారు. లేకుంటే వారి వారి పరాధీనత'ను గుర్తెరిగిన ప్రజలు వారి హక్కులకై ఉద్యమిస్తారు. అంతిమంగా కార్పొరేట్ శక్తులను పెంచి పోషిస్తున్న ఏకీకృత ఆర్థిక విధానాలకు వ్యతిరేకంగా ఐక్య పోరాటాలకు సంసిద్ధం అవుతూ, ప్రభంజనంలా కదలక తప్పదు.

*(రచయిత పాత్రికేయులు)*

వీ

# పాఠ్య పుస్తకాల్లో అంబేద్కర్ కార్టూన్ వివాదం

*అంబేద్కర్ కార్టూన్ వివాదం వెనుక దాగిన, ఆలోచించాల్సిన అనేక కోణాలను వివరిస్తున్నారు*

**కె. సత్యనారాయణ**

రిపబ్లిక్ పార్టీ ఆఫ్ ఇండియా (ఆర్‌పిఐ) నాయకులు రాందాస్ అతవాలే జాతీయ విద్యా పరిశోధన, శిక్షణా మండలి (ఎన్‌సిఇఆర్‌టి) వారి పదకొండవ తరగతి రాజనీతి శాస్త్రం పాఠ్య పుస్తకంలో ప్రచురించిన ఒక కార్టూన్ అంబేద్కర్‌ని అవమానించేదిగా ఉందని ఆరోపించారు. ఏప్రిల్ 2న ముంబాయిలో పాఠ్య పుస్తకంలోని అభ్యంతరకరమైన పేజీలను తగలబెట్టి, (ఎంఎచ్‌ఆర్‌డి) మంత్రి కపిల్ సిబాల్ రాజీనామా చేయాలని ఒక పత్రికా సమావేశంలో అతవాలే డిమాండ్ చేశారు. డా. అంబేద్కర్ కార్టూన్ వివాదంగా ప్రచారంలోకి వచ్చిన ఈ సమస్య ఒక జాతీయ వివాదంగా పార్లమెంట్‌లో చర్చ కొచ్చింది.

ఎన్‌సిఇఆర్‌టి వారి రాజనీతి శాస్త్ర పాఠ్య పుస్తకాల్లో కార్టూన్స్, పెయింటింగ్స్, పోస్టర్లు లాంటి అనేక కొత్త బోధనా సామాగ్రిని మొట్టమొదటిసారిగా పరిచయం చేసారు. అయితే, ఈ ప్రయోగంలో భాగంగా 1949లో ప్రముఖ కార్టూనిస్ట్ శంకర్ పిళ్లై వేసిన కార్టూన్‌ని కూడా ప్రచురించారు. ఈ కార్టూన్ భారత రాజ్యాంగ రచనా ప్రక్రియ సుదీర్ఘ కాలంగా సాగడంపై ఆ రోజుల్లో శంకర్ గీసిన వ్యంగ్య చిత్రం. ఒక నత్తపై కూర్చున్న డా. అంబేద్కర్, ఆ వెనుక చేతిలో కొరడాతో నెహ్రూ ఉన్నారు. నెహ్రూ నత్తని లేదా నత్తపై ఉన్న అంబేద్కర్‌తో సహా నత్తని కొరడా ఝుళిపించి ముందుకు నడిపించే ప్రయత్నం చేస్తున్నట్టుగా ఉంది. అలాగే, అంబేద్కర్ చేతిలో కూడా చిన్న కొరడా ఉంది. ఈ మొత్తం దృశ్యాన్ని దేశ ప్రజలంతా చూస్తు ఉన్నట్టు కార్టూన్‌లో ఒక పక్క కనిపిస్తూ ఉంటారు. బాబా సాహెబ్ అంబేద్కర్ రాజ్యాంగ రచన ప్రక్రియను చాలా నెమ్మదిగా, సుదీర్ఘంగా సాగించారని, నెహ్రూ కొరడా ఝుళిపిస్తే కాని రాజ్యాంగం తయారు కాలేదనే అర్థం స్ఫురించేలా ఈ కార్టూన్ ఉందని దళిత రాజకీయ నాయకులు వ్యాఖ్యానించారు. మరికొందరైతే ఇంకా ముందుకెళ్లి, ఒక బ్రాహ్మణ ప్రధానమంత్రి ఒక దళితుడిపై కొరడా ఎత్తినట్టుగా కార్టూన్ ఉందని వాదించారు. భారత రాజ్యాంగానిర్మాత అంబేద్కర్‌నే అవమానించేదిగా కార్టూన్ ఉందని, ఇది ప్రభుత్వ ఆధ్వర్యంలో ఎన్‌సిఇఆర్‌టి పుస్తకంలో ప్రచురించారు కాబట్టి ఎన్‌సిఇఆర్‌టి బోర్డుకి చైర్మన్‌గా ఉన్న ఎంఎచ్‌ఆర్‌డి మంత్రి కపిల్ సిబాల్ రాజీనామా చేయాలని ఆర్‌పిఐ నేత అతవాలే డిమాండ్ చేశారు.

2006 నుండి కేంద్ర ప్రభుత్వ ఆధీనంలోని విద్యా సంస్థల్లోనూ, మరికొన్ని ప్రైవేట్ విద్యా సంస్థల్లోనూ ఎన్‌సిఇఆర్‌టి పుస్తకాలు వాడుకలోకి వచ్చాయి. అప్పటి నుంచి రాజనీతి శాస్త్ర పుస్తకం 'కాన్‌స్టిట్యూషన్ ఎట్ వర్క్' బోధిస్తున్నారు. కానీ, ఈ కార్టూన్ ఎవరి దృష్టికీ రాలేదు. ఒక్కసారి ఆర్‌పిఐ ఈ కార్టూన్‌పై విమర్శలు లేపిన తరువాత ఈ వివాదం పార్లమెంట్ వరకు వచ్చి ఒక జాతీయ వివాదంగా మారింది.

మే 11న పార్లమెంట్‌లో తమిళనాడుకు చెందిన దళిత ఎం.పి. తిరుమావళవన్ ఎన్‌సిఇఆర్‌టి పుస్తకంలోని కార్టూన్ అంబేద్కర్‌ని అవమానించేదిగా ఉందని ప్రస్తావించారు. పార్లమెంట్‌లో అన్ని పార్టీల వారు (బిజెపి నేతలు, బిఎస్‌పి నేత మాయావతి తదితరులు) ముక్తకంఠంతో ఈ కార్టూన్‌ని వెంటనే తొలగించాలని డిమాండ్ చేశారు. కొందరైతే ఎన్‌సిఇఆర్‌టి పాఠ్య పుస్తకాల మొత్తాన్ని ఉపసంహరించాలని, కార్టూన్ ఎంపిక చేసిన వారిని శిక్షించాలని కూడా మాట్లాడారు. కేంద్ర విద్యా మంత్రి కపిల్ సిబాల్ కూడా అంతే తీవ్రంగా స్పందించారు. అభ్యంతరకరమైన కార్టూన్ ఎన్‌సిఇఆర్‌టి పుస్తకాల్లో ఉన్నందుకు క్షమాపణ చెప్పడమే కాకుండా, ఈ కార్టూన్‌ని తొలగిస్తామని, ఒక కమిటీ వేసి మొత్తం ఎన్‌సిఇఆర్‌టి రాజనీతి శాస్త్ర పుస్తకాల్ని సమీక్షిస్తామని, ఈ సమీక్ష జరిగేవరకు రాజనీతి శాస్త్ర పుస్తకాల్ని బోధించకుండా ఉపసంహరిస్తామని పార్లమెంట్‌లో ప్రకటించారు. పాఠ్య పుస్తకాలపై, ఆ పుస్తకాల్లోని అంశాలపై పార్లమెంట్ చర్చ చేయడాన్ని, పాఠ్య పుస్తకాల్లో మంచి, చెడుల నిర్ణయించడంలో ప్రభుత్వ జోక్యాన్ని నిరసిస్తూ ఎన్‌సిఇఆర్‌టి రాజనీతి శాస్త్ర పుస్తకాల రచనా ప్రక్రియలో పాల్గొన్న ప్రొ. సుహాస్ పాల్షీకర్, ప్రొ. యోగేంద్ర యాదవ్ తమ ప్రధాన సలహాదారుల బాధ్యతల నుంచి తప్పుకున్నారు. కార్టూన్‌లో అభ్యంతరకర అంశాలు లేవని, ప్రభుత్వం అధ్యాపకుల భావ ప్రకటనా స్వేచ్ఛను నియంత్రి స్తున్నదని, ఎన్‌సిఇఆర్‌టి స్వతంత్ర ప్రతిపత్తిని తుంగలో తొక్కుతుందని విమర్శించారు. ఎన్‌సిఇఆర్‌టి పాఠ్య పుస్తకాల రచనలో, సమీక్షలో, పర్యవేక్షణలో వివిధ స్థాయిల్లో పాల్గొన్న అధ్యాపకులు, మేధావులు పాఠ్య పుస్తకాల్లోని కార్టూన్‌లు, పాఠ్యాంశాలు విషయంలో జోక్యాన్ని తీవ్రంగా ఖండించారు. ఎన్‌సిఇఆర్‌టి పుస్తకాల పరిరక్షణకు క్యాంపెయిన్ చేపట్టారు.

ఎన్‌సిఇఆర్‌టి రాజనీతి శాస్త్ర పుస్తకంలోని కార్టూన్‌లో అంబేద్కర్‌ను అవమానకర రీతిలో చిత్రించారని దళిత రాజకీయ పార్టీలు చేసిన విమర్శ, ఆ తరువాత రోజుల్లో అనేక మంది దళిత మేధావులు, అభ్యుదయ మేధావులు సరైనదేనని అభిప్రాయపడ్డారు. ఈ పుస్తక రచయితల్లో ఒకరైన ప్రొ. సుహాస్ పాల్షీకర్ ఆఫీసుపై ఆర్‌పిఐ కార్యకర్తలు చేసిన దాడిని దళిత, అభ్యుదయ మేధావివర్గం తీవ్రంగా ఖండించింది. అయితే, ఈ కార్టూన్ విషయంలో అభ్యంతరాలపై చర్చ జరగాల్సిందేనన్నారు. అంబేద్కర్ ఒక ప్రవక్త అని, దళితులు ఆయన్ని

దేవుడిలా కొలుస్తారని ఒకరిద్దరు వాదించి అంబేద్కర్‌ని ఒక రాజ్యాంగ నిర్మాతగా, మేధావిగా సరిగ్గా పరిచయం చేయలేదని అనేక మంది దళిత మేధావులు, అభ్యుదయ వాదులు అభిప్రాయ పడ్డారు. ఈ వివాదం మొత్తంలో చాలామంది ఉదారవాద, మార్క్సిస్టు మేధావులు అంబేద్కర్‌ను కార్టూన్‌లో చిత్రించిన తీరు అభ్యంతరకరం, అవమానకరం కాదనీ, అది అసలు సమస్య కాదనీ వాదించారు. ఈ కార్టూన్‌ను సాకుగా చూపి, మొత్తం ఎన్‌సిఇఆర్‌టి రాజనీతి పుస్తకంలో ఉన్న కాంగ్రెస్ నాయకులను విమర్శిస్తున్న కార్టూన్‌లను తొలగించాలని, మొత్తంగా ఎన్‌సిఇఆర్‌టి పాఠ్య పుస్తకాలను తొలగించాలనే కుట్ర ఉందని అన్నారు. విమర్శనాత్మక బోధనా పద్ధతుల్ని ప్రవేశపెడుతూ, విద్యార్థుల్లో విశ్లేషణా శక్తిని, ప్రశ్నించే తత్వాన్ని నేర్పే ఉద్దేశంతో రూపొందించిన ఎన్‌సిఇఆర్‌టి పుస్తకాల్ని ప్రభుత్వం తన జోక్యంతో పక్కన పెట్టబోతోందని, దాన్ని అడ్డుకోవాలని 'ఎన్‌సిఇఆర్‌టి పాఠ్య పుస్తకాల్ని కాపాడుకుందాం' అంటూ సంతకాల సేకరణ మొదలుపెట్టారు.

కార్టూన్‌పై అభ్యంతరాలు, విమర్శలు పరిశీలిస్తే ఈ చర్చలో అనేక కొత్త విషయాలు వెలుగులోకి వచ్చాయి. రాజ్యాంగ రచన ఆలస్యం కావడానికి అంబేద్కర్ కారణమనే అభిప్రాయాన్ని ఈ కార్టూన్ కలిగిస్తుందని, ఈ కార్టూన్ కింద పుస్తక రచయితలు చేర్చిన కామెంట్ కూడా అలాంటి వాదనకే బలం చేకూర్చుతుందని కొందరు దళిత మేధావులు విశ్లేషించారు. అంబేద్కర్ రాజకీయ కృషిని, రాజ్యాంగ రచనలో ఆయన పాత్రను సరిగ్గా గుర్తించని నేపథ్యంలో ఈ కార్టూన్ విద్యార్థులకు తప్పుడు సంకేతాల్ని పంపుతుందన్నారు. రాజ్యాంగ రచన ఆలస్యానికి రాజ్యాంగ సభలో అనేకమంది వివిధ కారణాల వల్ల పాల్గొనకపోవడం, అయినా అంబేద్కర్ 'డ్రాఫ్టింగ్ కమిటీ చైర్మన్'గా ఎంతో కష్టపడి రాజ్యాంగ రచనను ఒక కొలిక్కి తెచ్చిన విషయాన్ని రాజ్యాంగ సభలోనే అనేక మంది ప్రస్తావించారని, అంబేద్కర్ కూడా సుదీర్ఘ వివరణ ఇచ్చారని కొందరు వాదించారు. అలాగే, కొరడా, ఉరితాళ్లు, గొలుసులు లాంటి చిహ్నాలు కూడా సింబాలిక్ వయలెన్స్‌గా గుర్తించాలని, అంబేద్కర్‌పై ఎత్తిన కొరడా దళితులపై తరతరాలుగా సాగుతున్న అగ్రకులాల దౌర్జన్యాలను గుర్తు చేస్తాయని కొందరు దళిత ఫెమినిస్టులు కార్టూన్‌లలో, పెయింటింగ్స్‌లో చిహ్నాలను విశ్లేషిస్తూ వివరించారు. అంబేద్కర్‌ను ఒక ప్రతీకగా దళితులు తమ ఆత్మగౌరవ పోరాటాల్ని, ఉద్యమాల్ని నిర్మించారు. అలాంటి అంబేద్కర్‌ను చిత్రించిన తీరుపై అభ్యంతరాల్ని పరిశీలించాల్సిన అవసరం ఉందని, కార్టూన్‌లో హాస్యం కోసం ఉద్దేశించినవని, వాటికి భయపడడం ప్రజాస్వామ్యాన్ని అపహాస్యం చేయడమేనని వాదించడం సరైంది కాదని దళిత మేధావులు, మరికొందరు ప్రొ. థోరట్ కమిటీకి ఇచ్చిన వినతిపత్రంలో పేర్కొన్నారు.

కేవలం కార్టూన్ మాత్రమే కాక, ఈ పుస్తకంలో అంబేద్కర్ గురించి ఆయన 'డ్రాఫ్టింగ్ కమిటీ చైర్మన్' అన్న విషయాన్ని, ఆయన కృషిని ప్రస్తావించే అంశాలు లేవని, కాబట్టి కార్టూన్‌తో పాటు, పుస్తకంలోని విషయాన్ని కూడా సమీక్షించాలని మరో వాదన ముందుకొచ్చింది.

ప్రస్తుతం అమలులో ఉన్న ఎన్‌సిఇఆర్‌టి పాఠ్యపుస్తకాల ప్రాధాన్యతను గుర్తించాలి. 2002లో హిందూత్వ శక్తులు పాఠ్యపుస్తకాల్ని కాషాయీకరణ చేసిన నేపథ్యంలో, జాతీయ సిలబస్ మార్గ దర్శకాలు (నేషనల్ కరికులమ్ ఫ్రేం వర్క్, 2005) వెలుగులో కొత్త పుస్తకాల్ని రాశారు. 2006 నుంచి ప్రవేశపెట్టిన ఎన్‌సిఇఆర్‌టి పుస్తకాల్లో కాషాయ భావజాలాన్ని పక్కనపెట్టి, కొంతవరకు శాస్త్రీయ దృష్టితో పుస్తక రచనకు ప్రయత్నం జరిగింది. ఈ నేపథ్యాన్ని గుర్తిస్తూనే, ఈ పాఠ్యపుస్తకాల్లో లోపాల్ని సరిదిద్దడానికి ఎన్‌సిఇఆర్‌టి, ప్రభుత్వం ప్రయత్నించాలి. కార్టూన్ వివాదాన్ని సాకుగా చూపి, దళితుల నిరసనను అడ్డుపెట్టుకొని ఎన్‌సిఇఆర్‌టి పాఠ్య పుస్తకాల్ని రద్దు చేసే ప్రయత్నాల్ని అందరూ వ్యతిరేకించాలి. అంబేద్కర్ చిత్రణపై స్పందించిన ప్రభుత్వం, దళితులపై అత్యాచారాలు, ఇతర మౌలిక సమస్యలపై అదే రీతిన స్పందించకపోవడం కూడా మనం గమనించాలి. ప్రజా సమస్యలపై, నిరసనలపై పార్లమెంట్ చర్చ చేసే అధికారం ఉన్నప్పటికీ, పాఠ్య పుస్తకాలపై సమీక్షను నిపుణుల కమిటీకి నివేదించాలి తప్ప ఆ పుస్తకాల్లో మార్పుల్ని పార్లమెంట్ సూచించడం కూడా సరైన సంప్రదాయం కాదు. అలాగే, దళిత నిరసనల్ని కేవలం రాజకీయ పార్టీల కుట్రగానో, వ్యూహంలో భాగంగానే చూడడం సరిపోదు. విశాల దళిత ప్రజానీకం ఈ వివాదంలోకి లాగబడ్డారు. అంబేద్కర్‌పై అవమానాన్ని దళిత ప్రజానీకం కూడా ఒక సమస్యగా భావించారు. ఇలాంటి సందర్భంలో దళిత నిరసనను కేవలం కొన్ని పార్టీల అరాచక చర్యలుగా చూడడం సరిపోదు. కార్టూన్‌పై దళిత, ప్రజాస్వామికవాదుల చర్యను పరిగణనలోకి తీసుకుని, వారి విమర్శల్ని పట్టించుకుంటే, ఎన్‌సిఇఆర్‌టి పుస్తక రచయితలు, ఆ పుస్తకాల్ని సమర్థించే మేధావులు ప్రభుత్వ కుట్రని తిప్పి కొట్టగలుగుతారు.

*(రచయిత అధ్యాపకులు, ఇఫ్ఎల్ యూనివర్సిటీ)* వీ

# సుప్రీంకోర్టు తీర్పు - లొసుగులు

***ఆజాద్, హేమచంద్ర పాండే ఎన్‌కౌంటర్ కేసులో సిబిఐ నివేదికను ఆమోదిస్తూ, న్యాయ విచారణ అవసరం లేదని సుప్రీంకోర్టు ఇచ్చిన తీర్పులో లొసుగులను వివరిస్తున్నారు* ప్రశాంత్ భూషణ్**

*ఆదిలాబాద్ జిల్లా సర్కపల్లి అడవులలో 2010 జూలై 1 రాత్రి జరిగిందని పోలీసులు చెపుతున్న ఎన్‌కౌంటర్‌లో మావోయిస్ట్ పార్టీ పొలిట్‌బ్యూరో సభ్యుడు, అధికార ప్రతినిధి చెరుకూరి రాజ్‌కుమార్ (ఆజాద్), ఢిల్లీకి చెందిన జర్నలిస్టు హేమచంద్ర పాండేలు చనిపోయారు. అది బూటకపు ఎన్‌కౌంటర్ అని, వారిద్దరినీ ఆ రోజు ఉదయం నాగ్‌పూర్‌లో పట్టుకొని, హత్యచేసి, ఆదిలాబాద్ అడవుల్లో మృతదేహాలు పడేశారని మావోయిస్టు పార్టీ మాత్రమే కాక వివిధ ప్రజాసంఘాలు, పౌరహక్కుల సంఘాలు, నిజనిర్ధారణ కమిటీలు, స్వతంత్ర మేధావులు ఆరోపించారు. ఈ ఎన్‌కౌంటర్‌పై న్యాయమూర్తి చేత న్యాయవిచారణ జరిపించాలని హేమచంద్ర పాండే సహచరి బినీత పాండే, సామాజిక కార్యకర్త స్వామి అగ్నివేష్ సుప్రీంకోర్టులో రిట్ పిటిషన్‌లు వేశారు. ఆ రిట్ పిటిషన్‌లపై విచారణలో ఈ ఎన్‌కౌంటర్ ఘటనను విచారించ వలసిందిగా సుప్రీంకోర్టు కేంద్ర నేర పరిశోధక శాఖ (సిబిఐ)ని ఆదేశించింది.*

*చట్టప్రకారం నడుచుకునే మనిషిగా, నిజాయితీపరుడుగా బహు ప్రశంసలు అందుకుంటున్న జాయింట్ డైరెక్టర్ వివి లక్ష్మినారాయణ నేతృత్వంలో సిబిఐ ఈ ఘటనను విచారించి, ఎన్‌కౌంటర్ జరిగిందని, పోలీసుల కథనం అక్షరాలా వాస్తవమని సుప్రీంకోర్టుకు నివేదిక ఇచ్చింది. ఆ నివేదిక ప్రతిని తమకు ఇమ్మని పిటిషనర్‌లూ, పిటిషనర్‌ల తరపు న్యాయవాదులూ అడిగితే సుప్రీంకోర్టు అందుకు నిరాకరించింది.*

*మృతదేహాలపైన మొట్టమొదటి పోస్ట్‌మార్టమ్ చేసి నివేదిక రాసిన మంచిర్యాల ఆస్పత్రి వైద్య నిపుణుడు డా. నీలకంఠేశ్వర రావు నివేదికను సిబిఐ ఫోర్జరీ చేసింది. పోలీసులు చెపుతున్నట్లుగా కాల్పులు కొండ కింది నుంచి పైకి జరగలేదని, ఆజాద్ మృతదేహంలో తూటా ఛాతి పై భాగాన దిగి వీపులో కింది నుంచి బయటికి వచ్చిందని, తూటా కాలిన గాయాన్ని బట్టి కాల్పులు అతి సమీపం నుంచి జరిగి ఉంటాయని, పోలీసులు చెప్పినట్లు ఫర్లాంగు దూరం నుంచి కాదని డా. నీలకంఠేశ్వరరావు నివేదికలో ఉండగా సిబిఐ దాన్ని తారుమారు చేసింది. సుప్రీంకోర్టు కూడా సిబిఐ చేసిన పనిని ఆమోదించింది. అందువల్ల ఎన్‌కౌంటర్ ఘటనపై న్యాయవిచారణ అక్కర్లేదని, స్థానిక మెజిస్ట్రేట్ కోర్టులో సాగుతున్న విచారణ సరిపోతుందని సుప్రీంకోర్టు మే 3న తీర్పునిచ్చింది. ఆ తీర్పును ఖండిస్తూ పిటిషనర్‌ల తరఫున న్యాయవాది ప్రశాంత్ భూషణ్, పిటిషనర్ స్వామి అగ్నివేష్ మే 11న ఢిల్లీలో పత్రికా సమావేశంలో చేసిన ప్రకటన ఇది...*

మావోయిస్టు పార్టీ పొలిట్‌బ్యూరో సభ్యుడు ఆజాద్, జర్నలిస్ట్ హేమచంద్ర పాండేల ఎన్‌కౌంటర్ బూటకమంటూ హేమచంద్ర పాండే భార్య బినీతా పాండే, స్వామి అగ్నివేష్‌లు దాఖలు చేసిన రిట్ పిటిషన్లపై 3 మే 2012న సుప్రీంకోర్టు ఇచ్చిన తీర్పులో ఈ కింది లొసుగులు స్పష్టంగా గుర్తించవచ్చు:

1) ఈ కేసు విచారణను సిబిఐకి అప్పగించడాన్ని వ్యతిరేకిస్తూ, సుప్రీంకోర్టు న్యాయమూర్తి చేత స్వతంత్ర న్యాయవిచారణ జరిపించ వలసిందిగా పిటిషనర్లు మొదటి నుండీ అభ్యర్థిస్తూ వచ్చారు.

2) ఆజాద్ సిపిఐ (మావోయిస్టు) పార్టీ అధికార ప్రతినిధిగా స్వామి అగ్నివేష్ ద్వారా కేంద్ర హోంమంత్రితో శాంతి చర్చల విషయమై మాట్లాడుతూ ఉన్నాడు. కనుక, అతడి ఎన్‌కౌంటర్ బూటకమే అయితే అది హోంమంత్రికి తెలియకుండా, అతడి ఆమోదం లేకుండా జరగదు. సిబిఐ అధికారులను పర్యవేక్షించేది, అదుపు చేసేది కేంద్ర హోం మంత్రిత్వ శాఖే. కనుక, అది సిబిఐని అదుపు చేస్తుందని, నేర పరిశోధనను దారితప్పించగలదని చెప్పేందుకు ఎన్నో ఉదాహరణలున్నాయి.

3) కేసు విచారణను సిబిఐకి అప్పగిస్తూనే, సిబిఐ పరిశోధన తీరును తామే పర్యవేక్షిస్తామని సుప్రీంకోర్టు చెప్పినందువల్ల న్యాయ విచారణ గురించి తమ డిమాండ్‌పై పిటిషనర్లు పట్టుపట్టలేదు. చివరికి సిబిఐ నివేదికలో అనేక లోపాలను పిటిషనర్‌ల న్యాయవాది ఎత్తి చూపినప్పటికీ, సుప్రీం కోర్టు సిబిఐ అంతిమ నివేదికను యథాతథంగా ఆమోదించింది. సిబిఐ నివేదికలోని ఈ కింది లోపాలను న్యాయవాది ఎత్తి చూపారు.

i) ఆజాద్ మృతదేహంపై తూటా ప్రవేశించిన చోట ఉన్న గాయం, హేమచంద్ర పాండే మృతదేహంపై ఉన్న మూడు బుల్లెట్ గాయాలు అంచులు నల్లగా కాలిపోయినట్లు ఎందుకున్నాయనే దానిపై పోస్ట్‌మార్టమ్ చేసిన డా. నీలకంఠేశ్వర రావు చెప్పగా జూనియర్ డా. చంద్రయ్య రాసినట్టు చెపుతున్న వివరణనే సిబిఐ ఇచ్చింది. అయితే ఆశ్చర్యకరంగా డా. చంద్రయ్య ఇచ్చిన ఈ వివరణ 24 మార్చ్ 2011 నాడు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం తన ప్రతివాదనలో ఇచ్చిన వివరణ అక్షరాలా ఒకేలా ఉన్నాయి. ఆంధ్రప్రదేశ్ పోలీసులు గానీ, సిబిఐ గానీ ఇచ్చిన వివరణలలో మొత్తం పోస్ట్‌మార్టమ్ కార్యక్రమానికి బాధ్యుడు అయిన డా. నీలకంఠేశ్వరరావు అభిప్రాయాన్ని పొందుపరచనే లేదు.

అఖిల భారత వైద్య విజ్ఞాన సంస్థకు చెందిన డా. టి.జి. డోగ్రా నాయకత్వంలోని బృందం ఈ అంచులు కాలిపోవడం గురించి అది 'బుల్లెట్‌ల వేడి' అని, 'వేగపు ఒత్తిడి' వల్ల పడినవని చెప్పింది. అయితే, ఈ బుల్లెట్ వేడి అనే వివరణ అక్కడ తుపాకి మందు అవశేషాలు లేనందువల్ల మాత్రమే ఇస్తున్నామని, హైదరాబాద్‌లోని కేంద్ర ఫోరెన్సిక్

సైన్స్ లాబొరేటరీ చెప్పింది. అయితే ఈ లాబొరేటరీ 18 నెలల తర్వాత పరీక్షించింది గనుక మృతుల చొక్కాల మీద తుపాకి మందు అవశేషాలు లేకుండా పోయే అవకాశం ఉంది.

ఎఐఐఎంఎస్ డాక్టర్లు ప్రకటిస్తున్న 'ఈ గాయాల అంచుల నల్లబడడం, కాలినట్లు ఉండడం కారణాలు వేడెక్కిన బుల్లెట్ వల్ల లేదా బుల్లెట్ ఘర్షణ వల్ల' అనే వివరణను ఫోరెన్సిక్ సైన్స్‌కు సంబంధించిన ఏ ప్రామాణిక గ్రంథమూ ఒప్పుకోదు. పోలీసులు చెపుతున్నట్లు 25 మీటర్ల దూరం నుండి కాల్చినపుడు కూడా ఈ కారణాలు ఉంటాయని ఏ ప్రామాణిక గ్రంథమూ అంగీకరించదు. అన్ని గ్రంథాలు కేవలం 4.5 అడుగులు అనగా 1.37 మీటర్లకు పైబడని దూరం నుండి కాల్చినపుడు మాత్రమే గాయం అంచులు నల్లబడడం, కాల్చినట్లు అవడం జరుగుతుందని చెప్పి ఉన్నాయి.

ii) అయితే ఇక్కడ ఎఐఐఎంఎస్ డాక్టర్ల బృందానికి నేతృత్వం వహించిన, ఏ ఫోరెన్సిక్ సైన్స్ ప్రామాణిక గ్రంథానికీ పొసగని సుత్రీకరణలు చేసిన డా. టి.జి. డోగ్రా గురించి చెప్పుకోవలసి ఉంది. ఆయన గతంలో కూడా ఇటువంటి ఎన్నో వివాదాస్పదమైన నివేదికలు ఇచ్చి ఉన్నాడు. ఉదాహరణకు షోఫియాన్, ఇష్రత్ జహాన్‌ల బూటకపు ఎన్‌కౌంటర్ల కేసులోనూ, బాట్లాహౌస్ ఎన్‌కౌంటర్ కేసులోనూ ఇటువంటి వివాదాస్పద నివేదికలే ఇచ్చాడు. షోఫియాన్ కేసులో పోస్ట్‌మార్టమ్ నివేదిక పరిధిని, దానికి అనుసరించవలసిన పద్ధతిని దాటి అభిప్రాయాలు ప్రకటించాడు. ఇష్రత్ జహాన్ కేసులోనైతే ఈయన నాయకత్వంలోని ఫోరెన్సిక్ నిపుణుల బృందం ప్రమాణాలను పూర్తిగా వక్రీకరించి, ప్రామాణిక గ్రంథాలను పక్కనబెట్టి నిర్ధారణలు చేసిందని, ఆ నిర్ధారణలను పునఃపరిశీలించుకోవాలనీ సుప్రీంకోర్టు ప్రత్యేక దర్యాప్తు బృందం ఎస్ఐటి వ్యాఖ్యానించింది. అయినప్పటికీ డోగ్రా బృందం అదే నిర్ధారణను ప్రకటించింది.

iii) ఈ కేసులో పోస్ట్‌మార్టమ్‌కు బాధ్యుడుగా వ్యవహరించిన డా. నీలకంఠేశ్వరరావు ప్రకటనను సిబిఐ రికార్డ్ చేయనేలేదు. అందుకు బదులుగా ఆయన మరొక డాక్టర్ చంద్రయ్యకు చెప్పి రాయించిన నివేదికగా ఒక నివేదికను సమర్పించింది. సిబిఐ ఇచ్చిన ఈ నివేదికలో 'ఫోరెన్సిక్ నిపుణుల కమిటీ అభిప్రాయం' కింద మొదటి రెండు పేజీలలో సాధారణ విషయాలు – 'డా. నీలకంఠేశ్వరరావు అనే నేను పోస్ట్‌మార్టంకు బాధ్యుడుగా వ్యవహరించాను', 'మృతదేహాలపై ఉన్న బుల్లెట్ గాయాలకు కారణాలను నా సహ డాక్టర్ చంద్రయ్యకు చెప్పి రాయించాను' అనే వివరణ మాత్రమే ఉంది. చివరి పేజీలో మొదటి వాక్యం మాత్రం 'డా. నీలకంఠేశ్వరరావూ, నేనూ కలిసి నిర్వహించిన పోస్ట్‌మార్టమ్ నిర్ధారణ' అంటూ అది కేవలం డా. చంద్రయ్య ఇచ్చిన వివరణ కావచ్చునేలా ఉంది. అంటే మూడవ పేజీ నుండి చివరి పేజీ వరకు నివేదిక అంతా డాక్టర్ చంద్రయ్య అభిప్రాయాలే అనీ, ఇక్కడ నివేదిక ఫోర్జరీ చేయబడిందనీ స్పష్టంగా కనబడుతూ ఉంది. ఇక్కడ పిటిషనర్లు డా. నీలకంఠేశ్వరరావును తిరిగి ప్రశ్నించమని లేదా పోస్ట్‌మార్టమ్ నివేదిక వెల్లడిస్తున్న డా. నీలకంఠేశ్వరరావు, డా. చంద్రయ్యల ప్రకటనల వీడియో టేపులను చూడమని చేసిన అభ్యర్థనను సుప్రీంకోర్టు అంగీకరించలేదు.

iv) హేమచంద్ర పాండే జూలై 1, 2010న ఉదయం 10.30కు కూడా తన సెల్‌ఫోన్ ద్వారా తన పై అధికారి అభిషేక్ రంజన్‌కు ఎస్ఎంఎస్ పంపాడనీ, ఆ అధికారి ఫోన్ నుంచి ఆ ఎస్ఎంఎస్‌ను తాము స్వాధీనం చేసుకున్నామనీ సిబిఐ తన నివేదికలో పేర్కొంది. ఆశ్చర్యకరమైన విషయమేమంటే, జూన్ 30 సాయంత్రం 6.30కి ఫరీదాబాద్ నుంచి బయలుదేరిన కాసేపటికే హేమచంద్ర పాండే ఫోన్ పనిచేయడం మానేసింది. సాయంత్రం 6.05 తర్వాత కాల్స్ చేసినట్టుగా సెల్‌ఫోన్ నెట్‌వర్క్ కంపెనీ వద్ద కూడా నమోదు కాలేదు. జూలై 1 ఉదయం అధికారికి చేసిన ఎస్ఎంఎస్ రికార్డ్ అయి, అంతకుముందు రోజు సాయంత్రం నుంచీ చేసిన కాల్స్ ఎందుకు నమోదు కాలేదు? అంటే జూలై 1 ఉదయం పాండే ఎస్ఎంఎస్ చేశాడనేది అవాస్తవం. ఈ ఎన్‌కౌంటర్ కట్టుకథ అనడానికి ఇదీ ఒక ఆధారం.

v) సర్కపల్లి అడవుల్లో మావోయిస్టులు సమావేశమై ఉన్నారన్న విషయం ఎస్‌పికి ఎప్పుడు, ఎలా తెలిసింది?

ఎ) సర్కపల్లి అడవుల్లో మావోయిస్టులు ఉన్నారనే సమాచారం స్పెషల్ ఇంటిలిజెన్స్ బ్యూరో (ఎస్ఐబి) ద్వారా ఎస్‌పికి అందిందని ఎఫ్ఐఆర్ చెపుతుంది. కాని ఎస్ఐబి డిఐజి దీన్ని అంగీకరించలేదు. సిబిఐ మాత్రం తన నివేదికలో పోలీసుల కథనాన్ని కొనసాగించి, మావోయిస్టుల సమాచారం తమకు ఎస్ఐబి ద్వారా కాదు, 'స్పెషల్ ఇంటిలిజెన్స్ పోలీస్' అనే స్థానిక ఇంటిలిజెన్స్ ద్వారా అందిందని చెప్పింది. అయితే ఎస్‌పి కాల్ రికార్డ్స్ ద్వారా తెలుస్తున్నది ఏమిటంటే, ఎస్‌పి సెల్‌ఫోన్ నుండి హైదరాబాద్‌లోని ఎస్ఐబి కార్యాలయానికి ఆ ఇరవై నాలుగు గంటలలో ఏడు కాల్స్ వెళ్లాయి. అందులో నాలుగు కాల్స్ మావోయిస్టుల సమాచారం అందక మునుపే వెళ్లాయి. ఎస్‌పికి సంబంధించిన మొత్తం ఫోన్ రికార్డ్స్ చూస్తే అందులో ఎస్ఐబికి చెందిన రెండు నెంబర్లు ఉన్నాయి. ఈ అంశాలన్నిటిపైనా సిబిఐ సరియైన దర్యాప్తు నిర్వహించి ఉంటే ఎస్‌పి ఫోన్ నుంచి ఎస్ఐబికి మాత్రమే కాక ఎవరెవరికి కాల్స్ వెళ్లాయో కూడా తెలిసి ఉండేది.

బి) హేమచంద్ర పాండే నాగ్‌పూర్‌కు 'గోండ్వానా ఎక్స్‌ప్రెస్'లో వెళ్లాడు. అది జూలై 1 ఉదయం 10 గంటలకు నాగ్‌పూర్ చేరుతుంది. అక్కడి నుండి ఘటన జరిగిన అటవీ ప్రాంతానికి దూరం 235 కిమీ. అంటే కనీసం నాలుగు గంటల సమయం పడుతుంది. సాయంత్రం నాలుగు గంటల కన్నా ముందు పాండే అక్కడికి చేరుకోవడం అసాధ్యం. మరి మధ్యాహ్నం రెండు గంటలకే మావోయిస్టులు సమావేశమయ్యారని కచ్చితమైన స్థలంతో సహా తమకు సమాచారం అందిందని ఎస్‌పి చెపుతున్నాడు. ఎన్‌కౌంటర్ జరిపిన బృందపు అధికారి రఘునందన రావుకు ఎస్‌పి ఫోన్ నుంచి మధ్యాహ్నం రెండున్నరకే ఫోన్‌కాల్ వెళ్లింది. అంటే మధ్యాహ్నం 2 గంటల నుంచి రాత్రి 11 గంటల వరకూ మావోయిస్టులు అదే ప్రదేశంలో కదలకుండా ఉన్నారనుకోవాలా?

vi) సంఘటన జరిగిన సర్కపల్లి అటవీ ప్రాంత సమీప గ్రామం లక్ష్మీపూర్‌కు మూడు వాహనాలు వచ్చి పోలీస్ బృందాలను దింపి వెళ్లిపోయాయి. ఎన్‌కౌంటర్ జరిగిన తర్వాత కూడా పోలీస్ వాహనాలు కానీ, బయటి నుండి అధికారులు కానీ ఆ ప్రాంతాన్నీ, సంఘటనా స్థలాన్నీ పరిశీలించేందుకు రానేలేదు. నిజానికి ఒఎస్‌డిని కూడా ఎస్‌పి ఆ మరుసటిరోజే సంఘటనా స్థలానికి వెళ్లమన్నాడు. కానీ తక్షణమే వెళ్లమనలేదు.

vii) సిబిఐ కోర్టుకు అందజేసిన ఎస్‌పి, సర్కిల్ ఇన్‌స్పెక్టర్ (సిఐ) ఒఎస్‌డిల ఫోన్‌కాల్స్ రికార్డ్స్ అన్నీ జూలై 1 మధ్యాహ్నం రెండున్నర తరువాతవే కాని ఆ ముందువి కావు. దీనిపై పిటిషనర్ల న్యాయవాది అభ్యంతరాలు వ్యక్తం చేసిన తరువాతనే జూలై 1, 2వ తేదీల మొత్తం ఫోన్‌కాల్స్ రికార్డ్ బయటపెట్టారు. అందులో సిఐ ఫోన్‌కాల్స్ రికార్డ్ ద్వారా తెలిసింది ఏమిటంటే, ఆయన ఆ సాయంత్రం 7.23కే సంఘటనా

# ప్రమాదాలన్నీ చట్టబద్ధ హత్యలే

*వివిధ రంగాలలో సంభవిస్తున్న ప్రమాదాలకు, మానవ హననానికి లాభాపేక్షతో, లాభం పునాదిగా నడుస్తున్న ప్రభుత్వ విధానాలే కారణమవుతున్నాయని అంటున్నారు* **పి.వి. రమణ**

మన పాలకులు, వారి ఆదేశాలను పాటించే యాజమాన్యాలు పవర్ పాయింట్ ప్రెజెంటేషన్స్‌తో ప్రాజెక్టులకు, ప్రాజెక్టుల విస్తరణకు రూపకల్పన చేసి వాటిని ఏ మాత్రం ఆలస్యం చెయ్యకుండా పూర్తి చెయ్యాలని విపరీతమైన ఒత్తిడి తెస్తున్నారు. ప్రాజెక్టులు, విస్తరణ కార్యక్రమాలు వేగంగా జరగాలి, వాటి మీద లాభాలు వెంటనే ఆర్జించాలి. రికార్డులు సాధించాలి. ఒకటే తొందర, తీవ్రమైన ఒత్తిడితో ఇవన్నీ చేసే క్రమంలో మనుషుల ప్రాణాలు బలి అవుతున్నాయి. పనిలో నాణ్యత, భద్రత మాయమవుతున్నాయి. గతంలో అనుభవానికి ఇచ్చే విలువ నేడు కనుమరుగవుతోంది. అనుభవజ్ఞులైన, శిక్షితులైన వారు చేయాల్సిన పనులు, కాంట్రాక్టర్లు, సబ్ కాంట్రాక్టర్లతో చేయిస్తున్నారు. వీటన్నిటి పర్యవసానమే భారీ ప్రమాదాలు. పదిహేను సంవత్సరాల క్రితం విశాఖపట్నంలో జరిగిన ఎచ్.పి.సి.ఎల్. విస్ఫోటన నాటి నుంచి నేటి స్టీల్ ప్లాంట్ ప్రమాదం వరకు ప్రభుత్వరంగ సంస్థల నిర్లక్ష్యానికి రుజువులైతే, వోల్వో బస్సు ప్రమాదం ప్రైవేట్ రంగం నిర్లక్ష్యానికి నిదర్శనం. అక్కడా ఇక్కడా కూడా ప్రాణాలకు విలువలేదు. మనుషులను చంపి వారి ప్రాణాలకు లక్ష రూపాయల నుండి కోటి రూపాయల వరకు ఖరీదు కడుతున్నారు.

1970లలో 'విశాఖ ఉక్కు ఆంధ్రుల హక్కు' అంటూ ఉధృతంగా జరిగిన ప్రజా ఉద్యమంతో, ముప్పై రెండు మంది చేసిన ప్రాణత్యాగం తర్వాత సోవియట్ యూనియన్ సహకారంతో ఈ విశాఖ స్టీల్‌ప్లాంట్ ఏర్పాటయింది. పెదగంట్యాడ, చిన గంట్యాడ, దిబ్బపాలెం, బాలచెరువు, పరవాడ, దేశబత్రుని పాలెం గ్రామాలకు చెందిన రైతుల నుండి స్వాధీనం చేసుకున్న భూమి మొత్తం ఇరవై ఐదు వేల ఎకరాల ప్రాంతంలో ఏడు వేల ఎకరాలలో తీర ప్రాంతాన నిర్మించిన ఏకైక ప్లాంట్ ఇది. 1982లో స్టీల్ అథారిటీ ఆఫ్ ఇండియా (ఎస్ఎఐఎల్) నుండి విడదీసి రాష్ట్రీయ ఇస్పాత్ నిగమ్ లిమిటెడ్ (ఆర్ఐఎన్ఎల్)గా మార్చారు. అధిక లాభాలు సంపాదిస్తూ ప్రస్తుతం దేశంలోనే ఉన్న ప్రముఖ ఉక్కు కంపెనీలలో నవరత్న హోదా పొందిన కంపెనీ ఇదే.

### విశాఖ స్టీల్ ప్లాంట్ ప్రమాదం

దేశ విదేశాల్లో పెరుగుతున్న ఉక్కు అవసరాల దృష్ట్యా ప్రస్తుతం 32 లక్షల టన్నులుగా ఉన్న ఉత్పత్తి సామర్థ్యాన్ని 63 లక్షల టన్నులకు పెంచేందుకు ప్రణాళికలు సిద్ధం చేశారు. గత నాలుగు సంవత్సరాలలో ఆధునికీకరణ కార్యకలాపాలు వేగవంతం చేశారు. అందులో భాగంగానే కొత్తగా మరో స్టీల్ మెల్టింగ్ షాప్-2 (ఎస్ఎంఎస్) ను ఏర్పాటు చేశారు. అతి త్వరలో దీనిని అధికారికంగా ప్రారంభించాల్సి ఉంది. జూన్ 13న బుధవారం రాత్రి దీన్ని ప్రయోగాత్మకంగా పరిశీలిస్తున్న ప్రయోగం విజయవంతమైతే సంతోషం పంచుకోవడానికి స్వీట్లు కూడా ఏర్పాటు చేశారు. కన్వర్టర్ పనితీరును పరీక్షిస్తుండగా కన్వర్టర్ బ్లోయింగ్‌కు అవసరమైన ఒత్తిడి (ప్రెజర్)తో ఆక్సిజన్ రావడం లేదు. దాంతో కొందరు అధికారులు ఆక్సిజన్ సిలిండర్ వద్దకు వెళ్లి ప్రెజర్ పెంచారు. అయినా అవసరమైనంత ఆక్సిజన్ రాలేదు. మూడుసార్లు ప్రెజర్ పెంచడంతో ఒత్తిడి పెరిగిపోయి ఒకేసారి ఎక్కువ మొత్తం ఆక్సిజన్ విడుదల కావడంతో ఇరవై మీటర్ల ఎత్తు ఐదు మీటర్ల వ్యాసం ఉన్న ఆక్సిజన్ సిలిండర్లు పేలిపోయాయి. ముగ్గురు డిజిఎంలతో సహా తొమ్మిది మంది అక్కడికక్కడే సజీవ దహనమయ్యారు. వీరి మృతదేహాలు గుర్తుపట్ట లేనంతగా మారిపోయాయి. గాయపడిన వారిని మొదట స్టీల్‌ప్లాంట్ ఆస్పత్రిలోనూ, తర్వాత కార్పొరేట్ ఆస్పత్రులు అయిన కేర్, సెవెన్ హిల్స్‌లలో చేర్చారు. హాస్పిటలన్నీ ఏడుపులు, పెడబొబ్బలతో మారుమోగి పోయాయి. కొందరు బంధువులు స్పృహ తప్పిపోయారు. 90 శాతం

---

స్థలానికి చేరుకున్నాడు. అప్పటి నుంచి రాత్రి 11.30 వరకూ ఎటువంటి కాల్స్ చేయలేదు. ఎస్పి మాత్రం ఆ సాయంత్రమంతా సిఐతో నిరంతర సంపర్కంలో ఉన్నానని చెపుతున్నాడు. మరి సిఐ ఫోన్‌కు కాల్స్ రాకపోవడం ఎట్లా సాధ్యం? ఇంకా ఆశ్చర్యకరంగా ఎస్పి నుంచి సిఐకి రాత్రి 11.30కు అంటే పోలీసులు చెపుతున్న ఎన్‌కౌంటర్ జరిగిన వెంటనే కాల్ వెళ్లింది. ఎన్‌కౌంటరే జరిగి ఉంటే అది నివేదించడానికి సిఐ ఎస్పికి చేయాలని గానీ, అటు నుంచి ఇటు కాల్ ఎలా వచ్చింది.

viii) జూలై 1 రాత్రి బాగా పొద్దుపోయిన తరువాత సిఐ మంజూర్ అహ్మద్ అనే మరొక పోలీస్ అధికారికి ఫోన్ చేశాడు. కాని ఎన్‌కౌంటర్ గురించి చెప్పకుండా కేవలం జాగ్రత్తగా ఉండమని మాత్రమే చెప్పాడు.

ఈ కేసు విచారణలో సిబిఐ తప్పుల తడక దర్యాప్తు నివేదికను పిటిషనర్ల న్యాయవాది బయట పెట్టిన తర్వాత అయినా సుప్రీంకోర్టు ఈ కేసు ప్రాముఖ్యతను గుర్తించవలసింది. కాని అలా చేయకపోగా రిట్ పిటిషన్‌లు కొట్టివేస్తూ, కేసును ముగిస్తూ, తన నివేదికను స్థానిక మెజిస్ట్రేట్‌కు అందజేయాలంటూ సిబిఐని ఆదేశించడం ద్వారా సుప్రీంకోర్టు తీవ్రమైన న్యాయతప్పిదానికి పాల్పడింది. ఈ కేసు తప్పనిసరిగా స్వతంత్ర సుప్రీంకోర్టు న్యాయమూర్తి చేత లేదా స్పెషల్ ఇన్వెస్టిగేషన్ టీం (ఎస్ఐటి) వంటి ప్రత్యేక సంస్థ ద్వారా స్వతంత్ర న్యాయ విచారణ చేయించవలసిన కేసే.

*(తెలుగు అనువాదం జి. ఉదయ, ఉపాధ్యాయురాలు)* వీ

కాలిపోయిన వారు బతుకుతారో లేదోనన్న ఆందోళనలతో ఎదురు చూసారు. మొత్తం పన్నెండు మంది స్టీల్‌ప్లాంట్ అధికారులు, కార్మికులు, ప్రైవేట్ కంపెనీలు బ్లూస్టార్, దస్తూర్, ఎన్ఎన్ఎస్ సీమేన్‌లకు చెందిన కార్మికులు ఏడుగురు ప్రమాదానికి బలి అయ్యరు. ప్రమాదంలో నష్టం దాదాపు 1200 కోట్ల రూపాయలు ఉంటుందని అంచనా.

కేంద్ర స్టీల్ మంత్రి బేణీప్రసాద్ వర్మ పరామర్శకు వచ్చి ముగ్గురు సభ్యులతో కూడిన ఉన్నతస్థాయి కమిటీని ప్రకటించారు. దీనికి మాజీ ఎస్ఎఐఎల్ చైర్మన్ ఎస్.ఆర్. జైన్ నాయకత్వం వహించి నెల రోజుల లోపున రిపోర్టు ఇవ్వాలని ఆదేశించారు. ముఖ్యమంత్రి కిరణ్‌కుమార్ రెడ్డి ఫ్యాక్టరీ చట్టం కింద విచారణ జరపాలని ఆదేశించారు. ఇది జాయింట్ చీఫ్ ఇన్స్‌పెక్టర్ ఆధ్వర్యాన జరుగుతుంది. ఈ ప్రమాదాన్ని సుప్రీంకోర్టు సుమోటోగా తీసుకొని పూర్తిస్థాయి విచారణ జరిపి నివేదిక అందచేయాల్సిందిగా జిల్లా న్యాయ సేవాసదన్‌ను ఆదేశించింది. ఈ మేరకు గాజువాక న్యాయ సేవాసదన్ చైర్మన్ సీనియర్ సివిల్ జడ్జి రమాదేవి సంఘటనా స్థలనాన్ని పరిశీలించి విచారణ జరుపుతున్నారు.

స్టీల్‌మెల్ట్ షాప్, బ్లాస్ట్ ఫర్నేస్, సెంటర్ ప్లాంట్‌లలో తరుచూ జరుగుతున్న ప్రమాదాలను చూసి కార్మికులు భయాందోళనలు చెందుతున్నారు. 13న ప్రమాదం జరిగిన ఆక్సిజన్ ప్లాంట్‌కు అతి సమీపంలో గల బ్లూస్టార్ కంపెనీకు చెందిన ఆక్సిజన్ ట్యాంకులున్నాయి. ఆ కార్యాలయంలో రోజూ రెండు వందల మంది తమ విధులు నిర్వహిస్తుంటారు. పేలుడులో ఎగిసిన అవశేషాలు ఏ మాత్రం తాకినా ఆక్సిజన్ ట్యాంకర్లకు అంటుకొని ఘోర ప్రమాదం, భారీ జననష్టం జరిగి ఉండేది. ప్రమాదం జరిగిన ప్లాంటు పక్కనే ఉన్న కారు, పేలుడు ధాటికి మూడు వందల మీటర్ల దూరంలో ఎగిరి పడిందంటే ప్రమాదస్థాయి అర్థం అవుతుంది.

**గతంలో జరిగిన ప్రమాదాలు**

2010లో ఎనిమిది దుర్ఘటనలు జరిగాయి.

| | |
|---|---|
| 10 ఏప్రిల్, 2011 | ఎస్ఎంఎస్‌లో అగ్ని ప్రమాదం జరిగి అరవై కోట్ల రూపాయల నష్టం |
| 14 ఏప్రిల్, 2011 | ఎస్ఎంఎస్‌లో కాస్టింగ్ విభాగంలో 140 టన్నుల ద్రవరూప స్టీల్ స్పిల్లేజి |
| 17 ఏప్రిల్, 2011 | ముడిసరుకు నిర్వహణ ప్లాంటులో ప్రమాదం, ఇరవై కోట్ల రూపాయల నష్టం |
| 1 మే, 2011 | బ్లాస్ట్ ఫర్నేస్‌కు వెళ్లే కన్వేయర్ బెల్ట్ మడత పడడంతో 48 గంటల ఉత్పత్తి నిలిపివేత |
| 18 జూన్, 2011 | హాట్‌కోల్ పడడంతో కాలిపోయిన రెండవ కన్వేయర్ బెల్టు, 15 లక్షల రూపాయల నష్టం |
| 6 ఫిబ్రవరి, 2012 | ఎన్ఎంఎన్‌లో భారీ స్పిల్లేజి, 1 కోటి రూపాయల నష్టం |
| 1 మే, 2012 | బ్లాస్ట్ ఫర్నేస్‌లో పేలుడు, ఇద్దరు కార్మికుల సజీవ దహనం |
| 12 మే, 2012 | కన్వేయర్ బెల్టు కాలిపోయి 1 కోటి రూపాయల నష్టం |

స్టీల్ ప్లాంట్‌లో ప్రమాదాలు కొత్తేమీ కాదు. గతంలో అనేక ప్రమాదాలు జరిగాయి. కానీ అధికార్లతో సహా ఇంతమంది చనిపోవడం ఇదే మొదటిసారి.

## మే 1, 2012 ప్రమాదం

కొత్తగా ఏర్పడిన బ్లాస్ట్ ఫర్నేస్ నెం.3లో పేలుడు వలన ఇద్దరు కాంట్రాక్టు కార్మికులు సజీవ దహనమయ్యారు. ఘటనా స్థలం దగ్గరలోనే పనులను పర్యవేక్షిస్తున్న విభాగం జీఎం ప్రదీప్, డిజీఎం భట్టాచార్య, భద్రతా విభాగం డిజీఎం ఎన్‌వికె రాజు, టెక్నీషియన్ సోమశేఖర్, తదితరులు అక్కడి నుండి పరుగులు తీయడం వలన ప్రాణాలు దక్కించు కున్నారు. బ్లాస్ట్ ఫర్నేస్ నుండి ద్రవ ఉక్కు, స్లాగ్ వేర్వేరుగా బయటకు పోతాయి. స్లాగ్‌ను బయట ఏర్పరిచిన తొట్టి లోనికి విడిచిపెట్టి చల్లార్చి బయటకు తీస్తుంటారు. సాయంత్రం 4.30 నిమిషాలకు స్లాగ్‌ను తీయడానికి ప్రైవేట్ సంస్థ నేహా కన్‌స్ట్రక్షన్స్ సూపర్‌వైజర్ సంతోష్ కుమార్ దాస్, ఆపరేటర్ సుమన్ ఠాకూర్‌లు ఎర్త్ మూవర్‌తో స్లాగ్‌ను తీస్తూ మరుగుతున్న వేడి ఇనప ద్రవం ను కదిలించడం వలన అది బయటకు చిమ్మి దాని మీద నీరు పడి పేలుడు సంభవించింది. చుట్టుపక్కల సామాగ్రి వంద మీటర్ల ఎత్తున ఎగిసిపడ్డాయి. చుట్టుపక్కల వందల మంది కార్మికులు భయంతో పారిపోయారు. విస్తరణలో భాగంగా 3800 కోట్ల రూపాయల ఖర్చుతో నిర్మించిన ఈ విభాగ వ్యవస్థ ఒక గాడిన పడేవరకు అనుభవజ్ఞులైన నిపుణుల పర్యవేక్షణ అవసరం కాగా, దానికి అట్టే ప్రాధాన్యత ఇవ్వకపోవడమే ప్రధాన కారణం. ప్రత్యేకంగా ఈ విభాగాల్లో పని చేయడానికి కావల్సిన శిక్షణ కోసం విదేశాలకు సైతం కొందరిని పంపించారు. కానీ తర్వాత వారిని ఆ విభాగాలలో కాకుండా వేరే విభాగాలలో వినియోగించడం యజమాన్యం తీవ్రమైన నిర్లక్ష్యానికి నిదర్శనం. ఏప్రిల్ 24న ప్రారంభించిన ఈ విభాగంలో 27న తొలిసారిగా హాట్ మెటల్‌ను బయటకు తీసారు. సరైన అవగాహన లేక 28న కోక్‌బిన్స్‌లోకి సింటర్‌ను పంపడంతో 34 ట్యూయర్స్ మూసుకు పోయాయి. దీనివలన సుమారు 36 గంటలు ఉత్పత్తి నిలిచిపోయింది. దీన్ని రహస్యంగానే ఉంచారు. గతంలో మొదటి ఫర్నేస్ ప్రారంభించి నపుడు భిలాయ్ నుండి అనుభవం గల కార్మికులను తీసుకువచ్చి ఫర్నేస్ పూర్తిగా పనిచేసే వరకు ఉంచిన సంగతి కార్మికులు గుర్తు చేసుకొంటున్నారు.

## జూన్ 13 ప్రమాదానికి కారణాలు, విశ్లేషణలు

దేశంలో ఉక్కును ఉత్పత్తి చేసే కర్మాగారాల పనితీరును వివిధ కోణాల నుండి బేరీజు వేయడానికి ఏర్పడ్డ సంస్థ 'గ్రీన్ రేటింగ్ ప్రాజెక్టు సంవత్సరానికి ఐదు లక్షల టన్నుల కన్నా ఎక్కువ ఉత్పత్తి చేసే 21 కంపెనీల పనితీరును విశ్లేషించి తయారు చేసిన నివేదికలో అంశాలు'. మొత్తం మీద చూసే ఈ రంగంలో ఉన్న కంపెనీలు, భద్రతా ప్రమాణాలు పట్టించుకోవడం లేదు. 2007 నుండి 2010 వరకు మూడేళ్లలో 17 ఉక్కు కర్మాగారాలలో జరిగిన ప్రమాదాలలో 144 మంది కార్మికులు చనిపోయారు. ఎవరికి వారు ఒక కమిటీ వేసి, ఆ కమిటీ నివేదిక సమర్పించిన తర్వాత సమస్య ముగిసి పోయిందని భావిస్తారు. కార్మికుల భద్రత విషయమై ఈ ఉక్కు కర్మాగారాలు ప్రత్యేక శ్రద్ధ తీసుకోవడం లేదు. విశాఖ ప్లాంట్‌కు ఒఎస్ఎచ్ఎస్ – 18001 సర్టిఫికేషన్ కూడా

ఉంది. అత్యున్నత భద్రతా ప్రమాణాలు, రక్షణ చర్యలు తీసుకొంటున్న సంస్థలకు మాత్రమే ఈ అంతర్జాతీయ సర్టిఫికేషన్ లభిస్తుంది. కానీ అదంతా డొల్లేనని తేలిపోయింది. కోక్ ఓవెన్ బ్యాటరీ అత్యంత ప్రమాదకరమైనది. దాని సమీపంలో పని చేసే కార్మికులందరికీ ఆరోగ్య పరీక్షలు తప్పనిసరిగా నిర్వహించాలి. కాని అవేమీ జరగడం లేదు. 2007 నుండి 2010 వరకూ ఇక్కడ జరిగిన ప్రమాదాలలో పది మంది కార్మికులు చనిపోయారు. భద్రతా, పర్యావరణ పరిరక్షణ వ్యవస్థపై చేసిన సర్వేలో వైజాగ్ ప్లాంట్‌కి అతి తక్కువగా 18 మార్కులు వచ్చాయి' అని ఈ ప్రాజెక్టును ఏర్పాటు చేసిన సెంటర్ ఫర్ సైన్స్ అండ్ ఎన్విరాన్‌మెంట్ (సిఎస్ఇ) సంస్థ డిప్యూటీ డైరెక్టర్ జనరల్ చంద్రభూషణ్ ప్రకటించారు.

విశాఖ ఉక్కు కర్మాగారంలో సీనియర్ అధికారులు, నిపుణులు ఉన్నప్పటికీ, విస్తరణలో ప్రధాన విభాగాలు ప్రారంభించే సమయంలో కీలక నిర్ణయాలు తీసుకోవడంలో అనుభవం తక్కువగా ఉందని అదే బుధవారం నాటి ప్రమాదానికి కారణమని ఉక్కు కర్మాగార రంగంలో అనుభవజ్ఞులైన నిపుణులు విశ్లేషించారు. విశాఖకు చెందిన ఇంజనీర్లు విదేశాలకు వెళ్లి శిక్షణ పొందినప్పటికీ, రష్యా, జర్మనీ దేశాలతో పోలిస్తే మరింత అనుభవం పొందాల్సి ఉందని నిపుణులు అభిప్రాయపడ్డారు. కన్వర్టర్‌లోకి ఆక్సిజన్ పంపే సమయంలో ఏర్పడ్డ సాంకేతిక సమస్యను గుర్తించకుండానే మూడుసార్లు ప్రెజర్ పెంచడాన్ని మాజీ అధికారులు తప్పుపట్టారు.

ఆక్సిజన్ సరఫరా కోసం 10 ఎంఎం స్టెయిన్‌లెస్ స్టీల్ పైపులకు బదులు 5 ఎంఎం నాసిరకం పైపులు వినియోగించారని, అవి ఒత్తిడికి తట్టుకోలేక తొందరగా కరిగి పేలి పోయాయని కొందరు అధికారులు అభిప్రాయపడుతున్నారు. 22 సంవత్సరాల క్రితం మొదటి స్టీల్ మెల్టింగ్ షాప్‌కు అవసరమైన ఆక్సిజన్ ప్లాంట్‌ను ప్రభుత్వరంగ సంస్థ అయిన బిఎచ్‌పివి తయారు చెయ్యగా దాన్ని ప్లాంట్‌లో ఏర్పాటు చేసారు. అది ఇప్పటికీ సమర్థవంతంగా పనిచేస్తోంది.

విస్తరణలో భాగంగా 800 కోట్ల రూపాయల ఖర్చుతో నిర్మాణం చెయ్యబోయే కొత్త స్టీల్ మెల్టింగ్ షాప్‌లో ఆక్సిజన్ ప్లాంట్ల నిర్మాణాన్ని జర్మనీకి చెందిన 'సీమేగ్' కంపెనీకి అప్పగించారు. ఐదు నెలల క్రితం ఈ సంస్థ 150 టన్నుల సామర్థ్యం గల రెండు ఆక్సిజన్ ఫర్నేస్‌లను నిర్మించింది. ఇవి ప్రమాదం జరిగిన మరుసటి రోజు అంటే గురువారానికి పూర్తి చేసి అందచేయాల్సి ఉంది. సాధారణ విచారణలో తేలిందేమిటంటే ట్రయల్ ముందు 'సీమేగ్' కంపెనీ అధికారులు అవసరమైన సాంకేతిక నైపుణ్యాన్ని అందివ్వలేదని, అవసరమైన శిక్షణ ఇవ్వలేదని తెలుస్తుంది. దీనిపై విదేశీ కంపెనీల సామర్థ్యంపైననే అనుమానాలు కలుగుతున్నాయి. పైగా విస్తరణలో భాగంగా ప్రైవేట్ కంపెనీలు కొత్తగా నిర్మిస్తున్న ప్లాంట్లలోనే ఎక్కువగా ప్రమాదాలు జరుగుతున్నాయని కార్మికులు అంటున్నారు. ఉక్కు కర్మాగారాల నిబంధనల మేరకు అనుభవమున్న స్కిల్డ్ కార్మికులను నియమించాలి. వారికి ప్రత్యేక శిక్షణ ఇచ్చి పనులు చేయించాలి. కాని దీనికి భిన్నంగా ఎక్కువ పనులు కాంట్రాక్టు కార్మికులతో చేయిస్తున్నారు. రికార్డుల కోసం, ఉత్పాదకత టార్గెట్‌లు పెంచుతూ పనిలో వేగం పెంచారు. దీని వలన భద్రతా నాణ్యతలపై దృష్టి తగ్గిపోయింది.

గతంలో కొత్తగా తీసుకున్న ఉద్యోగులందరిని భిలాయ్, రూర్కెలా, బొకారో స్టీల్ ప్లాంట్‌లలో శిక్షణకు పంపేవారు. కాని నేడు కొత్త యూనిట్లు స్థాపించడంలో ఉన్న తొందర, భద్రతా చర్యలపై కనిపించడం లేదు. స్టీల్‌ప్లాంట్ విస్తరణ పనులు ప్రైవేట్ సంస్థలకు ఇవ్వడం, అవి లాభాలు ఆర్జించే దృష్టితో నాణ్యత, భద్రతా ప్రమాణాలకు ప్రాధాన్యత ఇవ్వకపోవడంతో ప్రమాదాలు తరచుగా జరుగుతున్నాయి.

ఆధునికీకరణ, విస్తరణల పేరుతో జరుగుతున్నవన్నీ త్వరగా పూర్తిచేసి, తొందరలోనే స్టీల్ ప్లాంట్‌ను ప్రైవేటు పరం చేయాలనే పాలకుల కుట్ర కూడా ఉంది. భవిష్యత్‌లో 115 లక్షల టన్నుల ఉత్పత్తి స్థాయికి పెంచడానికి అవసరమైన నిధులు, దాదాపు 20 వేల కోట్ల రూపాయలు సేకరించడానికి ప్లాంట్ తాలుకా 10 శాతం షేర్లను మార్కెట్‌లోకి జూలై 3న విడుదల చేయాలని నిర్ణయించారు. దీనికోసం రోడ్ షోల పేరుతో బొంబాయి, న్యూయార్క్, బోస్టన్, లాస్ ఏంజెల్స్, లండన్, హాంగ్‌కాంగ్, సింగపూర్‌లలో ప్రచార యాత్ర నిర్వహించడానికి సన్నాహాలు కూడా చేశారు. కాని ప్రమాదంలో ఇంతమంది ప్రాణాలు పోవడం వలన ప్రస్తుతానికి వాయిదా వేసారు. షేర్ల అమ్మకం, వాస్తవ విలువకు, మార్కెట్ విలువకు సంబంధం లేకుండా జరుగుతాయి. వాటాలు అమ్మడం ప్రైవేటు పరం చెయ్యడానికేనని గతంలో బాల్కో, హిందుస్థాన్ జింక్‌ల చరిత్ర మనకు చెపుతోంది. దీనికి వ్యతిరేకంగా కార్మిక సంఘాలన్నీ ఐక్యంగా జూన్ 27, 28 తేదీలలో రెండురోజుల సమ్మె చెయ్యాలని నిర్ణయించాయి. కాని ప్రమాదం దృష్ట్యా సమ్మెను జూలై 31, ఆగస్ట్1 కి వాయిదా వేశాయి.

## ఎచ్‌పిసిఎల్‌లో భారీ ప్రమాదం

14 సెప్టెంబర్, 1997 విశాఖపట్టణం మల్కాపురం దగ్గర్లో ఉన్న హిందూస్థాన్ పెట్రోలియం కార్పొరేషన్ లిమిటెడ్ (ఎచ్‌పిసిఎల్) ప్లాంట్ ప్రాంతమంతా భారీ పేలుళ్లు, మంటలతో దద్దరిల్లిపోయింది. భయంతో జనం సింధియా నుండి గాజువాక వరకు ప్రాణాలు అరచేతిలో పెట్టుకొని పరుగులు తీసారు. యావత్తు విశాఖ నగరాన్ని వణికించిన ఈ విస్ఫోటనలో విశాఖ ఎచ్‌పిసిఎల్ రిఫైనరీ సగభాగం సర్వనాశనమైంది. పెద్ద పెద్ద భవనాలు పేకమేడల్లా కూలిపోయాయి. భవనాల శిథిలాల కింది దాదాపు అరవై మంది సజీవ సమాధులయ్యారు. అనేక ఆయిల్ ట్యాంకులు, గ్యాస్ స్ఫియర్లు మంటలకు ఆహుతయిపోయాయి. పోర్టులోకి ఒక నౌక నుండి రిఫైనరీ స్ఫియర్‌లోకి వంటగ్యాస్ దిగుమతి అవుతూ లీక్ అయింది. అది మొత్తం పారిశ్రామిక ప్రాంతమంతా విస్తరించింది. ఆ రోజు గాలి అదృష్టవశాత్తు ఉత్తర దిశ వైపు ఉండడంతో భయంకరమైన విపత్తు తప్పింది. గాలి దక్షిణ దిశగా వీచి ఉంటే లీకయిన గ్యాస్ మల్కాపురం పోర్ట్ క్వార్టర్స్, రామకృష్ణాపురం, శ్రీహరిపురం ప్రాంతమంతా విస్తరించి అక్కడ ఉన్న పరిశ్రమల సిబ్బందే కాక, ఆ ప్రాంతాల్లో నివసించే వేలాది కాంట్రాక్టు కార్మికులు ప్రాణాలు కోల్పోయి ఉండేవారు.

అంతకు ముందు కూడా అనేక ప్రమాదాలు జరిగాయి. ఒకసారి పోలీ ప్లాంట్ పూర్తిగా దగ్ధమైంది. మరోసారి లిఫ్ట్ పంప్‌హౌస్ దగ్గర పెద్ద అగ్ని ప్రమాదం జరిగి పైపులైన్లు ఎగిరిపడ్డాయి. ఓసారి నాఫ్తా టాంకు అంటుకుంది. ఇన్ని ప్రమాదాలు జరుగుతున్నా యాజమాన్యం ఎటువంటి గుణపాఠాలు తీసుకోలేదు. భద్రత గురించి నినాదాలు రాయించడంలో ఉన్న శ్రద్ధ సిబ్బందికి శిక్షణ ఇవ్వడంలో చూపలేదు. ఈ ప్రమాదాలన్నీ యాజమాన్య నిర్లక్ష్య ఫలితమే.

స్టీల్ ప్లాంట్ మాదిరిగానే ఎచ్‌పిసిఎల్‌లో కూడా ఆధునికీకరణ విస్తరణ కార్యక్రమాలు ఈ మధ్య జోరయ్యాయి. అవి భారీగా, వేగంగా కొనసాగుతున్నాయి. దాని ఫలితమే ఈ మధ్య అనేకసార్లు రసాయనిక వర్థ పదార్థాలను గాలిలోకి విడుదల చేయడం, దీనివలన మొత్తం విశాఖ ప్రజలు భరింపరాని వాసనతో సతమత మయ్యారు. కళ్లు మండి పోవడం, వికారం, ఊపిరి పీల్చుకోవడంలో ఇబ్బందులు పాలవ్వడం జరిగింది. సరైన భద్రతా చర్యలు తీసకోక పోవడం వల్లనే ఇవి జరుగుతున్నాయి. ప్రజల భయాందోళనలు గమనించిన కాలుష్య నియంత్రణ మండలి ఉత్పత్తిలో కోత కూడా విధించాల్సి వచ్చింది. అయినా షరా మామూలే. రాబోయే రోజుల్లో మరింత ప్రమాదకరమైన పరిస్థితులు ఏర్పడవచ్చని ప్రజలు భయాందోళనలు చెందుతున్నారు. భోపాల్ దుర్ఘటన ప్రభావం గురించి గుర్తు చేసుకొంటున్నారు.

### షిరిడీ యాత్రలో వోల్వో బస్సు ప్రమాదం

ఈ నెల 15న శుక్రవారం సాయంత్రం 45 మంది ప్రయాణికులతో హైదరాబాద్ నుండి షిరిడీ బయలుదేరిన కాళేశ్వరీ ట్రావెల్స్‌కు చెందిన వోల్వో బస్సు షోలాపూర్ రహదారిలో, ఉస్మానాబాద్ నవదుర్గ ప్రాంతంలో అర్ధరాత్రి ఎదురుగా వస్తున్న వ్యాన్‌ను తప్పించుకోవడంలో అదుపు తప్పి వంతెన పై నుండి ఇరవై ఐదు అడుగుల లోతుల్లోకి పడిపోయింది. ఈ భారీ ప్రమాదంలో 31 మంది నిద్రలోనే కన్ను మూసారు. వీరిలో ఎక్కువమంది సాఫ్ట్‌వేర్ ఉద్యోగులయిన యువతీ యువకులున్నారు.

రాష్ట్ర రోడ్డు రవాణా సంస్థ ఆదాయానికి గండికొట్టి, రాష్ట్ర ప్రభుత్వం ప్రైవేట్ బస్సు సంస్థలకు పూర్తి సహకారం అందించడం వలన, రాష్ట్రంలో వారి జోరుకు అడ్డూ ఆపూ లేకుండా సాగిపోతోంది. వీటిలో చాలా వరకు నిబంధనలేమీ పాటించవు. పొరుగు రాష్ట్రాలతో పోలిస్తే, ప్రైవేట్ సర్వీసులకు మూడవ వంతు పన్ను మాత్రమే వసూలు చేస్తున్నారు. పన్నులు తక్కువగా ఉండడంతో ప్రైవేట్ లగ్జరీ, వోల్వో బస్సులు పుట్టగొడుగుల్లా పుట్టుకొచ్చాయి. మన రాష్ట్రంలో దాదాపు మూడు వేల బస్సులను ప్రైవేట్ ఆపరేటర్లు నిర్వహిస్తున్నారు. వీటిలో కనీసం రెండు వేల వరకూ నిబంధనలేవీ పాటించడం లేదు. ఉన్న నిబంధనల్ని అపహాస్యం చేస్తూ అడ్డదారిలో ఇష్టారాజ్యంగా బస్సు సర్వీసులు నిర్వహిస్తున్నారు. ఈ బస్సులకు సరైన పర్మిట్లు ఉండవు. సరిపడా సిబ్బంది ఉండరు. ఎక్కువ మంది ఎటువంటి శిక్షణా లేకుండానే పని చేస్తుంటారు. ఈ ప్రైవేట్ ఆపరేటర్లకు సంబంధించిన బస్సులకు ఫిట్‌నెస్, తదితర అంశాలపై రెండేళ్లుగా జరగాల్సిన తనిఖీలు జరగలేదంటే వారి పలుకుబడి ఏ స్థాయిలో ఉందో తెలుసుకోవచ్చు. కొంతమంది ఒక పర్మిట్ తీసుకొని, దానిపై రెండు బస్సులు నడుపుతున్నారు. ఎప్పటికప్పుడు బస్సు కండిషన్, డ్రైవర్ ఆరోగ్య స్థితి సరిచూసుకోవాలి. కాని హడావుడి ప్రయాణానికే ఆపరేటర్లు ప్రాధాన్యత ఇవ్వడం వలన ప్రమాదాలు పెరుగుతున్నాయి. తనిఖీలు చేసి, చర్యలు తీసుకోవలిసిన అధికారులు నిర్లక్ష్యం వహిస్తున్నారు. ప్రైవేట్ ఆపరేటర్ల వద్ద పనిచేసే సిబ్బంది పరిస్థితి మరీ దారుణం. కార్మిక చట్టాల ప్రకారం జీతాలు చెల్లించడం లేదు. ఒక డ్రైవరు ఐదు గంటలు బస్సు నడిపిన తరువాత గంట సేపు విశ్రాంతి తీసుకోవాలి. అతడి స్థానంలో రెండో డ్రైవర్ విధులు నిర్వహించాలి. కానీ చాలా బస్సుల్లో ఇద్దరు డ్రైవర్ల ఏర్పాటును నిర్లక్ష్యం చేస్తూ ఒకే డ్రైవర్‌తో నడిపిస్తున్నారు. దాంతో విశ్రాంతి లేకుండా నడుపుతున్న డ్రైవర్ల వలన తరుచు ప్రమాదాలు జరుగుతున్నాయి. కొన్ని బస్సులలో డ్రైవర్ విశ్రాంతి తీసుకొంటే, ఏ మాత్రం అనుభవం లేని, అప్పుడే నేర్చుకుంటున్న వారితో నడిపిస్తున్నారు. స్కూలు బస్సులు పరిస్థితి ఇంతే. పిల్లల తల్లిదండ్రుల నుండి వేలాది రూపాయలు వసూలు చేస్తూ, డొక్కు బస్సులతో, సరైన జీతాలివ్వకుండా, తక్కువ జీతాలకు, అనుభవం లేని స్టాఫ్‌తో బస్సులు నడుపుతున్న ప్రైవేట్ స్కూలు యజమాన్యాలు. వీరి ధనాశకు ఎంతోమంది చిన్నారులు ప్రమాదాల్లో బలైపోతున్నారు.

ఎచ్‌పిసిఎల్ విస్ఫోటనలో అరవై మంది కార్మికులు, విశాఖ స్టీల్ ప్లాంట్ ప్రమాదాలలో దాదాపు ముప్పై మంది అధికారులు, కార్మికులు, వోల్వో బస్సు ప్రమాదంలో 32 మంది ప్రాణాలు పోయాయి. ఇలా ఎన్నో వేల మంది ప్రమాదాల పాలయి ప్రాణాలు కోల్పోతున్నారు. పాలకులు కొనసాగిస్తున్న ప్రపంచీకరణ, ప్రైవేటీకరణ దుర్మార్గ విధానాల ఫలితమే ఈ ప్రమాదాలు. లాభాల కోసం, రికార్డుల కోసం, నిబంధనలేవీ పాటించకపోవడం, అనుభవజ్ఞులైన, శిక్షితులైన ఉద్యోగులు నిర్వహించాల్సిన విధులను ప్రైవేట్ సంస్థలతో, కాంట్రాక్టర్లతో, సబ్ కాంట్రాక్టర్లతో పనులు చేయించడం, టార్గెట్‌లు నిర్వచించి విపరీతమైన ఒత్తిడితో పని చేయించడం, ఇవన్నీ ఆ విధానాలలో భాగంగానే జరుగుతున్నాయి. ఎంక్వైరీలు, కమిటీలు దాడుల పేరుతో జరుగుతున్న తతంగం వలన చివరకు ఏమి జరుగుతుందో ప్రజలకు తెలుసు. ప్రమాదాలలో చనిపోయిన వారందరివీ ప్రభుత్వాలు చేస్తున్న చట్టబద్ధమైన హత్యలే. ఎవరైనా హత్యచేస్తే, ఉరిశిక్ష వరకు వెళ్లే మన న్యాయ విధానం, ప్రమాదాల పేరిట జరుగుతున్న ఈ చట్టబద్ధ హత్యలకు కారకులైన మన పాలకుల్ని ఎందుకు శిక్షించడం లేదో ఆలోచించాలి.

*(రచయిత ట్రేడ్ యూనియన్ నాయకులు)* వీ

**రాబోయే సంచికలలో...**

- ❖ **బూటకపు ప్రజాభిప్రాయ సేకరణలు - విశాఖ జిల్లా ప్రజల తిరుగుబాటు - పి.వి. రమణ**
- ❖ **ఇసుక మాఫియా - ముప్పాళ్ల భార్గశ్రీ**
- ❖ **సర్కారు బడులు.. మీ గోడు వినేదెవరు? - సిలువేరు హరినాథ్**
- ❖ **విద్యా వ్యవస్థలో మార్పులు - ప్రగతి బాటలో విద్యార్థులు - తిరుక్కోవెల పద్మావతి**

# న్యాయవ్యవస్థలో అవినీతిని ప్రశ్నిద్దాం

***న్యాయమూర్తుల నియామకం నుంచి వారిచ్చే తీర్పుల వరకు వేర్వేరు స్థాయిల్లో అవినీతిమయమైపోయిన న్యాయవ్యవస్థ స్థితిగతులను వివరిస్తున్నారు* చిమ్మె జాన్ బర్నబాస్**

**భా**రత రాజ్యాంగం ప్రకారం ఈ దేశ 'న్యాయవ్యవస్థ' ఎంతో పటిష్ఠమైనది. అది ప్రజల అన్ని హక్కులనూ కాపాడుతుంది, రక్షిస్తుంది అనే మాట అటుంచి, దేశ న్యాయవ్యవస్థలో జరుగుతున్న అవినీతి, అక్రమాల గురించి ఇటీవల వచ్చిన ఆరోపణల గురించి కొంత లోతుగా అధ్యయనం చేస్తే, మరిన్ని కఠినమైన వాస్తవాలను మనం తెలుసుకోవచ్చు.

భారత ప్రజాస్వామ్య వ్యవస్థను నాలుగు విభాగాలుగా విభజించుకోవచ్చును. 1) కార్యనిర్వాహక వ్యవస్థ (ఎగ్జిక్యూటివ్); 2) శాసన నిర్మాణ శాఖ (లెజిస్‌లేటివ్; 3) న్యాయ వ్యవస్థ (జ్యుడిషియరీ); 4) పత్రికలు (ప్రెస్, మీడియా). ఇందులో పత్రికలు నాల్గవ ఎస్టేట్‌గా భావిస్తున్నాం. దాదాపుగా అన్ని వ్యవస్థలూ అవినీతిమయమై, ప్రజలను పీడించే వాటిగా తయారయ్యాయి. న్యాయవ్యవస్థపైన కొద్దో, గొప్పో నమ్మకం ఉండేది. ఇటీవల జరిగిన కొన్ని సంఘటనలు చూస్తుంటే న్యాయవ్యవస్థ కూడా మినహాయింపు కాదన్నట్లుగా నిర్ధారించవలసి వస్తోంది.

న్యాయవ్యవస్థలో అవినీతిని మూడు విభాగాలుగా విభజించ వచ్చును. 1) కిందిస్థాయి (నియోజకవర్గ స్థాయి లేదా పూర్వం తాలూకా స్థాయి)లోని అవినీతి – జిల్లా స్థాయిలో అవినీతి; 2) హైకోర్టు – సుప్రీంకోర్టు జడ్జీల అవినీతి; 3) న్యాయశాఖ ఉద్యోగ వ్యవస్థలో ఉన్న అవినీతి. (కంటెంప్ట్ ఆఫ్ కోర్టు – కోర్టు ధిక్కారం పేరు మీద జడ్జీలు తీసుకున్న విచక్షణాధికారాలను, బెదిరింపు ధోరణిలో న్యాయవాదవర్గాలపై ప్రయోగిస్తున్నారు. దీనిని ప్రతిఘటించాలి.)

న్యాయశాఖలో దాదాపుగా మిగతా శాఖలో మాదిరిగానే అన్ని స్థాయిల్లోనూ అవినీతి రాజ్యమేలుతున్నది. ఇది అప్పుడప్పుడూ ఓబుళాపురం మైనింగ్ కంపెనీ (ఓఎంసి) కేసులోని నిందితులకు బెయిల్ ఇవ్వడానికి లంచం తీసుకున్నట్లు ఆరోపణలు ఎదుర్కొంటున్న పట్టాభిరామారావు లాంటి న్యాయమూర్తుల వ్యవహారాలు బయటికి వచ్చినప్పుడు చర్చనీయాంశంగా మారుతుంటాయి. ఇదేం గొప్ప విషయం కాదు, సాధారణమైనదే. ఎందుకనగా, దాదాపుగా అందరు న్యాయమూర్తులు ఏదో ఒక సమయంలో అధికార దుర్వినియోగానికో లేదా చిన్న చిన్న అవినీతి పనులో బహిరంగంగానే చేస్తూ ఉంటారు. ఉదాహరణకు 2011లో ఎల్ఎల్ఎం పరీక్ష డిస్టెన్స్ ఎడ్యుకేషన్ మోడ్‌లో రాయడానికి కాకతీయ యూనివర్సిటీ ఉద్యోగులను బెదిరించి, దాదాపు ఇరవై మంది కింది స్థాయి న్యాయమూర్తులు (జూనియర్ – సీనియర్ సివిల్ జడ్జీలు) బహిరంగంగా 'కాపీలు' కొడుతూ రిజిస్ట్రార్ చేత పట్టుబడి మర్యాదలు పోగొట్టుకున్నారు. కేవలం ఐదు వందల ఇంక్రిమెంట్ కోసం ఏడుగురు న్యాయమూర్తులు సస్పెన్షన్‌కు గురయ్యారు. మిగతావారు తప్పించుకున్నారు. ఇలాంటి సంఘటనలు కోకొల్లలు. ఇది పతాక శీర్షికలకు ఎక్కిన సంఘటన. రాష్ట్ర హైకోర్టు తీవ్రంగా స్పందించి వెంటనే దొరికిన ఏడుగురిని సస్పెండ్ చేసింది. తామే తప్పులకు పాల్పడుతూ, దొరికినవారు, వారిచ్చే తీర్పులు ఎన్ని అన్యాయాలకు గురయి ఉంటాయో మనం ఒక్కసారి ఆలోచించాలి. (ఎంతమంది అమాయకులను వీరు బలిచేసి ఉంటారో) ఓఎంసి కేసులో గాలి జనార్దనరెడ్డి, బి. శ్రీనివాస రెడ్డి, వి.డి. రాజగోపాల్ (ఐఎఎస్), శ్రీలక్ష్మి (ఐఎఎస్) నలుగురికీ కలిపి అరవై కోట్లు లంచంగా బెయిల్ కొరకు ఒక అక్రమ ఒప్పందం కుదుర్చుకున్నారంటే, ఈ దేశంలో న్యాయం ఏ విధంగా అమ్ముడు పోతున్నదో అర్థమవుతుంది. గతంలో ఈ (అ)న్యాయమూర్తి, ఏసిబి కోర్టు జడ్జీగా ఉన్నప్పుడు కూడా ఎన్ని అవినీతి చర్యలను రక్షించారో ఇప్పుడు విచారణలో బయట పడుతున్నది. యాదగిరి అనే ఒక రౌడీషీటర్ ద్వారా పోలీసు అధికారులు, రాజకీయ నాయకులు, జడ్జీలు సెటిల్‌మెంట్లు నిర్వహిస్తున్నారంటే, ఈ దేశ ప్రజాస్వామ్యం ఏ విధంగా వర్ధిల్లుతున్నదో అర్థం చేసుకోవచ్చు. ఇటువంటి వారే ఈ సమాజంలో అప్పుడప్పుడు నీతిమంతుల మాదిరిగా ఫోజులు ఇస్తూ, సామాన్యులను సతాయిస్తుంటారు. రిటైర్డ్ న్యాయమూర్తి టి.వి. చలపతి రావు, గాలి జనార్దనరెడ్డి సోదరుడు సోమశేఖర రెడ్డి, వీరి బంధువు దశరథరామిరెడ్డి, వీరందరినీ ఏదో ఒక రూపంలో కలిసిన న్యాయశాఖ మంత్రి ఏరాసు ప్రతాపరెడ్డి (డిజిపి దినేశ్‌రెడ్డి వియ్యంకుడు) అందరినీ వెంటనే అరెస్ట్ చేసి, శిక్షించాలి. 'చట్టం ముందు అందరూ సమానులే' అన్నప్పుడు, చట్టం వీరికి వర్తించదా?

ప్రస్తుతం న్యాయమూర్తుల ఎంపిక విధానం చాలా లోపభూయిష్టంగా జరుగుతోంది. ఏమాత్రమూ ప్రాక్టీస్ (న్యాయవాద వృత్తి) చేయకుండా, పరీక్ష రాసి, జూనియర్ సివిల్ జడ్జీ కావచ్చును. జిల్లా జడ్జి పరీక్షలకు ఏడు సంవత్సరాల అనుభవం ఉంటున్నప్పటికీ, ఇంటర్వ్యూలలో ఎన్నో అనుమానాలూ, అవినీతి కార్యకలాపాలూ బహిరంగంగానే చర్చకు వస్తున్నాయి. ఇక రాష్ట్ర హైకోర్టు, సుప్రీకోర్టు జడ్జీల నియామక ప్రక్రియ రాష్ట్రపతి ఆమోద ముద్ర ద్వారా జరుగుతున్నది కాబట్టి అది, ఆయా రాష్ట్రాల గవర్నర్ల ద్వారా ప్యానెల్ పోవాలి. (ప్యానెల్‌లో పేరు పోవాలంటేనే ఇప్పుడు ఒకటీ, రెండు కోట్ల రూపాయలు లంచం రూపంలో ఇస్తున్నారు.) రాష్ట్ర హైకోర్టు రిజిస్ట్రార్‌ల ద్వారా జరుగుతూ ఉన్నాయి. ఇవన్నీ కూడా రాష్ట్ర హైకోర్టు సాక్షిగా, క్యాంటీన్‌ల దగ్గర, లైబ్రరీలలో న్యాయవాదులంతా బహిరంగంగానే మాట్లాడుకుంటూ ఉంటారు. ఒక కఠోర వాస్తవమేమంటే, ఇప్పుడున్న హైకోర్టు, సుప్రీంకోర్టు న్యాయమూర్తులలో దాదాపు 10–20 మందిపై అవినీతి ఆరోపణలు రికార్డెడ్‌గా ఉన్నాయి. విచారణలు పెండింగ్‌లో ఉన్నాయి. కొన్ని కొనసాగుతున్నాయి.

ఆంధ్రప్రదేశ్ హైకోర్టు ప్రధాన న్యాయమూర్తిగా 1995–97లో పనిచేసిన జస్టిస్ ప్రభాశంకర్ మిశ్రా ఎన్నికల సమయంలో చంద్రబాబు

నాయుడుకు 'సైకిల్' గుర్తు కేటాయించాలనే పిటిషన్ (ఎన్‌టిఆర్ నుంచి విడిపోయిన తర్వాత)లో పెద్ద ఎత్తున అవినీతి ఆరోపణలు ఎదుర్కొన్నారు. ఈయనను సుప్రీంకోర్టు జడ్జిగా ఎలివేషన్ (ప్రమోషన్) కాకుండా ఈ అవినీతి ప్రక్రియనే నాడు అడ్డుపడిందని న్యాయవాద వర్గాలందరికీ తెలుసు. ఈ అవినీతి ఉదంతాలను పరిశీలిస్తే, నాడు జస్టిస్ రామస్వామి, పి.డి.దినకరన్ (మూడు వందల ఎకరాల భూకబ్జా కేసు మద్రాసు హైకోర్టు లో పెండింగ్‌లో ఉంది), కలకత్తా హైకోర్టు న్యాయమూర్తి సౌమిత్రాసేన్, నిర్మల్ యాదవ్ (బీహార్) ప్రభృతుల ఉదంతాలు ఎన్నో ఉన్నాయి. ఇవన్నీ ప్రజలలో న్యాయవ్యవస్థపై నమ్మకం సన్నగిల్లే విధంగా చేస్తున్నాయి.

హైకోర్టు, సుప్రీంకోర్టు న్యాయమూర్తులకు ఒక రాజ్యాంగ రక్షణ ఉంది. అదేమంటే, వీరు కేవలం అవినీతి ఆరోపణలు ఎదుర్కొంటు న్నప్పటికినీ, వీరిని తొలగించాలంటే అభిశంసన ప్రక్రియ ద్వారానే జరగాలి. అనగా భారత పార్లమెంట్ (లోక్‌సభ, రాజ్యసభలో విడిగా)లో 2/3 వంతు మెజారిటీ సభ్యుల ఆమోదం ద్వారానే వీరిని తొలగించాలి. వీరి సస్పెన్షన్ తాత్కాలికం, కేవలం కంటి తుడుపు చర్య మాత్రమే. పి.డి. దినకరన్ (ప్రస్తుతం సిక్కిం సి.జె.) పై బెంగుళూర్ బార్ అసోసియేషన్ మొత్తం ఏకగ్రీవంగా ఆమోదించి సుప్రీంకోర్టుకు ఫిర్యాదు చేశారు. ఆయనను తాత్కాలికంగా సస్పెండ్ చేసి, తిరిగి అస్సాం హైకోర్టు, సిక్కిం (గ్యాంగ్‌టక్)లో నియమించింది. సుప్రీంకోర్టు ప్రధాన న్యాయ మూర్తిగా పనిచేసి, పదవీ విరమణ పొందిన వై.కె. సబర్వాల్, కె.జి. బాలకృష్ణన్ లాంటి వారు, పదవీ విరమణ చేసినప్పటికినీ, వారిపై వచ్చిన ఆరోపణలకు సమాధానం చెప్పవలసిన పరస్థితిని ఎదుర్కొంటున్నారు. విచారణలకు సహకరించకుండా దాటవేస్తున్న పరిస్థితే ఉంది.

హైకోర్టు న్యాయమూర్తులుగా అనుభవం గడించిన వారే సుప్రీంకోర్టు న్యాయమూర్తులుగా నియమింపబడుతున్నారు. అయితే హైకోర్టు న్యాయమూర్తులుగా నియమింపబడే ప్రక్రియనే పెద్ద వివాదాస్పద అంశంగా ఉంటుంది. గతంలో ఆంధ్రప్రదేశ్ హైకోర్టు న్యాయమూర్తులుగా పనిచేసి, ప్రస్తుతం వేరే రాష్ట్రాలలో హైకోర్టు న్యాయమూర్తులుగా ఉన్న వారి బంధువులు, సుప్రీంకోర్టు న్యాయమూర్తుల సహాయ, సహకారాలున్న వారు మాత్రమే హైకోర్టు న్యాయమూర్తులుగా నియమింపబడడం, వివాదాలకు దారితీస్తున్నది. జిల్లా జడ్జీలుగా మంచి పేరు తెచ్చుకున్న వారిని కూడా హైకోర్టు న్యాయమూర్తులుగా నియమించవచ్చు. అందులో కూడా గ్రేడింగ్ ఉంటుంది. ఈ గ్రేడింగ్‌లలో కూడా అన్ని అంశాలూ (కులం, అధికారం) అన్నీ పరిగణనలోకి తీసుకుంటారు.

కోర్టులలో ఏదేని డాక్యుమెంట్ (పత్రం) మనం పొందాలంటే, అందుకు 'కాపీ అప్లికేషన్ (సిఎ)' దాఖలు చేయవలసి ఉంటుంది. అందులో మనకు ఏ డాక్యుమెంట్ కావాలో, దాని తారీఖు, తదితర వివరాలు తెలియజేసి, న్యాయమూర్తికిచ్చే చిన్న పిటిషన్. కానీ ఆ డాక్యుమెంట్‌ను మనం కేవలం జిరాక్స్ కాపీలను ఉచితంగా అందజేయడం ద్వారానే పొందవచ్చు. అయితే ఆ డాక్యుమెంట్ కోర్టు నుంచి, బయటకు రావాలంటే దాదాపు ఐదువందల రూపాయలు ఖర్చవుతుంది. వివిధ దశలలో డబ్బును లంచంగా ఇస్తూ, చివరకు డాక్యుమెంట్ కోర్టు ముద్రపడి మనకు చేరుతుంది. ఇది అందరికీ తెలిసీ జరిగే ప్రక్రియనే. ఏదో ఒకరూ, ఇద్దరూ తప్ప న్యాయవాదులందరూ సమర్పించుకుంటుంటారు. ఇటీవల భారత సుప్రీంకోర్టు, ఒక కర్ణాటక ఉద్యోగి, దాదాపు పది సంవత్సరాల క్రితం రు.150 లంచం తీసుకుంటూ పట్టుబడి, కింది కోర్టులో శిక్ష పడి, బెంగుళూరు (కర్ణాటక) హైకోర్టులో ఆ శిక్ష నిర్ధారింపబడి, సుప్రీంకోర్టులో రివిజన్ (పునఃపరిశీలన)కు వచ్చిన సందర్భంగా, సుప్రీంకోర్టు ఇరువురు న్యాయమూర్తులు చేసిన వ్యాఖ్యలు చాలా స్ఫూర్తిదాయకమైనవి. 'లంచం ఎంతయినా, (ఎన్ని పైసలైనా) ఏ రూపంలోనైనా నేరమే' అంటూ సుప్రీంకోర్టు వ్యాఖ్యానించింది. అటువంటి సమయంలో కోట్ల రూపాయలు లంచంగా స్వీకరించిన జడ్జీలకూ, ఇచ్చిన వారికీ, మధ్యవర్తిత్వం వహించిన వారికీ ఏ విధమైన శిక్షలు వేయాలి? మనకు రావలసిన, పొందవలసిన డాక్యుమెంట్ తీసుకోవడానికి వందల రూపాయలు సమర్పించుకోవలసిన వ్యవస్థలో మనం జీవిస్తున్నప్పుడు, కోర్టులలో బెయిల్ – విచారణ – తీర్పులను ఏ ఖరీదుతో పొందాలో (అవినీతి న్యాయమూర్తుల దగ్గర) విచారించవలసి వస్తున్నది.

రంగారెడ్డి జిల్లా కోర్టు, నాంపల్లి క్రిమినల్ కోర్టు లాంటి బిజీ కోర్టులలో దాఫేదార్ నుంచి హెడ్‌క్లర్క్ (సిరస్తాదార్) రోజువారీ ఆదాయం వేలలో ఉంటోంది. ఇది వాస్తవం. కాబట్టి, కేవలం జడ్జీల స్థాయిలోనే ఈ లంచాల వ్యవహారం ఉంటుందనుకోవడం పొరపాటు. న్యాయమూర్తుల ప్రవర్తన, దీక్ష–దక్షతలపైననే న్యాయ వ్యవస్థ సార్థకత, సాఫల్యత ఆధారపడి ఉంటుంది. నేడు న్యాయమూర్తులు 'న్యాయబుద్ధి' (జ్యుడిషియస్ మైండ్) కలిగి లేరు. వారు కూడా, కేవలం సాధారణ ఉద్యోగులుగా మాత్రమే జీవిస్తున్నారు. ప్రవర్తిస్తున్నారు. అందుకే జడ్జీల నియామక ప్రక్రియలోనే సచ్ఛీలురనూ, సత్ప్రవర్తన ఉన్న వారిని నియమించే విధంగా, రాష్ట్ర స్థాయిలో ఒక ప్రత్యేక జ్యుడీషియల్ కమిషన్, అదే విధంగా జాతీయ స్థాయిలో ఒక జాతీయ కమిషన్ ఏర్పాటు చేయాలి. అంతేకాకుండా, న్యాయశాఖలోని చిన్న ఉద్యోగి నుంచి మొదలుకొని, సుప్రీంకోర్టు న్యాయమూర్తుల వరకూ అవినీతి ఆరోపణలపై విచారణ జరిపించడానికి ఒక ప్రత్యేక దర్యాప్తు బృందం వ్యవస్థీకృతమై ఉండాలి.

న్యాయాధిపతులే ఈ వ్యవస్థను అవినీతి ఊబిలోకి దించితే, రాబోయే కాలంలో సమాజంలో కేవలం అరాచకం రాజ్యమేలుతుంది. అప్పుడు ఎన్ని నీతివాక్యాలు వల్లించినా చెల్లుబాటు కావు. రాజ్యాంగ హక్కులూ, విలువలూ, ప్రజాస్వామిక సూత్రాలూ పూర్తిగా కాలరాయబడతాయి.

ఎంతో స్వాతంత్ర్యోద్యమ చరిత్ర, త్యాగాల చరిత్ర, పోరాటాల చరిత్ర ఉన్న మన దేశానికి, ఈ దుర్గతి పట్టడం శోచనీయం. ప్రజాస్వామిక శక్తులన్నీ సంఘటితపడి పోరాడితే తప్ప, ఈ వ్యవస్థ నీతి, నిజాయితీ, విలువలు రక్షించాలనే తపన కలిగిన వ్యక్తులు ఈ సమాజంలో ఇంకా ఉన్నారు కాబట్టే, అన్యాయాలపై ప్రతిఘటిస్తున్నారు.

పూర్తిగా భ్రష్టుపట్టిన రాజకీయ వ్యవస్థలో మనం ఉన్నాం కాబట్టి, అలాంటి రాజకీయ నాయకుల ప్రభావానికి, ఒత్తిడికి, ఈ సమాజం గురికాక తప్పని పరిస్థితి. గాలి జనార్దనరెడ్డి, వై.ఎస్. జగన్‌మోహన్ రెడ్డి లాంటి మాఫియా శక్తులు, ఆర్థిక నేరస్తులు ఇటీవలె తమ రాజకీయ క్రీనీడకు న్యాయవ్యవస్థను కూడా బలిచేస్తున్నారు. డబ్బుతో ఎవరినైనా కొనగలం అనే నిర్లక్ష్యంతో, అహంతో, ధనార్జనే ధ్యేయంగా జీవిస్తున్నారు. వీరి అనుచరులు కూడా అదే దోవలో పయనిస్తూ, అన్ని వ్యవస్థలనూ భ్రష్టుపట్టించారు. అవినీతిని కూడా అదే స్థాయిలో పెంచి పోషిస్తున్నారు. వీరికి ప్రభుత్వ యంత్రాంగం అండ కూడా ఏదో ఒక రూపంలో ఉంది.

అందువలన, అక్కడక్కడా, ఈ మాఫియా ప్రశ్నించేవారిని, హక్కుల కార్యకర్తలను, తమ అన్యాయాలను ఎదుర్కొనే వారిని హత్యలు కూడా చేస్తోంది. మహారాష్ట్ర, మధ్యప్రదేశ్, ఉత్తరప్రదేశ్, బీహార్ రాష్ట్రాలలో ఇది సర్వసాధారణమైపోయింది.

న్యాయవాదులు కానీ, ఇతర ప్రజాసంఘాల కార్యకర్తలు గానీ,

# ముస్లిం రిజర్వేషన్‌లు రాజ్యాంగ విరుద్ధమా?

***ఒక పక్కన మతం ప్రాతిపదికన హిందూ మతంలోని కులాలకు వెనుకబాటును అనుసరించి రిజర్వేషన్‌లు ఇస్తూనే ముస్లింలకు మత ప్రాతిపదికన రిజర్వేషన్‌లు ఇవ్వగూడదనడం సహేతుకం కాదంటున్నారు సయ్యద్ ఖుర్షీద్***

ప్రజలు వర్గాలుగా, తరగతులుగా విభజించబడి ఒకరిపట్ల మరొకరికి అపనమ్మకం, అభద్రతతో ఉండాలనుకోవడం, ఆ మేరకు పాలకులు తమ వంతు ప్రయత్నాలు చేయడం ఫ్యూడల్ లక్షణం. దురదృష్టవశాత్తు ఈ ప్రజాస్వామ్య యుగంలోను పాలకులు అవే కోరుకోవడం మన దౌర్భాగ్యం. ముస్లింలకు రిజర్వేషన్‌లు కల్పించే విషయంలో మన పాలకులు కచ్చితంగా ఇదే సూత్రాన్ని అనుసరించారు. జాతీయ స్థాయిలో 27 శాతం ఉన్న బిసి రిజర్వేషన్‌లలో ముస్లింలకు 4.5 శాతం భాగస్వామ్యాన్ని కల్పిస్తూ జనవరి 1, 2012న నిర్ణయం తీసుకుంది. ముస్లింలకు ఆయాచితంగా దోచిపెడుతున్నారనే ఫీలింగ్‌ను బిసిలలో కల్పిస్తూ తమ దక్కాల్సిన వాటా కోసం వారు కోర్టు గడప ఎక్కేలా చేసింది. ప్రభుత్వం ఆశించిందే జరిగింది. మేము ముస్లింలకు రిజర్వేషన్‌లు ఇచ్చినట్లు చేస్తాం – కోర్టులు ఆపేలా నిర్ణయాలు చేస్తాయి అన్నట్లు ప్రవర్తించింది. ఈ మొత్తం వ్యవహారంలో తమ ప్రమేయం ఏమీ లేకున్నా తెల్లబోయింది ముస్లిం ప్రజానీకమే.

ఇదిలా ఉండగా, ఈ వ్యవహారం చాలా కాలం నుండే ప్రచారంలో ఉన్న అనేక అంశాలను మళ్లీ తెరమీదకు తెచ్చాయి. మతపరమైన రిజర్వేషన్‌లకు రాజ్యాంగ బద్ధత లేవనేది వాటిలో ఒకటి. భారతదేశంలో అమలవుతున్న 'రిజర్వేషన్' విధానాన్ని పరిశీలిస్తే మనకు అనేక విషయాలు అర్థం అవుతాయి. 'కులం' ప్రాతిపదికన రిజర్వేషన్ విధానం అమలవుతోందనే విషయం స్పష్టమవుతుంది.

దేశానికి స్వాతంత్ర్యం రాకముందే 1936లో గవర్నమెంట్ ఆఫ్ ఇండియా (షెడ్యూల్డ్ కోర్ట్ ఆర్డర్) ద్వారా షెడ్యూల్డ్ కులాల జాబితాను తయారు చేశారు. 1935లోనే షెడ్యూల్డ్ తెగల జాబితాను తయారు చేశారు. వీరికి భారత రాజ్యాంగంలోని 330, 332, 335 ప్రకరణల ద్వారా కేంద్ర, రాష్ట్ర శాసనసభల్లోనూ, విద్యా సంస్థల్లోనూ, ప్రభుత్వోద్యోగాల్లోనూ రిజర్వేషన్ సదుపాయాన్ని కల్పించారు. కాని వెనుకబడిన తరగతులుగా పరిగణించబడుతున్న వారి రిజర్వేషన్‌ల విషయమై రాజ్యాంగ రచన సమయంలో కానీ, తదనంతరం కానీ ఏకాభిప్రాయం ఏర్పడలేదు.

భారత రాజ్యాంగంలోని 340వ ప్రకరణను అనుసరించి వెనుకబడిన తరగతుల ప్రజల స్థితిగతులను అధ్యయనం చేయడానికి తొలిసారిగా 1963లో కాకా కాలేల్కర్ ఆధ్వర్యంలో ఒక కమిషన్‌ను ఏర్పరిచింది. 1955లో తన నివేదికను సమర్పించిన ఈ కమిషన్ కుల వ్యవస్థలో ఉన్న హెచ్చు తగ్గులతో పాటు విద్యా, ఉద్యోగ, ఆదాయలలో అత్యల్ప స్థాయికి చెందిన వారిని సైతం బిసిలుగా గుర్తించవచ్చని అభిప్రాయ పడింది. దీనితో, ముస్లింలతో పాటు ఇతర మైనారిటీలు సైతం వెనుకబడిన తరగతులుగా గుర్తించబడే వీలు కలిగింది. కానీ ప్రభుత్వం ఈ నివేదికను పట్టించుకోలేదు.

రెండవ వెనుకబడిన తరగతుల కమిషన్‌ను కేంద్ర ప్రభుత్వం 1979లో బిపి మాండల్ ఆధ్వర్యంలో ఏర్పరిచింది. 1980లో ఈ కమిషన్ సమర్పించిన నివేదికలో కులం ప్రాతిపదికన వెనుకబాటుతనాన్ని నిర్ణయించాలని ప్రతిపాదించింది. వివాహ వయస్సు, పని చేసే మహిళల శాతం, అర్ధాంతరంగా బడి మానేసిన పిల్లల సంఖ్య, తాగునీటి వనరుల లభ్యత, గృహోపకరణాల స్థాయి తదితర అంశాలను వెనుకబడినతనానికి ప్రతీకలుగా తీసుకోవచ్చని సూచించింది. 1931 నాటి జనాభా లెక్కలు క్షేత్రస్థాయిలో తాము నిర్వహించిన సర్వేల ఆధారంగా సుమారు 82

---

స్వచ్ఛంద సంస్థలు కానీ, సామాన్య పౌరులు కానీ ఇచ్చే ఫిర్యాదులను తీవ్రంగా పరిగణించి, విచారణ జరిపించి, చర్యలు తీసుకోవాలి. అందుకు రాష్ట్ర హైకోర్టు పరిధిలోకానీ లేదా సుప్రీంకోర్టు పర్యవేక్షణలో కానీ ఒక ప్రత్యేక దర్యాప్తు సంస్థను కానీ, విచారణ సంస్థను కానీ నెలకొల్పాలి. ఇది కేవలం న్యాయస్థాన ఉద్యోగులు, న్యాయమూర్తుల అవినీతి పైన మాత్రమే విచారణ జరిపే ప్రత్యేక సంస్థగా రూపొందించాలి. అందుకు కేంద్ర ప్రభుత్వం ఒక ప్రత్యేక చట్టాన్ని రూపొందించాలి.

అవినీతి అంటే డబ్బు మాత్రమే కాదు – అనేక రూపాలలో ఉంటుంది. భూమి లేదా వస్తువు లేదా ఏదైన గృహం రూపంలో కూడా ఇస్తూ ఉండవచ్చును. తమ పిల్లలకు పెద్ద పెద్ద ఖరీదైన విద్యా సంస్థలలో 'ఉచిత విద్య' కూడా లంచం రూపంలో అందవచ్చు. ఏమీ సాధించాలన్నా ప్రజలలో మరింత చైతన్యం, పోరాట దృక్పథం, త్యాగనిరతి అవసరం. సామ్రాజ్యవాద ప్రపంచీకరణ పుణికి పుచ్చుకున్న వ్యవస్థలో మనం జీవిస్తున్నాం. ఇప్పుడు ప్రజలను చైతన్యవంతులను చేయడం, తీర్చిదిద్దడం ఒక సమస్యగా మారింది. నిజాయితీతో జీవించడం చాలా కష్టంగా మారింది. ఈ వ్యవస్థ, అమానవీయతనూ, అవినీతి అక్రమాలనూ సహనంతో ఒప్పుకొనే విధంగా వ్యక్తులను మారుస్తాం.

పెట్టుబడిదారీ వ్యవస్థ అత్యున్నత స్వరూపం సామ్రాజ్యవాదం అన్న లెనిన్ మహాశయుని మాటలు నేడు అక్షరసత్యాలు. ప్రత్యక్షంగా అనుభవిస్తున్నాం. వ్యవస్థపై తిరుగుబాటు పోరాటం ద్వారానే మనల్ని మనం తీర్చిదిద్దుకోగలుగుతాం. అందుకు మనమంతా సంఘటితపడి, పోరాటం చేయాలి.

*(రచయిత న్యాయవాది,*
*ప్రజాస్వామ్య హక్కుల పరిరక్షణ సంస్థ రాష్ట్ర కమిటీ సభ్యులు)* వీ

సామాజిక వర్గాల వారిని ఒబిసిల జాబితాలోకి చేర్చింది. ఇలా చేర్చడానికి రెండు సూత్రాలను ప్రామాణికంగా తీసుకుంది.

1) 'ఇస్లాం' పుచ్చుకున్న హిందూ అంటరాని కులాలకు చెందిన వారు.

2) సాంప్రదాయ, వారసత్వ వృత్తుల ఆధారంగా హిందువులలో ఒబిసిలుగా గుర్తింపు పొందిన కులాలకు చెందిన కులాల ప్రజల మాదిరిగానే ఆయా సాంప్రదాయ, వారసత్వ వృత్తులు కలిగిన ముస్లింలు (ధోబీ, తేలీ, నాయి, గుజ్జర్, కుమ్హార్, దర్జీ, తదితరులు)

ఈ కమిషన్ సిఫార్సులను 1990 ఆగస్ట్ 7న అమలు చేయనున్నట్లు అప్పటి ప్రధానమంత్రి వి.పి. సింగ్ ప్రకటించడం తదనంతర పరిణామాలు మనకందరికి తెలిసినవే. తర్వాత క్రిమిలేయర్‌ను రిజర్వేషన్ పరిధి నుండి తీసేసి ఈ కమిషన్ సిఫార్సులను అమలు చేయడం జరిగింది. తద్వారా కేంద్ర ప్రభుత్వం ఒబిసి లకు 27 శాతం రిజర్వేషన్‌ను కల్పించింది. హైందవేతరులలో ఈ వర్గాలను గుర్తించాలంటే వారు సాంప్రదాయికంగా చేపట్టే వృత్తులను బట్టి నిర్ధారించాలని సుప్రీంకోర్టు ఇందిరా షాహ్నీ – కేంద్ర ప్రభుత్వం (మండల్) కేసులో అభిప్రాయపడింది.

పై అంశాలను గమనిస్తే ముస్లింలకు రిజర్వేషన్‌లు కల్పించే విషయంలో ఇప్పటి వరకు జాతీయ స్థాయిలో ఏర్పాటు చేయబడిన రెండు వెనుకబడిన తరగతుల కమిషన్‌లు కానీ, సుప్రీం కోర్టు కానీ అభ్యంతరాలు వ్యక్తం చేసినట్లు మనకు కనిపించదు. ఈ నివేదికలతో సంబంధం లేకుండా వివిధ రాష్ట్రాల ప్రభుత్వాలు ముస్లింలకు పట్టికలో చూపిన విధంగా రిజర్వేషన్‌లు అమలు జరుపుతున్నాయి.

మతంతో సంబంధం లేకుండా రాష్ట్రాల జాబితాలో చాలా ఒబిసి గ్రూపులున్నాయి. కాని అవి కేంద్ర జాబితాలో చోటును సంపాదించుకోలేక పోయాయి. కొన్ని గ్రూప్‌లు కేంద్ర జాబితాల్లోని ఒబిసి గ్రూపుల్లో చోటు సంపాదించుకున్నప్పటికీ సంబంధిత రాష్ట్రాల జాబితాల్లో స్థానాన్ని దక్కించుకోలేకపోయాయి. దీన్ని సరిదిద్దాల్సిన అవసరం ఉంది.

ముస్లింలు ఆర్థికంగా, రాజకీయంగా, విద్యాపరంగా, ఉద్యోగపరంగా వెనుకబడి ఉన్నారు. ఈ వెనుకబాటుతనం ఎస్.సి.ల కంటే కొంత పై స్థాయిలోనూ, బిసిల కంటే తక్కువ గాను అనేక నివేదికలు రుజువులు, ఆధారాలతో సహా నిరూపించారు. అందుచేత ఈ వెనుకబాటుతనాన్ని ప్రాతిపదికగా ముస్లింలకు రిజర్వేషన్‌లు కల్పించాలని, చాలా కాలంగా డిమాండ్ చేస్తున్నారు. ఇప్పటికే ఒబిసిలుగా గుర్తింపు పొందిన ముస్లిం లకు సబ్‌కోటా ఉండాలని వాదన ఉంది. కానీ ప్రభుత్వం దీన్ని పట్టించు కోకుండా బిసిలకు అమలులో ఉన్న 27 శాతం రిజర్వేషన్‌ల నుండే ముస్లింలకు 4.5 శాతం రిజర్వేషన్ కల్పించడంతో సమస్య తలెత్తింది. ముస్లింలు, బిసిలు కోర్టు గడప ఎక్కడంతో, ముస్లింలకు మరోసారి మొండిచెయ్యి మిగిలింది. ముస్లింలకు మత ప్రాతిపదికన రిజర్వేషన్‌లు రాజ్యాంగ విరుద్ధం అనే వాదన మరోసారి తెరపైకి తెచ్చింది.

ప్రస్తుత రాజ్యాంగంలోని పలు నిబంధనలను పరిశీలిస్తే ముస్లిం రిజర్వేషన్‌లకు మతం అడ్డు కాదనే వాదనను రాజ్యాంగంలోని 15(4), 16(4), 29(2) నిబంధనలు స్పష్టంగా చెబుతున్నాయి. రాజ్యాంగంలోని 15(1) నిబంధన మతం, జాతి, కులం, లింగ, జన్మస్థలం ప్రాతిపదికన పౌరుల మధ్య ఎలాంటి వివక్ష ఉండకూడదని చెప్పినప్పటికీ – 15(4) నిబంధన సాంఘికంగా, విద్యాపరంగా వెనుకబడిన తరగతులకు చెందిన పౌరులకు ప్రత్యేక సదుపాయాలు కలగజేసే అధికారాన్ని రాజ్యానికి ఇచ్చింది.

15(4) నిబంధనలోని సాంఘికంగా, విద్యాపరంగా వెనుకబడిన పౌరుల జాబితా అనే పదబంధం పరిధిలో ముస్లింలు కూడా తప్పక వస్తారు. విద్యా, ఉద్యోగాలపరంగా, రాజకీయంగా, ఆర్థికంగా తరతరా లుగా తీవ్రమైన వెనుకబాటుతనాన్ని అనుభవిస్తున్న ముస్లింలు సామాజికంగా కూడా వెనక్కి నెట్టవేయబడతారు. అంతేగాక 15(4), 29(2) నిబంధనలను ప్రస్తావిస్తూ సామాజికంగా లేదా విద్యాపరంగా వెనుకబడిన తరగతులకు చెందిన పౌరుల అభివృద్ధికి రాజ్యం కల్పించే ప్రత్యేక సదుపాయాలను అడ్డుకోకూడదు. నిబంధన 29(2) ప్రస్తావించే వివిధ విషయాలలో మతం, భాషా కూడా ఉన్నాయి. ఈ రెండు నిబంధనలను కలిపి చూస్తే 15(4)లో ప్రస్తావించిన ప్రత్యేక సదుపాయాల పరిధి కిందకు వివిధ మత, భాషా, కమ్యూనిటీలు కూడా అంటే ముస్లింలు కూడా రిజర్వేషన్‌లు పొందడానికి తప్పకుండా అర్హులే అన్నమాట. సుప్రీంకోర్టు కూడా ఈ విషయాన్ని స్పష్టం చేసింది. 15(4) నిబంధన కల్పించే ప్రత్యేక సౌకర్యాలు అనేవి సమానత్వ సాధనకు మార్గాలు అని మండల్ కమిషన్ కోసం తీర్పు సమయంలో చెప్పింది. వెనుకబడిన తరగతులను గుర్తించడంలో కులం కూడా ఒకానొక గుర్తింపు మాత్రమేనని (ఒకే ఒక గుర్తింపు ప్రాతిపదికన కానే కాదని) ఇతర ప్రాతిపదికల ఆధారంగా (మతం, వర్గం) కూడా వెనుకబాటుతనాన్ని వర్గీకరించవచ్చునని స్పష్టంగా చెప్పింది. దీనిని బట్టి సామాజికంగా, విద్యాపరంగా తీవ్రమైన వెనుకబాటుతనాన్ని అనుభవిస్తున్న ముస్లింలకు మత ప్రాతిపదికన రిజర్వేషన్‌లు కల్పించడాన్ని రాజ్యాంగం సమర్థిస్తుందని అర్థం అవుతుంది.

16(1) నిబంధన ప్రభుత్వోద్యోగాలలో పౌరులందరికి సమాన అవకాశాలు ఉండాలని చెప్పినప్పటికీ 16(4) నిబంధన ప్రభుత్వ సర్వీసులో తగిన ప్రాతినిధ్యం లేదని వెనుకబడిన తరగతులకు చెందిన పౌరులకు రిజర్వేషన్ సౌకర్యాన్ని కల్పించే అధికారాన్ని రాజ్యానికి ఇచ్చింది. నిజంగా మత ప్రాతిపదికన రిజర్వేషన్ ఇవ్వడమనేది రాజ్యాంగ విరుద్ధం అయితే ఈ రాష్ట్రాలలో ఎలా సాధ్యమైంది? రాజ్యాంగం ఒక్కొక్క రాష్ట్రంలోనే ముస్లింలందరిని మత ప్రాతిపదికన వెనుకబడిన తరగతులుగా గుర్తించి రిజర్వేషన్‌లు కల్పించడం రాజ్యాంగ విరుద్ధం కాదని అర్థం అవుతుంది.

అసలు మత రిజర్వేషన్‌లు లేకుండా కూడా ఒకరకంగా చూస్తే అవాస్తవమే. ఇవ్వాళ రిజర్వేషన్ విధానాన్ని పరిశీలిస్తే 'కులం' ప్రాతిపదికన రిజర్వేషన్‌లు అమలవుతున్నట్లు తేలుతుంది. రిజర్వేషన్ సౌకర్యం పొందుతున్న ఎస్‌సి లు హిందూ మతంలోనే ఉండే అదే కేటగిరిలో కొనసాగుతారు. వారు క్రైస్తవ మతంలోకి మారితే ఎస్‌సి ల కోటా నుండి బిసి 'సి' కేటగిరిలోకి మారుతారు. మరి వారు ముస్లిం మతంలోకి మారితే రిజర్వేషన్‌ను కోల్పోతారు. ఇది ఎంత అసమంజసం. మతం మారినంత మాత్రాన వారి సామాజిక, ఆర్థిక, రాజకీయ, విద్యా ఉద్యోగాలలో వారనుభవిస్తున్న వెనుకబాటుతనం మారిపోతుందా? అదే నిజమైతే అందరూ ముస్లింలైతే చాలుకదా? ఇక ఈ రిజర్వేషన్‌ల

| క్ర.సం. | రాష్ట్రం | ముస్లిం జనాభా | రిజర్వేషన్ కోటా శాతం | | | | రిమార్కులు |
|---|---|---|---|---|---|---|---|
| | | | ఎస్‌సి | ఎస్‌టి | బిసి | మొత్తం | |
| 1 | పశ్చిమ బెంగాల్ | 25.2 | 22 | 6 | 7 | 35 | 9 ముస్లిం గ్రూప్‌లను రాష్ట్ర ఒబిసి జాబితాలో చేర్చారు. |
| 2 | కేరళ | 24.7 | 10 | | 40 | 50 | ముస్లింలకు వివిధ స్థాయిలలో 10-12 % ప్రత్యేక కోటా |
| 3 | ఉత్తర్‌ప్రదేశ్ | 18.5 | 21 | 2 | 27 | 50 | సుమారు 30 గ్రూప్‌లను ఒబిసి కోటాలో చేర్చారు |
| 4 | బీహార్ | 16.5 | 15 | 1 | 34 | 50 | ఒబిసి కోటాను బిసి 13 శాతం, ఎంబిసి 18 శాతం, ఒబిసి (స్త్రీలు) 3 శాతం విభజించారు. 9 ముస్లిం గ్రూపులను బిసి లిస్టులో, 27 గ్రూపులను ఎంబిసిలో చేర్చారు |
| 5 | అస్సాం | 30.9 | 7 | 15 | 15 | 37 | ఒబిసి కోటాను బిసిలు ఎంబిసిలుగా విభజించి ముస్లింలను రెండింటిలోను చేర్చారు |
| 6 | జార్ఖండ్ | 13.8 | 11 | 27 | 22 | 60 | ముస్లిం ఒబిసిలను చేర్చారు |
| 7 | కర్ణాటక | 12.2 | 15 | 3 | 32 | 50 | బిసిల కోటాను Iఎ, Iబి, IIఎ, IIబి లుగా వర్గీకరించారు. Iకు 4 శాతం ముస్లిం గ్రూపుల్ని చేర్చారు. IIఎ కు 15 శాతం ముస్లిం గ్రూపుల్ని చేర్చారు. IIబికు 41 శాతం కేవలం ముస్లింలకే |
| 8 | ఉత్తరాంచల్ | 11.9 | 19 | 4 | 14 | 37 | IIIఎ 5 శాతం ముస్లింలు లేదా రాష్ట్ర జాబితాలో కొన్ని ముస్లిం గ్రూపులకు చోటు కల్పించారు |
| 9 | ఢిల్లీ | 11.7 | 15 | 7.5 | 24 | 49.5 | రాష్ట్ర జాబితాలో 54 కులాలుండగా 19 ముస్లిం గ్రూపులున్నాయి |
| 10 | మహారాష్ట్ర | 10.6 | 13 | 7 | 32 | 52 | వివిధ కాటగిరీలుగా విభజించబడిన బిసి జాబితాలో 35 ముస్లిం గ్రూపుల్ని చేర్చారు. |
| 11 | ఆంధ్రప్రదేశ్ | 9.2 | 15 | 6 | 25 | 46 | బిసిలను ఎబిసిడి గ్రూపులుగా వర్గీకరించారు. ఎకు 7 శాతం, బికు 10 శాతం, సికు 1 శాతం, డికు 7 శాతం. దూదేకులు, లద్దాఫ్, 20, పింజారీ/ నూరాబాష్, మెహతర్ వర్గాలకు ఎబిడి గ్రూపుల్లో చేర్చారు. సి గ్రూపుకు కేవలం ఎస్‌సి ల నుండి క్రిస్టియానిటీ తీసుకున్న వారికే. కొత్తగా బిసి ఇ గ్రూపులో ముస్లింలను చేర్చి 5 శాతం రిజర్వేషన్ కల్పించారు |
| 12 | గుజరాత్ | 9.1 | 7 | 15 | 27 | 49 | రాష్ట్ర ఒబిసి జాబితాలో సుమారు 50 ముస్లిం గ్రూపుల్ని చేర్చారు |
| 13 | రాజస్థాన్ | 8.5 | 15 | 7.5 | 27 | 49.5 | సుమారు 50 ముస్లిం గ్రూపుల్ని చేర్చారు. |
| 14 | మధ్యప్రదేశ్ | 6.4 | 16 | 20 | 14 | 50 | 37 ముస్లిం గ్రూపుల్ని చేర్చారు |
| 15 | హర్యానా | 5.8 | 15 | 7.5 | 27 | 49.5 | కొద్దిపాటి ముస్లిం గ్రూపుల్ని చేర్చారు |
| 16 | తమిళనాడు | 5.6 | 18 | 1 | 50 | 69 | ఒబిసి కోటాను బిసిలకు 30 శాతం, ఎంబిసి లు, డినోటిఫైడ్ కమ్యూనిటీలకు 20 శాతంగా విభజించారు. ముస్లిం గ్రూపులు దాదాపు 95 శాతం జనాభాను రిజర్వేషన్ పరిధిలోకి తెచ్చారు |
| 17 | ఒడిశా | 2.1 | 15 | 7.5 | 27 | 49.5 | కొద్దిపాటి గ్రూపుల్ని చేర్చారు |
| 18 | హిమాచల్ ప్రదేశ్ | 2 | 15 | 7.5 | 5 | 27.5 | కొద్దిపాటి గ్రూపుల్ని చేర్చారు |
| 19 | చత్తీస్‌గఢ్ | 2 | 15 | 18 | 14 | 47 | కొద్దిపాటి గ్రూపుల్ని చేర్చారు |
| 20 | పంజాబ్ | 1.6 | 20 | 5 | 5 (17 శాతం ఇతరులకు) | 47 | కొద్దిపాటి గ్రూపుల్ని చేర్చారు |

(మూలం : సచార్ కమిటీ రిపోర్ట్)

# బిఎస్ఎ సత్యనారాయణ



ట్రేడ్ యూనియన్ నాయకుడిగా బిఎస్ఎగా సుప్రసిద్ధుడైన బొమ్మకంటి శ్రీ ఆంజనేయ సత్యనారాయణ (బిఎస్ఎ) జూన్ 22 ఉదయం గుండెపోటుతో మరణించారు. పశ్చిమ గోదావరి జిల్లా అత్తిలిలో 1940లో పుట్టిన బిఎస్ఎ రైల్వే మెయిల్ సర్వీస్ (ఆర్ఎంఎస్) ఉద్యోగిగా 1950 దశకం చివర హైదరాబాద్ చేరారు. ఆర్ఎంఎస్‌కు మాతృసంస్థ అయిన పోస్ట్ అండ్ టెలిగ్రాఫ్స్ శాఖలో క్రియాశీలమైన ట్రేడ్ యూనియన్‌ను నిర్మించడంలో, నాయకత్వం వహించడంలో అసాధారణమైన కృషి చేశారు. రాష్ట్ర వ్యాప్తంగా ట్రేడ్ యూనియన్ నాయకుడిగా, ప్రభావశీలమైన వక్తగా పేరు తెచ్చుకున్నారు. 1960ల చివర ప్రారంభమైన నక్సల్బరీ విప్లవోద్యమ ప్రభావంతో విప్లవ రాజకీయాల వైపు మళ్లారు. ట్రేడ్ యూనియన్ నాయకుడిగా, విప్లవోద్యమ సానుభూతిపరుడుగా ఎమర్జెన్సీ నాటి నుంచీ ఎన్నోసార్లు నిర్బంధాన్ని అనుభవించారు. ఉద్యోగం నుంచి సస్పెన్షన్‌కు గురయ్యారు. విప్లవ విద్యార్థి యువజన సంఘాల కార్యకర్తలకు తత్వశాస్త్ర ఉపాధ్యాయుడిగా ఎంతో మందిని ఉత్తేజపరచారు. ఆ క్రమంలోనే విజయవాడలో తరగతులు నిర్వహిస్తున్న సందర్భంలో 1984లో అరెస్ట్ అయి కానూరు కుట్ర కేసు నిందితుడిగా కొంతకాలం జైల్లో గడిపారు. విప్లవోద్యమ కార్మిక పత్రిక 'కార్మికపథం' నిర్వాహకులలో ఒకరుగా ఉన్నారు. 1990లలో ఉద్యోగం నుంచి వాలంటరీ రిటైర్‌మెంట్ తీసుకుని న్యాయశాస్త్రం అభ్యసించి హైదరాబాద్‌లో న్యాయవాదిగా పనిచేయడం ప్రారంభించారు. న్యాయవాదిగా, పౌరహక్కుల ఉద్యమ కార్యకర్తగా ఉంటూనే కార్మికవర్గం కోసం స్వతంత్ర పత్రికగా 'శ్రమజీవి' మాసపత్రికను ప్రారంభించారు. శ్రమజీవిలోనూ, ఇతర పత్రికల్లోనూ కార్మికవర్గ పోరాటాల గురించీ, కార్మికోద్యమ చట్టాల గురించీ ఎన్నో విలువైన వ్యాసాలు రాశారు. ఇటీవల రాజకీయ ఖైదీల హక్కులను కాపాడే ఉద్యమంలో క్రియాశీలంగా పనిచేస్తూ, రాజకీయ ఖైదీల విడుదల పోరాట కమిటీ నాయకుడిగా ఎన్నికయ్యారు. రాష్ట్రంలోనే కాక ఇతర రాష్ట్రాల జైళ్లలో ఉన్న రాజకీయ ఖైదీలను కలిసి, వారి అవసరాలు తీర్చే పనిలో నిమగ్నమై ఉన్నారు. వీ

గొడవెందుకు? కనుక ఏ కోణాలలో చూసినా ప్రస్తుతం అమలులో ఉన్నవి మతపరమైన రిజర్వేషన్‌లే. ఏ విధంగా హిందూ మతంలో ఉన్న కులాలను ఆధారంగా చేసుకొని రిజర్వేషన్‌లు ఇస్తున్నారో... అదే కులాన్ని ప్రాతిపదికగా చేసుకొని ముస్లింలకు సైతం రిజర్వేషన్‌లు ఇవ్వమని కోరుతున్నారంతే. దీనికంత రాద్ధాంతమెందుకు?

పైకి కనిపించదు కానీ, భారతీయ ముస్లిం సమాజంలో కుల వ్యవస్థ ఉంది. హిందూ మతం అగ్ర, నిమ్న కులాలుగా విభజించబడినట్లే, భారతీయ ముస్లింలు (ఉన్నత) 'అష్రాఫ్', (నిమ్న) 'అజ్లాఫ్' ముస్లింలుగా విభజింపబడి ఉన్నారు. ఇది ప్రధానంగా ఉత్తర భారతదేశంలో కనిపిస్తుంది. అష్రాఫ్ ముస్లింలు సయ్యద్, షేక్, మొఘల్, పఠాన్, ఖాన్, మీర్జా తదితరులుగా విభజితమై ఉన్నారు. అజ్లాఫ్ ముస్లింలు దర్జీ, హజామ్, రంగ్రేజ్, కురేషి, మోమిన్, కల్లాల్ మొదలగు తరగతులుగా విభజింపబడి ఉన్నారు. ఆంధ్రప్రదేశ్‌లో కూడా అష్రాఫ్ కోవకు చెందిన షేక్, సయ్యద్, పఠాన్, ఖాన్, మీర్జా తదితర విభజనలు స్పష్టంగా కనిపిస్తాయి. కాని వీరెవరికీ ఈ పేర్లెలా వచ్చాయో, అందుకు కారణాలేమిటో పెద్దగా అవగాహన ఉన్నట్లు కనిపించదు. మతాంతీకరణ చెందిన ముస్లింలు సైతం సాంఘిక హోదా కోసం తమను తాము ఇలా వ్యవహరించుకుంటున్నట్లు కనిపిస్తున్నది. ఏది ఏమైనా ఈ దేశంలో ప్రస్తుతం ముస్లింలుగా కొనసాగుతున్న వారిలో అధిక సంఖ్యాకులు మతాంతీకరణ చెందినవారే అనడంలో ఎటువంటి సందేహం లేదు. కనుకనే ఇంకా పూర్వపు మతాలకు చెందిన వృత్తుల్లోనే వారు కొనసాగుతున్నారు. అలాంటి వారికి మీరు ముస్లింలు కనుక రిజర్వేషన్‌కు అనర్హులు అనడం ఏమేరకు కరెక్టు?

వేయి మాటలెందుకు, ముస్లింలకు రిజర్వేషన్‌లు దక్కాలంటే, ఈ ప్రభుత్వాలకు చిత్తశుద్ధి కావాలి. రిజర్వేషన్‌ల వాదనలో హైకోర్టు సైతం ఇదే విషయాన్ని స్పష్టం చేసింది. ముస్లింలకు రిజర్వేషన్‌లతో (ఇప్పటికే బిసిలకు అమలవుతున్న కోటాలో భాగం కాకుండా) ప్రత్యేక కోటాను కేటాయించాలి. అగ్రవర్ణాల ముస్లింలు ఈ రిజర్వేషన్‌లను తన్నుకు పోకుండా 'క్రిమిలేయర్' ప్రమాణాలను నిర్ణయించాలి. తగు జాగ్రత్తలు తీసుకోవాలి. అలా కాకుండా కాలయాపన కోసం కమిషన్‌లను నియమించడం, ఆ నివేదికలను అటకెక్కించడం, ముస్లింలను కేవలం 'ఓటు బ్యాంక్'గా పరిగణించి అరకొర ప్రయోజనాలను ప్రసాదించడం మానుకోవాలి. చిత్తశుద్ధితో పటిష్టమైన ప్రణాళికలతో ముస్లింల వెనుకబాటుతనాన్ని రూపుమాపడానికి ముందుకు రావాలి.

ముస్లింలకు రిజర్వేషన్‌లు ఇవ్వడమంటే వేర్పాటువాదానికి అవకాశమివ్వడమేనని, అది మరో విభజనకు దారి తీస్తుందని బిజెపి దాని అనుబంధ సంఘాలు, సంస్థలు ప్రచారం చేస్తున్నాయి. అలాంటిదేమీ జరగదని ఇప్పటికే పలు రాష్ట్రాల్లో అమలులో ఉన్న రిజర్వేషన్‌లు నిరూపించాయి. ప్రజలు ఈ విషయాలను గమనించి ముస్లిం రిజర్వేషన్‌లను స్వాగతించాలి.

*(రచయిత రాష్ట్ర ప్రభుత్వ ఉద్యోగి)*

*ksyed64@yahoo.co.in*

వీ

# మనకున్న దళిత స్పృహ ఎంత...?

***వివిధ సమూహాల ప్రజల ఆహారపు అలవాట్లను, సంస్కృతీ, సాంప్రదాయాలను వివరిస్తూ సంఘ పరివార్ సాంస్కృతిక ఆధిపత్యాన్ని ప్రశ్నిస్తున్నారు*** **డా. జి. లచ్చయ్య**

మండల్ కమిషన్ సందర్భంగా ఉన్నత వర్గాల విద్యార్థులు రోడ్లను ఊడ్వడం, బూట్ పాలిష్ చేయడం లాంటి పనులు చేసి వారి నిరసనను తెలిపారు. (మురికి కాలువల్ని, పాయిఖానాల్ని మాత్రం ముట్టుకోలేదు) చూసేవారికి, 'అయ్యో పాపం, వారిగతి అంతేనా?' అని అనిపించింది. ఈ నేపథ్యంలోనే రాజీవ్ గోస్వామి అనే ఢిల్లీ యువకుడు ఆత్మాహుతి చేసుకొని మండల్ కమిషన్ వ్యతిరేకోద్యమానికి మరింత ఆజ్యం పోశాడు. ఇందులో రెండు అంశాలున్నాయి. ఒకటి - మండల్ కమిషన్ రిపోర్టు అమలైతే ఉన్నత వర్గాల యువకులకు అసలు ఉద్యోగాలే దొరకవని, రెండవది - పైన ఉదహరించిన పనులు కేవలం దళిత, వెనుకబడిన, నిమ్నవర్గాల వారు మాత్రమే చేయాలనే సంకేతాన్ని సమాజంలోకి పంపడం. అప్పుడు మొదలైన దళిత వ్యతిరేక ఉద్యమం విద్యాలయాల్లో నేటికి కొనసాగుతూనే ఉంది. అవి విభిన్న రూపాల్లోకి రూపాంతరం చెందాయి. మండల కమిషన్ రిపోర్టు అమలు ఏమోగాని, మొత్తంగా ప్రభుత్వరంగాన్ని ప్రైవేటీకరించడం మొదలైంది.

అద్వాని రథయాత్రతో, బాబ్రీమసీద్ కూల్చివేతతో, ఆ తర్వాత జరిగిన గోధ్రా, ముంబాయి అల్లర్లతో మరింత బలోపేతమవుతూ చివరికి హిందువుల ఐక్యత అనే ముసుగులో హిందువులుగా భావిస్తున్న దళితుల్ని కించపరిచే స్థాయికి ఈ వ్యతిరేక ఉద్యమాలు ఎదిగాయి.

గత విద్యా సంవత్సరం ఢిల్లీ విశ్వవిద్యాలయంలో వెనుకబడిన తరగతుల విద్యార్థులు మైసాసుర దినోత్సవాన్ని (ది డే ఆఫ్ మైసాసుర) జరిపినందుకు మతోన్మాదులు గుప్పిట్లో పనిచేస్తున్న వైస్‌చాన్సలర్ సంబంధిత విద్యార్థి సంఘానికి నోటీసులు జారీ చేసాడు. వెనువెంటనే ఎకె రామానుజన్ రాసిన 'మూడు వందల రామాయణాలు' (త్రి హండ్రెడ్ రామాయణాస్) వ్యాసాన్ని చరిత్ర పాఠ్యాంశాల నుంచి తొలగించారు. అహల్య పాత్ర చిత్రీకరణలో వాల్మీకి రామాయణానికి, కంబ రామాయణానికి వ్యత్యాసం ఉందనే నెపంతో ఈ చర్యకు పాల్పడ్డారు. రామాయణ గాథపై ఈగ వాలకుండా చూసే పరివారమే విమర్శనాత్మకమైన ఈ వ్యాసాన్ని విద్యార్థులు చదవకుండా చేశారు. మొన్నటి శ్రీరామనవమి రోజున హైదరాబాద్ కేంద్రీయ విశ్వవిద్యాలయంలో రావణాసుర దినోత్సవాన్ని (ది డే ఆఫ్ రావణ) దళిత, వెనుకబడిన విద్యార్థులు నిర్వహించారు. ఈ రెండు సంఘటనలు సున్నితమైనవిగా కనిపించినా, ఇందులో అనేక అంశాలు ఇమిడి ఉన్నాయి. అనాదిగా వస్తున్న మతాధిపత్యాన్ని ధిక్కరించడమే కాకుండా, ఇతిహాసాల్లో రూపుదిద్దుకున్న 'యుగ పురుషుల' (రాముడు, కృష్ణుడు) ఉనికికే ఈ చర్యలు భంగకరంగా మారడం!

ఇదే హైదరాబాద్ కేంద్రీయ విశ్వవిద్యాలయంలో ఈశాన్య రాష్ట్రాల విద్యార్థులు తమ ఆహారపు అలవాట్లకు అనుగుణంగా ప్రత్యేక వంటశాల కావాలని డిమాండ్ చేసి సాధించుకున్నారు. వీరికి అండగా దళిత, వెనుకబడిన వర్గాల విద్యార్థులు నిలువడం మతతత్వ విద్యార్థి సంఘాలకి ఆగ్రహాన్ని తెప్పించాయి. ఆది నుంచి భిన్న ఆలోచనలకు నిలయాలైన విశ్వవిద్యాలయాల్లో రక్తపాతాలు జరుగుతూనే ఉన్నాయి. ఈ కోవలోనే ఉస్మానియాలో జార్జిరెడ్డి హత్య సంఘటన! ఫాసిస్టు భావజాలాన్ని విశ్వవిద్యాలయాల్లో ముందుకు తీసుకెళ్లాలనే ఆలోచనలే ఈ సంఘటనకు మూలకారణాలు. ఈ నేపథ్యంలో గత ఏప్రిల్ 15న ఉస్మానియా న్యూ రిసెర్చి హాస్టల్ దగ్గర జరిగిన పెద్దకూర పండగ (బీఫ్ ఫెస్టివల్) వ్యతిరేక సంఘటనలు కూడా. ఏదో జరగకూడని తప్పిదం జరిగినట్లు, హిందూ మతం కలుషితమైనట్లు సంఘ్ పరివార్ నేతృత్వంలో పనిచేస్తున్న విద్యార్థి సంఘం కోడై కూస్తున్నది. పత్రికల్లో కథనాలను రాసింది. ఇదే భావజాలంతో పనిచేస్తున్న పత్రికలు వేదికలుగా నిలుస్తున్నాయి.

ఈ పరివారం దృష్టిలో ఒక్క ముస్లింలు తప్ప మిగతా వారంతా హిందువులనే భావన నాటుకొని ఉంది. క్రిస్టియన్లు కూడా ఆది హిందువులేనని, మత మార్పిడికి గురైనారని వీరి ప్రచారం. ఇక సిక్కులు, బౌద్ధులు, జైనులు, జొరాస్టియన్లు హిందువుల్లో ఒక భాగమని, తెగని వీరు భావిస్తూ ఉంటారు. ఇకపోతే పదిహేను శాతంకు పైగా ఉన్న దళితులు, పదిశాతం దాకా ఉన్న ఆదివాసులు, గిరిజనులు (ఆదివాసులు, గిరిజనులు ఒకటి కాదు), యాభై శాతానికి పైగా ఉన్న వెనుకబడిన తరగతుల వారు వీరి దృష్టిలో హిందువులే అయినా ఉన్నత వర్గాలకు సేవకులనే భావన వీరి నరనరాన జీర్ణించుకున్నది. ఇదే వీరి వాదన అయితే వీరంతా 'సేవక మతస్తులు' (సర్వెంట్ రిలిజియన్) కావాలి గాని హిందువులు కాకూడదు. ఆది నుంచి మతాన్ని తప్పుగానే నిర్వచించడం జరుగుతున్నది. ఈ తప్పుడు విధానాల్ని రూపుమాపడానికే 'కబీర్' లాంటి భక్తి ఉద్యమాలు వచ్చాయి. అక్బర్ కాలంలో 'దిన్-ఇ-ఇలాహి' లాంటి మతాల స్థాపన జరిగింది. క్రీస్తు పూర్వమే (300 బిసి) ఈ దేశంలో విగ్రహ ఆరాధనను వ్యతిరేకించిన బౌద్ధమతం స్థాపించబడింది. ఈ ఉద్యమాలకు ఆకర్షితులై ప్రజలు వేలాదిగా వీటిల్లో చేరారు. మనం గొప్పగా చెప్పుకునే అశోక చక్రవర్తి బౌద్ధాన్ని స్వీకరించి, దాని వ్యాప్తికై ఎనలేని కృషి చేశాడు. మరి అశోకుడు హిందువా? బౌద్ధుడా? అలాగే 1956లో బౌద్ధాన్ని స్వీకరించిన అంబేద్కర్ ఏ మతానికి చెందుతాడు?

ఉన్నత వర్గాలు, మనువాద ఆలోచనాపరులు మతాన్ని పాలకుల గుప్పిట్లో జాగ్రత్తపరుస్తూ వారు చెప్పిందే వేదంగా ప్రచారం చేసారు. దీనితోనే అన్ని మతాల్లో రెండు విభజన రేఖలు పొడసూపాయి.

కేథలిక్కులు, ప్రొటెస్టెంట్లని, షియాలు, సున్నీలు అని, హీనయానం, మహాయానం అని, ద్వైతం, అద్వైతం అని, శైవులు, వైష్ణవులని, జీయర్లలో చిన్న జీయర్, పెద్ద జీయర్ అని ఎవరి కుంపటిని వారు రాజేసుకుంటూనే ఉన్నారు. వీరివీరి భావజాల వ్యాప్తి కోసం అమాయక ప్రజల్ని సమిధలుగా మార్చడం ఆది నుంచి జరుగుతూనే ఉంది. ఇదే ఆలోచనా విధానంలో గిరిజనుల్ని హిందువులుగా ముద్ర వేస్తున్నారు. మతం (ఓ ఆలోచనా విధానం) అనేది ఆయా సంస్కృతుల్లో ఒక పార్శ్వం మాత్రమే. ఈ దేశంలో అనేక సంస్కృతులున్నాయి. ఎవరి సంస్కృతి వారిది. ఎవరి మతం వారిది. ఎవరి కట్టు, బొట్టు, ఆచారాలు, వేషభాషలు, ఆహారపు అలవాట్లు వారివి. ఇది కాదనలేని సత్యం. పరిసరాలను బట్టి, పరిస్థితులను బట్టి, ఇతరుల సాంగత్యాన్ని బట్టి ఇవి ఏర్పడుతాయి. ఉన్నత వర్గ మతాధిపతులే 'కర్మ' సిద్ధాంతాన్ని ప్రచారంలోకి తెచ్చారు. కర్మను మార్చుకోవడానికి మతాన్ని, మతంతోపాటుగా దేవుణ్ని సృష్టించారు. ఈ దేవుళ్లని మాత్రం వీరి గుప్పిట్లోనే ఉంచుకోవడంతో, విధిలేని పరిస్థితుల్లో సేవకులు, శ్రమజీవులు వారికి అనుకూలమైన దేవుళ్లను రూపొందించుకున్నారు. చాకలి వారికి మడేలయ్య, ముదిరాజులకు పెద్దమ్మ, గౌండ్ల వారికి (కళాలి) రేణుక (ఎల్లమ్మ), జాలర్లకు గంగమ్మ, విశ్వకర్మలకు కాళికాదేవి, గొల్ల కుర్మలకు బీరప్ప, మోచి వారికి రోహిత్‌దాస్, కాపు వారికి మైసమ్మ, నల్లపోచమ్మ, ముత్యాలమ్మ, లస్మమ్మ, ఊరడమ్మ, పోత లింగయ్య, మాలలకు మాల పోచమ్మలు రూపుదిద్దుకున్నాయి. మాదిగలకు ఏ దేవతామూర్తి లేకుండా పోయింది. (ఏదైనా ప్రాంతంలో ఉంటే దీనికి జతచేయాలి) పై వర్గాలకి, వారి దేవతలకి, ఉత్సవాలకి వీరు ఊడిగం చేసేవారిగానే మిగిలిపోయారు. శాకాహారులుగా రూపాంతరం చెందిన ఉన్నత వర్గాల వారు (బ్రాహ్మణులు, క్షత్రియులు మొదలగువారు) సృష్టించుకున్న దేవతలు శాఖాహారులుగా, శ్రమజీవులు రూపొందించుకున్న దేవతలు పక్కా మాంసాహారులుగానే స్థిరపడి పోయారు. అనగా ఎవరి ఆహారపు అలవాట్లకు అనుగుణంగా వారు తమ తమ దేవుళ్లను రూపొందించుకున్నారు. మధ్యస్థంగా ఉండే నరసింహస్వామి ఉన్నత వర్గాలకు శాకాహారిగా, శ్రమజీవులకు మాంసాహారిగా వెలుగొందు తున్నాడు. పైగా ఈయన అటవీ ప్రాంతాలకు, కొండ ప్రాంతాలకే పరిమితమై ఉంటాడు. ఎందుకంటే తలభాగం సింహరూపం కాబట్టి.

ఇక మతం గొప్పదా, దేవుడు గొప్పవాడా (దేవుడెప్పుడూ పులింగమే!) అనే చర్చ ప్రపంచ వ్యాపితంగా జరుగుతున్నది. దేవుడు మతం ద్వారా సృష్టించబడ్డాడు కాబట్టి మతానికే దేవుడు లొంగి ఉండాలనేది అంతర్గత భావన. దీనికి చక్కని ఉదాహరణ ఫ్రెంచ్ మహిళ జోన్ ఆఫ్ ఆర్క్‌దే.

ఇక గిరిజనుల పరిస్థితి అన్నింటికి చెడిన రేవడిలా ఉంది. వీరు హిందువులనీ, కాదు ముస్లింలనీ, ఈ మధ్యన క్రిస్టియన్లనీ వీరిని విభజిస్తూ వస్తున్నారు. నిజానికి దేశంలోని దాదాపు ఆరు వందలకు పైగా ఉన్న గిరిజన తెగలు, ఆదివాసీలు ఏ మతానికీ చెందరు. ఎవరి మతం వారిదే. ఉదాహరణకు సంచార జీవులైన బంజారులలో ముస్లిం మతాచారులు, హిందు మతాచారులు కనబడతారు. ఒక్కో రాష్ట్రంలో వీరిని ఒక్కో విధంగా గుర్తించారు. ఉత్తర భారతదేశంలో వీరిని హరిజనులుగా, మధ్య భారతదేశంలో వెనుకబడిన తరగతుల వారిగా గుర్తిస్తే, దక్షిణ భారతదేశంలో వీరిని గుర్తించబడిన గిరిజనులుగా (ఐడెంటిఫైడ్ ట్రైబ్) పరిగణిస్తున్నారు. వీరి సంతతి వారు యూరప్ దేశాలకు కూడా వలసపోవడంతో (పృథ్వీరాజ్ చవాన్ ఓడిపోవడంతో) అక్కడ వీరిని రోమో బంజారాలని పిలుస్తారు. ఈ బంజారుల ఆచార వ్యవహారాలు, వేష భాషలు దేశమంతా దాదాపుగా ఒకే తీరుగా ఉండడం గమనార్హం. వీరు మాట్లాడే భాషలో రాజస్థానీ, జోధ్‌పూరి, కొంత హిందీ మిళితమై ఉంటుంది. సిక్కు మత స్థాపకుడైన గుర్ గోబింద్ సింగ్ బంజారా వర్గానికే చెందినవాడు కావడాన్ని గమనించాలి. వీటన్నింటిని బట్టి బంజారాలు ఏ మతానికి చెందుతారో ఎలా చెప్పగలం. బంజారాలతో పాటు ఈ ప్రాంతానికి వలస వచ్చిన మధురాలు బంజారాల లాగానే జీవన విధానం కలిగి ఉన్నా, వారిని గిరిజనుల జాబితా నుంచి తిరిగి వెనుకబడిన తరగతుల్లో చేర్చారు. వీరి భాష, వేషధారణ బంజారాలకు కొంచెం భిన్నంగా ఉంటుంది.

ఈ విధంగా ఆదివాసులు, గిరిజనులు ఉన్నత వర్గాలు మాట్లాడే భాషనో, లేదా సంస్కృతమో మాట్లాడాలి. లేదా ఆయా ప్రాంతాల ప్రాంతీయ భాషనే మాతృభాషగా కలిగి ఉండాలి. కాని అలా లేకుండా ప్రతీ తెగకు ఓ భాష ఉంది. ఓ సంస్కృతి ఉంది. గిరిజనులు మాట్లాడే ఏ ఒక్క భాషను ఏ ప్రాంతం వారూ మాట్లాడరు. ఏ దేవుడూ మాట్లాడడు. బాలాజీగా బంజారా గూడెంలో ప్రవేశించిన వెంకటేశ్వర స్వామికి బంజారా భాష వచ్చునో రాదో తెలియదు గాని తమిళులు మాత్రం ఆయనకు తమిళం వచ్చంటే, తెలుగు వారు ఆయనకు తెలుగు మాత్రమే వచ్చంటారు. ఇక జీయర్లైతే తెలుగు, తమిళం కాదు, ఆయనకు వైదిక భాష అయిన సంస్కృతం మాత్రమే వస్తుందని పెద్ద చర్చ పెడతారు. దీన్ని బట్టి దేవుడి సృష్టి ఎలా జరిగిందో అర్థం చేసుకోవచ్చు.

కాబట్టి ఆదివాసులు, గిరిజనులు భిన్నమైన సంస్కృతీ, సంప్రదాయాల్ని, ఆచారాల్ని కలిగి ఉన్నారు. వారి దేవుళ్లు వారికున్నారు. కాని జాతీయ స్రవంతి పేరున వీరి సంస్కృతిని దెబ్బతీస్తూ ఉన్నత వర్గాలు సృష్టించుకున్న దేవుళ్లకు వీరిని బానిసలుగా చేస్తున్నారు. శ్రమతో పాటుగా సాంస్కృతిక బానిసలుగా వీరిని మార్చే ప్రయత్నం జరుగుతున్నది. ఈ విషయాలను గుర్తించలేని ఈ అమాయక వర్గాలు ఉన్నత వర్గాలు చెప్పిందే వాస్తవమనే భ్రమల్లోకి నెట్టబడుతున్నారు. వీటి ఫలితంగానే మాల, మాదిగ వాడల్లో కూడా గణేష్ విగ్రహాల్ని పెట్టుకుంటున్నారు. ఈ వాడల్లో తిరుమల తిరుపతి దేవస్థానం (టిటిడి) రామాలయాన్ని కట్టిస్తూ రామున్ని కూడా సవర్ణ హిందూ రాముడిగా, అవర్ణ హిందూ రాముడిగా విభజించారు. ఏ ప్రాంతాల్లో కూడా టిటిడి పోచమ్మ, కాశమ్మ గుళ్లను కట్టించడం లేదు. దీన్ని బట్టి రాజకీయం మతం మత్తును ఎలా వాడుకుంటుందో తెలుస్తున్నది. వీటిని అలుసుగా తీసుకొని మిషనరీలు గిరిజన ఆవాస ప్రాంతాల్లో చర్చీలను స్థాపిస్తూ స్వస్థత కూటముల పేరున మతం మార్పిడులకు గురి చేస్తున్నారు. ఈ మత ఛాందస వాదాలతో దళిత, వెనుకబడిన తరగతులు, నిమ్న వర్గాలు తమ కర్మని పరీక్షించుకుంటున్నాయి. ఈ వర్గాలు సృష్టించుకున్న మహిళా దేవతలను శక్తి స్వరూపులనీ, వీరంతా పార్వతి మారు రూపాలేననీ కొత్త కథనాల్ని ప్రచారం చేశారు. ఈ విధంగా మాతృస్వామ్య ప్రతీకల్ని దెబ్బ తీయడం మొదలైంది.

ఎల్లకాలం ఈ మోసాలు సాగలేవని, వాస్తవాల్ని గుర్తిస్తున్న ఈ

బలహీన వర్గాల విద్యార్థులు, యువకులు తమ మూలాల్ని వెతుక్కోవడం ప్రారంభించారు. ఇందులో భాగంగానే ఈ మధ్యన విశ్వ విద్యాలయాల్లో వివిధ ఘటనలు చోటు చేసుకుంటున్నాయి. తమ ఆధిపత్య ధోరణికి అడ్డుకట్ట పడుతుందేమోనని భావిస్తున్న ఉన్నతవర్గాల వారు వీటిని అడ్డుకోవాలని ప్రయత్నం చేస్తూనే ఉన్నాయి. శంభూకుణ్ని, రావణున్ని, బలి చక్రవర్తిని రాక్షసులుగా ముద్రవేసి బలి తీసుకుంటూనే ఉన్నారు. ఏకలవ్యున్ని ఎదగకుండా చేశారు. వీరి వర్గానికే చెందినా, ఎదిరించినందుకు కర్ణున్ని మోసపూరితంగా చంపారు. ఈ దుశ్చర్యలు చేసిన వారి వారసులే హిందూ సంప్రదాయాలంటూ గొంతెత్తి చాటుతున్నారు. ఇంకా ఇది ఎంత కాలమని దళితుల గొంతులు ప్రశ్నిస్తున్నాయి. ఇందులో ధిక్కార స్వరం ఉంది. ఆధిపత్య ధోరణిని ప్రశ్నించే ఆలోచన ఉంది. అన్నింటిని మించి తమ సంస్కృతిని కాపాడుకోవాలనే తపన ఉంది. ఈ విధంగా దళిత, వెనుకబడిన వర్గాలు కదులుతే తమ అధికార మూలాలు ఎక్కడ కదిలిపోతాయోననే భయంతోనే ఉస్మానియాలో జరిగిన పెద్దకూర పండుగను అడ్డుకున్నారు. నిజానికి ఇందులో కొత్త అంశాలేవి లేవు. పసక జాతర / పండుగను జరపడం, వంటలకు పోవడం (ముద్దుగా పిక్నిక్), జాతరలకు పోవడం పల్లెవాసులకు సర్వసాధారణమే. ఛిద్రమైన జీవితాల్లో ఈ రోజుల్లోనే ఆనందం వెల్లివిరుస్తుంది. సంప్రదాయ ఆహారాన్ని, పానీయాలను (ఒకప్పుడు కల్లు, సారాయి స్వచ్ఛమైనవి లభించేది) సేవిస్తారు. వారి వారి ఆరాధ్య దైవాలకు, చనిపోయిన కుటుంబ పెద్దలకు మాంసంను (శియ్యకూర), పసుపు, లవంగాలు, యాలకులు వేసి వండిన అన్నంను (జేజబువ్వ) నైవేద్యంగా అర్పిస్తారు. కల్లు సాకను పెడతారు. ఇదో నమ్మకం. దేశవ్యాపితంగానే కాక, ప్రపంచ వ్యాపితంగా శ్రమజీవుల్లో ఏదో రూపంలో ఈ ఆచారాలు కనబడతాయి. ఇవి వారి వారి సంస్కృతీ, సంప్రదాయాలకు ప్రతీకలుగా కనబడతాయి.

ఇలాంటి సంస్కృతీ, సంప్రదాయాల్నీ రక్షించుకోవడం 'విద్య'లో ఒక భాగమని, విద్యావేత్తలే సెలవిస్తూ ఉంటారు. నిర్వచిస్తూ ఉంటారు. కానీ మనం పరాయీకరణకు గురవుతూ (అమెరికనైజ్డ్), మిడ్డీలు, బర్‌మొడాలను, స్థానిక దర్జీలు కుట్టలేని జీన్స్ ఫ్యాషన్ అని, ఫాస్ట్‌ఫుడ్స్‌ను, పిజ్జాలను, బర్గర్‌లను ఆరగిస్తూ, మటన్ ఫ్రై, చికెన్ 65 అనే ముద్దుపేర్లతో పబ్బుల్లో తింటూ, పార్కుల్లో గంతులేస్తూ, ర్యాంప్‌పై వయ్యారంగా నడుస్తూ, స్వయంగా పాశ్చాత్య సంస్కృతికి గురౌతూ, ధ్వంసమౌతూ, జాతీయ స్రవంతి (నేషనల్ మెయిన్‌స్ట్రీం) అనే ముద్దుపేరుతో గిరిజనుల్ని, ఆదివాసుల్ని కూడా ధ్వంసం చేయాలని చూస్తున్నాం. వారి ఆచార వ్యవహార, భాష, సంస్కృతీ, సంప్రదాయాల్నీ ఉన్నతంగా, గౌరవంగా కాపాడుకునే చైతన్యపూరిత విద్యా విధానాన్ని రూపొందించక మరో వర్గానికి, వ్యవస్థకు బానిసలుగా తయారు చేస్తున్నారు. ఒకప్పుడు ప్రజాస్వామ్యబద్ధంగా, మానవీయంగా ఉన్న ఆదివాసుల, గిరిజనుల ఆచారాలు, అశాస్త్రీయ దోపిడీ భావజాల చదువుల పుణ్యమా అని పరాయీకరణకు గురౌతున్నాయి. ఆడపిల్ల పుడితే ఆనందించే గిరిజన కుటుంబాలు వరకట్నాల ప్రవేశంతో పుట్టిన ఆడపిల్లల్ని పురిటిలోనే చంపాలనుకుంటున్నాయి. వేష, భాషలతో తన ఉనికి ఎక్కడ బయట పడుతుందోనని భయపడి ప్రాంతీయ భాషను బలవంతంగా నేర్చుకుంటున్నాయి. చివరికి విశ్వ విద్యాలయాల్లో కూడా ఈ పరిస్థితి దాపురించడంతో కించిత్తు ఆలోచన చేస్తున్న ఆలోచనాపరులు వారి సంస్కృతిని పరిరక్షించుకునే ప్రయత్నాల్ని మొదలు పెట్టారు. ఇందులోని భాగమే పెద్దకూర పండుగ.

ఈ పెద్దకూర తినడాన్ని వ్యతిరేకిస్తున్న అత్యధికులు మాంసాహారులు కావడం గమనార్హం. మాంసాహారం అంటే మేక, గొర్రె, కోడి, చేపలు, రొయ్యలే కాదు – పంది, గొడ్డు మాంసాలు కూడా ఇందులో భాగమేననేది వీరికి తెలిసి కూడా వ్యతిరేకించడం శోచనీయం. గర్హనీయం. వీరు ప్రవచిస్తున్న అఖండ భారత్‌లోనే వివిధ వర్గాల వారి ఆహారపు అలవాట్లు విభిన్నంగా ఉన్నాయి. ఈశాన్య రాష్ట్రాల భారతీయుల అలవాట్లు తూర్పు ఆసియా దేశాల ఆహారపు అలవాట్లకు దగ్గరగా ఉన్నాయి. వీరు కుక్కల్ని, పిల్లుల్ని, పాముల్ని ఆహారంగా స్వీకరిస్తారు. మధ్య భారతదేశంలో ఎలుకల్ని ఆహారంగా స్వీకరించే జాతులుండగా, దక్షిణ భారతదేశంలో కూడా పిల్లుల్ని తినే దొమ్మర్లు, ఎలుకల్ని తినే సంచార జాతులున్నాయి. ఇవన్నీ కంగాళపు అలవాట్లని అంటే, స్వచ్ఛమైన శాకాహారులకు మేక, కోడి మాంసం, చేపలు, రొయ్యలు, పీతలు తినేవారి పట్ల ఎలాంటి అభిప్రాయం ఉండాలి? ఉంటుంది? పైగా క్యాంపస్‌లలో వీరి పట్ల ఈ మాంసాహార వర్గాలు చులకనగా చూడడం, గేలి చేయడం, అవమానపర్చడం జరుగుతూనే ఉంది. పెళ్లిళ్లలో, ఇతర ఫంక్షన్స్‌లల్లో మాంసాహారం వడ్డించినపుడు శాకాహారులకు ఓ మూలన పెట్టి వారిపై ఎన్ని జోకులు చేస్తారో! వీటికి దూరంగా ఉండే (బ్రాహ్మణ, వైశ్యులు, కొన్ని ఇతర కులాల్లోని వ్యక్తులు) వారిని వారి వారి కులం పేరుతో నిక్‌నేమ్స్‌తో పిలవడం జరుగుతుంది. వీరి బాధల్ని పడలేని యువత (చదువుకునేవారు) మాంసాహారానికి అలవాటు పడడం సర్వసాధారణమైంది. క్యాంపస్‌లోకి శాకాహారులుగా వచ్చి, మాంసాహారులుగా మారి క్యాంపస్‌లను వదలడం సర్వసాధారణం.

ఇకపోతే, స్వచ్ఛమైన శాకాహారులంటూ ఏ వర్గాల్లో ఉండరు. కాశ్మీర్ బ్రాహ్మణులు, బెంగాల్ బ్రాహ్మణులు చేపల ప్రియులనేది అందరు గుర్తించినదే. సముద్రతీర ప్రాంతాల్లో చేపలు ప్రధాన ఆహారం కాగా, మైదాన, అటవీ ప్రాంతాల్లో ఆయా ఆవాస ప్రాంతాల్లో లభించే జంతువుల మాంసమే ఆహారపు అలవాటుగా మారుతుంది. ఇదో ప్రకృతి జీవిత సూత్రం. ఆహారపు గొలుసులో (ఫూడ్ చెయిన్) ఇదో భాగం. ఇది అవసరం కూడా. లేకపోతే ప్రకృతి సమతుల్యత దెబ్బతింటుంది.

సంఘ్ పరివారు కోరినట్లుగా నిజంగానే గోవులు రక్షించబడాలంటే విధిగా వాటిని ఆహారంగా స్వీకరించడమే శాస్త్రీయమైనది. ఏవైతే వినియోగించబడుతుందో దాని ఉత్పత్తి పెరుగుతుంది. ఇదే మార్కెట్ సూత్రం. ఇప్పుడు కోళ్ళు, బాతులు, ఈము పక్షుల పెంపకంతో పాటుగా సంప్రదాయేతర విధానంలో మేకల, గొర్రెల, చేపల, రొయ్యల పెంపకం ఊపందుకున్నది. లేనిచో సగటు భారతీయుడి మాంసం వినియోగం పెరిగేది కాదు. ఏదో ఒక జంతువు మాంసంపై ఆధారపడితే ఆ జంతువు అంతరించి పోయే ప్రమాదం కూడా ఉంటుంది. అందుకే ప్రకృతి సిద్ధంగా లభించే వాటిని వినియోగించడం అనివార్యం. ఈ విధంగా గోమాంసం వినియోగం పెరిగితే తప్పకుండా ఆవుల పెంపకం తిరిగి ఊపందుకుంటుంది. దీంతో గోవుల సంఖ్య, వీటితోపాటు ఎద్దులు తిరిగి పెరుగుతాయి. వీటిపై ఆధారపడి జీవించే వారికి ఆర్థిక పుష్టి

చేకూరుతుంది. కుంటుపడిపోతున్న చిన్న కమతాల వ్యవసాయం తిరిగి పూర్వ వైభవం పొంది, చిన్న, సన్నకారు రైతులు బాగుపడతారు. లేదంటే ఉత్సవ విగ్రహాల్లాగా ఆవులు పరిమితమై పోతాయి. పశు సంపద ఇప్పటికే దెబ్బతిన్నది. సంఘ్ పరివార్ హయాంలోనే మెదక్ జిల్లాలో అల్-కబీర్ యాంత్రిక గోవధశాలకు అనుమతినివ్వడం జరిగిందనేది మర్చిపోతున్నారు. అప్పుడు వీరు చెప్పిన కారణాలను తవ్వి తీయాలి.

నిజానికి సృష్టిలో ప్రతి జంతువు ప్రత్యేకమైనదే. దేని విశిష్టత దానికుంటుంది. మానవుడిని దృష్టిలో ఉంచుకొనే జంతువుల్ని, జీవరాసుల్ని మంచివీ, చెడువీ అనీ, అపకార, ఉపకార బాక్టీరియాలనీ, క్రూర మృగాలనీ ముద్రవేయడం జరిగింది. ప్రకృతిలో ప్రతి జంతువు ఉపయోగకరమే. పాములు రైతు బాంధవులు. అవి ఎలుకల్ని తిని పంటల్ని రక్షిస్తాయి. అనాదిగా పామును ఆదివాసులు, గిరిజనులు, కాయాకష్టం జేసుకునే ప్రజలు గౌరవించడం, పూజించడం చేస్తున్నారు. సినిమాలు, తప్పుడు ఆలోచనా విధానాలు వచ్చిన తర్వాత పాముల్ని చంపడం మొదలైంది. ఇది చదువుకున్న వారి ద్వారా సంక్రమించిన జాఢ్యం. పాములపై తప్పుడు భావనలపై అనేక సినిమాలు వచ్చాయి. ఇవి వాస్తవమని ప్రజలు భావించే స్థితికి వెళ్లారు. నాగుల చవితి రోజున పుట్టలో పాలు పోయడం చేస్తారు. నిజానికి పాము పాలు తాగదని ఎవరూ గుర్తించరు. వీరి భక్తికి మెచ్చి పాము పుట్ట నుంచి (ఉంటే) బయటకు వస్తే పరవశించి పూజచేస్తామా? పారిపోయి వస్తామా! పాము శంకరుడి కంఠభరణ అని, వినాయకుడి చేతి ఆయుధమని ఇంట్లో ప్రత్యక్షమైతే చంపకుండా ఊరుకుంటున్నామా? ఎలుక వినాయకుడి వాహనం కాదా? ఎందుకు రకరకాల పద్ధతుల్ని అవలంబించి వాటిని చంపుతాం? ఇదంతా పాపం కాదా?

వైదిక కాలంలో యజ్ఞయాగాల పేరున జంతుబలులు ఇచ్చింది ఈ మనువాదులే. సర్పయాగం, అశ్వమేధయాగం, గోమేధంతో పాటు నరమేధం, పౌండరీకం పేరున యాగాలు చేసిన చరిత్ర మనకుంది. బ్రాహ్మణులు, క్షత్రియులు ఆవుల్ని, గుర్రాల్ని ఆహారంగా తీసుకున్నట్లు అవి ఘోషిస్తున్నాయి. వీటన్నింటిపైన చర్చలు జరిగాయి. ఒక్క ఆవు మాత్రమే సాధు జంతువు కాబట్టి, ఆవులు పవిత్రంగా రూపొందించి, సువర్ణదానం, భూదానం, వస్త్రదానం తోపాటు గోదానాన్ని బ్రాహ్మణులు ప్రోత్సహించారు. ఈ విధంగా స్వీకరించిన గోవుల్ని పెంచింది, పోషించింది వీరివద్ద పాలేర్లుగా ఉన్న మాల, మాదిగలు, వెనుకబడిన తరగతుల వారే! ఆవు పేడను, మూత్రాన్ని పవిత్రంగా చూసే వీరు, ఎన్నడూ పశువుల పాకల్లో వాటిని శుభ్రం చేయలేదు. రొచ్చు (పేడ, మూత్రం కలిపి ఏర్పడిన ద్రవం) ను ఎత్తలేదు. కాని సొమ్ము చేసుకోవడానికి ఆవు మూత్రానికి, పేడకు రోగాలను రూపుమాపే గుణముందని (పరిశోధనలు వీటిని ఇంకా గుర్తించలేదు), అవి పవిత్రమైనవనే తప్పుడు ప్రచారాన్ని చేస్తున్నారు. నిజంగా వీటికంత ప్రాధాన్యతనే ఉంటే, కార్పొరేట్ హాస్పిటల్స్‌ను ఎందుకు కడుతున్నారు? ఎందుకు దోపిడీ చేస్తున్నారు? కుటుంబానికో ఆవును కొనిస్తే (నిజానికి ఇది వ్యవసాయ బంధువు) రోగాలు మాయమవుతాయిగా.

వీటన్నింటినీ మాట్లాడకుండా గొడ్డు మాంసం తింటే గోవధకు ఊతమిస్తుందని, గోవులన్నీ తెరమరుగైపోతాయని, హిందూ ధర్మం మంటగలుస్తుందని గగ్గోలు పెడితే గోవులు రక్షించబడవు. వాటి పెంపకంపై, పోషణపై దృష్టి సారించాలి. సంప్రదాయ వ్యవసాయ పద్ధతులకు ఊతం ఇవ్వాలి. సామాజిక వ్యవసాయ పద్ధతులకు స్వస్తి చెప్పాలి. ఇలాంటి చర్యలు పశుపోషణకు దోహదపడతాయని గుర్తించాలి. అంతేగాని ఓ పక్క గోవుల ఉనికి భంగం కలిగించే చర్యలు చేపడుతూ, మరోపక్క గోవధను నిషేధించాలని, గొడ్డు మాంసం తినవద్దని ఆంక్షలు విధించడం నేలవిడిచి సాము చేయడమే కాకుండా అత్యధికంగా గల జనాభా హక్కుల్ని కాలరాయడమే అవుతుంది. ధరలు సామాన్యునికి ఎప్పుడూ అందుబాటులో ఉండని వ్యవస్థలో ఆ వర్గాలకు అందుబాటులో ఉండే ఆహారాన్ని, అలవాట్లని నిషేధించడం, అడ్డుకోవడం ఆధిపత్య ధోరణే అవుతుంది.

ఇప్పటికే సగటు భారతీయ స్త్రీ రక్తహీనతతో బాధపడుతున్నది. పుట్టిన పిల్లలు రక్తహీనతతో జన్మిస్తూ మరణిస్తున్నారు. ఇందులో దళిత, వెనుకబడిన, గిరిజన స్త్రీలే అధికభాగంలో ఉంటున్నారు. ఇలాంటి వారికి చౌకగా లభించడమే కాకుండా 70 శాతం ఒకటవ రకపు మాంసకృత్తులు లభించే గొడ్డు మాంసం ఆరోగ్యకరమని జాతీయ పోషకాహార సంస్థ (ఎన్ఐఎన్) నిపుణురాలు వీణా శత్రుఘ్న ఈ సందర్భంగా అన్న మాటల్ని గుర్తుంచుకోవాలి. ఉన్నత వర్గాలు తింటున్న మేక, గొర్రె, కోడి మాంసం, చేపలు ఏనాడు సామాన్యునికి అందుబాటులో ఉండవు. చౌకగా అందుబాటయ్యే గొడ్డు మాంసం తినవద్దనే ఆంక్షలు మార్కెట్ మాయజాలంలోని ఒక భాగమే. దోపిడీ వర్గాల వర్గ స్వభావమే. గొడ్డు మాంసాన్ని నిషేధిస్తేనే ఉన్నత వర్గాల ఫామ్స్‌లలో పెంచబడుతున్న మేకల, గొర్రె, కోళ్ల పెంపకం దినదినాభివృద్ధి జరుగుతుంది. నిజానికి మేక, గొర్రెలు కూడా ఆవులాగా సాదు జంతువులే. ఆవుకుండే లాభాలన్నీ వీటికీ ఉన్నాయి. అలాంటపుడు వీటిని కూడా ఆవు జాబితాలో చేర్చి తినవద్దని కోరాలి.

క్యాంపస్ మెస్‌లలో గొడ్డు మాంసం వడ్డించడం కొత్తేమీ కాదు. కేరళ, తమిళనాడు రాష్ట్రాల క్యాంపస్‌లలో వీటికి స్థానం ఉంది. దీనికోసం ఇంత రాద్ధాంతం చేయాల్సిన అవసరం ఏమీ లేదు. ఎవరి ఇష్టం వారిది. శాకాహారులు క్యాంపస్ మెస్‌లలో కేవలం శాకాహారమే ఉండాలనే ఉద్యమాన్ని లేవదీస్తే ఈ వర్గాలు ఏమంటాయి? వీరిని ఈ ఉన్నత మాంసాహార (మేక, కోడి, చేప) తినే వర్గాలు చీల్చి చెండాడవా? ఏది ఏమైనా మాంసం తినగానే బ్రాహ్మణులు బ్రాహ్మణులు కాకుండా పోరు! అలాగే పెద్ద కూర మానినంత మాత్రాన దళితులు, వెనుకబడిన వర్గాలు బ్రాహ్మణులుగా మారలేరన్న అంబేద్కర్ సూత్రీకరణ ఇక్కడ గమనంలోకి తీసుకోవాలి. డిడి కౌశాంబి అన్నట్లు మాంసాహార జంతువులన్నీ సజీవ ఆహారపు నిలువలు. అవసరానికి అనుగుణంగా వినియోగించడానికి ఇవి ఎల్లప్పుడూ అందుబాటులో ఉంటాయి. నిల్వచేయడానికి ఎలాంటి గోదాములు అవసరం లేని ఈ ప్రకృతి సంపద సామాన్యుడి వరప్రసాదం.

ప్రజాస్వామ్యబద్ధంగా సంఘ్ పరివార్ ఈ విషయాన్ని గుర్తిస్తే వారు కోరుకుంటున్న అఖండ్ భారత్ ఆరోగ్యకరంగా, ప్రజాస్వామ్య బద్ధంగా రూపుదిద్దుకుంటుంది. లేదంటే రాజకీయ తిరుగుబాటుతో పాటుగా, సాంస్కృతిక తిరుగుబాటుకు బీజాలు పడతాయి.

*(రచయిత ఉపాధ్యాయ ఉద్యమ నాయకులు)* వీ

# పన్నుల ఎగవేత, నల్లధనం సమస్య

*అక్రమంగా ఆస్తులు సంపాదించి, ఆస్తులను దేశ సరిహద్దులు దాటించడంతో ఆర్థిక వ్యవస్థ ఎలా కుదేలవుతుందో వివరిస్తున్నారు* **డి. నరసింహారెడ్డి**

పన్నుల ఎగవేత గురించి, నల్లధనం గురించి, స్విట్జర్లాండ్‌లోని పన్ను రహిత స్థావరాలలో అక్రమ ధనాన్ని నిలువ చేయడం గురించి పార్లమెంట్ లోపలా బయటా చాలా చర్చ జరిగింది. ఇప్పుడు భారత ప్రభుత్వం కూడా నల్లధనం మీద ఒక శ్వేతపత్రాన్ని ప్రకటించింది గానీ, అది నిరాశనే మిగిల్చింది. నల్లధనం పరిమాణం ఎంతో, అది పోగుపడిన పద్ధతులేమిటో, పోగు చేసిన వారెవరో, అది నిలువ ఉన్న స్థలాలేమిటో, అది ఏ విచారణా లేకుండా మళ్లీ చలామణీలోకి ఎలా వస్తున్నదో, ఈ నల్లధన వ్యాప్తిని అడ్డుకునే మార్గాలేమిటో ఈ పత్రంలో పెద్దగా చర్చించలేదు. చట్టాలు, ఒడంబడికలు అనబడే వాటి సాయంతో పన్ను ఎగవేతదారులు ఎంత బహిరంగ మార్గాలలో ఈ నల్లధనాన్ని నిలువ చేస్తున్నారో ప్రజలకు అవగాహన చేయించేందుకు కూడా ఈ పత్రం ఉపయోగపడలేదు. ఈ నల్ల ఆర్థిక వ్యవస్థ, లేదా, సమాంతర ఆర్థిక వ్యవస్థ ఎన్నో దశాబ్దాలుగా పెరుగుతూనే పోతోంది. భారత ఆర్థిక వ్యవస్థపై ఆంక్షలు సడలించడంతో ఈ సమస్య మరింత పెద్ద ఎత్తున సాగుతోంది. ఎప్పుడో 1971లో జస్టిస్ వాంఛూ నల్ల ఆర్థిక వ్యవస్థ అనేది దేశ ఆర్థిక వ్యవస్థకు పట్టిన క్యాన్సర్ వంటిదని, దాన్ని సకాలంలో అడ్డుకోకపోతే మొత్తం ఆర్థిక వ్యవస్థనే కుప్పకూల్చివేస్తుందని అన్నారు. నాలుగు దశాబ్దాల తరువాత మార్చ్ 2011లో మరొక సుప్రీంకోర్టు న్యాయమూర్తి 'అసలీ దేశంలో ఏం జరుగుతోంది?' అని ఆవేదనతో ప్రశ్నించారు. హసన్ అలీ వంటి అందరికీ తెలిసిన హవాలా వ్యాపారుల మీద ఎటువంటి చర్య తీసుకోకుండా ఏళ్లకు ఏళ్లు సాగదీస్తూ అధికారులు ప్రతి ఒక్కరినీ 'మోసగిస్తున్నారని' ఆ న్యాయమూర్తి అన్నారు. రాజకీయ అధికార వర్గానికీ, కార్పొరేట్ ప్రయోజనాలకూ, విదేశీ, స్వదేశీ నేరపూరిత వ్యాపార ప్రయోజనాలకూ మధ్య ఒక స్థిరమైన బంధం ఏర్పడి ఉన్నది. ఈ బంధానికి సహకరించే ఒక పన్నుల సలహాదారుల బృందం ఒకటి తయారైంది. ఇదంతా పన్నుల చట్టాలలోని లొసుగులను వాడుకుంటూ, వాటికి తప్పుడు వ్యాఖ్యానాలు చెపుతూ పరాన్నభుక్కులుగా మారి సంపద పోగు చేసుకుంటుంది. ఈ వర్గమే ఈ దేశంలో నల్లధనాన్ని వెలికి తీయడానికీ, భాగస్తుల మీద తగిన చర్యలు తీసుకోవడానికీ అడ్డుకట్ట వేసే ఒక రాతిగోడలా నిలుస్తోంది.

అక్రమ ద్రవ్య ప్రవాహాలు ఎలా మొదలవుతాయో, ఇందులో ఉన్న సంపద పరిమాణం ఎంతో చర్చించడానికి ఈ పత్రం ప్రయత్నిస్తున్నది. ఇప్పటికే వెలువడిన ఎన్నో అధ్యయనాల ఆధారాలను ఇది వాడుకుంటున్నది.

అక్రమ ఆదాయాలు ప్రధానంగా మూడు స్థూల మార్గాలలో పోగుపడతాయి. మొదటిది, జూదం, స్మగ్లింగ్, లంచాలు, అవినీతి, సరుకుల బ్లాక్ మార్కెటింగ్ వగైరా చట్టవ్యతిరేక చర్యల ద్వారా పోగుపడే అక్రమ ఆదాయం. రెండవది, ఇళ్లకో, ఆస్తులకో సంబంధించిన లావాదేవీలలో కాగితంపైన చూపెట్టకుండా చట్టబద్ధమైన ఖాతాలను తప్పించుకొని సాగే వ్యవహారాల ఆదాయం. మూడవది, లాభాలను తక్కువ చేసి చూపడం, ఎగుమతులనో, దిగుమతులనో ధరలను పొరపాటుగా చూపడం వంటి మార్గాల ద్వారా పన్నుల ఎగ్గొట్టి మిగుల్చుకునే ఆదాయం. ఎగుమతి, దిగుమతుల ధరల పొరపాట్లను సాధారణంగా ఎక్కువ ఖరీదు చూపడం (ఓవర్ ఇన్వాయిసింగ్) లేదా తక్కువ ఖరీదు చూపడం (అండర్ ఇన్వాయిసింగ్) అంటారు. ఇలా వచ్చిన ఆదాయాన్ని విదేశాలలో అక్రమ కంపెనీలను సృష్టించి వాటి ఖాతాలలోకి చేర్చి ఆ సంపద మీద పన్ను ఎగ్గొట్టడం జరుగుతుంది. సాధారణంగా ప్రజలకు మొదటి రెండు రకాల నల్లధనం గురించి అవగాహన ఉంది. కానీ, అంతర్జాతీయ వాణిజ్యంలో తప్పుడు ధరల ద్వారా, పన్నుల ఎగవేత ద్వారా, అక్రమ కంపెనీల సృష్టి ద్వారా జరిగే అక్రమ ధన లావాదేవీల గురించి ఎక్కువ మందికి తెలియదు. కానీ, నల్లధనంలో అత్యధిక భాగం ఈ అంతర్జాతీయ లావాదేవీల తప్పుడు ధరల ద్వారానూ, పన్ను రహిత స్థావరాలలోని పోస్ట్‌బాక్స్ కంపెనీల లావాదేవీల ద్వారానూ పోగుపడుతుంది. ఒక అంచనా ప్రకారం దేశంలో నల్ల ఆర్థిక వ్యవస్థ నిజ ఆర్థిక వ్యవస్థలో దాదాపు సగ భాగం ఉండగా, అందులో 80 శాతం ఈ మూడో తరహా అక్రమ లావాదేవీల, పన్ను ఎగవేతల, అంతర్జాతీయ వాణిజ్య ద్రవ్య చలామణీలలోనే వస్తోంది. దీనికి దగ్గరగా ఉండేవే అంతర్జాతీయ హవాలా లావాదేవీలు, మారిషస్ వంటి పన్ను రహిత స్థావరాల నుంచి జరిగే అక్రమ ద్రవ్య వ్యాపారాలు. ఈ పత్రంలో ఇటువంటి రెండు ప్రధాన అక్రమ ద్రవ్య లావాదేవీల గురించి వివరించబోతున్నాం. ఈ రెండు రకాల లావాదేవీలకు పరస్పర సంబంధం ఉంది. ఇవి రెండూ నల్లధనాన్ని ఉత్పత్తి చేస్తాయి. దేశానికి రావలసిన పన్నుల వనరులను కొల్లగొడతాయి. వీటిలో మొదటిది, వాణిజ్య తప్పుడు ధరల లావాదేవీలు. రెండవది, మారిషస్ వంటి పన్ను రహిత స్థావరాల నుంచి సాగే లావాదేవీలు. ఈ రెండో లావాదేవీలలోనే కలిసినవి పార్టిసిపేటరీ నోట్స్ పేరిట సాగే ద్రవ్య చలామణీ వ్యవహారాలు. అలాగే, పన్నులను అధిగమించడం పేరుతో పన్నుల ఎగవేతకు వేరు వేరు చట్టపరమైన వ్యాఖ్యానాలను కూడా చర్చించవలసి ఉంది.

### వాణిజ్య లావాదేవీల తప్పుడు ధరలు

దేవ్‌కర్, కార్ట్‌రైట్ స్మిత్ అనే రచయితలు 2008లో గ్లోబల్ ఫైనాన్షియల్ ఇంటిగ్రిటీ (జిఎఫ్ఐ) సంస్థ కోసం ఇల్లిసిట్ ఫైనాన్షియల్ ఫ్లోస్ ఫ్రం డెవలపింగ్ కంట్రీస్ (అభివృద్ధి చెందుతున్న దేశాల నుంచి అక్రమ ద్రవ్య ప్రవాహాలు) అనే నివేదిక తయారు చేశారు. ఆ నివేదికలో అభివృద్ధి చెందుతున్న దేశాల నుంచి 2002 నుంచి 2006 వరకు మొత్తం మీద 641 బిలియన్ డాలర్ల నుంచి 939 బిలియన్ డాలర్ల

వరకు అక్రమ ద్రవ్య ప్రవాహం సాగిందని అంచనా వేశారు. ఆ నివేదిక ఈ కాలంలో అతి ఎక్కువ అక్రమ ద్రవ్య ప్రవాహం ఉన్న పది దేశాల జాబితాను కూడా ఇచ్చింది. ఆ జాబితాలో భారతదేశం ఐదవ స్థానంలో ఉంది. దాని ప్రకారం సగటున భారతదేశం నుంచి బయటికి 22.7 బిలియన్ డాలర్ల నుంచి 27.3 బిలియన్ డాలర్ల అక్రమ ధనం ప్రవహించింది. ఇది రూపాయల్లో చెప్పాలంటే, రు.1,02,150 కోట్ల నుంచి రు.1,22,850 కోట్ల వరకు ఉంటుంది. ఈ సమయంలోనే భారత దేశం నుంచి బయటికి తరలి వెళ్లిన మొత్తం ద్రవ్య పరిమాణం 113.6 బిలియన్ డాలర్లు (రు.5,11,850 కోట్లు) ఉంటుందని అంచనా వేశారు. యురోపియన్ యూనియన్‌తోనూ, అమెరికాతోనూ 2005-07 మధ్య జరిగిన వాణిజ్యంలో ఈ తప్పుడు ధరల వల్ల భారతదేశం 3,603 మిలియన్ పౌండ్ల (రు.25,400 కోట్లు) పన్ను ఆదాయాన్ని పోగొట్టుకుని ఈ విషయంలో మొత్తం జి-20 దేశాలలో మూడోస్థానంలో నిలిచింది.

పై పట్టిక ఏయే సరుకులలో అంతర్జాతీయ వాణిజ్యంలో తప్పుడు ధరలు అమలవుతున్నాయో వివరిస్తుంది. యురోపియన్ యూనియన్, అమెరికాలతో అభివృద్ధి చెందిన దేశాలు జరిపే వాణిజ్యంలో మొత్తంగా చూపుతున్న తప్పుడు ధరలలో 60 శాతం కన్న ఎక్కువ కేవలం రెండు తరహాల సరుకులలోనే ఉన్నాయి. అవి, 1) అణుశక్తి రియాక్టర్లు, బాయిలర్లు, భారీ యంత్ర సామగ్రి, యంత్ర సాధనాలు, వగైరా. 2) విద్యుత్ యంత్ర సామగ్రి, పరికరాలు. దేశంలోని కంపెనీలు, బహుళజాతి కార్పొరేట్ కంపెనీలు భారత ప్రభుత్వాన్ని అణు విద్యుచ్ఛక్తికి అనుకూలంగా సముద్ర తీరాలలోని థర్మల్ విద్యుచ్ఛక్తికి అనుకూలంగా మెడలు వంచి ఒప్పించాడనికి కారణం ఇదే. మొత్తంగా కార్పొరేట్ ప్రయోజనాలకు విద్యుచ్ఛక్తి అంటే ఎంత ప్రేమో ఈ పట్టిక వివరిస్తుంది.

### రీ ఇన్వాయిసింగ్ (బిల్లులు మళ్లీ రాయడం)

జిఎఫ్ఐ సంస్థ 2010 ఫిబ్రవరిలో ఇంప్లైడ్ టాక్స్ రెవెన్యూ లాస్ ఫ్రం ట్రేడ్ మిస్ ప్రైసింగ్ (వ్యాపార తప్పుడు ధరలలో ఇమిడి ఉన్న పన్ను ఆదాయ నష్టాలు) అని ఒక నివేదికలను విడుదల చేసింది. లావాదేవీల బిల్లులు మళ్లీ రాసిన ఫలితంగా ధరలు తారుమారు అయినప్పుడు పన్నుల ఆదాయం ఎంతగా నష్టమవుతుందో ఈ నివేదిక విశ్లేషించింది. ఈ రీ ఇన్వాయిసింగ్ అనే మాటకు అర్థమేమంటే, ఒక దేశం నుంచి మరో దేశానికి ఎగుమతులు ఒక ఇన్వాయిస్ (బిల్లు) కింద జరుగుతాయి. ఆ ఇన్వాయిస్‌ను ఆ తరువాత ఒక పన్ను రహిత స్థావరపు చట్టపరిధిలోకి బదిలీ చేస్తారు. అక్కడ ఆ ఇన్వాయిస్ మీది ధర మారుస్తారు. ఈ మార్చిన ఇన్వాయిస్‌ను సరుకు దిగుమతి చేసుకునే దేశానికి పంపుతారు. సరుకు దిగుమతి చేసుకున్న దేశం ఈ కొత్త ఇన్వాయిస్ ప్రకారం డబ్బు చెల్లించవలసి ఉంటుంది.

ఇటువంటి తప్పుడు ధరల, మార్చిన ధరల వ్యవహారం జరుగుతున్న సరుకులలో అతి ముఖ్యమైనవి అణు విద్యుచ్ఛక్తిని ఉత్పత్తి చేసే యంత్ర పరికరాలు, అణు విద్యుచ్ఛక్తికి సంబంధించిన ఇతర ఎగుమతులు, థర్మల్ విద్యుదుత్పత్తి యంత్ర సామగ్రి. భారతదేశంలో అమలవుతున్న విద్యుదుత్పత్తి విధానాలకు ఈ తప్పుడు ధరల యంత్ర సామగ్రికి దగ్గరి సంబంధం ఉంది. ఈ సందర్భంలోనే ప్రత్యేకంగా గుర్తించవలసినది అదనపు విద్యుదుత్పత్తి సామర్థ్యాన్ని మొత్తంగా ప్రైవేట్ రంగానికి అప్పగించడం. అందులోనూ, తీవ్రమైన రాజకీయ భేదాభిప్రాయాన్ని కూడా పక్కనపెట్టి అణు విద్యుచ్ఛక్తి ఉత్పాదన కోసం సాగుతున్న వెంపర్లాట. ఈ ప్రైవేట్ రంగ విద్యుదుత్పత్తి కంపెనీలు సాధారణంగా అనుసరించే మదుపు విధానాలు ఎటువంటివంటే, వాటి మొత్తం మదుపులో అత్యధిక భాగం సింగపూర్, మారిషస్ వంటి పన్ను రహిత స్థావరాల నుంచే వస్తుంది. ఇటువంటి మదుపు పద్ధతి వల్ల ఈ కంపెనీలు ఉత్పత్తి ప్రారంభించి లాభాలు చేసుకున్నప్పటికీ, ఆ లాభాలు ఎక్కువ భాగం మదుపుదార్లకు చెందుతాయి గనుక ఆ లాభాల మీద దేశానికి రావల్సిన పన్ను రాదు. మొదటే విద్యుదుత్పత్తి యంత్ర సామగ్రిని విదేశాల నుంచి కొంటున్నప్పుడు పెద్ద ఎత్తున దేశం నుంచి పెట్టుబడి తరలి పోతుంది. ఆ యంత్ర సామగ్రి ధరలు హెచ్చుగా ఉండడం వల్ల అక్కడా పన్ను ఆదాయం నష్టం జరుగుతుంది.

రీ ఇన్వాయిసింగ్‌లో తప్పుడు ధరల వల్ల పన్ను ఆదాయం నష్టపోతున్న దేశాల జాబితాలో భారతదేశం మూడవ స్థానంలో ఉంది. ఇంతకు ముందే చెప్పినట్టు 2002-06 మధ్య భారతదేశం నుంచి సాలీనా 22.72 బిలియన్ డాలర్లు (రు.1,02,150 కోట్లు) అక్రమ ద్రవ్య ప్రవాహం సాగింది. అందులో వార్షిక పన్ను ఆదాయ నష్టం, ప్రస్తుత కార్పొరేట్ పన్ను 34 శాతం బట్టి చూసినా, 7.7 బిలియన్ డాలర్లు (రు.34,650 కోట్లు) అవుతుంది. దేశ పన్ను ఆదాయ సగటును బట్టి చూస్తే మొత్తం పన్ను ఆదాయ నష్టం మొత్తం ఆదాయంలో 8.8 శాతం అవుతుంది.

భారతదేశం వంటి చాలా అభివృద్ధి చెందుతున్న దేశాలు తమ జాతీయ ఆదాయంలో అంతర్జాతీయ వాణిజ్య వాటాను నానాటికీ పెంచుకుంటున్నాయి. అలా పెంచుకోవడమే అవసరమని అంతర్జాతీయ ద్రవ్య సంస్థలు చెపుతున్నాయి. ఈ వాణిజ్య పరిమాణం పెరిగిన కొద్దీ ఆ వాణిజ్య లావాదేవీలలోని ధరల తారుమారు వల్ల నానాటికీ దేశం నుంచి తరలిపోయే సంపద పెరిగిపోతుంది. అంటే, దేశం విదేశీ వాణిజ్యానికి ఎంతగా తలుపులు తెరిస్తే అంతగా దేశం నుంచి పెట్టుబడీ తరలిపోతుంది, పన్నుల ఆదాయంలో నష్టమూ పెరిగిపోతుంది. ఇదంతా ధరల తారుమారు వల్ల మాత్రమే.

దేశం స్వాతంత్ర్యం సంపాదించిన నాటి నుంచి అక్రమ ద్రవ్య ప్రవాహాలు ఎంత పరిమాణంలో జరిగి ఉండవచ్చునని క్రమబద్ధమైన అంచనాలు ఇప్పుడే మొదటిసారిగా వెలువడుతున్నాయి. దేవ్‌కర్ 2010లో జిఎఫ్ఐ సంస్థ కోసమే ది డ్రైవర్స్ అండ్ డైనమిక్స్ ఆఫ్ ఇల్లిసిట్ ఫైనాన్షియల్ ఫ్లోస్ ఫ్రం ఇండియా 1948-2008 అనే అధ్యయనం చేశారు. ఇప్పటివరకు ఈ విషయంలో వచ్చిన అత్యంత సమగ్రమైన నివేదిక ఇదే. దాని అంచనాల ప్రకారం ఈ అక్రమ ప్రవాహాల వల్ల భారతదేశం ఈ అరవై సంవత్సరాలలో 213 బిలియన్ డాలర్లను నష్టపోయింది. ప్రస్తుత డాలర్ రేటు బట్టి రూపాయల్లో చెప్పాలంటే ఇది కళ్లు తిరిగిపోయే 23,00,00,00,00,000 - ఇరవై మూడు లక్షల కోట్ల రూపాయలు. ఇందులో అత్యధిక భాగం అంటే, 69 శాతం లేదా 147 బిలియన్ డాలర్లు ప్రపంచీకరణ మొదలైన తర్వాత, 1991 నుంచి 2008 మధ్య జరిగింది. అంతకు ముందు నలభై రెండు సంవత్సరాలలో 31 శాతం జరగగా, ఈ పదిహేడు సంవత్సరాలలో 69 శాతం. అంటే, సరళీకరణ అక్రమ ద్రవ్య ప్రవాహాలు అవకాశం ఇచ్చిందన్నమాట. నూతన ఆర్థిక విధానాలు అక్రమ ప్రవాహాలను అడ్డుకోలేదు సరికదా, వెసులుబాటు కల్పించాయన్నమాట. ప్రపంచీకరణ ప్రారంభమైన తరువాత భారత వాణిజ్యానికి తలుపులు బార్లా తెరవడమనే పేరుతో వ్యాపారం పెరిగింది. అంతుకుముందు జాతీయాదాయంలో విదేశీ వాణిజ్యానికి 11 శాతం ఉన్న వాటా, 1991 తర్వాత 22 శాతానికి పెరిగింది. ఇది ధరల తారుమారు మరింత అవకాశం కల్పించింది.

అక్రమ ద్రవ్య ప్రవాహాలు పెంపొందడానికి ప్రధానమైన వనరులు

## అణు, థర్మల్ విద్యుత్తు మీద ఇంత ప్రేమ ఎందుకు?

భారతదేశానికీ, ఇతర దేశాలకూ ద్వైపాక్షిక వాణిజ్యంలోనూ, ఇతర ఒప్పందాలలోనూ ఇటీవల జరుగుతున్న వ్యవహారాలను చూసినప్పుడు వేరువేరు సరుకుల ధరలను తప్పుడుగా చూపడం (పట్టిక) ఎందుకో స్పష్టమవుతోంది. పట్టిక చూస్తే అన్నిటికన్నా ఎక్కువగా ధరల తారుమారు జరుగుతున్న సరుకులు అణు విద్యుత్ ఉత్పాదన సామగ్రి, అణు విద్యుత్తుకు సంబంధించిన ఇతర పరికరాలు, థర్మల విద్యుదుత్పాదన యంత్రాలు అని స్పష్టమవుతుంది. భారత ప్రభుత్వం ప్రస్తుతం అనుసరిస్తున్న విద్యుదుత్పత్తి విధానాలకూ, ఈ ధరల తారుమారుకూ సన్నిహిత సంబంధం ఉంది. భారత ప్రభుత్వ విధానాలలో అదనపు విద్యుదుత్పత్తి సామర్థ్యం కోసం ప్రైవేట్ రంగం మీద ఆధారపడడం నానాటికీ పెరిగిపోతోంది. మరొకవంక ఎంత తీవ్రమైన ప్రజా వ్యతిరేకత ఉన్నప్పటికీ అణు విద్యుదుత్పాదనకు అనుకూలంగా భారత ప్రభుత్వ విధానాలు సాగుతున్నాయి. ప్రైవేట్ రంగ విద్యుదుత్పాదక కంపెనీలు సాధారణంగా విదేశీ పెట్టుబడులతో, లేదా పెట్టుబడిలో హెచ్చు భాగం విదేశీ వాటాతో తయారవుతాయి. విదేశాలు అన్నప్పుడు కూడా చాలా ఎక్కువగా సింగపూర్, మారిషస్ వంటి పన్నురహిత స్థావరాల నుంచే ఈ పెట్టుబడులు వస్తాయి. ఆ విదేశీ పెట్టుబడులు అన్నీ కూడా ఇతర దేశాల నుంచి విద్యుదుత్పాదక యంత్ర పరికరాలు కొనే రూపంలోనే వస్తాయి. మొదటి పద్ధతిలో ఆ కంపెనీలు సంపాదించే లాభాల మీద పన్నుల ఆదాయం నష్టపోవడం జరుగుతుంది. అలాగే, రెండవ పద్ధతిలో విదేశాల నుంచి విదేశీ మదుపుతో యంత్ర సామగ్రి కొనడం వల్ల పెట్టుబడి తరలిపోతుంది. తప్పుడు ధరల వల్ల ఆ పెట్టుబడి మీద పన్ను ఆదాయం కూడా నష్టపోవలసి వస్తుంది. ప్రస్తుత యుపిఎ ప్రభుత్వం అణు విద్యుత్తు విషయంలో విపరీతమైన ఉత్సాహం కనబరుస్తోంది. మొదట భారత, అమెరికా పౌర అణు ఒప్పందం రూపంలోనూ, ఆ తర్వాత న్యూక్లియర్ లయబిలిటీ బిల్ రూపంలోనూ భారత ప్రభుత్వం ఈ ఉత్సాహాన్ని చూపింది.

| సరుకు | (మిలియన్ పౌండ్లలో) | | | |
|---|---|---|---|---|
| | **2005** | **2006** | **2007** | **2005–07** |
| అన్ని సరుకులు | 140,271<br>(100) | 141,622<br>(100) | 299,539<br>(100) | 581,431<br>(100) |
| అణు రియాక్టర్లు, బాయిలర్లు, యంత్ర సామగ్రి, పరికరాలు, కంప్యూటర్లు | 30,750<br>(21.89) | 38,100<br>(26.90) | 112,494<br>(37.56) | 181,298<br>(31.18) |
| విద్యుత్ యంత్రాలు, పరికరాలు | 24,801<br>(17.68) | 32,091<br>(22.66) | 112,172<br>(37.45) | 169,064<br>(29.08) |
| సేంద్రీయ రసాయనాలు | 19,729<br>(14.06) | 3,536<br>(2.50) | 4,431<br>(1.48) | 27,696<br>(4.76) |
| ఖనిజ ఇందనాలు, చమురు, మైనం | 6,822<br>(4.86) | 6.231<br>(4.46) | 9,998<br>(3.34) | 23,141<br>(3.98) |
| రైల్లు మినహా ఇతర రవాణా వాహనాలు | 6,397<br>(4.56) | 7,964<br>(5.62) | 6,595<br>(2.20) | 20,957<br>(3.60) |
| దృష్టి సాధనాలు, ఫొటోగ్రఫిక్ సాధనాలు వైద్య సాధనాలు వగైరా | 5,363<br>(3.82) | 8,398<br>(5.93) | 4,381<br>(1.46) | 18,141<br>(3.12) |
| ఇతరాలు | 46,454<br>(33.11) | 45,212<br>(31.92) | 49,469<br>(16.52) | 141,134<br>(24.27) |

దేశంలోనే ఉండే విస్తృతమైన నల్లధనం, లేదా అజ్ఞాత ఆర్థిక వ్యవస్థ. అప్పటికే సాగిన ఇతర అధ్యయనాల ఆధారంగా దేవ్‌కర్ తేల్చినదేమంటే జాతీయ ఆదాయంలో దాదాపు సగం అజ్ఞాత ఆర్థిక వ్యవస్థలోనే ఉన్నదని. భారతదేశపు అజ్ఞాత ఆర్థిక వ్యవస్థలో 72 శాతం సంపద విదేశాలలో అక్రమ ఆస్తుల రూపంలోనే ఉందని కూడా ఆయన అంచనా వేశారు. అంటే, 28 శాతం అక్రమ ఆస్తులు మాత్రమే దేశంలో ఉన్నాయి. దీన్నే మరో మాటల్లో చెప్పాలంటే, దేశంలో ప్రభుత్వం కళ్లుగప్పి ఆస్తులు సంపాదించి, వాటిని సరిహద్దుల అవతలికి పంపించే ప్రయత్నాలు విస్తృతంగా జరుగుతున్నాయి.

ఆ నివేదిక ఈ అక్రమ ద్రవ్య ప్రవాహాల పద్ధతులు మారుతున్నాయని కూడా విశ్లేషించింది. బ్యాంక్ ఫర్ ఇంటర్నేషనల్ సెటిల్‌మెంట్స్ దగ్గర సరిహద్దులకు అతీతమైన ఖాతాల గురించి ఉన్న గణాంకాలను విశ్లేషించి భారత దేశపు ప్రైవేట్ రంగ ఆదాయాల నుంచి ఈ అక్రమ ప్రవాహాలు ఎలా సాగుతున్నాయో చూపింది. అభివృద్ధి చెందిన దేశాలలోని బ్యాంకులకు, విదేశీ ద్రవ్య సంస్థల (ఒఎఫ్‌సి) కు 1995 నుంచి 2009 వరకు డబ్బు తరలింపు ఎలా జరిగిందో ఈ నివేదిక విశ్లేషించింది. విదేశాలలో సంపద ఉన్న భారతీయులు తమ నిలువలను బ్యాంకుల నుంచి ఒఎఫ్‌సిలకు తరలిస్తున్నారు. బ్యాంకుల మీద ఉండే నిఘా కన్న ఒఎఫ్‌సిల మీద ఉండే నిఘా తక్కువ గనకనే, తమ సంపద ప్రభుత్వాల దృష్టికి రాకూడదనే ఆలోచనతోనే ఈ పని జరుగుతుంది. 1995లో ఒఎఫ్‌సిలలో ఉన్న డిపాజిట్ల వాటా 36.4 శాతం కాగా, అది 2009కి 54.2 శాతానికి పెరిగింది. బ్యాంకులలో డిపాజిట్లు ఆ మేరకు తగ్గాయి. ఇది దేశంలో అజ్ఞాత ఆర్థిక వ్యవస్థకు ఒక చిహ్నం.

*(రచయిత అర్థశాస్త్రవేత్త, సెంట్రల్ యూనివర్సిటీ రిటైర్డ్ ప్రొఫెసర్)* వీ

# ఇథనాల్ పేరుతో మద్యం తయారీ

*పంట భూముల్ని, పర్యావరణాన్ని కాలుష్యమయం చేసి ప్రజలకు బతుకు లేకుండా చేస్తున్న ఇథనాల్ ఫ్యాక్టరీలకు వ్యతిరేకంగా ఉద్యమించాలని అంటున్నారు* **ముప్పాళ్ల భార్గవశ్రీ**

రాష్ట్రంలో మద్యం వ్యాపారం వెయ్యి పువ్వులు పదహారు కాయలుగా వర్ధిల్లుతున్నది. మారుమూల గ్రామాల్లో బడిలేకపోయినా సారాకొట్టు ఉండేలా పాలకులు మద్యం వ్యాపారాన్ని విచ్చల విడిగా పెంచి వేశారు. 2009లో వైఎస్ ప్రభుత్వం మద్యం తయారీపై ఉన్న నియంత్రణలను తొలగించివేసి అంత వరకు రాష్ట్రంలో ఉన్న 32 మద్యం ఉత్పత్తి ఫ్యాక్టరీలకు తోడు 40 ఫ్యాక్టరీలకు ఒక్క సారిగా అనుమతులిచ్చేసారు. 'ప్రజల తాగుడు అవసరానికి తగిన విధంగా మద్యం ఉత్పత్తి జరగనందు వల్లనే కొత్త ఫ్యాక్టరీలకు అనుమతులిచ్చా మంటూ' నిస్సిగ్గుగా తమ చర్యను సమర్థించుకున్నారు. పైకి ప్రజాసంక్షేమ ప్రభుత్వాలని బాకాలూదు కొంటూ ఆచరణలో మద్యంపై ఆదాయం లేకపోతే ప్రభుత్వాలను నడపంటం కష్టం అన్న నిష్టుర సత్యాన్ని చెప్పకనే చెబుతున్నారు. మద్యం మత్తులో ప్రజల్ని ముంచి, చివరికి వారి జీవితాల్నే పణంగాపెట్టి అధికారాలు చెలాయిస్తున్నారు.

ఇప్పుడున్న మద్యం ఫ్యాక్టరీలు చాలవన్నట్లు ఇథనాల్ ఫ్యాక్టరీల పేరుతో ఇబ్బడి ముబ్బడిగా పాలకులు అనుమతులిచ్చేస్తున్నారు. వాహనాల్లో పెట్రోల్ బదులు ఇథనాల్ వాడితే కాలుష్యాన్ని చాలావరకు తగ్గించవచ్చుని, అలానే పెట్రోల్ కంటే ఇథనాల్ ధరలు చాలా తక్కువగా ఉంటాయని, అందుకని ఇథనాల్ ఫ్యాక్టరీలను ప్రోత్సహిస్తున్నామని పాలకులు చెబుతున్నారు. కాని మన రాష్ట్రంలో నడుస్తున్న ఇథనాల్ ఫ్యాక్టరీలు ఇథనాల్‌కు బదులు మద్యాన్నే ఎక్కువగా తయారు చేస్తూ పెద్ద ఎత్తున లాభాలు గడిస్తున్నాయి. ఈ మధ్య కిరణ్‌కుమార్ రెడ్డి ప్రభుత్వం మద్యం ఉత్పత్తులను పెంచే చర్యల్లో భాగంగా ఇథనాల్ ఫ్యాక్టరీ లకు మద్యం తయారీ అనుమతులను పెద్దఎత్తున ఇచ్చేసింది. ఇంతవరకు లోపాయికారీగా జరుగుతున్న వ్యాపారానికి రాజముద్ర వేశారు.

మద్యం తాగి ప్రజలు అనారోగ్యాలపాలై దుర్భర జీవితాలు గడుపుతూ ఉంటే, మద్యం తయారు చేసే ఫ్యాక్టరీలు వెదజల్లే కాలుష్యాల వల్ల కూడా మద్యం తాగని అశేష ప్రజానీకపు జీవితాలు కూడా కాలుష్యపు రక్కసి కోరల్లో నలిగి నాశనం అయిపోతున్నాయి. ఇథనాల్ పేరుతో మద్యాన్ని తయారు చేస్తూ కాలుష్యాన్ని వెదజల్లుతున్న రాష్ట్రంలోని కొన్ని ఫ్యాక్టరీలకు, మరికొన్ని ఇథనాల్ ఫ్యాక్టరీలకు అనుమతులు మంజూరు చేస్తున్నందున ఆయా ప్రాంతాల్లోని ప్రజలు, ఈ కాలుష్య భూతాలు మాకొద్దంటూ చేస్తున్న ఆందోళనలను పరిశీలిద్దాం.

## నంద్యాల ఎస్ పి వై ఆగ్రో కాలుష్యం

కర్నూలు జిల్లా నంద్యాల పట్టణ పరిసరాల్లో ఎస్‌పివై ఆగ్రో పేరుతో 2005లో ఏర్పాటు చేసిన ఆల్కహాలిక్ పరిశ్రమ వల్ల చుట్టుపక్కల అనేక రకాల కష్టనష్టాలు కలుగుతున్నాయి. స్థానిక పార్లమెంటు సభ్యుడు ఎస్పీవై రెడ్డి పేరిట నెలకొల్పిన ఎస్‌పివై ఆగ్రో పరిశ్రమలో ఖరీదైన మద్యం తయారుచేస్తోన్నారు. మొక్కజొన్న, వరి విత్తనాలను ముడిసరుకుగా వాడుతున్నారు. మద్యం తయారయ్యాక వెలువడుతున్న బ్రీవరీ, వైనరీ వృథా జలాల్లో బి.ఒ.డి, సి.ఒ.డి., టి.ఎస్.ఎస్., పి.హెచ్., నైట్రోజన్ తదితరాలు మోతాదుకు మించి ఉంటున్నట్లు కాలుష్య నియంత్రణ మండలి వారే చెబుతున్నారు. మండలి సూచనలను ఖాతరు చేయకుండా యాజమాన్యం పనులు చేసుకుపోతోంది. పరిశ్రమ నుంచి రసాయనాలు వెలువడుతుండడంతో వాయు, జలకాలుష్యం ఏర్పడుతోంది. నేలలు నిస్సారంగా మారడం, వర్షపునీరు ఇంకకపోవడం, భూగర్భజలాలు కలుషితమవడం వంటి దుష్పరిణామాలు కలుగుతాయని పర్యావరణ నిపుణులు పేర్కొంటున్నారు. కర్నూలు, కడప జిల్లాల పరిధిలో ఉన్న కుందూనదీ పరీవాహక ప్రాంతంలోని పొలాలపై పరిశ్రమ నుంచి నేరుగా వ్యర్థాలను వదులుతున్నారు. దీనివల్ల మాగాణి భూములపై తెల్లగా పేరుకుపోతోంది. మట్టిలో నత్రజని ఎక్కువైతే మొక్కలు చనిపోవడం, సరిగ్గా పెరగకపోవడం, పంటల దిగుబడి తగ్గడం వంటి దుష్పరిణామా లుంటాయని పర్యావరణవేత్తలు చెబుతున్నారు. వెంకటేశ్వరపురం, పోలూరు, ఉడుమాల్పురం, మూలసాగరం తదితర గ్రామాలకు చెందిన రైతుల భూములను సైతం పరిశ్రమ వారు కౌలుకు తీసుకొని వ్యర్థాలను వదులుతున్నారు. ఒప్పంద పత్రాల్లేకుండానే రైతుల వద్ద నోటి మాటగా భూములు తీసుకున్నారు. తన భూములు ఎలాంటి ఒప్పందం లేకుండానే ఇచ్చానని నంద్యాల మండలాధ్యక్షుడు తిరుమలేష్ తెలిపారు. నంద్యాల సమీపంలోని ఎస్ఆర్‌బిసి పంట కాలువలోకి పైపులు వేసి పరిశ్రమ వ్యర్థాలను వదిలారు. కాలువలకు నీరు వస్తే ఈ వ్యర్థాలు పంటపొలాల్లోకి చేరుతాయని రైతులు ఆవేదన చెందుతున్నారు.

నదీ తీరంలోని అనేక గ్రామాలకు తాగడానికి కుందూజలాలే శరణ్యం. అసలే ఫ్లోరైడ్ సమస్యతో అల్లాడుతున్న గ్రామాలకు ఇప్పుడు రసాయనిక వ్యర్థాలు భయం ఏర్పడింది. తాగునీరు లేక వారు అవస్థలు పడుతున్నారు. పరిశ్రమ దగ్గర్లో ఉన్న ఉడుమాల్పురం గ్రామానికి కొంతవరకు ఎస్‌పివై రెడ్డి తాగునీరు సరఫరా చేస్తున్నా, మిగతా 14 గ్రామాలకు మురికి నీరే దిక్కు.

కుందూలో రసాయనిక వ్యర్థాల వల్ల భరించలేని దుర్వాసన వ్యాపిస్తోంది. గతంలో ఇదే సమస్య జాతీయ రహదారిపై వెళ్లే ప్రతి ఒక్కరికీ ఎదురయ్యేది. ప్రజల ఆందోళన నేపథ్యంలో ఆ దుర్గంధాన్ని

నందికొట్కూరు రహదారి వైపు మళ్లించారు. దీంతో ఆ దారిలో వెళ్లే వారిని సమస్య పట్టిపీడిస్తోంది. ఎస్ఆర్‌బిసి కాలనీ, వెంకటేశ్వరపురం, పోలూరు తదితర గ్రామాలవారు ముక్కు మూసుకుని ప్రయాణించాల్సి వస్తోంది.

2005లో ఉడుమాల్పూరం గ్రామంలో పరిశ్రమ గురించి బహిరంగంగా ప్రజాభిప్రాయాన్ని సేకరించారు. దీనికి అప్పటి జిల్లా కలెక్టరు వికాస్‌రాజు, జాయింట్ కలెక్టరు రాంశంకర్‌నాయక్, ఎంపి ఎస్‌పివై రెడ్డి, ఎమ్మెల్యే శిల్పా మోహన్‌రెడ్డి తదితరులు హాజరయ్యారు. ఈ సందర్భంగా ప్రజలు పరిశ్రమ ఏర్పాటుపై అభ్యంతరం వ్యక్తం చేశారు. మంచినీటి సమస్యతో అల్లాడుతున్న తమకు పరిశ్రమ వస్తే మురికినీరే దిక్కవుతుందని ఆందోళన వ్యక్తంచేశారు. పర్యావరణ ఇబ్బందులు తలెత్తకుండా మొక్కలు నాటి మంచినీటి సరఫరా చేస్తానని అప్పట్లో ఎస్‌పివై రెడ్డి హామీఇచ్చారు. ఈ హామీని ఈనాటికీ పూర్తి స్థాయిలో నెరవేర్చలేదు.

కుందూ నదీ జలాల్లో కలుషిత నీరు వదులుతున్నది నిజమేనని ఎస్‌పివై రెడ్డి ఒప్పుకుంటూనే, పది క్యూసెక్కుల నీరు ప్రవహిస్తున్న కుందూ నదిలో 2 క్యూసెక్కులు రసాయనిక వ్యర్థాలు వదిలితే పెద్ద ప్రమాదం ఉండదంటూ తన చర్యను సమర్థించుకొన్నారు. కాలుష్య నియంత్రణ చర్యలు చేపడతానని చెప్పి ఆచరణలో పూర్తి స్థాయిలో చేయకపోవడంతో ఆ ప్రాంతల ప్రజలు భారీ ఎత్తున ఫ్యాక్టరీ వద్ద ఆందోళన చేశారు. కొద్ది రోజుల్లో సమస్యను పరిష్కరిస్తామని చెప్పిన ఎస్‌పివై ఈ నాటికీ పూర్తి స్థాయిలో కాలుష్య నియంత్రణ చర్యలు చేపట్టకపోవడంతో ఆ ప్రాంత ప్రజలు బాధలు పడుతూనే ఉన్నారు.

## గండేపల్లి ఫ్యాక్టరీ చేదు అనుభవం

కృష్ణాజిల్లా కంచికచర్ల మండలం గండేపల్లి దగ్గర హైదరాబాద్ జాతీయ రహదారికి 2 కి.మీ. దూరంలో ప్రధానంగా ఇథనాల్, ఎక్స్‌ట్రా న్యూట్రల్ ఆల్కహాల్ (లిక్కర్)లను తయారుచేసే సెంటినీ బయో ప్రొడక్ట్స్ ఫ్యాక్టరీని 2008 జూన్ 24వ తేదీన ముఖ్యమంత్రి వైఎస్ అట్టహాసంగా ప్రారంభించారు. రు.130 కోట్లతో 120 ఎకరాల స్థలంలో మొక్కజొన్న ఆధారిత ఇథనాల్ బయో ప్రొడక్ట్ ప్లాంట్ వలన ఈ ప్రాంత ప్రజల సామాజిక స్థితిగతులు అనూహ్యంగా మారిపోతాయని ఫ్యాక్టరీ యాజమాన్యం ప్రకటించింది. ఈ ప్లాంట్‌లో రోజుకు 125 కిలో లీటర్ల టోటల్‌స్పిరిట్, ఎక్స్‌ట్రా న్యూట్రల్ ఆల్కహాల్ (ఇఎన్ఎ), ఇథనాల్, 4 మెగవాట్ల విద్యుత్ తయారవుతుందని ప్రకటించారు. వీటన్నింటికంటే ఈ ప్లాంట్ వలన పర్యావరణ సమస్యలేవీ తలెత్తకుండా 'శూన్య విసర్జన విధానం' (జీరో డిశ్చార్జ్ వ్యవస్థ)ను, ఇతర దేశాల్లో ఉన్న ప్లాంట్‌లను అధ్యయనంచేసి అత్యున్నత సాంకేతిక పరిజ్ఞానంతో ఏర్పాటు చేస్తున్నట్లు యాజమాన్యం ఎంతో గర్వంగా ప్రకటించింది. అయితే ప్లాంట్‌ను ప్రారంభించి పూర్తిగా ఐదు నెలలు కూడా నిండక ముందే గండేపల్లి చుట్టుప్రక్కల గ్రామాల ప్రజలు జీవితాలతో చెలగాటమాడే రాక్షసి అవతారమెత్తింది. ఈ కలుషిత జలాలను తాగి ఈ గ్రామాల ప్రజలు వాంతులు, విరోచనాలు, కామెర్లు లాంటి ప్రాంణాంతక వ్యాధుల పాలవుతున్నారు, అంతేకాక పుట్టబోయే శిశువులను గర్భంలోనే చంపివేస్తున్న భయంకర మానసిక పరిస్థితుల మధ్య గర్భవతులు జీవిస్తున్నారు. ఇప్పటికే కొందరికి గర్భస్రావాలు అయ్యాయి. తలపై సమ్మెట పోటులా పడుతున్న ఫ్యాక్టరీ నుండి వస్తున్న శబ్దాలతో, పశుదాణాగా ఉపయోగపడే (డిడిజిఎస్) మొక్కజొన్న పిప్పిని పొడిగా చేయకుండా పచ్చిమీదనే కోళ్ల ఫారాలకు లారీల మీద తరలిస్తుంటే ఆ లారీలు వెదజల్లే దుర్గంధంతో ఈ గ్రామాల ప్రజలు, ముఖ్యంగా గండేపల్లి గ్రామ ప్రజలు సాయంత్రం ఆరు దాటితే వాసన భరించలేక ఇళ్లుదాటి బయటకురాని కర్ఫ్యూ జీవితాన్ని అనుభవిస్తున్నారు. ఈ కలుషిత జలాలు వెళ్లి మునేరు వాగులో కలవడం వలన చేపలు గుట్టలు గుట్టలుగా చనిపోతున్నాయి. దీని వలన ఇక్కడ జీవిస్తున్న మత్స్యకారుల పరిస్థితి అగమ్యగోచరంగా తయారై బొక్క యాకోబు అనే పేద వ్యవసాయ కూలీ ఈ కాలుష్య రక్కసికి బలైపోయాడు. అలానే మునేరు నుండి కీసర వద్ద కంచికచర్లకు మంచినీళ్ల పైపులు వెళ్లడం వలన కంచికచర్ల వాసులు అనేక జబ్బుల వాత పడుతున్నారు. ఈ ఫ్యాక్టరీకి రోజుకు వందకుపైగా లారీలు, జీపులు, తదితర వాహనాలు తిరుగుతూ గ్రామాల్లో ప్రజల్ని నిద్ర పోనీయకుండా చేయడమే కాక రోడ్లను ధ్వంసం చేస్తున్నాయి.

ఈ భయానక, విపత్కర పరిస్థితులను గండేపల్లి చుట్టు పక్కల గ్రామాల ప్రజలు అనుభవించడానికి ప్రధాన కారణం ఈ లిక్కర్ ఫ్యాక్టరీ కాలుష్యాన్ని నివారంచే ఎటువంటి నియమ నిబంధనలను పాటించక పోవడమే. కాలుష్య నియంత్రణ మండలి ఈ ఫ్యాక్టరీ గురించి పేర్కొన్న ప్రాజెక్టు, పర్యావరణ విషయాల సంక్షిప్త నివేదికలోని అన్ని అంశాలను తుంగలో తొక్కి ఫ్యాక్టరీ 'అభివృద్ధి' కోసం ప్రజల జీవితాలతో చెలగాట మాడుతూనే ఉంది.

ప్రజలు ఎన్నిసార్లు కాలుష్య నియంత్రణ చర్యలు చేపట్టాలని కోరినా ఫ్యాక్టరీ యాజమాన్యం పెడచెవిన పెట్టడంలో రైతు కూలీ సంఘం, ఒ పి డి ఆర్ లాంటి ప్రజా సంఘాల అండతో మిలిటెంట్ ఆందోళన సాగించి ఫ్యాక్టరీని మూసివేయించారు. కృష్ణాజిల్లా జాయింట్ కలెక్టర్ సమక్షంలో చర్చలు జరిగి, కాలుష్య నివారణ చర్యలు పూర్తి స్థాయిలో చేపడ్తామని హామీ ఇచ్చిన తర్వాత 40 రోజులకు ఫ్యాక్టరీని తిరిగి ప్రారంభించారు. కాని ఫ్యాక్టరీ యాజమాన్యం పూర్తి స్థాయిలో కాలుష్య నివారణ చర్యలు తీసుకోని కారణంగా గండేపల్లి' పరిసర గ్రామాల ప్రజలు నేటికీ ఇబ్బందులు పడుతూనే ఉన్నారు.

## పెద్దవరానికి రానున్న కాలుష్య భూతం - 1

కృష్ణాజిల్లా నందిగామ మండలం, పెద్దవరం గ్రామ పరిధిలో క్రక్స్ బయోటెక్ ఇండియా ప్రై.లిమిటెడ్ వారు రోజుకు 60 వేల లీటర్ల సామర్థ్యం గల ధాన్యపు గింజలనుపయోగించే డిస్టిల్లరీ యూనిట్‌ను 28.98 ఎకరాల వ్యవసాయ భూమిలో, కోట్ల రూపాయల ఖర్చుతో నిర్మాణం ప్రారంభించేందుకు పూనుకున్నారు. ఈ ఇండస్ట్రీకి పర్యావరణ అనుమతుల నిమిత్తం 'పర్యావరణ ప్రభావ అంచనా నివేదిక' ను పయొనీర్ ఎన్విరో లెబొరేటరీస్ & కన్సల్టెంట్స్ ప్రై. లిమిటెడ్ (హైదరాబాద్) రూపొందించింది.

పర్యావరణ ప్రభావ అంచనా నిమిత్తం ఆధ్యయనం కొరకు ప్రతిపాదిత ప్లాంట్ ఏరియా నుంచి 10కి.మీ. దూరం వరకుగల

గ్రామాలను పరిగణనలోకి తీసుకున్నామని అంటూ 5 గ్రామాలనే నివేదికలో పేర్కొన్నారు. అవి–పెద్దవరం, లక్ష్మీపురం, రామన్నపేట, తాడువాయి, చల్లగరిగ గ్రామాలు. కానీ 10 కి.మీ. దూరం పరిధిలో ఉన్న కాంద్రపాడు, కోనాయపాలెం, వేదాద్రి, బండిపాలెం, కొణకంచి, బొబ్బిళ్లపాడు మొదలైన ఈ గ్రామాలను, వీటికి ఉన్న శివారు గ్రామాలను స్టడీ ఏరియా నుండి మినహాయించారు. ఈ గ్రామాల్లో సుమారు 25 వేలమంది ప్రజలు నివశిస్తున్నారు. వీరిలో ఎక్కువమంది పేద, సన్న, చిన్నకారు రైతులే ఉన్నారు. ఇతర వృత్తులవారు, మత్స్యకారులు కూడా ఉన్నారు. ఈ గ్రామల్లో ప్రత్తి, మిర్చి, వరి, పండ్ల తోటలు, సుబాబుల్ మొదలైన పంటలను నాగార్జున సాగర్ కాల్వల ద్వారా, ఎత్తిపోతల ద్వారా, చెరువులు, బోర్లు, బావులు మొదలగు వాటిమీద ఆధారపడి పండిస్తున్నారు. పశువులు, గొర్రెలు, మేకల పెంపకం విస్తృతంగా ఉంది. ప్రతిపాదిత డిస్టలరీ యూనిట్‌లో అనుకోని ప్రమాదం సంభవించినప్పుడు కలిగే పర్యావరణ కాలుష్య సమస్యల వలన రైతాంగంతో సహా ఈ ప్రాంతాల్లో వివిధ వృత్తులలో ఉన్న ప్రజానీకంలో, వారి జీవన విధానంలో ఏవిధమైన పరిణామాలు, మార్పులు చోటు చేసుకుంటాయో నివేదికలో ఎక్కడా పేర్కొనలేదు.

అలాగే ఫ్యాక్టరీకి దిగువున సమారు 3 కి.మీ. దూరంలో చందర్లపాడు మండలం, రామన్నపేట గ్రామం వద్ద కృష్ణానదిపై రక్షిత మంచినీటిని అందించే పైలట్ ప్రాజెక్టు ఉన్నది. ఈ ప్రాజెక్టు ద్వారా చందర్లపాడు, నందిగామ మండలాలోని దాదాపు 35–40 గ్రామాలలోని ఒక లక్షమందికి పైగా ప్రజలకు మంచినీటిని సరఫరా చేస్తున్నారు. ఈ డిస్టిల్లరీ ఫ్యాక్టరీ నుంచి రోజుకు 439 క్యూబిక్ మీటర్ల వ్యర్థకాలుష్య జలాలు విడుదల అవుతాయని నివేదికలో పేర్కొన్నారు. ఇంత పెద్ద మొత్తంలో వ్యర్థజలాలను ప్లాంట్ ఆవరణలో చెరువులు తవ్వి అందులో నిల్వ చేస్తే భూగర్భ జలాలు కలుషితం అవుతాయి. లేదా ప్లాంట్ ఆవరణ పక్కనేగల వాగు ద్వారా కృష్ణానదిలోకి విడుదల చేసినా కృష్ణా జలాలు కలుషితం అవుతాయి. ఫలితంగా ఈ కలుషిత జలాలనే రక్షిత మంచినీటి పైలట్ ప్రాజెక్టు ద్వారా 35–40 గ్రామాలలోని లక్షకు పైగా ఉన్న ప్రజలు తాగడంవలన కామెర్లు, కిడ్నీ ఫైల్యూర్స్, లివర్‌క్యాన్సర్, ఊపిరి తిత్తుల జబ్బులు లాంటి ప్రాణాంతకమైన వ్యాధులకు గురికాక తప్పదు.

పర్యావరణ ప్రభావం అంచనా నివేదికలో ప్లాంట్‌లను నిర్మించే భూమిని గిడసబారిన భూమిగా పేర్కొన్నారు. కానీ వాస్తవానికి, ఇవన్నీ వ్యవసాయ భూములు. ఇందులో పత్తి, మిర్చి మొదలగు పంటలు పండిస్తున్నారు.

ప్రతిపాదిత ఫ్యాక్టరీకి రోజుకు 64.2 క్యూ.మీ. నీరు అవసరమవుతుందని పేర్కొన్నారు. భూగర్భ జలాలను కూడా వినియోగించుకుంటామని పేర్కొన్నారు. ఈ ఫ్యాక్టరీ చుట్టు పక్కల పొలాలలో బావుల ద్వారా వ్యవసాయం సాగుచేస్తున్నారు. ఈ విధంగా కంపెనీ భూగర్భ జలాలను ఇంత పెద్దమొత్తంలో వెలికి తీస్తే, రైతుల పొలాలలోని బావులు ఎండిపోయి సాగు నీటికొరత సమస్యను ఎదుర్కొనవలసి వస్తుంది. తద్వారా నేలల స్వభావం మారుతుంది. భూసారంలో తేడాలొస్తాయి. ఫ్యాక్టరీ పొగగొట్టం నుంచి వెలువడే బొగ్గుమసి పంట పొలాలపై పడడం వలన ఆయా పంటలకు మార్కెట్‌లో రేట్లు లభించవు. అంతిమంగా వివిధ రకాల పంటలు పండే భూములు మధ్య ఈ రకపు ఫ్యాక్టరీలు ఉండడం తీవ్రమైన నష్టం.

పర్యావరణ నివేదికలో శూన్య విసర్జన అంటే జీరో పొల్యూషన్ వ్యవస్థను ఏర్పాటు చేస్తున్నట్లు పేర్కొన్నారు. డ్రయ్యర్‌ను ఏర్పాటు చేస్తామని పేర్కొన్నారు. ఇవన్నీ పూర్తిగా, దీర్ఘకాలంగా నిజాయితీగా అమలు జరుపుతారన్న గ్యారంటీ లేదు. ఉదాహరణకు కంచికచర్ల మండలం గండేపల్లిలో నిర్మించిన సెంటినీ బయోప్రొడక్ట్సు కంపెనీవారు తమ పర్యావరణ నివేదికలో జీరో పొల్యూషన్ వ్యవస్థను ఏర్పాటు చేసినట్లు పేర్కొన్నారు. కానీ ఆచరణలో దీనికి పూర్తిగా భిన్నంగా వ్యవహరించారు. పరిశ్రమాధిపతులు తమకు అనుమతులు వచ్చేవరకు చెప్పే మాటలను ఆచరణలో ఎక్కడా అమలు పరచడం లేదు. అందులో భాగంగానే క్రక్స్‌బాయెటెక్ ఇండియా ప్రై.లిమిటెడ్ కంపెనీవారు కూడా అమలు పరుస్తారన్న గ్యారంటీ లేదు.

ఫ్యాక్టరీ వినియోగించే బొగ్గువలన రోజుకు కనీసం 30 టన్నుల ప్లైయాష్ వస్తుంది. వేదాద్రిలోని హెచ్‌పిసిఎల్ విద్యుత్ కేంద్రం నుంచి వెలువడే బూడిదను పక్కనే ఉన్న పంటపొలాలలోకి విడిచి పెట్టడంవల్ల, పొలాలు బూడిదతో మేటలువేసి పంటలు నష్టపోవడం పట్ల రైతాంగం ఆందోళన చెందుతోంది.

మద్యం వ్యాపారాన్ని ప్రోత్సహిస్తున్న మన ప్రభుత్వం మొక్కజొన్నల ద్వారా ఇథనాల్ తయారీతో పాటు మద్యం ఉత్పత్తిని కూడా తయారు చేయడానికి విచ్చల విడిగా లైసెన్స్‌లు ఇవ్వడంతో – ప్రజల బలహీనతల పై ఆధారపడి తక్షణ లాభాలను పొందాలనుకుంటున్న పెట్టుబడిదారీ వర్గం 90 శాతం మద్యం ఉత్పత్తిని, 10 శాతం ఇథనాల్ ఉత్పత్తిని చేస్తున్నాయి. ఈ ఇథనాల్‌ను యూరప్ దేశాలకు ఎగుమతి చేయడం ద్వారా ఆయా దేశాలు దీన్ని పెట్రోలులో కలుపుకొని కొంత కాలుష్యాన్ని తగ్గించుకుంటున్నారు. ఈ ఫ్యాక్టరీలు పెద్ద ఎత్తున మొక్కజొన్నలను ఉపయోగించటం వలన రాబోయే 5–10 సంవత్సరాల కాలంలో మనదేశం కూడా తీవ్రమైన ఆహార సంక్షోభాన్ని ఎదుర్కోవలసి వస్తుంది. కనుక ప్రజాప్రయోజనాల ప్రాధాన్యతనిచ్చి ఈ రకపు పరిశ్రమలకు అనుమతులను నిలిపి వేయడం కోసం ప్రజాందోళనను తీవ్రం చేయాలి.

### పెద్దవరం కాలుష్య భూతం – 2

పెద్దవరం గ్రామ పరిధిలోనే మరొక ఇథనాల్ ప్లాంట్‌ను సుధీర్ బయోప్రొడక్టు ప్రైవేటు లిమిటెడ్ పేరుతో 60 వేల లీటర్ల రోజువారీ ఉత్పత్తి సామర్థ్యం గల, మొక్కజొన్ననుపయోగించే డిస్టిలరీ పరిశ్రమ నిర్మాణానికి ప్రభుత్వం అనుమతులు మంజూరు చేసింది. ఈ పరిశ్రమకు పర్యావరణ అనుమతి కొరకై 'పయనీర్ ఎన్విరో లెబోరేటరీస్ అండ్ కన్సల్టెంట్స్' (హైదరాబాదు) సంస్థ పర్యావరణ ప్రభావ అంచనా నివేదికను రూపొందించింది. ఈ నివేదిక అంతా అవాస్తవాలు, అర్ధ సత్యాలతో తప్పులు తడకగా ఉండడమేగాక, వాస్తవంగా ఈ ఫ్యాక్టరీ వలన ప్రజల ఆరోగ్యాలకు, పర్యావరణానికి జరిగే నష్టాన్ని, కాలుష్యపు ప్రభావంతో జరిగే పంటల నష్టాన్ని, ఉద్దేశపూర్వకంగానే పరిగణనలోకి తీసుకోకుండా అత్యంత నిర్లక్ష్యంగానూ, బాధ్యతారహితంగాను వ్యవహరించింది.

# మార్కెట్ గుప్పిట్లో విద్య

***మనిషినీ, సమాజాన్నీ సృజనాత్మకంగా ఉన్నతీకరించే మానవీయ విద్య మాత్రమే వ్యక్తి వికాసానికి, సమాజ పరివర్తనకు తోడ్పడుతుందని అంటున్నారు* ఎ. నర్సింహారెడ్డి**

సామాజిక ఆర్థిక సాంస్కృతిక మార్పులు తీసుకు వచ్చే సాధనమే విద్య. అయితే, మన దేశంలో అర్థవంతమైన విద్య ఎంత మందికి అందుబాటులో ఉందన్నది ఒక ప్రశ్న. ఆ విద్య ఎందరికి నాణ్యతతో అందుతుందన్నది మరో ప్రశ్న. ప్రస్తుత పరిస్థితుల్లో వీటికి దొరికె సమాధానాలు ఏ మాత్రం సంతృప్తికరంగా లేవు. అ అంటే అమ్మ అని పలికించడం విన్నాం. కానీ విద్యలో నానాటికీ పెరిగిపోతున్న ప్రైవేటు పెత్తనం వల్ల అ అంటే అమ్మకంగా మారిపోయింది. దురదృష్టవశాత్తు కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు కూడా ప్రైవేటుకే వత్తాసు పలుకుతుండడంతో విద్య ఓ సరుకుగానూ, 'కొనే'వాడికే దక్కేదిగానూ మారిపోయింది. సరిలీకృత ఆర్థిక విధానాలు, ప్రపంచబ్యాంకు డైరెక్షన్‌లో యుపిఎ-2 ప్రభుత్వం విద్యారంగంలో పెనుమార్పులకు నాంది పలికింది. నిన్నటి దాకా ప్రాథమిక విద్యలో అభివృద్ధి అంటూ జిల్లా ప్రాథమిక విద్యా పథకం (డిపిఇపి) పేరుతో దానిని బలహీనం చేసేందుకు ప్రయత్నించిన ప్రపంచబ్యాంకు దృష్టి ఇప్పుడు మాధ్యమిక విద్యపై పడింది. ఈ పథకానికి కేటాయించిన నిధుల్లో బ్యాంకు వాటా నామమాత్రమే అయినప్పటికీ అది సూచించిన ప్రభుత్వ, ప్రైవేటు భాగస్వామ్యం (పిపిపి) పద్ధతిలోనే మాధ్యమిక సెకండరీ విద్య విస్తరణ జరగబోతున్నది. అంటే తొమ్మిది నుంచి పన్నెండో తరగతి వరకు ప్రభుత్వ ఉన్నత పాఠశాలలు, ఇంటర్ కళాశాలలు మూతపడనున్నాయి. ఇంటర్ వరకు బోధించే విద్యను కార్పొరేట్‌శక్తుల చేతుల్లో పెట్టేందుకు మాస్టర్‌ప్లాన్ సిద్ధంగా ఉంది. భారత్‌లో 17-23 సంవత్సరాల వయస్సు గల వారిలో కేవలం 12 శాతం మాత్రమే ఉన్నత విద్యను అందుకోగలుగుతున్నారు. అభివృద్ధి చెందుతున్న దేశాలలో ఉన్నత సాంకేతిక విద్య అభ్యసించే వారి సంఖ్య 20 శాతానికి తగ్గరాదని ప్రపంచ బ్యాంకు నివేదికలు ఉద్ఘోషిస్తున్నాయి. ఏ సమాజమైన విజ్ఞాన ఆధారితంగానే పురోగమిస్తుంది. ఉన్నత విద్య వ్యాప్తి సమర్థంగా జరగాలంటే ప్రభుత్వ పెట్టుబడులు విద్యపైన గణనీయంగా పెరగాలి. కానీ పాలకులు అందుకు సిద్ధంగాలేరు.

ఆర్థిక సంస్కరణలు ప్రవేశ పెట్టక ముందు మన దేశంలో విద్యా పాలన ప్రభుత్వ, ఎయిడెడ్ విద్యాసంస్థల ఆధ్వర్యంలో సాగింది. సంస్కరణలు చేపట్టిన (1991) తర్వాత కేంద్ర-రాష్ట్ర ప్రభుత్వాలు సామ్రాజ్యవాద ప్రపంచీకరణ, ప్రైవేటీకరణ, సరళీకరణ విధానాలు అవలంబించడంలో క్రమంగా విద్యారంగంలో విద్యా ప్రైవేటీకరణను వేగవంతం చేశాయి. వాటి కనుగుణంగా అవి విధానాలు అమలు చేస్తున్నాయి. ఇంటర్ నుండి ఉన్నత విద్యవరకు విద్యారంగంలో ప్రైవేట్ విద్యా సంస్థల చొరబాటుకు అవకాశం కల్పించాయి. నేడు విద్యారంగం ఎదుర్కొంటున్న సవాళ్ళను గాని, దేశ అవసరాలను గాని, ప్రజల ప్రయోజనాలు గాని, ప్రపంచ ఆరిక్థ సంక్షోభ పరిణామాలను గాని, పరిగణనలోకి తీసుకోకుండా కేంద్ర-రాష్ట్ర ప్రభుత్వాలు స్వదేశీ, విదేశీ కార్పొరేటు అవసరాల కోసమే అమలు చేస్తున్న విద్యా సంస్కరణలు, విధానాలు ప్రభుత్వ విద్యారంగాన్ని బలహీనపరుస్తూ పెట్టుబడి లాభాల కొరకు ఇబ్బడి ముబ్బడిగా ప్రైవేటు సంస్థలకు అనుమతిస్తున్నారు. మరోవైపు ప్రజాధనాన్ని ఫీజు రీయింబర్స్‌మెంట్ విధానం ద్వారా అప్పనంగా ప్రైవేట్ విద్యాసంస్థలకు దోచిపెడ్తున్నారు. నిజానికి ప్రైవేట్ ఆస్తులు ప్రజోపయోగానికి ఉపయోగించేలా ఉండాలే కానీ, ప్రజాసంపదను ప్రైవేట్ వ్యక్తులు, సంస్థలు ఉపయోగించుకునేలా ఉండకూడదు. సామాజికవసరాలు విస్మరించి మార్కెట్ అవసరాలు,

---

ఈ డిస్టిలరీకి రోజుకు 642 క్యూబిక్ మీటర్ల నీరు అవసరమౌతుందని నివేదికలో పేర్కొన్నారు. అసలు ఈ ప్రాంతం నిరంతర అనావృష్టితో, కరువు పీడిత క్షామ ప్రాంతంగా ఉంటే, ఇక్కడ లభించే అరాకొరా నీటి వనరులను కూడా దిగమింగే ఒకటికి రెండు డిస్టిలరీలను ఏర్పాటు చేయబూనుకోవడం ప్రజలపట్ల ప్రభుత్వం ఘోర బాధ్యతరాహిత్యానికి నిదర్శనం. ఈ ప్రాంత ప్రజానీకం తీవ్ర తాగునీటి- సాగునీటి ఎద్దడిని ఎదుర్కోనున్నారు. భూగర్భ జలాలు అడుగంటిపోనున్నాయి.

పర్యావరణానికి, ప్రజల ఆరోగ్యాలకు, పంట భూములకు తీవ్రనష్టకరమైన, వ్యవసాయ భూములలో నెలకొల్పడం వలన ఉన్న కొద్దిపాటి జలవనరులను హరించివేసి, ఉపాధి అవకాశాలను మరింతగా కుదించివేసే, అన్నిటికీ మించి ఆహారధాన్యాలనుపయోగించి సారాతయారచేసే ఈ పరిశ్రమ స్థాపనపట్ల ప్రజలు తమ వ్యతిరేకతను బహిరంగ విచారణలో తీవ్రంగా తెలియజేసారు.

ఇథనాల్ పేరుతో మద్యం తయారు చేస్తున్న ఫ్యాక్టరీలు వెదజల్లుతున్న కాలుష్యాల వలన ప్రజల జీవితాలకే ప్రమాదం ముంచుకొస్తున్నది. మరోవైపు కాలుష్య రాకాసి ఫ్యాక్టరీలకు నీరు పెద్ద ఎత్తున కావాలి. కావున ఇవి జల రకాసుల రూపం ఎత్తి భూగర్భ జల వనరులను విపరీతంగా తోడెయ్యడం ఫలితంగా భూగర్భ జలవనరులు తగ్గిపోయి చివరికి వ్యవసాయ పంటలను దెబ్బతీస్తుంది. అంటే మనకు ప్రధానంగా ఉన్న వ్యవసాయరంగాన్ని సంక్షోభంలోకి నెడుతుంది. ఈ రాకాసి ఫ్యాక్టరీల వలన జల కాలుష్యంతో పాటు నీటి కొరత తీవ్రంగా పెరిగిపోయి తాగునీటికి, సాగునీటికి తీవ్ర ఎద్దడి ఏర్పడుతుంది. అంతకంటే సారా మహమ్మారి ప్రజల జీవితాలను సర్వనాశనం చేస్తుంది. అందువల్ల ప్రజల జీవితాలతో చెలగాటం ఆడుకునే ఇలాంటి రాకాసి ఫ్యాక్టరీలు మనకి అవసరమా!

*(రచయిత సిపిఐ (ఎం.ఎల్) రాష్ట్ర కమిటీ సభ్యులు)* వీ

పెట్టుబడి లాభాలకోరకే విద్యావిధానాలను రూపొందించి అమలు చేస్తున్నారు. పాఠశాల విద్యలోను ప్రైవేట్ రంగానికి అవకాశాలు కల్పిస్తున్నారు. ఈ విధానాల్లో మన రాష్ట్రం అగ్రస్థానంలో నిలుస్తుంది.

బాలలు జాతి సంపద. ఆ బాలలకు విజ్ఞానం, నైపుణ్యం, విలువలు అందించి వారిని నాణ్యంగా మలచుకోవడం ద్వారానే భారత్‌ను అభివృద్ధి పథంలో నిలపగలం. కేవలం ఉన్నత విద్యపై దృష్టి సారించడం ఈ సమస్యకు పరిష్కారం కాదు. పాఠశాల విద్యకు పటిష్ట పునాదులు లేకుండా భారీ భవంతి నిర్మించడం సాధ్యంకాదు. కాబట్టి, ప్రాథమిక విద్యకు సంబంధించీ గణనీయ పురోగతి సాధించాలి. మనదేశం విజ్ఞానాధారిత సమాజంలో అభివృద్ధి చెందిన దేశంగా ఎదగాలంటే విద్యారంగ పురోగతి కీలకం. 1964నాటి కొఠారీ కమిషన్ మొదలు నేటివరకు అన్ని విద్యాకమిషన్లు- స్థూల జాతీయోత్పత్తిలో ఆరు శాతం విద్యపై వెచ్చించాలని సిఫార్సు చేశాయి. ఏనాడూ మన ప్రభుత్వాలు ఆ లక్ష్యాన్ని చేరుకోలేదు.

ఏ జాతి భవిష్యత్తు అయినా బాలల అభివృద్ధి మీదే ఆధారపడి ఉంటుంది. బాలల భవితే అగమ్యగోచరంగా తయారైతే దేశం ఏ దిశలో వెళుతుందో వేరే చెప్పనక్కర్లేదు. ముఖ్యంగా చదువు'కొన'లేని పేద కుటుంబాల పిల్లలు, వెనుకబాటుతనానికి ప్రతినిధులుగా మిగిలి పోతున్నారు. ఐక్యరాజ్యసమితి 1948 డిశంబర్ 10న ఆమోదించిన ప్రపంచ మానవ హక్కుల ప్రకటనలో విద్యకు ప్రత్యేక ప్రాధాన్యత ఇచ్చింది. ప్రజానీకంలో విజ్ఞానాన్ని, నైపుణ్యాన్ని పెంపొందించడం ద్వారా మానవ హక్కులను ప్రోది చేయడం విద్య లక్ష్యం కావాలని సూచించింది. అంతర్జాతీయ ఆర్థిక, సామాజిక, సాంస్కృతిక హక్కుల ఒడంబడికలోనూ విద్యను మానవహక్కుగా పేర్కొన్నారు. సుప్రీమ్ కోర్టు పలు తీర్పులలో విద్యను ప్రాథమిక హక్కుగా గుర్తించింది. విద్యను అందించే బాధ్యత, కర్తవ్యం ప్రభుత్వాలదేనని స్పష్టంచేసింది.

బుడిబుడి నడకల పసిపాపాయికి ఊహ నేర్పి, అక్షర ప్రపంచాన్ని పరిచయం చేసి, వ్యక్తి వికాసానికి సరైన భూమిక ఏర్పరచాల్సింది ప్రాథమిక విద్య. అంతటి కీలకమైన పునాదిని గుల్లబార్చే పోకడలకు దేశంలో అడ్డులేదని 'ప్రథమ్' వార్షిక విద్యాస్థితి నివేదికలు ఏటా నిర్ధారిస్తూనే ఉన్నాయి. ప్రాథమిక విద్యారంగ ముఖ చిత్రాన్ని మార్చేసేదిగా నాయకగణం ఊదరగొట్టిన సర్వశిక్షా అభియాన్ సర్వభ్రష్టమైనట్లు 'కాగ్' నివేదికలే నిగ్గుతేల్చాయి. దేశ రక్షణకు ఇచ్చినంత ప్రాధాన్యత విద్యారంగానికి దక్కాలన్న నిపుణుల నివేదికల మీద దుమ్ము పేరుకుపోతోంది! జర్మనీ, బెల్జియం, ఇటలీ, నార్వేల్లో యావత్ పాఠశాల విద్య ఉచితం, నిర్బంధం. స్పెయిన్, ఫ్రాన్స్, కెనడా లాంటి చోట్ల పిల్లలకు పదేళ్లపాటు తప్పని సరి విద్యాభ్యాసం నిమిత్తం తల్లిదండ్రులు ఏమీ చెల్లించనక్కర్లేదు. జనావాస ప్రాంతాలకు దగ్గర్లో పాఠశాల ఉండితీరాలన్న కట్టుబాటు మేరకు పొరుగున చైనా వేలాది బోర్డింగ్ స్కూళ్లను, లక్షలాది గ్రామీణ మాధ్యమిక విద్యాసంస్థల్ని ఏర్పాటుజేసింది. అమెరికాలో సుమారు 80 శాతం, బ్రిటన్‌లో 90 శాతానికి పైగా పిల్లలు ప్రభుత్వ నిర్వహణలోని పాఠశాలల్లోనే విద్యాభ్యాసం చేస్తుండగా. మనదేశంలో ప్రైవేటు విద్యా సంస్థల్ని ఆశ్రయిస్తున్నవారి సంఖ్య 40 శాతానికి పైబడుతోంది!

ఇటీవల 25 దేశాల విద్యా విధానాన్ని సమీక్షించారు. వాటిలో బ్రెజిల్, చిలీ, కొన్ని లాటిన్ అమెరికన్ దేశాలున్నాయి. ఆఫ్రికా ఖండంలో దక్షిణాఫ్రికాను తీసుకున్నారు. ఆసియాలో ఉన్న చైనా, కొరియా, ఇండియా, జపాన్ దేశాలను, యూరప్‌లో ఐర్లాండ్, ఇంగ్లాండ్, స్పెయిన్, ఇటలీ, ఫ్రాన్స్, ఫిన్‌లాండ్, డెన్మార్క్, జర్మనీ, పోలండ్ దేశాల విద్యను సమీక్షించారు. ఈ దేశాల్లోని విద్యారంగ పరిస్థితిని సమీక్షిస్తూ అభివృద్ధి చెందుతున్న దేశాలలో ఆర్థిక ఎదుగుదల ఎంతగా జరుగుతున్నదో అంతరాలు కూడా అదే మోతాదులో పెరుగుతున్నదన్న ఆందోళన వ్యక్తమైంది. ప్రధానంగా విద్య, వైద్య రంగాలలో పెరుగుతున్న అంతరాలు తీవ్రమైన పరిస్థితులకు దారితీయవచ్చునని భావిస్తున్నారు. అసమానతలు గల సమాజం అనేక సమస్యలను ఎదుర్కోవాల్సి వస్తుంది. అసమానతలే పేదరికానికి మూలం. ఒక రకమైన అసమానత, మరో రకమైన అసమానతకు దారితీస్తుంది. విద్యాపరమైన అసమానత, ఆదాయపరమైన అసమానతకు దారి తీస్తుంది అని అమర్త్యసేన్ వ్యాఖ్యానించారు. అసమానతలను తొలిగించేందుకు సాధనం కావాల్సిన విద్యే, నేడు మన దేశంలో వాటిని పెంచేందుకు సాధనంగా మారుతోంది. ప్రపంచంలోనే అత్యంత అసమానతలతో కూడిన విద్యా వ్యవస్థ ఉన్న దేశాల్లో భారత్ ఒకటి. విద్యావకాశాలను అందించడంలో ఇప్పటికీ వివక్ష కొనసాగుతోంది. నేతల నిష్క్రియాపరత్వం - ప్రపంచ నిరక్షరాస్యుల్లో మూడింట రెండొంతుల మందికి నిలయమైన తొమ్మిది దేశాల్లో ఒకటిగా ఇండియాను తల దించుకునేలా చేసింది. ఈ నేపథ్యంలోనే విద్య ప్రజాస్వామికీకరణ చెందాలని ఉద్యమాలు వస్తున్నాయి. ఉదాహరణకు 'అఖిల భారత విద్యా హక్కుల వేదిక' ఆచార్య అనిల్ సద్గోపాల్ (మధ్య ప్రదేశ్), ఆచార్య మెహర్ అలీ (కలకత్తా), ఆచార్య హారగోపాల్ (హైద్రాబాద్)ల నేతృత్వంలో గత రెండు సంవత్సరాలుగా ఉద్యమాలు చేస్తున్నారు. ప్రపంచ బ్యాంకు అభివృద్ధి నమూన వలన ఆర్థికాభివృద్ధి జరిగినప్పటికీ సమాజంలో అంతరాలు పెరుగుతున్నాయి. ఆర్థిక అభివృద్ధి, విద్యలో అంతరాలను పెంచుతున్నదని 25 దేశాలకు చెందిన ఒక సమీక్ష ప్రపంచం ముందుకు తెచ్చింది. ఈ సవాళ్లను ఎదుర్కొన్న పుడే, సమత్వాన్ని సాధించినప్పుడే విద్య ద్వారా దేశాల ప్రగతి ముందుకు పోతుంది లేకపోతే అన్ని దేశాలు ఈ సవాళ్లను ఎదుర్కొనక తప్పదు.

గరిష్టస్థాయిలో లాభాలు ఆర్జించేందుకు నూతన మార్గాలను అన్వేషించడం పెట్టుబడి లక్షణం. ప్రపంచీకరణ నేపథ్యంలో భారత ప్రభుత్వం అక్కున చేర్చుకున్న నయా ఉదారవాద ఆర్థిక సంస్కరణల్లోనే ఈ లక్షణం దాగి ఉంది. ఫలితంగా ప్రభుత్వ ఆస్తులను లూటిచేయడం, అన్ని ఉత్పత్తి వ్యవస్థలతో పాటు విద్యారంగం ప్రైవేటీకరణతో పాటు గరిష్ట స్థాయిలో లాభాలు ఆర్జించేలా విద్యారంగ వ్యవస్థలో మార్పులు చేసే ప్రక్రియ ప్రారంభమైంది. ఆర్థికాభివృద్ధికి ప్రభుత్వ-ప్రైవేటు భాగస్వామ్యం (పిపిపి) ప్రధాన సాధనంగా 12వ ప్రణాళికా సంఘం ఈ కొత్త విధానాన్ని ముందుకు తీసుకొస్తోంది. ప్రభుత్వ ఆస్తులు, మౌలిక వసతులు నిర్మించేందుకు తగు మొత్తంలో లాభాలకు ఆస్కారం కల్పిస్తూ ప్రైవేటు పెట్టుబడులను ఆకర్షించడం భారతదేశ ఆర్థికాభివృద్ధికి అవసరమని ఈ సిద్ధాంతం చెబుతోంది. గరిష్ట స్థాయిలో లాభాలు ఆర్జించేందుకు ప్రభుత్వ ఆస్తులను ప్రైవేట్ ప్రయోజనాలకుపెట్టుబడి పెట్టడం పూర్తిగా భిన్నమైన ఆలోచన. ఈ విధానాన్ని ప్రవేశపెట్టడం ద్వారా భారతదేశంలో ఆర్థిక ప్రణాళికా వ్యవస్థను కుప్పకూల్చడానికి ప్రణాళికా సంఘం ప్రయత్నిస్తోంది.

మన రాష్ట్రంలో ఇంటర్మీడియట్ దశపై ఇప్పటికే కార్పొరేట్‌శక్తులు అదుపు సంపాదించాయి. 2009లో అధికారంలోకి వచ్చిన యుపిఎ-2 గద్దెనెక్కింది మొదలు 100 రోజుల ఎజెండా పేరిట ఉన్నత విద్యను పూర్తిస్థాయిలో విదేశీ శక్తులకు కట్టబెట్టేందుకు ప్రణాళిక రూపొందించింది. ప్రపంచ బ్యాంకు డైరెక్షన్‌లో వినాశకర బిల్లులు ఆరు రూపొందించి పార్లమెంటు ముందుపెట్టింది. ప్రతిపాదిత ఉన్నత విద్యారంగ బిల్లులు వరుసగా 1) విదేశీ విద్యా సంస్థల బిల్లు.

2) ప్రమాణాల ధ్రువీకరణ అధికార సంస్థ బిల్లు. 3) విద్యా ట్రిబ్యునళ్ల బిల్లు, 4) ఉన్నత విద్యా సంస్థలలో అవినీతి కార్యకలాపాల నిషేధ బిల్లు, 5) ఉన్నత విద్య, పరిశోధన జాతీయ మండలి బిల్లు 6) యూనివర్సిటీ ఇన్నోవేటివ్ బిల్లు. ఇందులో మొదటి బిల్లు విదేశీ విద్యా సంస్థలను అనుమతించడానికి ఉద్దేశించినది కాగా, మిగిలిన ఐదూ ఉన్నత విద్యారంగంలో స్వదేశీ, విదేశీ వ్యాపారానికి అనుకూలమైన వాతావరణాన్ని కల్పించే బిల్లులే. విదేశీ విద్యాసంస్థల బిల్లు చట్ట సభలను పక్కనపెట్టగా, విద్యా ట్రిబ్యునల్ బిల్లు కోర్టులను పక్కన పెడుతుంది. ఈ కొత్త బిల్లులతో ఏర్పడే వ్యవస్థ రాష్ట్ర ప్రభుత్వాధికారాలను కుదించడమే గాక, యుజిసి, ఎఐసిటిఇ వంటి అనేక సంస్థలను రద్దుచేస్తూ అధికార కేంద్రీకరణకు దారితీస్తుంది. వ్యాపారం, అధికార కేంద్రీకరణ అవినీతికి ప్రధానమైన మూల కారణాలు అని చరిత్ర పదే పదే రుజువు చేసింది.

ఓ వైపు ప్రమాదకరమైన ఈ తరహా బిల్లులు ప్రవేశపెడుతూనే మరోవైపు అంతరాలు పెరిగిపోతున్నాయంటూ మొసలి కన్నీరు కార్చడం ప్రధాని మన్మోహన్‌కే చెల్లింది. హోంమంత్రి చిదంబరం కూడా విద్యారంగ సంక్షోభంపై ఒక ప్రకటన చేశారు. పుట్టగొడుగుల్లా ప్రైవేటు సంస్థలు పుట్టుకొస్తున్నాయి. దీనిని నివారించలేం. అయితే అవి డబ్బులు దండుకునే కేంద్రాలుగా మారకుండా అడ్డుకుంటాం అని సెలవిచ్చారు. ఇవి బుకాయింపులు మాత్రమే. అలాంటి పనికి ప్రభుత్వం పూనుకో బోదన్నది సుస్పష్టం. విద్యలో ప్రైవేటు భాగస్వామ్యానికి పరిమితం కావడం లేదు. మొత్తం వ్యవస్థను అదుపు చేయాలన్నది దాని సంకల్పం. దానికి సర్కారు వత్తాసు పలకడం ఆందోళన కల్గిస్తోంది. ఫీజులు నియంత్రిస్తానని చెప్పడం జనాన్ని మోసపుచ్చడానికే తప్ప ఇంకొకటి కాదు. తిరుపతిలో జరిగిన ఉన్నత విద్యా పరిరక్షణ సదస్సు దీనినే ఎత్తిచూపింది. ఢిల్లీలో జరిగిన మరో సదస్సు 'విద్యారంగంలో కేంద్రీకరణ, ప్రైవేటీకరణ, వ్యాపారీకరణ' పెరిగిపోతోందని ఆందోళన వ్యక్తం చేసింది.

పన్నెండవ పంచవర్ష ప్రణాళిక ముసాయిదా పత్రం సిఫారసు చేసిన ప్రతిపాదనలన్నీ భారీ స్థాయిలో ప్రైవేటీకరణను, వ్యాపారీకరణను చట్టబద్ధం చేసేందుకు ఉద్దేశించినవేనని నేషనల్ యూనివర్సిటీ ఆఫ్ ఎడ్యుకేషనల్ ప్లానింగ్, అడ్మినిస్ట్రేషన్ ప్రొఫెసర్ జె.బి. తిలక్ ఇటీవల వివరించారు. టెక్నికల్ విద్యతో సహా ఉన్నత విద్యలో ప్రైవేటురంగం పాత్ర పెంపును ప్రోత్సహించాలని ఈ పత్రం సూచిస్తోందని ఆయన పేర్కొన్నారు. విద్యారంగంలో ప్రైవేటు సంస్థలకు భాగస్వామ్యం కల్పించడంలో ప్రతిబంధకాలను అధిగమించే ప్రక్రియ ఉన్నత విద్యా రంగానికే పరిమితం కాకుండా అన్ని స్థాయిలకు విస్తృత పరచాలని ముసాయిదా పత్రం పేర్కొంటోందని ప్రొఫెసర్ తిలక్ పేర్కొన్నారు. ప్రభుత్వ – ప్రైవేటు భాగస్వామ్యానికి గల అవకాశాలను అధ్యయనం చేసి ఆచరణలో పెట్టాలని సూచించింది. అర్హత గల ప్రైవేటు సంస్థలకు ప్రవేశం కల్పించాలని, వాటికి రుణాల రూపంలో ప్రభుత్వ నిధులను అందుబాటులోకి తీసుకురావాలని పత్రం సూచించింది. దేశంలో నాలుగు, ఐదు ప్రాంతాల్లో భారీ స్థాయి విద్యా హబ్‌లను ఏర్పాటు చేసే విషయాన్ని పరిశీలించాలని సూచించింది. ఇందులో ప్రైవేటు రంగానికి భాగస్వామ్యం కల్పించాలని ముసాయిదా పత్రం సూచించిందన్నారు.

భారతదేశంలో ఉన్నత విద్య సంక్షేమం ప్రాతిపదికగా ఉన్న దశ నుండి నయా ఉదారవాద మార్కెట్ ఆర్థిక వ్యవస్థగా రూపాంతరం చెందిందని ప్రొఫెసర్ తిలక్ పేర్కొన్నారు. దురదృష్టవశాత్తు పరివర్తన పూర్తయినట్లు కనిపిస్తోందని, ప్రమాదవశాత్తు ఇక తిరిగి బాగు చేసుకునే అవకాశం లేని స్థాయికి చేరుకుందని ఆయన వ్యాఖ్యానించారు. దేశంలో ప్రస్తుతం 73 ప్రైవేటు విశ్వవిద్యాలయాలు, సుమారు 100 డీమ్డ్ విశ్వవిద్యాలయాలున్నాయని తెలిపారు. దశాబ్దం క్రితం ఇవి ఒక్కటి కూడా భారత్‌లో లేవు. ప్రొఫెషనల్ విద్యలో చేరే వారిలో ఐదింట నాలుగో వంతు మంది ప్రైవేటు విద్యాసంస్థల్లోనే చేరుతున్నారు. ఉన్నత విద్యారంగంలో మొత్తం చేరేవారిలో మూడవ వంతు మంది ప్రైవేటు కళాశాలల్లో చేరుతున్నారు.

'విశ్వవిద్యాలయాలనూ అంతర్జాతీయ ప్రమాణాలతో తీర్చిదిద్దాల్సి ఉంది' అని ప్రధాని మన్మోహన్ సింగ్ ఘనంగా ఉద్ఘాటించి ఏడేళ్లవు తున్నా– అడుగడుగునా ఘోర వైఫల్యాలు వెక్కిరిసున్నాయి. ఇక ప్రైవేట్ విద్యా సంస్థల్లో నాణ్యత విషయానికొస్తే 'నేతిబీరలో నెయ్యి ఎంతో, నేటి చదువుల్లో నాణ్యత అంత' అన్న చందంగా ఉంది. ఈ అనుభవ సత్యానికి జెఎన్‌టియు (హైదరాబాద్) తాజా స్నాతకోత్సవ సభలో ప్రధాన వక్తల సూటి వ్యాఖ్యలే నిదర్శనం. గవర్నరు నరసింహన్, 'ఇన్ఫోసిస్' సంస్థ రూపశిల్పి నారాయణమూర్తి చేసిన పదునైన విమర్శ సమకాలీన విద్యారంగ అవ్యవస్థకు, మొదలంటా చెదలు పట్టిన దుర్గతికి అద్దం పట్టేవే. విద్యార్థులకు నాణ్యమైన విద్య అందుతోందో లేదో విశ్వ విద్యాలయాలు ఆత్మశోధన చేసుకోవాలన్న రాష్ట్ర ప్రథమ పౌరుడి సూచన ఆలోచనాత్మకం. ఎంసెట్ (ఇఎంసిఇటి) లో సున్నా మార్కులు వచ్చినవారికీ సీటు కేటాయిస్తుంటే క్వాలిటీ ఎడ్యుకేషన్ ఎక్కడ నుంచి వస్తుందని ఆయన సంశయం వ్యక్తం చేశారు. చదువులెంతగానో పరువు తీశాయనడానికి ఇది ప్రబల నిదర్శనం. రాష్ట్రంలో వృత్తివిద్యా కాలేజీలపై అఖలభారత సాంకేతిక విద్యామండలి నియంత్రణ అవసరమని అభిప్రాయపడ్డారు. రాష్ట్రంలో ఫీజులపై సీలింగ్ అవసరమన్నారు. నారాయణమూర్తి– ప్రాథమిక దశనుంచి ఉన్నత విద్యవరకు మన రికార్డు దయనీయంగా ఉందని నిష్ఠుర సత్యం పలికారు. 'విజ్ఞానమనే పిరమిడ్ దిగువన అందరికీ ప్రాథమిక విద్యాగంధం అందించడం ప్రభుత్వానికి ఒక సవాలు అన్నారు.

ఉన్నత విద్య బాగుకు చేయగలిగినంతా చేస్తున్నామని, ఇక గాడిన పడాల్సింది పాఠశాల విద్యేనని మూడున్నరేళ్ల క్రితం ప్రధాని మన్మోహనంగా సెలవిచ్చారు. నారాయణమూర్తి ఆవేదనాభరిత స్పందనను పరికించిన జాతిజనులు ఎవరైనా– మొదటిది పచ్చి దబాయింపు, రెండోది ఎండమావి అని నిట్టూర్చక మానరు! వృత్తివిద్యా కోర్సుల్లో విద్యాబోధన, నిర్వాహణల పరంగా అత్యున్నత ప్రమాణాలు పాటించడం అత్యవసరమని సర్వోన్నత న్యాయస్థానం ఎన్నోమార్లు స్పష్టీకరించడం తెలిసిందే. అఖిలభారత సాంకేతిక విద్యమండలి (ఎఐసిటిఇ) విచ్చలవిడి అనుమతుల పందేరం పుణ్యమా అని పుట్టుకొచ్చిన నడమంత్రపు సంస్థల్లో ఇంజనీరింగ్ చదువుల నాసి ప్రమాణాలు వెగటు కలిగిస్తున్నాయి. ఒక్క ఇంజనీరింగ్ కళాశాలలు మాత్రమే కాదు దేశంలో మూడింట రెండొంతుల విశ్వవిద్యాలయాలు, 90 శాతం కాలేజీలు నేలబారు ప్రమాణాలతో ఈసురోమంటున్నాయి.

ఆరు సంవత్సరాల క్రితం ఇంజనీరింగ్ విద్యకు సంబంధించి, దాని స్థితిగతులను అధ్యయనం చేసేందుకు కేంద్ర ప్రభుత్వం జాతీయ స్థాయిలో ఇస్రో శాస్త్రవేత్త యు.ఆర్.రావు నేతృత్వంలో ఒక అధ్యయన కమిటీని నియమించింది. అది తన నివేదికలో మన దేశ అవసరాలను పరిగణనలోకి తీసుకొని ఇంజనీరింగ్ సీట్లు 75 వేలకు మించరాదని సిఫార్సు చేసింది. దీనిని కేంద్రం అమలు చేయక అటకెక్కించింది. ఫలితంగా ఇంజనీరింగ్ పట్టభద్రులు జాతీయ అవసరాలకు మించి తయారవుతున్నారు. నాస్కామ్ (సాఫ్ట్‌వేర్ సంస్థల జాతీయ సంఘం) దేశంలో ఇంజనీరింగ్‌లో పట్టభద్రులైన ప్రతి నల్గురిలో ఒకరు మాత్రమే ఉద్యోగార్హత కలిగి ఉన్నారని తన నివేదికలో పేర్కొంది. ఇదిలా ఉంటే

ఎన్.ఆర్. నారాయణమూర్తి నేతృత్వంలో ఏర్పాటైన కమిటీ తయారు చేసిన నివేదికను కేంద్ర మానవ వనరుల మంత్రి కపిల్ సిబల్ ఇటీవల విడుదల చేస్తూ సరైన వాతావరణం కల్పించకుంటే ప్రైవేట్ రంగం పెట్టుబడి పెట్టదని అన్నారు. మరోవైపు ప్రణాళికా సంఘం ఉపాధ్యక్షుడు మాంటెక్‌సింగ్ అహ్లూవాలియా విశ్వవిద్యాలయాలు తమ ఫీజులను పెంచాలని సూచించాడు. ఉన్నత విద్యా రంగంలోకి ప్రవేశించే ప్రైవేటు రంగానికి ఉచితంగా భూమి తదితర భారీ ప్రభుత్వ తోడ్పాటును ఇవ్వాలని సిఫారసు చేశాడు.

మన రాజ్యాంగ నిర్మాతలు అనేక దఫాలుగా చర్చించి విద్యను రాష్ట్ర ప్రభుత్వ ఆధీనంలో ఉంచారు. బలమైన కేంద్రం, బలమైన రాష్ట్రాలు ఉన్నప్పుడే సమాఖ్య స్ఫూర్తి వర్ధిల్లుతుందని రాజ్యాంగ నిర్మాతలు చెప్పారు. ఎమర్జెన్సీ తరువాత విద్యను కేంద్రం ఉమ్మడి జాబితాలోకి చేర్చడం ద్వారా సమాఖ్య స్ఫూర్తిని దెబ్బతీసింది. ఇప్పుడు రాష్ట్రాల హక్కులను హరించి కేంద్రం కర్రపెత్తనం చేసేందుకు ప్రయత్నిస్తోంది. ఈ తరహా కేంద్రీకరణ మన విద్యావ్యవస్థపై విదేశీ వర్సిటీల ఆధిపత్యానికి, మార్కెట్ శక్తులకు ఊతమివ్వడానికి పనికొస్తుంది. ఉన్నత విద్యలో ఎఫ్‌డిఐని ప్రవేశపెట్టిన తరువాత 144 విద్యాసంస్థలు మన దేశంలో ప్రకటన లిస్తున్నాయి. వాటిల్లో 44 సంస్థలకు వారి వారి దేశాల్లోనే గుర్తింపు లేదు. 110 సంస్థలు యుజిసి నిబంధనలు తుంగలో తొక్కి అనుమతుల్లే కుండానే నడుస్తున్నాయి. వీటిపై ఇప్పటి దాకా ఎలాంటి చర్యా లేదు. ఇప్పుడు విదేశీ వర్సిటీలను సంతోష పెట్టడానికి యుజిసిని కూడా ఎత్తేయబోతోంది. ఇక ప్రైవేట్ సంస్థల నియంత్రణ, ప్రమాణాల పరిరక్షణ ఎలా సాధ్యం?

ఉన్నత విద్యను దేశ నిర్మాణానికి సాధనంగా మన పాలకవర్గాలు గుర్తించనందునే మాటలు తప్ప వనరులు సమకూర్చలేక పోయాయి. అభివృద్ధి చెందిన, లేదా అభివృద్ధి చెందుతున్న దేశంలో చూసిన మన దేశంలో ఉన్నత విద్య అభ్యసిస్తున్న విద్యార్థిపై పెడుతున్న ఖర్చు అత్యంత తక్కువగా ఉంది. జిడిపి లెక్కల్లో చూస్తే ఉన్నత విద్యకు చేసిన కేటాయింపు ఒక శాతం కూడా లేదు. ప్రమాణాలు కూడా అలాగే ఉన్నాయి. వీటిని సరిచేయకుండా విద్యా కేంద్రీకరణ, వ్యాపారీకరణ, ప్రైవేటీకరణ విధానాలను ఈ రంగంలో చొప్పించేందుకు కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు ప్రయత్నిస్తున్నాయి. ఈ వినాశకర విధానాల వల్ల భవిష్యత్తు భయానకంగా మారిపోనుంది. దీనిని నివారించాలంటే విద్యారంగంలో ఎఫ్‌డిఐలను, విదేశీ యూనివర్సిటీల బిల్లును గట్టిగా వ్యతిరేకించాలి. ప్రైవేట్ విద్యాసంస్థలపై సామాజిక నియంత్రణ కోసం చట్టం చేయాలి. మేధో స్వయం సమృద్ధిని కాపాడుకునేందుకు వీలుగా మౌలిక వసతులను సమృద్ధిగా కల్పించాలి.

**ఉన్నత విద్యపై తలసరి వ్యయం**

| | | |
|---|---|---|
| భారత్ | 400 డాలర్లు | రు. 21,000 |
| అమెరికా | 9629 డాలర్లు | రు. 5,10,000 |
| బ్రిటన్ | 8502 డాలర్లు | రు. 4,50,000 |
| జపాన్ | 4830 డాలర్లు | రు. 2,56,000 |
| చైనా | 2728 డాలర్లు | రు. 1,45,000 |
| రష్యా | 1024 డాలర్లు | రు. 55,000 |
| బ్రెజిల్ | 3986 డాలర్లు | రు. 2,11,000 |

రాష్ట్రంలోని అనేక విశ్వవిద్యాలయాలు, ఇంజనీరింగ్ కళాశాలల్లో అర్హతలు లేనివాళ్లు సైతం వివిధ స్థాయిల్లో పనిచేస్తున్నరు. నిజానికి రాష్ట్రంలోని విద్యా సంస్థలు నాణ్యమైన బోధన సిబ్బంది కొరతను ఎదుర్కొంటున్నాయి. ఎన్నో కళాశాలలు, విశ్వవిద్యాలయాలు అరకొర అర్హతలున్న, పదవీ విరమణ చేసిన ఉపాధ్యాయులతోనే కాలం నెట్టుకొస్తున్నాయి. వీటికి తోడు రాష్ట్రంలోని అత్యధిక విశ్వవిద్యాలయాల్లో తీరైన పాలక మండళ్లు(ఈసీ) లేవు. కొన్నేళ్లుగా కులపతుల నియామకాలూ బాధ్యతరాహిత్యాన్ని తెలియజెబుతున్న పరిణామాలివి. సర్కారు లోపభూయిష్ఠ విధానాలు విద్యారంగంలో నాణ్యత క్షీణతకు కారణమవుతున్నాయి. దేశంలో ఉన్నత విద్య మునుపెన్నడూ లేనంత నాణ్యత సంక్షోభాన్ని ఎదుర్కొంటోందని 2007లోనే యుజిసి వెల్లడించింది. దేశంలో 123 విశ్వవిద్యాలయాలు, 2,956 కళాశాలల్లో 'నాక్' అధికారిక సర్వే నిర్వహించింది. మెజారిటీ విద్యాసంస్థల్లో నాణ్యత నాసిరకంగా ఉందని ఆ అధ్యయనంలో స్పష్టమైంది. నాణ్యమైన అధ్యాపక వర్గం లేకపోవడం, సౌకర్యాలు కొరవడడం ప్రమాణాలు కోసుకు పోవడానికి ప్రధాన కారణాలని ఆ కమిటీ అభిప్రాయపడింది.

2010-11 నాటికి మన రాష్ట్రంలో 720 ఇంజనీరింగ్ కాలేజీలు, 3.39 లక్షల సీట్లతో ఉన్నాయి. ఏటా వృత్తి విద్యను అభ్యసించి బయటకు వస్తున్న విద్యార్థుల్లో 18నుంచి 20 శాతం మాత్రమే తగిన ఉద్యోగాలు పొందగలుగుతున్నారు. 80శాతం మంది ఉపాధికి నోచుకోవడం లేదు. ప్రైవేటు ఇంజనీరింగ్ కాలేజీల్లో నాసికరం బోధన సిబ్బంది కారణంగా- చాలా మంది విద్యార్థులు, తల్లిదండ్రులు ఆ విద్య పైనే ఆసక్తి కోల్పోతున్నారు. సాంకేతిక విద్యను ప్రైవేటు సంస్థలు పూర్తి వ్యాపారాత్మకంగా, లాభాపేక్షతో నిర్వహించడంవల్లే ఈ దురవస్థ దాపురించింది. ఆధునిక ప్రపంచం విసురుతున్న సవాళ్లకు దీటుగా నిలబడాలంటే దేశంలోని బాలబాలిక లందరికి సరైన విద్యా నైపుణ్యాలతో పరిపుష్టం చేయడమే మార్గం. ప్రపంచంలో అత్యధిక జనాభాగల దేశాల్లో రెండోస్థానంలో ఉన్న భారత్‌లో సరైన విద్య ప్రసాదించి, శిక్షణ అందించినట్లయితే అత్యుత్తమ నైపుణ్యం కలిగిన పౌరులకు భారత్ కేంద్రంగా విరాజిల్లుతుంది.

ప్రాథమికోన్నత విద్యపై లక్ష్మణస్వామి ముదలియార్ కమిటీ, విశ్వవిద్యాలయ విద్య మీద రాధాకృష్ణన్ కమిషన్, వివిధ అంచెల చదువులపై కొఠారీ కమిషన్ విలువైన సిఫార్సులెన్నో చేశాయి. మేలిమి సూచనల్నీ తొక్కిపట్టిన నేతల దారుణ అలసత్వమే విద్యారంగాన క్షీణప్రమాణాలకు దారితీసింది. ప్రతి పౌరుణ్నీ విలువైన పౌరునిగా తీర్చిదిద్దడం ఆధునిక ప్రగతి సూత్రం. ఆ స్ఫూర్తిని ఒంట పట్టించుకోని ప్రభుత్వాలది క్షమించరాని మహా ఘోర వైఫల్యం! మనిషిని, సమాజాన్ని సృజనాత్మకంగా ఉన్నతీకరించే మానవీయ విద్య మాత్రమే వ్యక్తివికాసానికి సమాజ పరివర్తనకు తోడ్పడుతుంది. సమాజం ఎదుర్కొంటున్న అన్ని సవాళ్ళను పరిష్కరిస్తుంది. అలాంటి విద్య మాత్రమే సృజనాత్మక సమాజ నిర్మాణానికి దోహదపడుతుంది. మనిషిని సమాజాన్ని ఉన్నతీకరిస్తుంది. సామాజిక న్యాయం జరుగాలంటే ముఖ్యంగా ప్రమాణాలతో కూడిన నాణ్యమైన విద్యను అందించే బాధ్యతను ప్రైవేటు విద్యాసంస్థలకే వదిలిపెట్టకుండా, ప్రభుత్వ పాఠశాలల్లో సైతం అదే స్థాయిలో చదువులు చెప్పినప్పుడే- పేద పిల్లలందరికీ ప్రయోజనం చేకూరుతుంది. సమాజ వ్యతిరేక విద్యా విధానాలను బట్టబయలు చేస్తూ విద్యార్థులు, అధ్యాపకులు, ప్రజాతంత్ర శక్తులు ఐక్యంగా ఉద్యమాలు సాగించే కర్తవ్యాన్ని స్వీకరించాలి.

*(రచయిత ఉపాధ్యాయ ఉద్యమ నాయకులు)* వీ

# 2020 తరువాత ఏం జరగబోతోంది?

*మన దేశం చేసిన అప్పులు తీర్చే సమయం ఆసన్నమైందనీ, అది పెను సంక్షోభంగా మన నెత్తిన పడనున్నదనీ వేరు వేరు దేశాల అనుభవాలతో వివరిస్తున్నారు* **లోక సంచారి**

**1991** నుండి (అంటే సరళీకరణ, ప్రపంచీకరణ మొదలైనప్పటి నుండి) భారత ప్రభుత్వం అంతర్జాతీయ ద్రవ్య నిధి, ప్రపంచ బ్యాంక్, ఏసియన్ డెవలప్‌మెంట్ బ్యాంక్ లాంటి అంతర్జాతీయ రుణ సంస్థల నుండి వందల కొద్ది బిలియన్ల డాలర్లు అప్పుగా తెచ్చింది. ఇంకా తెస్తూనే ఉంది. ఇదే కాకుండా, ద్వైపాక్షిక ఒప్పందాలలో భాగంగా జపాన్, జర్మనీ, ఫ్రాన్స్, అమెరికా లాంటి వివిధ దేశాలకు చెందిన రుణ సంస్థల నుండి కూడా బిలియన్ల కొద్ది డాలర్‌లను అప్పుగా తెస్తూ ఉంది. (ఒక బిలియన్ డాలర్లు అంటే దాదాపు 5,500 కోట్ల రూపాయలు.)

మామూలుగా, అంతర్జాతీయ రుణ సంస్థలు అప్పులను 15 నుండి 25 సంవత్సరాల కాల పరిమితితో ఇస్తాయి. ఈ లోపు ఏటా కేవలం వడ్డీ మాత్రమే కట్టవలసి ఉంటుంది. ఆ లెక్కన 1991 నుండి 2000 మధ్యన భారత ప్రభుత్వం తీసుకున్న బిలియన్ల కొద్ది డాలర్ల అప్పులను, 2018 నుండి 2020 మధ్యన (లేదా రెండు సంవత్సరాలు అటు ఇటుగా) ఏదో ఒక సంవత్సరం అసలుతో సహా అప్పులను తిరిగి కట్టడం మొదలవుతుంది. అయితే, దాంతో వచ్చిన సమస్య ఏంటని అనుకుంటున్నారా? ఆ విషయాలే ఇప్పుడు చర్చిద్దాం.

అంతర్జాతీయ రుణ సంస్థల నుండి పెద్ద ఎత్తున అప్పులు తీసుకొని, తిరిగి చెల్లించడం మొదలు పెట్టిన దేశాల ఆర్థిక వ్యవస్థ కుప్పకూలుతోంది. ఇండోనేషియా, అర్జెంటీనా, ఉరుగ్వే, మెక్సికో, పెరూ లాంటి దేశాల అనుభవమిదే. పరిస్థితి ఎంత దారుణంగా ఉంటుందంటే, నేను యూరప్‌లో పని చేసేపుడు మా కంపెనీ సిఇఓ తో నేను కొన్ని సాయంత్రాలు జరిపిన మేధో చర్చల సందర్భంగా ఆయన తన అనుభవాలను వివరించాడు. ఉరుగ్వే దేశం అంతర్జాతీయ రుణ సంస్థల అప్పులు కట్టడం మొదలవగానే ఉరుగ్వే దేశ ఆర్థిక వ్యవస్థ పేకమేడలా కూలిపోయిన సమయంలో అనుకోకుండా అతను ఆ దేశంలో ఉన్నాడు. తాను చెప్పినదేమంటే, దాదాపు 70 శాతం పైగా జనాలు నిరుద్యోగులైపోయారు. కొనుగోలు శక్తి లేక జనాలు కేవలం తిండి పదార్థాలు తప్ప మిగతా అన్నింటినీ కొనడం ఆపేసారు. దాంతో చిన్న, మధ్యతరహా సంస్థలు దివాలా తీసి ఉద్యోగస్తులను తీసివేసి, చివరికి ఆఫీస్ ఫర్నిచర్, యంత్రాలు కూడా ఎంతో కొంతకు అమ్ముకున్నారు. ఇక రోజువారీ అవసరమయ్యే తిండి గింజలు, పాలు, మాంసం ఇతర తిండి పదార్థాల ధరలు పొద్దున నుండి సాయంత్రానికే ఎంతో ఎక్కువ ధరలకు అమ్మే వారట. ఆయనకు సిగరెట్లు తాగే అలవాటు. అన్నింటి ధరలలాగే రోజు రోజుకు సిగరెట్ ధరలు కూడా పెరగడం చూసి, దానికి బదులు పది రోజులకు సరిపడా సిగరెట్లు కొనాలనే ఉద్దేశంతో రోడ్డుపై సిగరెట్లు అమ్మే వ్యక్తిని తన వద్ద ఉన్న సిగరెట్లు అన్నింటినీ ఎంతకు అమ్ముతావని అడిగితే, 'ఎంత డబ్బు ఇచ్చినా అన్ని అమ్మను. ఈ రోజు నేను, నా కుటుంబం బతకడానికి ఎంత డబ్బు అవసరమో అన్నే సిగరెట్లు అమ్ముతాను. రేపు బతకడానికి ఎంత డబ్బు కావాలంటే అన్నే సిగరెట్లు రేపు అమ్ముతాను' అని జవాబిచ్చాడట. ఒక దేశం అంతర్జాతీయ రుణ సంస్థల నుండి తీసుకున్న అప్పులను తిరిగి చెల్లించడం మొదలు పెట్టినప్పుడు అనివార్యంగా ఏర్పడే ఆర్థిక సంక్షోభంలో పరిస్థితి అలా ఉంటుందని మా కంపెనీ సిఇఓ తన ప్రత్యక్ష అనుభవాలు చెప్పే వరకు నాకు అంత వివరంగా తెలువదు.

1990 చివరి దశకంలో ఇండొనేషియా దేశంలో ఇదే కారణం చేత ఆర్థిక సంక్షోభం వచ్చింది. అప్పుడు మామూలు జనాల బతుకు ఎంత దారుణంగా ఉండేదో రెండు ఫుల్ పేజీల కథనం ప్రఖ్యాత వాషింగ్టన్ పోస్ట్ దిన పత్రికలో వచ్చింది. అప్పుడు నేను వాషింగ్టన్ డిసి వద్ద పని చేస్తున్నందున ఆ పత్రిక చదివేవాన్ని.

మచ్చుకు కొన్ని సంఘటనలు చెప్తాను. ఉద్యోగాలు పోయి ప్రజలు చివరికి అద్దె కొరకు, తిండి గింజల కొరకు ఇంట్లో ఉన్న వస్తువులను ఎంతో కొంతకు బజార్లో నిలబడి అమ్ముకునే వారట. స్థానిక కరెన్సీ విలువ పూర్తిగా దెబ్బతినడంతో ఎక్కువ శాతం బంగారం, డాలర్ లాంటి 'హార్డ్ కరెన్సీ'లను వ్యాపారులు అగిడే వారట. ఇరవై, ముప్పై మంది ఉద్యోగస్తులు కార్లు, తరుచూ కుటుంబంతో విదేశీయానం చేసే స్థాయి కలిగిన వ్యాపారులు కూడా కొనుగోలుదార్లు లేక దివాళా తీసారని, కొందరు వ్యాపారస్తులు అప్పులు భరించలేక తమ కుటుంబాల్ని పల్లెటూర్లలో ఎవరైనా బంధువులుంటే అటు పంపివేసి తాము నిరాశ్రయుల ఆశ్రమాలలో తలదాచుకొని, అక్కడ ఏదైనా స్వచ్ఛంద సంస్థల వాళ్ళు ఇచ్చే గంజిని తాగి బతుకుతున్నారని, ఇలాంటి వందల కొద్ది దీనగాథలని రాసారు.

దాదాపు 2020 సంవత్సరానికి అటు ఇటుగా భారతదేశంలో కూడా ఇదే జరగబోతోంది. భారత ప్రభుత్వం అప్పుల్ని అంతర్జాతీయ రుణ సంస్థలకి తిరిగి చెల్లించక తప్పదు. చెల్లించే క్రమంలో అనివార్యంగా ఈ దారుణ ఆర్థిక సంక్షోభం రాకా తప్పదు.

మరి ఈ విషయం భారత ప్రభుత్వానికి తెలువదా? అని ఎవరైనా అనుకోవచ్చు. ఎందుకు తెలువదు. చాలా స్పష్టంగా తెలుసు. అందుకే 2030 నాటికి భారతదేశం సూపర్ పవర్ కాబోతుంది అని చెప్తున్నారు. అదేంటి, దారుణ ఆర్థిక సంక్షోభం రాబోతుంటే, సూపర్ పవర్ కాబోతున్నామని ఎలా అంటారనా మీ ప్రశ్న? ప్రపంచీకరణ తర్వాత పెట్టుబడిదారీ వ్యవస్థ చాలా ముందు చూపుతో ఆలోచిస్తుంది. పాత పెట్టుబడిదారీ ఆలోచనా విధానం పూర్తిగా ప్రజల్ని అణచివేయడం పైనే

ఆధారపడి నడిచింది. దాంతో రష్యా, క్యూబా, చైనా, తూర్పు యూరప్, ఉత్తర కొరియా లాంటి దేశాల్లో ప్రజలు విప్లవించి కమ్యూనిజం వైపు మొగ్గు చూపారు. ఇంకా ఇతర దేశాల్లో కూడా వివిధ రకాల విప్లవాలు వచ్చాయి. దాంతో దిమ్మ తిరిగిన పెట్టుబడిదారులు, తీవ్ర అణచివేత ఒక్కటే తమ దోపిడీ పాలనను సుస్థిరం చేయదని, దాంతో పాటుగా ప్రజల మెదడులను కూడా కంట్రోల్ చేయాలని గ్రహించి, హార్వర్డ్, స్టాన్‌ఫోర్డ్, ఆక్స్‌ఫర్డ్ లాంటి ప్రపంచ ప్రఖ్యాత యూనివర్సిటీలలో పనిచేసే మానసిక శాస్త్రవేత్తలయిన ప్రొఫెసర్లను బిలియన్ల కొద్ది డాలర్లు ఇచ్చి ప్రజల మనస్తత్వాలను ఎలా మార్చాలి, ప్రజల మైండ్‌ను ఎలా తమ కంట్రోల్‌లో ఉంచుకోవాలి అని పరిశోధన చేపించారు. నిజానికి వీరు ఎంత సూక్ష్మ స్థాయిలో పరిశోధించారంటే, చివరికి ఒక సంవత్సరం వయసు పిల్లల మైండ్ కూడా తమకనుకూలంగా మార్చుకోవడానికి ఏమి చేయాలి, ఎలా చేయాలి అని పరిశోధించి, దాని పద్ధతులను తయారు చేశారు.

మీరు అత్యంతంగా ఇష్టపడే దాన్ని ప్రభుత్వం తలుచుకుంటే ఎలా అసహ్యించుకునేట్టు చేయవచ్చు, అసహ్యించుకునే దాన్ని ఇష్టపడేట్టుగా ఎలా చేయవచ్చు, ఒక మంచి వ్యక్తి లేదా సంస్థ పట్ల ప్రజలకు ఉండే ప్రేమను, నమ్మకాన్ని వారికి అర్థం కాకుండా ఆ సంస్థ లేదా వ్యక్తి పట్ల అపనమ్మకాన్ని, అయిష్టతను ఎలా పెంచవచ్చు, ఇలా ఎంత సూక్ష్మస్థాయిలో ఆ శాస్త్రవేత్తలు కొన్ని సంవత్సరాల పాటు పరిశోధించి ప్రభుత్వాలకు మైండ్ కంట్రోల్ మ్యాన్యువల్స్‌ను ఇచ్చారు. 1960 దశకం నుండి పాశ్చాత్య దేశ ప్రభుత్వాలు ఈ టెక్నిక్స్‌ను తమ దేశ ప్రజలపై ప్రయోగిస్తున్నాయి. ప్రపంచీకరణ ప్రారంభించిన తర్వాత పాశ్చాత్య దేశాలు ఇచ్చిన ట్రైనింగ్ తో మన ప్రభుత్వం కూడా ఈ టెక్నిక్‌లను మనపై ప్రయోగిస్తున్నది. దాంట్లో భాగంగానే 2030 వరకు ఇండియా సూపర్ పవర్ కాబోతుందనే ప్రచారం. ఏది జరుగబోతుందో, దానికి పూర్తిగా వ్యతిరేకమైన ప్రచారం చేస్తే, దాన్ని ప్రజలు నమ్మి, నిజంగా ఏమి జరగబోతుందో ముందే గ్రహించి చెప్పేవారిని అపనమ్మకంతో చూడడం లేదా వారిని పనికిరాని పెస్సిమిస్ట్‌ల్లాగా ప్రజలు పరిగణిస్తారనే మైండ్ కంట్రోల్ టెక్నిక్‌లో భాగంగా ఈ ప్రచారం చేయిస్తున్నారు. నిజానికి లక్షాధికారులు, కోటీశ్వరులు తప్ప మిగతా ప్రజల పరిస్థితి దారుణ ఆర్థిక సంక్షోభంలో పడి తిండి గింజలకు కూడా ఇంట్లో వస్తువులు, బంగారం అమ్ముకోవలసిన పరిస్థితి అనివార్యంగా రాబోతుంటే, 2030 నాటికి ఇండియా సూపర్ పవర్ కాబోతుందనే ప్రచారం, భవిష్యత్‌లో నిజంగా ఏమి జరుగబోతుందనేది లేశ మాత్రం అవగాహన లేకుండా చేయడానికి మాత్రమే జరుగుతుంది.

మరి ఇలా ఎందుకు జరగబోతుంది, దీనికి కారణం ఎవరు అనే విషయాలు చర్చిద్దాం.

భారత ప్రభుత్వం అంతర్జాతీయ రుణ సంస్థల నుండి అప్పులు ఎందుకు తీసుకుంటుంది?

బ్రిటిష్ వారి కాలం నుండి దళారీ మనస్తత్వాన్ని అభివృద్ధి చేసుకున్న భారత పెట్టుబడిదారులు, తదనంతరం సోవియట్ యూనియన్ పతనంతో అమెరికా ఏకధృవ ప్రపంచంగా ఏర్పడ్డప్పుడు, అమెరికా పంచన చేరితేనే తమ అభివృద్ధి సాధ్యమని గ్రహించి ప్రపంచీకరణకు తెరలేపారు. అయితే ప్రపంచీకరణ అమలు చేయాలంటే వందల బిలియన్ల డాలర్ల విదేశీ మారక ద్రవ్యం (ఫారెక్స్) అవసరం. దానికి వివిధ కారణాలు ఉన్నాయి. ఒకటి, భారత పెట్టుబడిదారులు పాశ్చాత్య దేశాల నుండి యంత్రాలను దిగుమతి చేసుకోవడానికి, వారు తమ సంస్థలను ఫ్యాక్టరీలను విదేశాల్లో స్థాపించడానికి ఫారెక్స్ అవసరం. అలాగే, భారతదేశంలోని లక్షాధికారులు, కోటీశ్వరులు, బిలియనీర్లు విదేశాల నుండి కొనే లగ్జరీ వస్తువులు, డైమండ్లు లాంటి వాటికి కూడా బిలియన్ల కొద్ది డాలర్లు ప్రతి సంవత్సరం అవసరం ఉంటాయి. అంతేకాకుండా, బహుళజాతి సంస్థలు తమ స్వంతంగా కాని, భారత పెట్టుబడిదారులతో కలిసి కాని మన దేశంలో చేస్తున్న వ్యాపారాల్లో వచ్చిన లాభాలను వారి దేశంలోకి తీసుకువెళ్లడానికి, షేర్ మార్కెట్ కమాడిటీ ట్రేడింగ్, మ్యూచ్‌వల్ ఫండ్స్ లాంటి రకరకాల ఫైనాన్షియల్ వ్యాపారాల్లో పెట్టిన పెట్టుబడులు, దానిపై లాభాలు తిరిగి తమ దేశాలకు తీసుకు వెళ్లడానికి కూడా ఏటా బిలియన్ల కొద్ది ఫారెక్స్ కావాలి. అయితే, ఫారెక్స్ సంపాదించాలంటే, ఏ దేశానికైనా ఒకటే మార్గం ఉంది. అది, విదేశాల్లో మన వస్తువులను, సేవలను అమ్మడం ద్వారా ఫారెక్స్ ఆర్జించడం. కానీ, మన దేశం ఆ రంగంలో విఫలం అయింది. అయినప్పటికీ, భారత పెట్టుబడిదారీ వర్గానికి, బహుళజాతి వ్యాపార సంస్థల కోసం ఫారెక్స్‌ను ఎప్పుడూ సిద్ధంగా ఉంచాలి. అది ప్రపంచీకరణ ఒప్పందంలో ఒక షరతు. దాంతో, భారత ప్రభుత్వం ఫారెక్స్ కొరకు అంతర్జాతీయ రుణ సంస్థల నుండి బిలియన్ల కొద్ది డాలర్లు అప్పుగా తెస్తుంది. సామ్రాజ్యవాదుల చెప్పు చేతుల్లో నడిచే ఈ అంతర్జాతీయ రుణ సంస్థలు తమ వద్దకు అప్పు కొరకు వచ్చిన దేశాలపై అమానవీయ మైన, ఆ దేశపు 99.5 శాతం జనాల వినాశనానికి కారణమయ్యే షరతులు విధిస్తాయి. అయినప్పటికీ, ఆ దేశ పాలకవర్గాలు మిగతా 0.5 శాతం జనాల కొరకు, బహుళజాతి సంస్థల కొరకు, వారి తొత్తులైన పెట్టుబడిదారుల కొరకు ఆ షరతులను ఒప్పుకొని అప్పులు తెస్తున్నాయి.

ఆ షరతులు ఏమిటనే విషయంలో ఇప్పటికే వేల కొద్ది పుస్తకాలు, లక్షల కొద్ది వ్యాసాలు వచ్చినందున వాటిని ఇక్కడ ప్రస్తావించడం లేదు. అదే విధంగా, వివిధ ప్రాజెక్టులు, డ్యాంల పేరు మీద పేదరిక నిర్మూలన, మురికివాడల అభివృద్ధి, చివరికి డ్రైనేజ్ వ్యవస్థ ఏర్పాటు, ప్రాథమిక విద్య లాంటి వాటి పేర్ల మీద కూడా వందల కొద్ది బిలియన్ల డాలర్ల అప్పులు తీసుకుంటున్నారు.

అయితే, ఈ అప్పులు భారతదేశం ఎలా తీర్చగలదు? ఎలా అంటే, పన్నులు వేయడం ద్వారా. పన్నులు ఎవరిపై వేస్తారు? న్యాయంగానైతే, ప్రపంచీకరణ వలన ఎవరు కోట్లు గడించారో వారిపై మాత్రమే పన్నులు వేసి అప్పులు తీర్చాలి. ఎందుకంటే మెజారిటీ భారత ప్రజలకు ప్రపంచీకరణ వలన నష్టమే తప్ప లాభం జరగలేదు. స్వదేశీ, విదేశీ కార్పొరేట్ కంపెనీలల్లో ఉద్యోగాలు పొందిన కొద్దిమంది మధ్యతరగతి విద్యాధికులు ప్రపంచీకరణ వలన తమకు లాభం జరిగిందని అనుకుంటుండవచ్చు. కానీ, వారు ఒకవేళ 360 డిగ్రీల కోణంలో, 2020 ప్రాంతంలో జరగబోయే ఆర్థిక సంక్షోభపు కోణంలో చూస్తే వారికి కూడా అది తీవ్ర నష్టమేనని అర్థం అవుతుంది. కాబట్టి 0.5 శాతంగా ఉన్న లక్షాధికారులు, కోటీశ్వరులు, బిలియనీర్లే ఈ అప్పులను తీర్చాలి. కానీ ఇది పగటి కలే. ఎందుకంటే, ఎవరి బాగు గురించి

# ప్రజలపై విరుచుకుపడుతున్న రాజ్యం

***ఆదివాసీ ప్రజలపై క్రూరమైన నిర్బంధాన్ని అమలు చేస్తున్న పాలకులు సివిక్ ఆక్షన్ పేరిట ప్రజల హృదయాల్ని, మనసుల్ని గెలుచుకోగలరా అని ప్రశ్నిస్తున్నారు*** **మంగేష్ సడిమెక్**

**మ**హారాష్ట్రలోని గడ్చిరోలి జిల్లాలో ప్రజలపై ప్రభుత్వ నిర్బంధం తీవ్రంగా కొనసాగుతున్నది. నిత్యం పోలీసులు, అర్ధసైనిక బలగాలు కూంబింగులు చేస్తూ, ఆంబుష్‌లకు కూర్చుంటూ ప్రజలను భయభ్రాంతులకు గురిచేస్తున్నాయి. గ్రామాలపై పడి ప్రజలను విచక్షణారహితంగా కొట్టడం, చిత్రహింసలు పెట్టడం, అరెస్టు చేసి తప్పుడు కేసుల్లో ఇరికించడం, ఇండ్లల్లోకి దూరి వస్తు సామాగ్రిని ధ్వంసం చేయడం, నగదును, విలువైన వస్తువులను దొంగిలించడం సర్వసాధారణమైంది. ఈ సంవత్సరం (2012) ఒక్క మార్చి నెలలోనే జరిగిన కొన్ని సంఘటనలను బట్టి నిర్బంధ తీవ్రతను కొంతమేరకు అర్థం చేసుకోవచ్చు.

మార్చి 14న ధనోరా ప్రాంతంలోని టవ్వెటోలా, గట్టనేలి గ్రామాలపై పోలీసులు దాడి చేసి విధ్వంసం సృష్టించారు. ఎనిమిది మందిని పట్టుకొని ధనోరా పోలీస్‌స్టేషన్‌కు తీసుకువెళ్లారు. అయితే ఈ రెండు గ్రామాల ప్రజలు ముఖ్యంగా మహిళలు తమ గ్రామస్తులను వదిలెయ్యండంటూ పోలీసుల వెంటబడి ధనోరా వరకు వెళ్లి పోరాడారు. ఈ పోరాటం ఫలితంగా పట్టుకున్న వాళ్లలో ఆరుగురిని వదిలేశారు. ఇద్దర్ని మాత్రం జైలుకు పంపారు. వీరిలో టవ్వెటోలా గ్రామస్తుడు కోలూరాం భోగాతో పాటు ఒక గట్టనేలి గ్రామస్తుడు ఉన్నాడు.

మార్చి మూడవ వారంలో చాద్‌గావ్ ఏరియాలోని నాలుగు గ్రామాలపై దాడి చేసి విధ్వంసం సృష్టించి కొందరిని అరెస్టు చేశారు. ఇలా అరెస్టు చేసిన వారిలో జానకి అనే యువతి ఉంది. బోదిలి గ్రామస్తురాలైన ఈమె గతంలో కొన్నాళ్ల పాటు మావోయిస్ట్ గెరిల్లా దళంలో పనిచేసింది. కానీ ప్రస్తుతం ఆమె ఇంటి దగ్గర సాధారణ జీవితం గడుపుతున్నది. టొడ్డె గ్రామస్తుడిని పెళ్లి చేసుకొని అక్కడే స్థిరపడింది. ఆమెకు ఇద్దరు పిల్లలు కూడా. చిన్న పాప మరీ పసిబిడ్డ. టొడ్డె గ్రామంపై దాడి చేసిన సమయంలో ఈమెను అరెస్టు చేసి, నక్సలైటును అరెస్టు చేసినట్టుగా పత్రికల్లో ఆమె ఫోటోను వేసి మరీ ప్రచారం చేసుకున్నారు. కానీ చంటి బిడ్డ తల్లిని అరెస్టు చేసినందుకు కోర్టు చివాట్లు వేయడంతో ఆమెను వదిలేశారు.

---

అప్పులు తెచ్చారో, ఆ పెట్టుబడిదారి వర్గానికే భారత ప్రభుత్వం గత ఎనిమిది సంవత్సరాల కాలంలో 25 లక్షల కోట్ల రూపాయల టాక్స్ మినహాయింపు ఇచ్చింది. అది కూడా కేవలం కస్టమ్స్, ఎక్సైజ్, సేల్స్ టాక్స్ మూడింటిపై మాత్రమే. అవి కాకుండా వీరికి బంగారం, డైమండ్స్‌లపై వేల కోట్ల దిగుమతి సుంకం తీసివేసారు. ఈ పెట్టుబడిదారులకు పారిశ్రామిక అభివృద్ధి పేరున లక్షల ఎకరాలను, లక్షల కోట్ల సబ్సిడీలను, అతి తక్కువ వడ్డీలకు పారిశ్రామిక రుణాలను, అలా రకరకాల పేరున లక్షల కోట్ల రూపాయల ప్రయోజనం కల్పిస్తున్నారు.

అలాంటి చరిత్ర కలిగిన ప్రభుత్వం, అంతర్జాతీయ రుణ సంస్థల నుండి తెచ్చిన అప్పులకు వారిపైన టాక్స్‌లు విధిస్తుందని అనుకుంటే అమాయకత్వమే అవుతుంది. నిజానికిది, ఇతర దేశాలలో కూడా జరుగలేదు. పైపెచ్చు, అలాంటి ఆర్థిక సంక్షోభం కాలంలోనే ఉద్యోగ కల్పన సాకుతో వారిపై ఏవైనా కొద్దిపాటి టాక్స్‌లు ఉంటే, అవి కూడా తీసివేస్తాయి ప్రభుత్వాలు. పై నుండి వారికి రకరకాల ప్రోత్సహకాల పేరు మీద డబ్బులు ఇస్తాయి.

మొత్తంగా చూస్తే 99.5 శాతం ప్రజలపైనే అప్పులు తీర్చాల్సిన బాధ్యత ప్రభుత్వం పెడ్తుంది. అందుకే, త్యాగాలకు సిద్ధంకండని ప్రభుత్వం పదే పదే పిలుపునిస్తుంటుంది. అంటే, 0.5 శాతం ధనవంతులను ఇంకా ఇంకా ధనవంతులుగా మార్చడానికి, మిగతా 99.5 శాతం జనాలు ఇంకా ఇంకా దుర్భర జీవితం అనుభవిస్తూ, అప్పుల్లోకి కూరుకుపోతూ, జీవనాధారాల్ని కోల్పోతూ, ఆకలితో అలమటిస్తూ, పౌష్టికాహార లోపంతో, రోగాలతో, కష్టాలతో, కన్నీళ్లతో త్యాగం చేయక తప్పదు. త్యాగం చేయడమంటే 2020ని దృష్టిలో పెట్టుకొని ఇప్పటి నుండే పెంచుతున్న పన్నులను కట్టడం, అప్పులను కట్టబోయే సమయానికి ఇబ్బడిముబ్బడిగా పెంచబోయే పన్నులను (భారతదేశంలో 99.05 శాతం ప్రజలపై దాదాపు 200 రకాల పన్నులు వేస్తుంది ప్రభుత్వం) కట్టడం. అలాగే, ప్రభుత్వ ఖర్చులను తగ్గించుకునే చర్యల్లో భాగంగా అన్ని రకాల సబ్సిడీలు, ప్రజా ప్రయోజనమైన పథకాలను తీసివేయడం వలన, అనూహ్యంగా పెరుగుతున్న, పెరగబోయే ధరలను నోరు మూసుకొని భరించడం. ఇదంతా త్యాగం. భరతదేశం 2030 వరకు సూపర్ పవర్‌గా ఎదగడానికి దేశ భక్తితో మీరు చేయాల్సిన త్యాగం అదే. చివరికి మీరు ఈ 0.5 శాతం పరాన్నభుక్కుల రాజ్యాన్ని ప్రాణాలు ఫణంగా పెట్టయినా రక్షించాలనుకునే దేశభక్తిగల పోలీస్ కావచ్చు, సైనికుడు కావచ్చు. అయినప్పటికీ వాళ్లు మీపై కూడా అప్పులు తీర్చే బాధ్యత వేసారు. ఎందుకంటే మీరు కూడా వారి దృష్టిలో 99.05 శాతం ప్రజలల్లో ఒక భాగమే కాబట్టి. మీరు తీసుకోని అప్పులకు కూడా మీకు బాధ్యత ఉందంటున్నారు. కాని మీరు ఈ వ్యవస్థ మీద చూపుతున్న విశ్వాసానికి మాత్రం వారికి బాధ్యత కాని కృతజ్ఞత కాని లేదంటున్నారు. పెట్టుబడి అసలు స్వరూపం, విశ్వరూపం అర్థం చేసుకోలేనంత వరకు, ఆ వేయి కాళ్ల రాక్షసి మనచేత బలవంతంగా త్యాగాలు చేయిస్తూనే ఉంటుంది. కనీసం మన తర్వాత తరాల భవిష్యత్ కొరకైనా వేయి కాళ్ల రాక్షసిని కూల్చక తప్పదు.

*(రచయిత అనేక దేశాల్లో పని చేసిన సామాజిక కార్యకర్త)* వీ

బోదిలి గ్రామానికి చెందిన శాంతారాం మడావి కూడ కొద్ది కాలం పాటు గెరిల్లా దళంలో పనిచేసి, ప్రస్తుతం సాధారణ జీవితం గడుపుతున్నాడు. ఇంటికి వెళ్లాక పెళ్లి కూడా చేసుకున్నాడు. మార్చి 23న ఈ గ్రామంపై సిఆర్‌పిఎఫ్ వాళ్లు దాడి చేసి ఇతన్ని అరెస్టు చేశారు. ఇతనిపై దాదాపు 50 కేసులు పెట్టి జైల్లోకి తోశారు. మావోయిస్టులు లొంగిపోయి 'జనజీవన స్రవంతి'లో కలవాలనీ, సాధారణ జీవితం గడిపే వాళ్లకు అనేక సదుపాయాలు కల్పిస్తామని ప్రభుత్వాలు చేసే ప్రచారం ఎంత బూటకమో తెలుసుకోవడానికి ఇదొక మచ్చుతునక.

25 తారీఖున ఇర్పగుట్ట గ్రామంపై సి-60 బలగాలు దాడి చేశాయి. ఈ గ్రామానికి చెందిన అర్జున్ అనే యువకుడు గెరిల్లా దళంలో పనిచేస్తున్నాడు. పోలీసులు వీళ్ల ఇంటిపై దాడి చేసి అర్జున్ సోదరుడిని పట్టుకోవాలని ప్రయత్నించారు. కానీ అతను తప్పించుకోగల్గాడు. వీళ్ల ఇంట్లోని సామాగ్రినంతా ధ్వంసం చేశారు. ఇంట్లో ఉన్న నాలుగువేల నగదును దొంగిలించుకుపోయారు.

మార్చి 23, 24 తేదీలలో గ్రామీణాభివృద్ధిశాఖ మంత్రి జయరాం రమేశ్ ఈ ప్రాంతంలో పర్యటనలు జరిపాడు. స్థానిక ఎం.ఎల్.ఎ నామ్‌దేవ్ ఉసెండీ, సిఆర్‌పిఎఫ్ అధికారులతో కలిసి ఈ సందర్భంగా లేఖమేంద, సిరొంచ, సావర్‌గాం, కోర్చి తదితర చోట్ల సభలు జరిపారు. విప్లవోద్యమ అణచివేతలో భాగమే ఈ సభలు. కనుక విప్లవోద్యమానికి వ్యతిరేకంగా ఈ సందర్భంగా విపరీతమైన ప్రచారం చేశారు, పలు పిలుపులనిచ్చారు. అంతేకాదు ఈ సందర్భంగా మంత్రి తదితరులకు రక్షణగా వచ్చిన పోలీసులు గ్రామాల్లో కూంబింగ్‌లు చేయడం, ప్రజలను కొట్టడం వంటి చర్యలకు పాల్పడి ప్రజలను భీతావహులను చేశారు. అంటే ఈ మంత్రి ప్రత్యక్షంగా ఈ నిర్బంధకాండకు నేతృత్వం వహించాడన్న మాట.

మార్చి 25న జయరాం రమేశ్ ఇక్కడి నుండి వెళ్లిపోయాడు కానీ సిఆర్‌పిఎఫ్ బలగాలన్నీ వెనుదిరగలేదు. సివిక్ యాక్షన్ కార్యక్రమం కోసం సిఆర్‌పిఎఫ్ కమాండెంట్ అశోక్ సాన్యాల్ సహా కొన్ని బలగాలు ఈ ప్రాంతంలోనే ఉండిపోయాయి. అశోక్ సాన్యాల్ గతంలో కాశ్మీర్‌లో పని చేసి అణచివేత చర్యలలో మొనగాడుగా పేరుమోసిన సిఆర్‌పిఎఫ్ అధికారి. విప్లవోద్యమాన్ని అణచడంలో భాగంగా ఒక చేత్తో నిర్బంధాన్ని అమలు చేస్తూనే మరో చేత్తో సివిక్ యాక్షన్ కార్యక్రమాన్ని ఈ ప్రాంతంలో చురుగ్గా నడిపిస్తున్నారు. సిఆర్‌పిఎఫ్ డిజి విజయ్ కుమార్ కూడా ఈ కార్యక్రమంలో పాల్గొనాలని గడ్చిరోలికి వచ్చాడు. 'ప్రజల హృదయాల్ని, మనస్సుల్ని గెల్చుకోవడం' అనే విప్లవ ప్రతిఘాతుక వ్యూహంలో భాగంగా చేపడుతున్న 'సివిక్ యాక్షన్ ప్రోగ్రాం'లకు అత్యున్నత స్థాయి అధికార గణం రావడాన్ని బట్టి ఇది అణచివేతలో భాగమేనని, నిర్బంధానికి ఇది మరో ముఖమే అని స్పష్టంగా అర్థం చేసుకోవచ్చు. మరుసటి రోజు విజయ్ కుమార్ ఈ గ్రామీణ ప్రాంతానికి రావాల్సి ఉండే. కానీ మార్చి 27న చాద్‌గావ్ ఏరియాలోని పూస్‌టోల గ్రామ సమీపంలో మావోయిస్టులు మందుపాతర పేల్చడంతో అతని పర్యటనకు బ్రేక్‌పడింది. ఈ మందుపాతర ఘటనలో 13 మంది కోబ్రా బలగాలు చనిపోగా, అంతకు రెట్టింపు మంది గాయపడ్డారు.

సాక్షాత్తు విజయ్‌కుమార్ జిల్లా కేంద్రంలో ఉండగానే ఈ ఘటన జరగడంతో ప్రభుత్వ సాయుధ బలగాల అధికారులు ఖంగుతిన్నారు. ఇక వాళ్ల ప్రతాపాన్నంతా ప్రదర్శించుకోవాలనుకున్నారు. అధికారుల ఆదేశాలను అందుకున్న జవానులు తేలిక లక్ష్యాలైన అమాయక ప్రజలపై పడ్డారు. అంబుష్ జరిగిన రోజే 21 మంది నక్సలైట్లను అరెస్టు చేశామని పేపర్లలో వార్తలు వేసి పెద్దఎత్తున ప్రచారం చేసుకున్నారు. కానీ ఈ 21 మంది ఎవరు అనే వాస్తవంలోకి వెళ్తే పోలీసుల 'ప్రతాపం' ఎవరి పైననో అర్థమవుతుంది. వీళ్లంతా మధ్యప్రదేశ్‌లోని బాలాఘాట్, మాండ్లా జిల్లాల నుండి వెదురు నరకడానికి వచ్చిన కూలీలు. మందుపాతర పేలినస్థలానికి కొంచెం దూరంలో వెదురుకూలీల క్యాంపు ఉంది. మందు పాతర ఘటన జరగగానే ఆ క్యాంపు మీద పడి, ఈ సంఘటనకు ఎటు వంటి సంబంధంలేని నిరుపేద కూలీలను బాగా కొట్టి అరెస్టు చేశారు.

మార్చ్ 29న పూస్‌టోల ఊరిపై దాడి చేశారు. కొందరిని అరెస్టు చేశారు. ఇలా అరెస్టు చేయబడిన వారిలో ఈశ్వర్ ఆత్‌లా (21) అనే యువకుడు ఉన్నాడు. ఇతన్ని విడిపించుకోవడానికి ప్రయత్నించిన ఇతని చిన్నమ్మలు సోనీబాయి ఆత్లా (35), శాంతాబాయి ఆత్లా (39)లను పోలీసులు విచక్షణారహితంగా కొట్టారు. ఈ దెబ్బలకు గాయపడిన వీళ్లిద్దరు దాదాపు వారం రోజుల పాటు ఆసుపత్రిలో చికిత్స తీసుకున్న విషయం పత్రికలు కూడా వెల్లడించాయి. మార్చి 30న బాప్‌డా గ్రామంతో పాటు పూస్‌టోల గ్రామంపై తిరిగి దాడి జరిగింది. ఈ దాడిలో దాదాపు తొమ్మిది మందిని అరెస్టు చేశారు. ఈ తొమ్మిది మందిలో బాప్‌డా గ్రామానికి చెందిన నానాజీ పద్దా, పూస్‌టోల గ్రామానికి చెందిన రాహుల్ ఆత్లా ఉన్నారు. రాహుల్ ఆత్లా గ్రాడ్యుయేషన్ విద్యార్థి. సెలవుల కారణంగా ఇంటికి వచ్చాడు. ఇతన్ని అరెస్టు చేసి జనమిలీషియా కమాండర్‌ను అరెస్ట్ చేశామని పోలీసులు ప్రచారం చేసుకున్నారు. మందుపాతర ఘటన జరిగిన రోజు రోడ్డు మీద వచ్చి, పోయే ప్రయాణీకులను కూడా పట్టుకొని పోలీసులు విచక్షణారహితంగా కొట్టారు. సెలవులపై ఇంటికి వచ్చిన ఒక మిలిటరీ ఉద్యోగి సైకిల్ మీద చుట్టాలింటికి పోతుంటే దారిలో పట్టుకొని బాగా కొట్టారు. నేను మిలిటరీ వాడిని అని చెప్పుకున్నా, ఐడెంటిటీ కార్డు చూపించినా కూడా పోలీసులు వినలేదు. పైన చెప్పిన సంఘటనలే కాక మందుపాతర సంఘటనకు ముందూ, తర్వాత అనేక గ్రామాలపై దాడులు చేసి ప్రజల్లో ఒక భయానక వాతావరణాన్ని సృష్టించడానికి ప్రయత్నించారు.

విదర్భ ప్రాంతంలోని గడ్చిరోలి జిల్లా అనేక ఖనిజ సంపదలకు నిలయం. ఇక్కడ ఎన్నో కంపెనీలు ప్రభుత్వంతో ఎం.ఒ.యు.లు కుదుర్చుకొని గనుల్ని తెరచి ఆదివాసుల పంట భూముల్ని, అడవుల్ని, కొండల్ని నాశనం చేయడానికి సిద్ధంగా ఉన్నాయి. సూర్జాగఢ్ సహా ఎన్నో చోట్ల కార్పొరేట్ విధ్వంసకాండకు రంగం సిద్ధమైంది. అయితే గత ముప్పయ్యేళ్లుగా మావోయిస్టు పార్టీ నాయకత్వంలో సంఘటితమైన ప్రజలు దీనికి అతి పెద్ద అడ్డంకిగా ఉన్నారు. అందుకే దండకారణ్యంలో భాగమైన గడ్చిరోలి ప్రాంతంలో ఆపరేషన్ గ్రీన్‌హంట్‌లో భాగంగా పోలీసులు, అర్ధసైనిక బలగాలు, కోబ్రా, సి-60 కమాండోలు ప్రజలపై అత్యంత ఫాసిస్టు పద్ధతుల్లో నిర్బంధకాండ కొనసాగిస్తున్నారు. ఈ నిర్బంధకాండకు, నిర్బంధం అండతో ఇక్కడి జల్-జంగల్-జమీన్‌ను కార్పొరేట్ సంస్థలకు వశపర్చి విచ్చలవిడి దోపిడీపీడనలను సాగించాలని చూస్తున్న ప్రభుత్వ విధానాలకు జవాబుగానే కోబ్రా కమాండోలపై మార్చ్ 27న పిఎల్‌జిఎ గెరిల్లాలు జరిపిన ఎదురుదాడిని చూడాల్సి ఉంటుంది. గడ్చిరోలి ప్రాంత ప్రజలు సాగిస్తున్న న్యాయమైన పోరాటాల్ని బలపర్చడం, వాళ్లపై రాజ్యం కొనసాగిస్తున్న ఫాసిస్టు నిర్బంధాన్ని ఖండించడం ప్రజాస్వామ్య వాదులందరి బాధ్యత.

*(రచయిత సామాజిక ఉద్యమ కార్యకర్త)* వీ

# సామాజిక శాస్త్రాల అధ్యయనాలు

***గ్రామాలను అధ్యయనం చేసే వివిధ పద్ధతులను వివరించే క్రమంలో సామాజిక శాస్త్ర పద్ధతుల గురించి చెపుతున్నారు ఎన్. వేణుగోపాల్***

గ్రామాలను అధ్యయనం చేసే పద్ధతులు, పరికరాలు సామాజిక శాస్త్రాలలో గత శతాబ్దంలో విస్తృతంగా అభివృద్ధి అయ్యాయి. యూరపియన్ వలసవాద ప్రభుత్వాల పాలనా అవసరాల కొద్దీ కొంత, విశ్వవిద్యాలయాల విద్యా పరిశీలనలలో భాగంగా కొంత వివిధ దేశాల లోని ఆదిమ జాతులను పరిశీలించే మానవ శాస్త్రం (ఆంత్రొపాలజీ), సమాజ నిర్మాణాన్ని పరిశీలించే సమాజశాస్త్రం (సోషియాలజీ) సామాజిక అధ్యయనాల మీద దృష్టి పెట్టాయి. ఈ రెండు శాస్త్రాల ఉమ్మడి చర్చనీయాంశాలతో సోషల్ ఆంత్రొపాలజీ, కల్చరల్ ఆంత్రొపాలజీ శాఖలు, సమాజ శాస్త్రంలో గ్రామాల అధ్యయనాల ప్రత్యేకశాఖగా రూరల్ సోషియాలజీ అభివృద్ధి అయ్యాయి. ఈ శాస్త్ర శాఖలన్నిటిలోనూ ప్రత్యేక మైన, నిశితమైన అధ్యయన పద్ధతులు, పరికరాలు తయారయ్యాయి.

అలాగే ఆర్థికవ్యవస్థలను పరిశీలించే అర్థశాస్త్రం, సామాజిక చలనాన్ని పరిశీలించే చరిత్ర, రాజకీయ నిర్మాణాలను పరిశీలించే రాజనీతిశాస్త్రం, పాలనావ్యవస్థలను పరిశీలించే ప్రభుత్వపాలనాశాస్త్రం, వ్యక్తి ప్రవర్తన మూలాలను, పర్యవసానాలను పరిశీలించే మనస్తత్వశాస్త్రం వంటి ఇతర సామాజికశాస్త్ర శాఖలు కూడ సమాజ పరిశీలనకు, గ్రామ పరిశీలనకు పూనుకుని తమ తమ పద్ధతులను, పరికరాలను అభివృద్ధి చేశాయి. అంతకుముందే రూపొంది ఉన్న పరికరాలతో, అవగాహనలతో పరిశీలన ప్రారంభించినా, పరిశీలనా క్రమంలో ఎన్నో కొత్త పరికరాలను కనిపెట్టడం జరిగింది. అలా ఈ శాస్త్ర శాఖలు, వాటి అధ్యయన పద్ధతులు ఇప్పటికీ విస్తరిస్తూనే ఉన్నప్పటికీ, ప్రస్తుతానికి అన్ని సామాజిక శాస్త్ర శాఖలకూ ఉమ్మడిగా గుర్తించదగిన కొన్ని పరిశీలనా పరికరాలు తయారయి ఉన్నాయి. ఆ పరికరాలన్నీ కూడ భారత దేశంలో గ్రామ అధ్యయనాలకు ఉపయోగపడతాయి. ఆ పరికరాలన్నిటికీ కూడ వాటి సాంకేతిక ప్రత్యేకతలు, అవకాశాలు, పరిమితులు ఉన్నాయి. ఈ పరికరాలలో ప్రస్తుతానికి మనకు ఉపయోగపడే గ్రామ అధ్యయన పద్ధతులుగా సెన్సస్ (జనగణన), నమూనా సర్వే, ఇంటర్వ్యూ – ప్రశ్నావళి, గణాంకశాస్త్ర విశ్లేషణలు, కేస్ స్టడీ, పార్టిసిపెంట్ అబ్జర్వేషన్ (భాగస్వామ్య పరిశీలన) వంటి వాటిని అర్థం చేసుకుంటే సరిపోతుంది.

సెన్సస్ ప్రత్యేకించి సామాజిక శాస్త్రాలు అన్వేషించకపోయినా, ఆ శాస్త్రాలకన్న ముందునుంచే ఉనికిలో ఉన్నా, సామాజిక శాస్త్రాలన్నిటికీ గ్రామ అధ్యయనాలలో ఉపయోగపడే పరికరం సెన్సస్. దీన్ని జనగణన అని పిలుస్తున్నాం గాని అది కేవలం తలల లెక్కింపు మాత్రమే కాదు. దాని నిజమైన అర్థం ఒక ప్రాంతంలోని (సాధారణంగా ఒక దేశంలోని) జనాభా గురించిన క్రమబద్ధమైన సమాచారపు సమగ్ర గణాంకాలు అని. ఈ సమాచార వనరులో గ్రామ అధ్యయనాలకు ఉపయోగపడే అంశాలు ఎన్నో ఉంటాయి. భారత దేశంలో బ్రిటిష్ వలసకాలంలో 1872లో ఈ సెన్సస్ మొదలయ్యాయి. 1881 నుంచి క్రమబద్ధంగా ప్రతి పది సంవత్సరాలకు ఒకసారి ఈ సెన్సస్ సమాచార సేకరణ జరుగుతోంది. ఇప్పటికి పదిహేను సార్లు సేకరణ జరిగిన ఈ గణాంకాలు, వివరాలు గ్రామాల స్థితికీ, చలనానికీ సంబంధించిన పరిమాణాత్మక సూచికలను అందిస్తాయి. 1931 జనగణన వరకు దేశమంతా ఒకేరోజున జనసంఖ్యను లెక్కించేవారు. కాని సాంకేతికపరమైన ఇబ్బందుల రీత్యా ఆ ఒక్కరోజు జనగణనను వదిలేసి, 1941 నుంచీ ఫిబ్రవరిలో మూడువారాల పాటు జనసంఖ్య నమోదు చేయడం, మార్చ్ 1న చేర్పులు, మార్పులు (కొత్త జననాలు, మరణాలు) నమోదు చేసి జనగణన ఫలితాలు ప్రకటించడం మొదలయింది.

ఈ జనగణనలో కేవలం ఎంతమంది మనుషులు ఉన్నారనే అంకె మాత్రమే కాక, వారి వయసు, స్త్రీపురుష నిష్పత్తి, వైవాహిక హోదా, గ్రామ – పట్టణ నిష్పత్తి, వలసల వివరాలు కూడ ఉంటాయి. అంతకన్న ముఖ్యంగా, మతం, మాతృభాష, తెలిసిన భాషలు, షెడ్యూల్డ్ కులం లేదా తెగకు చెందినవారా, విద్యాస్థాయి, శ్రామిక స్థాయి, వృత్తి, పారిశ్రామిక ఉపాధి, నివాసస్థలం నుంచి పనిస్థలానికి దూరం, ప్రయాణసౌకర్యం, వ్యవసాయరంగ కుటుంబాల భూమి విస్తీర్ణం, యాజమాన్య స్థితి, నీటి పారుదల సౌకర్యం, నివాసగృహం స్థితి, నివాసగృహంలో గదుల సంఖ్య, శారీరక, మానసిక వైకల్యం, తాగునీటి వసతి, మరుగుదొడ్డి, స్నానాలగది వసతి, ఇంట్లో రాత్రిపూట వెలుగుకు వనరు, వంటకు వాడే ఇంధనం, ప్రయాణ, రవాణా వాహనాల వసతి, వినోద, విజ్ఞాన, సమాచార సాధనాల వసతి మొదలయిన సామాజిక, ఆర్థిక సమాచారం కూడ జనగణనలో భాగమే. ప్రస్తుతం ఈ జనగణన కుటుంబ జాబితా (హౌజ్ లిస్ట్ షెడ్యూల్), గృహ వివరాలు (హౌజ్ హోల్డ్ షెడ్యూల్) అనే రెండు ప్రధాన సమాచార పత్రాల ద్వారా జరుగుతోంది. వీటిలో మొదటి పత్రంలో ఒక కుటుంబానికి సంబంధించిన 34 వివరాలు, రెండవ పత్రంలో ఒక ఇంట్లో ఒక్కొక్క వ్యక్తికి సంబంధించిన 17 వివరాలు సేకరిస్తారు.

జనగణనలో విలువైన సమాచారమే పోగు పడుతుంది గాని ఆ సమాచారానికి సంబంధించి తీసుకోవలసిన జాగ్రత్తలు కూడ కొన్ని ఉన్నాయి. మొట్టమొదటిది, ఈ వివరాలు, గణాంకాల నాణ్యతలో, కచ్చితత్వంలో కొన్ని సమస్యలు ఉన్నాయి. దేశపు స్థూల స్థాయిలో దాదాపు సమగ్రంగా, కచ్చితంగా ఉండే ఈ అంకెలు సూక్ష్మ స్థాయిలో అంతే

సమగ్రంగా, కచ్చితంగా ఉంటాయని చెప్పలేం. 'గ్రామం, పట్టణం/నగరం, వాటిలోని వీథులు వంటి చిన్న భౌగోళిక ప్రాంతాల సమాచారం లో కొన్ని పొరపాట్లుండే అవకాశం ఉంది. వయసు, వైవాహికస్థితి, విద్యాస్థాయి, ఆర్థిక కార్యకలాపాలకు సంబంధించి సమాచార సేకర్తల, సమాచార దాతల నిర్లక్ష్యం వల్ల సమాచార నమోదు సమయంలో జరిగే పొరపాట్లు కావచ్చు. ఆ సమాచారాన్ని విశ్లేషించే సమయంలో జరిగే పొరపాట్లు కావచ్చు. లేదా ఆ సమాచారం అచ్చయ్యేటప్పుడు జరిగే పొరపాట్లు కావచ్చు. కాని ఆ సమాచారాన్ని విశాల స్థాయిలో, స్థూల స్థాయిలో కలగలిపినప్పుడు ఆ పొరపాట్లలో చాలభాగం ఒకదాన్ని ఒకటి సరిచేసుకుంటాయి, లేదా ఆ పొరపాట్ల తీవ్రత తగ్గుతుంది. అందువల్ల, జనగణన సమాచారాన్ని జిల్లాలకో, ఇంకా పెద్ద భౌగోళిక ప్రాంతాలకో వాడినప్పుడు ఉపయోగకరంగా ఉంటుంది. సూక్ష్మస్థాయిలో వాడినప్పుడు చాల జాగ్రత్త వహించవలసి ఉంటుంది' అని జనగణన మీద ప్రామాణిక పరిచయ గ్రంథం **పాపులేషన్ ఆఫ్ ఇండియా ఇన్ ది న్యూ మిలీనియం: సెన్సస్ 2001** లో మహేంద్ర కె ప్రేమి అన్నారు.

ఆ జాగ్రత్తతో పాటే, జనగణన సమాచార సేకరణలో ప్రతి విడతకూ మార్పులు చేర్పులు జరుగుతున్నాయని కూడ గుర్తించవలసి ఉంది. ఉదాహరణకు 1931 వరకు కులం నమోదయ్యేది, ఆ తర్వాత రద్దయింది. 1941 వరకు నరజాతి (రేస్) నమోదయ్యేది, ఆ తర్వాత రద్దయింది. 1951, 1961లలో జాతి (నేషనాలిటీ) నమోదయింది గాని ఆ తర్వాత రద్దయింది. ప్రస్తుతం సేకరిస్తున్న సమాచారంలో ఎక్కువ అంశాలు 1991, 2001 జనగణనలలో కొత్తగా చేరినవే. అలాగే ఒక జనగణనకూ మరొక జనగణనకూ మధ్య వాడే పదజాలంలో మార్పులు, ఒకే పదానికి నిర్వచనాలలో మార్పులు కూడ ఉంటున్నాయి. ఉదాహరణకు పట్టణం అనే మాటకు, శ్రామికులు అనే మాటకు ఒక్కొక్క జనగణనలో ఒక్కొక్క రకమైన నిర్వచనం ఉంది. పట్టణం అనే మాటకు 1991 జనగణనలో నిర్వచనానికీ, 2001 జనగణనలో నిర్వచనానికీ తేడా ఉండడం వల్ల ఆంధ్రప్రదేశ్ లో పట్టణాల సంఖ్య 1991లో 264గా ఉన్నదల్లా 2001 నాటికి 210కి తగ్గింది. ఈ పదేళ్లలో ఆంధ్రప్రదేశ్‌లో జనగణన నిర్వచనం ప్రకారం కొత్తగా 35 పట్టణాలు వచ్చాయి. పాత జాబితాలోని 89 పట్టణాలు ఇతర పట్టణాలలో కలిసిపోవడమో, పట్టణ నిర్వచనం నుంచి తొలగిపోవడమో జరిగింది. పట్టణాల సంఖ్య ఇలా మారిపోయిందంటే ఆ మేరకు గ్రామాల సంఖ్య, గ్రామీణ జనాభా కూడ మారిపోయినట్టే.

ఈ లోపాల గురించి జాగ్రత్త వహిస్తూనే జనగణన వివరాల నుంచి గ్రామానికి సంబంధించిన ప్రాథమిక వివరాలు, గణాంకాలు సేకరించవచ్చు. సాధారణంగా జనగణనలో గ్రామ వివరాల పట్టికలు ఐదారు సంవత్సరాల తర్వాత అచ్చువేస్తారు. ఇటీవల ఆ వివరాలన్నిటినీ ఇంటర్నెట్ మీద సెన్సస్ వెబ్‌సైట్ (http://www.censusindia.gov.in)లో కూడ పెడుతున్నారు. ప్రస్తుతం దేశంలోని ఏ గ్రామానికైనా సంబంధించిన దాదాపు ఇరవై అంశాల మౌలిక సమాచారాన్ని ఈ జనగణన వివరాలనుంచి సేకరించవచ్చు. సాధారణంగా సామాజిక శాస్త్రపు గ్రామ అధ్యయనాలకు మొదటి మెట్టు ఈ జనగణన వివరాల సేకరణే.

ప్రత్యక్ష పరిశీలనా పద్ధతులు జనగణన వివరాలయితే గ్రామానికి వెళ్లకుండానే సేకరించే వీలుంది గాని, గ్రామానికి వెళ్లకుండా గ్రామాన్ని అధ్యయనం చేయడం అసాధ్యం. గ్రామానికి వెళ్లినప్పుడు కూడ అక్కడ కనబడే వందలాది, వేలాది మందిని కలిసి మాట్లాడడం, ఆ మాటలవెనుక సారాంశాన్ని గ్రహించడం, గ్రామాన్ని తిరిగి చూడడం, అక్కడి పరిణామాలను పరిశీలించడం సులభమైన పని కాదు. అందుకు ఎక్కువ సమయమూ, నిశితమైన దృష్టీ మాత్రమే కాదు, ప్రజాభిప్రాయాన్ని, ప్రజాభిమతాన్ని గ్రహించగలిగే పరికరాలు కూడ కావాలి.

ఆ పరికరాలతో సాగే పరిశీలనను సామాజిక శాస్త్రాలు నియంత్రిత పరిశీలన, అనియంత్రిత పరిశీలన అని రెండు రకాలుగా విభజిస్తాయి. నియంత్రిత పరిశీలన అంటే పరిశీలించ దలచుకున్న అంశాన్ని వేరు చేసి, సూటిగా, ప్రత్యక్షంగా పరిశీలించడం. పరిశీలకులకు పరిశీలనా వస్తువు మీద నియంత్రణ, అదుపు ఉండేలా చూడడం. అనియంత్రిత పరిశీలనలో పరిశీలనా వస్తువు మీద పరిశీలకులకు ఎటువంటి అదుపూ లేకుండా పరిశీలనా వస్తువును దాని నిత్యజీవితాచరణలో సహజంగా, స్వేచ్ఛగా ప్రవర్తించనిచ్చి పరిశీలకులు తమ పరిశీలన సాగించడం. నియంత్రిత పరిశీలనా పద్ధతులలో నమూనా సర్వే, ఇంటర్వ్యూ – ప్రశ్నావళి, కేస్ స్టడీ ముఖ్యమైనవి. నమూనా సర్వే, ప్రశ్నావళి ద్వారా వచ్చిన సమాచారాన్ని సాధారణంగా గణాంకశాస్త్ర పద్ధతులలో విశ్లేషించడం జరుగుతుంది. అనియంత్రిత పరిశీలనా పద్ధతులలో పార్టిసిపెంట్ అబ్జర్వేషన్ ముఖ్యమైనది.

అయితే ఏ పరికరాలు ఉపయోగించినా సమాజాన్ని ప్రత్యక్షంగా పరిశీలించడానికి, పరిశోధించడానికి ఒక ప్రధానమైన పరిమితి ఉంది. ప్రకృతి పరిశీలనలో పరిశీలనా వస్తువుకూ పరిశీలకులకూ మధ్య స్పష్టమైన విభజన ఉంటుంది. చాలవరకు ప్రకృతి పరిశీలనావస్తువు నిశ్చలంగా ఉంటుంది, చలనంలో ఉన్నప్పుడు కూడ దానిమీద ఇతర ప్రభావాలు లేకుండా నియంత్రించి పరిశీలించడం జరుగుతుంది. కాని సామాజిక పరిశీలన చేసేటప్పుడు పరిశీలనా వస్తువూ మనిషే, పరిశీలన చేసేదీ మనిషే. పరిశీలనా వస్తువూ పరిశీలక వస్తువూ కూడ నిరంతర చలనంలో, ఆలోచనలో, ప్రభావాలలో, పరస్పర ప్రభావాలలో ఉంటారు. ఈ అన్యోన్య చర్య – ప్రతిచర్యల వల్ల పరిశీలనా వస్తువులోనూ పరిశీలకులలోనూ కూడ పరిశీలనాక్రమంలోనే మార్పులు వస్తాయి. ఈ మార్పులక్రమం కూడ సంక్లిష్టంగా, గజిబిజిగా, ఆదానప్రదానాలతో, వర్తులంగా, బహుముఖంగా ఉండడం వల్ల సంపూర్ణంగా గుర్తించడం కూడ కష్టమవుతుంది. పరిశీలకులు తమలో జరిగిన మార్పులను పరిశీలనావస్తువులో మార్పులుగా పొరపడుతున్నారా, పరిశీలనా వస్తువులో నిజంగా జరిగిన మార్పులను గమనించ గలుగుతున్నారా, అటూ ఇటూ కూడ జరిగిన మార్పుల సంబంధాన్ని గుర్తిస్తున్నారా కచ్చితంగా చెప్పలేని స్థితి ఉంటుంది. సమాజ స్థితిగతుల గురించి మనుషులలో భిన్నమైన అభిప్రాయాలు, అంచనాలు, నిర్ధారణలు ఉండడానికి కారణం ఇదే. కనుకనే సామాజిక పరిశీలనలో పరిశీలకులు తమ పరిశీలనా పరికరాలను ఎక్కువ జాగ్రత్తగా వాడవలసి ఉంటుంది. తాత్విక దృక్పథంలో, పరిశీలనా లక్ష్యంలో స్పష్టంగా ఉంటూనే, పరిశీలనా పరికరాలను కచ్చితంగా వాడినప్పుడు మెరుగైన నిర్ధారణలకు రావడానికి అవకాశం ఉంటుంది.

## నమూనా సర్వే

ప్రకృతికి సంబంధించిన పరిశీలనలు సాధారణంగా ఒక నమూనా (శాంపిల్ – మచ్చు) ను తీసుకుని జరుగుతాయి. ఒక అణువు మీద పరిశోధన ద్వారా అటువంటి అనేక అణువులు ఉన్న పదార్థం స్థితినీ గతినీ విశ్లేషిస్తారు. అందరికీ తెలిసిన మామూలు ఉదాహరణ చెప్పాలంటే ఒక మెతుకు పట్టి చూసి అన్నం ఉడికిందా లేదా చెపుతారు. ఈ నమూనా పద్ధతినే సామాజిక పరిశీలనకు కూడ ఉపయోగించవచ్చునని భావించిన సామాజిక శాస్త్రాలు నమూనా పరిశీలన పద్ధతిని అభివృద్ధి చేశాయి. అయితే ప్రకృతిలోని పదార్థంలోని అణువుల చలనం కన్న సమాజంలోని మనుషుల చలనం విశిష్టమైనది. అణువులకు ఆలోచన, స్వీయ ఆచరణ, నిర్దిష్ట లక్ష్యం కోసం ఆచరణ లేవు, మనుషులలో ప్రతి ఒక్కరికీ, మానవమేధకు సహజంగానే అవన్నీ ఉన్నాయి. అందువల్ల ఒక మనిషిని అర్థం చేసుకుంటే మరొక మనిషిని అర్థం చేసుకున్నట్టు కాదు. సమాజంలో ఒక్కరిని మినహా మిగిలిన వారందరినీ పరిశీలించినా ఆ మిగిలిపోయిన ఒక్క వ్యక్తే తన ప్రత్యేకతలతో ఉండవచ్చు. మరి సమాజంలోని మొత్తం మనుషులను పరిశీలించడం ఏ ఒక్కరికీ, ఎంత పెద్ద పరిశోధనా సంస్థకూ సాధ్యం కాదు. అందువల్ల ఇక్కడ కూడ నమూనా పరిశీలన పద్ధతిని ఉపయోగించవచ్చునని, కాకపోతే ఈ నమూనాను ఎంచుకోవడంలో పరిశోధనా లక్ష్యాన్ని బట్టి తగిన జాగ్రత్తలు తీసుకోవాలని సామాజిక శాస్త్రాలు భావించాయి. ఎంపిక చేసిన నమూనాకు ప్రాతినిధ్య స్వభావం ఉండాలని, సమూహంలోని ఏ వ్యక్తినయినా నమూనాగా తీసుకునే అవకాశం ఉండాలని, సమాజంలోని ప్రత్యేకతలకు, విభజనలకు, వైవిధ్యాలకు నమూనాలో చోటు కల్పించాలని, పరిశీలనా వస్తువులో భిన్న స్థాయిలు ఉన్నప్పుడు నమూనాలను కూడ ఆయా స్థాయిలలో తీసుకోవాలని, ఆ నమూనా ఆధారంగా చేసే నిర్ధారణ మొత్తం సమాజానికి సరిపోగలిగేలా ఉండాలని, ఏవైనా మినహాయింపులు ఉన్నా అవి గణాంక పొరపాట్లుగా, అతి తక్కువగా మాత్రమే ఉండాలని సామాజిక శాస్త్రాలలో అనేక జాగ్రత్తలు ఉన్నాయి.

ఒక గ్రామానికి వెళ్లి అధ్యయనం చేసేటప్పుడు గ్రామంలోని రెండు మూడు వేల మంది ప్రజలలో ప్రతి ఒక్కరినీ కలిసి, వారి సమాచారం సేకరించి, పరిశీలించి, నిర్ధారణలు చేయడం అసాధ్యం. అది ఎక్కువ శ్రమనూ కాలాన్నీ వ్యయాన్నీ తీసుకుంటుంది గనుక ఈ నమూనా పరిశీలన పద్ధతిని అవలంబించడం జరుగుతుంది. మొట్టమొదట గ్రామం గురించి సమగ్ర చిత్రాన్ని గ్రహించి, ఆ గ్రామంలోని కుల, మత, ఆర్థిక, వయో, స్త్రీ–పురుష, అక్షరాస్య–నిరక్షరాస్య విభజనల ఆధారంగా ఆయా సమూహాలను గుర్తించి ప్రతి సమూహం నుంచీ నమూనాలను ఎంపిక చేస్తారు. పరిశీలనా లక్ష్యాన్ని బట్టి ఆ నమూనాలను పరిశీలించి అంతిమ నిర్ధారణలకు వస్తారు. సమూనాలను పరిశీలించడానికి ఇంటర్వ్యూ, ప్రశ్నావళి, కేస్ స్టడీ వంటి పద్ధతులున్నాయి.

## ఇంటర్వ్యూ – ప్రశ్నావళి

ఈ అధ్యయనాల నమూనాలుగా ఉండేది వ్యక్తులే గనుక వారితో సంభాషించడం ద్వారా, నిర్దిష్టమైన అంశాలపై ప్రశ్నలు వేసి వారినుంచి సమాధానాలు రాబట్టడం ద్వారా సమాచారం సేకరించడం జరుగుతుంది. ఈ ఇంటర్వ్యూ పద్ధతి ముందే నిర్ణయించుకున్న ప్రశ్నావళి రూపంలోనైనా ఉండవచ్చు, సంభాషణలో అప్పటికప్పుడు ప్రస్తావనకు వచ్చే అంశాలను నమోదు చేయడం రూపంలోనైనా ఉండవచ్చు.

పరిశీలనాంశాన్ని బట్టి నమూనా నుంచి గాని, మొత్తం జనాభా నుంచి గాని రాబట్టదలచుకున్న సమాచారం ఏమిటో స్పష్టత ఉంటే ఆ సమాచార సేకరణకు అవసరమైన ప్రశ్నపత్రాలను తయారు చేసుకోవచ్చు. ఆ ప్రశ్నపత్రాల నిడివి ఎంతయినా ఉండవచ్చు. నాలుగైదు ప్రశ్నలకు పరిమితమైన ప్రశ్నపత్రాలనుంచి ముప్పై పేజీల ప్రశ్నపత్రం దాకా అనేక రకాల ప్రశ్నపత్రాలు ఉన్నాయి. లేదా విడివిడి ప్రశ్నలు కాక, ప్రశ్నలను రంగాలుగా విభజించి ఆయారంగాల మీద స్థూలంగా సమాచారం సేకరించే పద్ధతి కూడ ఉంది. పెద్దపెద్ద పరిశోధనా పథకాలలో సామాజిక శాస్త్ర శాఖలు ఈ ప్రశ్నపత్రాలను తయారు చేసి, గ్రామాలకు వెళ్లి ఆ ప్రశ్నపత్రాలకు సమాధానాలు నింపుకురావడానికి సమాచార సేకర్తలను, పరిశోధక విద్యార్థులను నియమిస్తాయి. ఆ సమాచార సేకర్తలు ఆ ప్రశ్నపత్రాలతో గ్రామస్తులలో ఎంపిక చేసిన నమూనాల దగ్గరికి వెళ్లి ఒక్కొక్క ప్రశ్న అడుగుతూ సమాచారం నమోదు చేస్తారు. ఈ ప్రశ్నపత్రాలు తామే నాలుగైదు రకాల జవాబులు ఇచ్చి వాటిలో ఒకదాన్ని ఎంచుకొమ్మనడం గాని, లేదా ప్రశ్న మాత్రమే ఇచ్చి జవాబు చెప్పమనడం గాని చేస్తాయి. సమాచార స్పష్టత, సమగ్రత అడిగిన ప్రశ్నలమీదనే ఆధారపడి ఉంటాయి. ప్రశ్నలు అడిగిన పద్ధతే ఒకరకమైన జవాబును ఆశించినదైనా, సమాచారదాతకు అర్థంకానిదైనా, సమాచారదాతను గందరగోళపరిచేదైనా జవాబులు సరిగా రావు. పరిశీలనా లక్ష్యమే దెబ్బతింటుంది. అందువల్ల ప్రశ్నలు వీలయినంత తటస్థంగా, సూటిగా, భిన్నమైన అర్థాలు రాకుండా జాగ్రత్తలు తీసుకోవాలి.

## గణాంకశాస్త్ర విశ్లేషణలు

నమూనా పరిశీలన ద్వారా, ప్రశ్నపత్రాల జవాబుల ద్వారా వచ్చిన సమాచారాన్ని క్రోడీకరించడం పెద్దపని. ఒక గ్రామ జనాభా కొన్ని వేలు అయితే నమూనా కొన్ని డజన్లో, కొన్ని వందలో కూడ కావచ్చు. నమూనా అతి తక్కువగా పదుల్లో ఉన్నప్పటికీ కూడ ప్రతి మనిషీ ఒక్కొక్క రకమైన జవాబు చెప్పి ఉండవచ్చు. అప్పుడు ఎన్ని నమూనాలు ఉంటే అన్ని రకాల జవాబులు ఉంటాయి. అన్నిరకాల జవాబులు ఉన్నప్పుడు వాటిని విశ్లేషించి నిర్దిష్టమైన నిర్ధారణ చేయడం కష్టమవుతుంది. ఆ వైవిధ్యాన్ని గ్రహించాలంటే ఆ జవాబులలో సన్నిహితంగా ఉన్న జవాబులేవో, అత్యధిక స్థాయిలో వెలువడిన జవాబేదో, ఎక్కువ సంభావ్యమైన అంచనా ఏదో గుర్తించగలగాలి. ఈ సంభావ్యతలను అంచనా కట్టడానికి గణాంకశాస్త్ర పరికరాలు వాడవలసి వస్తుంది. సగటు, మధ్యరాశి, వృద్ధిరేటు, నిష్పత్తి, సంభావ్యత, సమీకరణం వంటి అనేక పరికరాల ద్వారా సామాజిక చిత్రాన్ని పట్టుకోవలసి వస్తుంది.

## కేస్ స్టడీ

నమూనా పరిశీలనకు ఉండగల పరిమితులను దృష్టిలో పెట్టుకుని, ఒక రకంగా నమూనా పరిశీలన లోని సంఖ్యాత్మక నిర్ధారణలను గుణాత్మక నిర్ధారణలతో పూరించేందుకు కేస్ స్టడీ (సందర్భ పరిశీలన) అనే పరికరం తయారయింది. ఇది నమూనాలోని, లేదా నమూనాకు

బైట ఉండే కొన్ని వాస్తవ చిత్రాలను తీసుకుని వాటిని వివరంగా చర్చిస్తుంది. ఒక మనిషిని, సమూహాన్ని, పరిణామాన్ని ఒక సందర్భంగా తీసుకుని దాన్ని సమగ్రంగా వివరించడం, చర్చించడం ద్వారా దానిలోని ప్రత్యేకతలను వెలికి తీయడానికి ప్రయత్నం జరుగుతుంది. నమూనా పరిశీలనలో అన్ని ప్రత్యేకతలూ రద్దయి సగటు నిర్ధారణలే బయటపడతాయి గాని, కేస్ స్టడీలో ప్రత్యేకతల చిత్రణ, విశ్లేషణ జరుగుతుంది. గ్రామాన్ని, సమూహాన్ని మొత్తంగా తీసుకుని పరిశీలించడం, నమూనాల మీద ఆధారపడక పోవడం, సమాచార సేకరణలో పొరపాట్లను తొలగించడానికి అనేక పద్ధతులు ఉపయోగించడం, సమాచారదాతలను సమాచారవనరులుగా మాత్రమే కాక జ్ఞానవంతులుగా చూడడం కేస్ స్టడీలో ప్రధానమైన అంశాలు. నమూనా పరిశీలనా పద్ధతితో పాటు కేస్ స్టడీ పద్ధతి కూడ ఉపయోగిస్తే గ్రామ అధ్యయనం సమగ్రం అవుతుంది.

### పార్టిసిపెంట్ అబ్జర్వేషన్ (భాగస్వామ్య పరిశీలన)

నమూనా పరిశీలన, ఇంటర్వ్యూ, ప్రశ్నావళి, సర్వే, గణితశాస్త్ర విశ్లేషణలకన్న భిన్నమైనది, ప్రపంచవ్యాప్తంగా మానవశాస్త్రం అభివృద్ధి చేసినది, భారతదేశంలో సమాజ శాస్త్రం ద్వారా ఎక్కువగా ప్రచారం లోకి వచ్చినది పార్టిసిపెంట్ అబ్జర్వేషన్ పద్ధతి. ఒక సమాజాన్ని పరిశీలించదలచుకున్న పరిశీలకులు ఆ సమాజాన్ని బైటినుంచి పరిశీలించజాలరని, దానిలో భాగస్వాములైనప్పుడే సరైన పరిశీలన సాధ్యమవుతుందని, పరిశీలనావస్తువు విశ్వసనీయతను చూరగొనాలన్నా, పరిశీలనావస్తువుకు సంబంధించిన విశిష్ట సంస్కృతిని అర్థం చేసుకోవాలన్నా పరిశీలకులు ఆ పరిశీలనావస్తువులో భాగస్వామి కావాలని ఈ పద్ధతి చెపుతుంది.

ఇరవయో శతాబ్దపు తొలి దశకాలలో పాపువా న్యూగినియా దీవులలో ఆదిమజాతులను అధ్యయనం చేసిన పోలిష్ మానవ శాస్త్రవేత్త బి కె మాలినోవ్ స్కీ ఈ పద్ధతికి ఆద్యుడు. మొదటి ప్రపంచ యుద్ధ కాలంలో ఆయన ప్రారంభించిన ఈ పద్ధతిని ఆ తర్వాత ఎంతో మంది మానవ, సమాజ శాస్త్రవేత్తలు అనుసరించారు. నెలల తరబడి, ఏళ్ల తరబడి కూడ గ్రామ సమాజాలలో, ఆదిమ సమూహాలలో నివసిస్తూ వారి ఆచార వ్యవహారాలను, నిత్య జీవితాచరణను గమనిస్తూ, నమోదు చేసుకుంటూ, వారితో సంభాషిస్తూ, సమాచారం సేకరిస్తూ తమ అధ్యయనాలను కొనసాగించారు. గ్రామ చరిత్రను, గ్రామంలోని సామాజిక, రాజకీయార్థిక, సాంస్కృతిక పరిణామాలను, గ్రామంలోని ప్రజల మధ్య సంబంధాలను సన్నిహితంగా పరిశీలించడానికి ఈ భాగస్వామ్య పరిశీలన అవకాశం ఇస్తుంది. ఈ క్రమంలో పరిశీలనకు గురవుతున్న సమాజం పరిశీలకులను ప్రభావితం చేస్తుంది. పరిశీలకులు ఆ సమాజాన్ని ప్రభావితం చేస్తారు. మామూలు పరిశీలకులు గుర్తించలేని సున్నితమైన, చిన్న విషయాలను కూడ సాన్నిహిత్యం వల్ల భాగస్వామ్య పరిశీలకులు గుర్తించగలరు.

ఇటువంటి భాగస్వామ్య పరిశీలన అధ్యయనం పరిశోధకుల మీద ఎంత గాఢమైన ప్రభావం వేస్తుందో చూపడానికి ప్రఖ్యాత భారత సమాజ శాస్త్రవేత్త ఎం ఎన్ శ్రీనివాస్ ఒక ఉదాహరణ. ఆయన తొలితరం సమాజ శాస్త్రవేత్తగా పాత మైసూరు రాష్ట్రంలోని రాంపుర అనే గ్రామంలో 1948లో దాదాపు పదినెలల పాటు నివసించి అధ్యయనం చేశారు. ఒక బహు కుల గ్రామీణ వ్యవస్థ పనితీరు ఎలా ఉంటుందో, భిన్న కులాల వ్యక్తుల మధ్య, ఒకే కులంలోని వ్యక్తుల మధ్య సంబంధాలు ఎలా ఉంటాయో పరిశోధించడం ఆయన లక్ష్యం. అప్పుడు ఆయన సేకరించి, విశ్లేషించిన సమాచారమంతా ఆ తర్వాత ఇరవై సంవత్సరాలకు 1970లో ఆయన స్టాన్ ఫర్డ్ విశ్వవిద్యాలయంలో ఉండగా ప్రమాదవశాత్తూ అగ్నికి ఆహుతి అయిపోయింది. ఆ గ్రామ అనుభవం ఆయన మీద ఎంత గాఢమైన ప్రభావాన్ని వేసిందంటే, అలా ప్రాథమిక సమాచారాన్నంతా పోగొట్టుకున్నప్పటికీ కేవలం జ్ఞాపకాల మీద మాత్రమే ఆధారపడి ఆయన ఆ గ్రామం గురించి **ది రిమెంబర్ డ్ విలేజ్** అనే అద్భుతమైన పుస్తకం రాశారు.

ఈ భాగస్వామ్య పరిశీలనా పద్ధతి గ్రామ అధ్యయన పద్ధతులన్నిటి లోకీ చాల లోతయినది, విశాల అవకాశాలు గలది. గ్రామం గురించి ఎక్కువ తెలుసుకోవడానికి, లోతుగా విశ్లేషించడానికి వీలు కలుగుతుంది. కాని పరిశోధక విద్యార్థులకు మినహా ఇతరులెవరికైనా ఈ పద్ధతికి అవసరమైన సమయం ఇవ్వడం కష్టమవుతుంది.

ఈ గ్రామ అధ్యయన పద్ధతులన్నీ వాటికవిగా మేలైనవీ, ఉపయోగకరమైనవీ అయినప్పటికీ మార్క్సిస్ట్ దృక్పథం నుంచి చూసినప్పుడు మాత్రం వీటిలో కొన్ని లోపాలు ఉన్నాయి. ఈ సామాజిక శాస్త్ర పరిశీలనా పరికరాలన్నీ రూపానికి ఇచ్చిన ప్రాధాన్యతను సారానికి ఇవ్వవు. పద్ధతికి ఇచ్చిన ప్రాధాన్యతను వస్తువుకు ఇవ్వవు. చరిత్ర గురించీ, పరిణామం గురించీ కొంతవరకు మాట్లాడినప్పటికీ, ఎక్కువగా ఘటనల చిత్రణ, విశ్లేషణ దగ్గరే ఆగిపోతాయి. కొంతవరకు కార్యకారణ సంబంధాలను కూడ స్పృశిస్తాయి గాని కార్యం కూడ కారణం అవుతుందని, పరస్పర సంబంధాలలో అది ఒక వర్తుల చలనమనీ గతితార్కిక అవగాహన లోపిస్తుంది. ఈ సామాజిక శాస్త్ర అధ్యయన పద్ధతులలో అవసరమైనవాటిని ఉపయోగించుకుంటూనే, వాటికి నేపథ్యంలో మార్క్సిస్టు దృక్పథం ఉండాలనే ఆలోచనతో సాగితేనే గ్రామ అధ్యయనాలు అర్థవంతమైన నిర్ధారణలను తీయగలవు. గ్రామసమాజపు చలనాన్ని అర్థం చేసుకోవాలంటే, భవిష్యత్ గమనానికి చోదకశక్తులను, చరిత్ర పరిణామాన్ని అర్థం చేసుకోవాలంటే మార్క్సిస్టు దృక్పథంతో, అంతకు ముందరి పరికరాలలో ఉపయోగకరమైన వాటన్నిటినీ ఉపయోగించుకుంటూ సాగవలసి ఉంటుంది.

*(మిగతా వచ్చే సంచికలో)*

*(రచయిత వీక్షణం సంపాదకులు)*

వీ

# అధ్యక్షుడి ఎన్నిక - ముబారక్‌కు జైలు

***ఈజిప్ట్ మాజీ అధ్యక్షుడు ముబారక్‌కు కోర్టు విధించిన జైలుశిక్ష నేపథ్యంలో తొలిసారిగా అధ్యక్ష పదవికి జరిగిన ఎన్నికలలో పార్టీలు అనుసరించిన వ్యూహాలను వివరిస్తున్నారు సి. రాజశేఖర్***

**మూ**డు దశాబ్దాల పాటు నిరంకుశ పాలనతో ప్రజలను తీవ్ర నిర్బంధాలకు, అత్యాచారాలకు గురిచేసిన నియంత హోస్నీ ముబారక్‌కు జీవిత ఖైదు పడింది. ఏడాదిన్నర క్రితం ముబారక్ పాలనకు వ్యతిరేకంగా తిరుగుబాటు చేసిన ప్రజలపై ప్రభుత్వ బలగాలు సాగించిన దమనకాండలో ఎనిమిది వందల యాభై మంది చనిపోయారు. ఆరు వేలకు పైగా ప్రజలు గాయాల పాలయ్యారు. ఈ దాడులకు సూత్రధారి అధ్యక్షుడు ముబారక్‌ను నిందితుడిగా కోర్టు నిర్ధారించింది. కైరో క్రిమినల్ కోర్టు ఆయనకు, ఆయనతో పాటు హోంమంత్రిగా పనిచేసిన హబీబ్ అల్ అద్లీలకు ఇరవై ఐదేళ్ల జైలు శిక్ష విధించింది. ముబారక్ పై గత పది నెలలుగా విచారణ సాగుతోంది. ఈ కేసులో ముబారక్ కుమారులు ఆలా, గమాల్‌లపై ఉన్న ఆర్థిక నేరాల అభియోగాలను కూడా కోర్టు ఉపసంహరించుకుంది. వీరితో పాటు ఆరుగురు మాజీ పోలీసు కమాండర్లనూ నిర్దోషులుగా విడుదల చేసింది. ఈ చర్యపై ప్రజలు తీవ్ర ఆగ్రహం వ్యక్తం చేశారు. ముబారక్‌కు, ఆయనతో పాటు ఆయన అనుచరులకు మరణశిక్ష విధించాలని డిమాండ్ చేశారు. ఈ తీర్పుపై ఉన్నత న్యాయస్థానానికి అప్పీలు చేసేందుకు ముబారక్ న్యాయవాదులు సిద్ధమౌతున్నారు.

ఈజిప్ట్‌లో గత ఏడాది జనవరి, ఫిబ్రవరి నెలలో జాస్మిన్ విప్లవం స్ఫూర్తితో పోరాట గడ్డ తెహ్రీర్ స్క్వేర్‌లో లక్షలాది మంది ప్రజలు పద్దెనిమిది రోజులపాటు పోరాటంచేసి ముబారక్ పాలనకు తెరదించారు. ఆ తరువాత జరిగిన పరిణామాలలో పాలనను సైన్యం తన స్వాధీనంలోకి తీసుకుంది. దీంతో ప్రజలు తిరిగి నిరసనలు ప్రారంభించారు. ముబారక్‌ను గద్దె దించిన తర్వాత ప్రజాస్వామిక పాలన వస్తుందనుకున్న ప్రజలకు నిరాశే ఎదురైంది. నిరసన చేస్తున్న ప్రజలపై సైన్యం మరోమారు తీవ్ర అణచివేతను అమలు చేసింది. అమెరికా అండతో సైన్యం తాత్కాలిక ప్రభుత్వాన్ని ఏర్పాటు చేసింది. దీంతో తెహ్రీర్ స్క్వేర్ మళ్లీ ఉగ్రరూపం దాల్చింది. ఈ సందర్భంగా సైన్యం నిరసన చేస్తున్న పౌరులపై దమనకాండ సాగించి, వేలాది మందిని అరెస్టు చేసి జైల్లో వేసింది. గత ఏడాది కాలంలో పన్నెండువేల మందికి పైగా సైనిక కోర్టులో విచారించి, అనేక మందికి మరణశిక్ష విధించింది. ముబారక్‌కు వ్యతిరేకంగా ఉద్యమిస్తున్న ప్రజలపై దాడి చేయబోమని హామీ ఇచ్చిన ఈజిప్టు సైన్యం తదనంతరం ప్రజలపై ప్రతీకార దాడులకు పూనుకుంది. ఈ నిరసన కార్యక్రమంలో ముస్లిం బ్రదర్‌హుడ్ కార్యకర్తలు కీలకపాత్ర వహించారు.

ఈ ఉద్యమానికి వ్యతిరేకంగా ముబారక్ అనుచరులు నిరసన కార్యక్రమాలు మొదలుపెట్టారు. దీంతో ముబారక్ అనుకూల, వ్యతిరేక వర్గాల మధ్య పోరాటం ప్రారంభమైంది. ముబారక్‌కు మరణశిక్ష విధించాలన్న వారిపై సైన్యం సహాయంతో దాడులకు పాల్పడ్డారు.

ఇదే నేపథ్యంలో ఈజిప్ట్‌లో అధ్యక్ష పదవి కోసం ఎన్నికల నిర్వహించారు. గత నవంబర్, ఈ ఏడాది జనవరిలలో పార్లమెంట్‌లోని 508 స్థానాలకు రెండు విడతలుగా జరిగిన ఎన్నికల్లో ఏ పార్టీకీ మెజారిటీ లభించలేదు. మెజారిటీ స్థానాలను సంపాదించిన పార్టీలుగా ముస్లిం బ్రదర్‌హుడ్ మొదటిస్థానంలోనూ, మరో మతవాద పార్టీ సలాఫీ రెండవ స్థానంలోనూ నిలిచాయి. ఈ పరిస్థితిని ఆసరాగా చేసుకొని సైన్యం సలాఫిస్టు పార్టీపై నిషేధాన్ని ప్రయోగించింది. పార్లమెంటరీ ఎన్నికల తర్వాత తాత్కాలిక గంజౌరీ ప్రభుత్వం ఏర్పడినప్పటికీ సైన్యానిదే పెత్తనం నడిచింది. అమెరికా వెన్నుదన్నుతో సైనికాధికారులు అధికారాన్ని కొనసాగిస్తూ వచ్చారు. ప్రజలు తిరిగి పెద్ద ఎత్తున నిరసన తెలపడంతో మే 23, 24 తేదీలలో ఎన్నికలు నిర్వహించింది. ఈ ఎన్నికలు సైనిక అధికారుల ఆదేశాలకనుగుణంగా నడిచే సుప్రీం ప్రెసిడెన్షియల్ ఎలక్షన్స్ కమిషన్ (ఎస్‌పిఇసి) కనుసన్నల్లో నడిచాయి. ముస్లిం బ్రదర్‌హుడ్, వామపక్ష, ప్రజాతంత్ర వాదులు ఏకమై సైనిక ముఠాకు వ్యతిరేకంగా ఉద్యమించారు. అయితే సైన్యం ఈ అధ్యక్ష ఎన్నికల్లో పాల్గొనే అభ్యర్థుల్లో కొంతమందిని నిషేధించింది. ఇది తీవ్ర నిరసనలకు దారితీసింది.

అధ్యక్ష పదవికి జరిగిన ఎన్నికల్లో ఎవరికీ సరైన మెజారిటీ రానందున తిరిగి జూన్ 16, 17న ఎన్నికలు నిర్వహించారు. ముస్లిం బ్రదర్‌హుడ్ అభ్యర్థి మహమ్మద్ మోర్సి, ముబారక్ పాలనలో చివరి ప్రధానిగా పనిచేసిన షఫిఖ్‌పై బరిలో దిగారు. ఈ ఎన్నికల్లో మోర్సి ముఖ్యంగా ముబారక్‌ను గద్దె దించడంలో అత్యంత కీలక పాత్ర పోషించిన యువతపై దృష్టి సారించారు. వారికి ప్రజాస్వామ్య, పౌర, ఆధునిక రాజ్యాన్ని నిర్మించడంలో సహాయం చేయాలని పిలుపునిచ్చారు. ఈజిప్ట్‌లో ముబారక్ పాలనలో తీవ్ర అణచివేతలకు గురైన ముస్లిం మహిళలకు కూడా ఆశ్వాసాన్ని ఇచ్చారు. వారి వస్త్రధారణపై ఎలాంటి నిబంధనలు ఉండవనీ, వారు తమ పౌరహక్కులను స్వేచ్ఛగా వినియోగించుకొనే వాతావరణం కల్పిస్తామనీ హామీ ఇచ్చారు.

మోర్సికి ప్రత్యర్థిగా ఉన్న షఫిఖ్‌కు ముబారక్ మద్దతుదారులు అండగా నిలిచారు. మోర్సికి తీవ్రమైన పోటీ ఇవ్వడంలో వారు ముందున్నారు. ముఖ్యంగా మైనారిటీలు, కాప్టిక్ క్రిస్టియన్లు మోర్సి అధికారంలోకి వస్తే తమపై దాడులు తీవ్రమవుతాయని ఆందోళన వ్యక్తం చేశారు. ఈ భయాందోళనలు అవసరం లేదని మోర్సి చెప్పారు. అధికారంలోకి వచ్చాక ప్రధానిగా ఇతర వర్గాల వారినీ, ఉపాధ్యక్షుడుగా కాప్టిక్ క్రిస్టియన్

# విద్య - శాస్త్రీయత

*మన విద్యారంగం, విద్యా విషయాలలోని తాత్వికతను, స్వభావాన్ని చరిత్ర, సంస్కృతుల వెలుగులో వివరిస్తున్నారు*

**మహమూద్**

**ఆ**ధునికకాలంలో విద్యను, శాస్త్రీయతను విడదీసి చూడలేం! దురదృష్టవశాత్తు భారతీయ విద్యావిధానం సనాతన వాసనలను ఇంకా ఒదులుకోలేదు. మారుతున్న స్థలకాలాదులకు తగినట్టుగా విద్యా విషయాలలో తీసుకురావలసిన మార్పుల గురించి గంభీరంగా ఎవరూ ఆలోచిస్తున్నట్టు కనబడడం లేదు.

బోధన–బోధనేతర అంశాలన్నీ విద్యార్థి శారీరక మానసిక సంపూర్ణ వికాసానికి విలువ చేకూర్చేలా ఉండాలన్న విషయం అందరూ అంగీకరించేదే! అయినా ఆ లక్ష్యాన్ని చేరుకోవడానికి మనం ఉపయోగిస్తున్న సాధానాలు ఏ శాస్త్రీయ దృక్కోణం నుంచి స్వీకరించామన్నది ప్రశ్న! కానీ మన విద్యా విధానంలో శాస్త్రీయతకు తావివ్వకుండా చూసుకుంటున్నారు ప్రణాళికలు తయారుచేస్తున్న వాళ్లు. కాలంతో పాటు మార్పుకు లోనుకాని విద్యకు మందు చూపుండదు. ముందడుగు పడదు. అలాంటి విద్యా విధానంతో విద్యార్థికి పాక్షిక జ్ఞానమే అందుతుంది. ఆ రకంగా విద్యార్థికి శాస్త్రీయ విద్య నుండి దూరం చేస్తున్నటే!

అనాదిగా అనేక ఆచారాలనూ, సనాతన సంప్రదాయాలనూ, సిద్ధాంతాలను (కర్మ, ద్వైత, అద్వైత) ఆచరిస్తున్న లేదా ఒదులుకో లేకున్న మన దేశ సామాజిక నిర్మాణం చాలా సంక్లిష్టమైనది. దీనికి తగినట్లు విద్యలో మార్పులను తీసుకురావడం అంతే సంక్లిష్టమైన పని. ఈ సంక్లిష్టతకు భయపడి విద్యలో మార్పులు తీసుకురాకుండా అలాగే గాలికి ఒదిలేద్దామా? శాస్త్రీయ అభ్యాసనం ఇక తీరని కలేనా? అనే ప్రశ్నలు శాస్త్రీయ దృక్పథం కలిగిన వారినీ, శాస్త్రీయ విద్య ద్వారా కొంతలో కొంతైన సామాజిక మార్పు తీసుకొద్దాం అనుకుంటున్న వాళ్లనీ బాధిస్తున్నాయి.

అయితే మతం లేకపోతే కులం, వీటకి మించి రాజకీయ ప్రమేయం భారత సమాజాన్ని నడిపిస్తున్నాయి. కాబట్టి ఇప్పుడిపుడే మా ఆశ తీరేది కాకపోయినా సమాజానికి ఇవ్వవలసిన హెచ్చరిక ఇవ్వక మానలేం! ఎందుకంటే విద్య భవిష్యత్తరాలను తీర్చిదిద్దుతుంది కాబట్టి.

'ఒకప్పుడు సాంస్కృతికంగా, వైజ్ఞానికంగా ఒక వెలుగు వెలిగాం కానీ ఇప్పుడు అన్ని రంగాల్లో వెనుకబడిపోయాం' అని బాధ పడే ఒక వర్గం. 'లేదు ఈ గడ్డ మీద పుట్టిన అనేన సిద్ధాంతాలను కాపీ కొట్టి వాళ్లు (పాశ్చాత్యులు) ముందుకు పోయారు' అని నమ్మబలికె ఒక వర్గం, నీటికి రంగూ, వాసన, రుచి లేనట్టే శాస్త్రీయయతకు ప్రాంత, లింగ, వర్గ బేధాలు ఉండవు దానికొక విశ్వజనీన లక్షణం ఉంటుంది, శాస్త్రం ఎక్కడ పుట్టినా అది అన్ని వేళలో అందరికీ అందుబాటులో ఉంటుంది. అందరికీ ఒకే రకమైన ఫలితాలను ఇస్తుంది. అలా కాకపోతే అది శాస్త్రమే కాదు, ఏ మూలకాల కలయికతో నీరు (ఎచ్‌టుఒ) తయారౌతుందో అదే విధానం అన్ని ప్రాంతాలకు దేశాలకు వర్తిస్తుందనీ, ప్రాంతాలూ, దేశాలూ వేరైనా నీటి మూలకాల కలయిక మారదనీ, ఇంకో పద్ధతిలో నీరు తయారు కాదని నమ్మే ఒక వర్గంగా భారత విజ్ఞానవంతులు విడిపోయారు.

నిజానికి మనదేశంలో సనాతనం ఎంత ప్రాంచీనమైన మూలాలు కలిగి ఉందో అంతే ప్రాచీనమైన మూలాలను హేతువాదం కూడా కలిగి ఉంది. వేదాలతో పాటు లోకయతులూ, చార్వాకులూ సమాంతరంగా

---

వర్గానికి చెందిన వ్యక్తిని నియమిస్తానని చెప్పారు. దీంతో క్రిస్టియన్లకు ఉన్న అనుమానాలు తొలిగిపోయాయి. షఫిఖ్ కూడా ఈజిప్ట్ పౌరులకు తనదైన రీతిలో వాగ్దానాలు చేశారు. తను ఒక నూతన అధ్యాయానికి నాంది పలుకుతానని, గతంలో జరిగిన వాటిని తవ్వితీయనని, గతం చచ్చిపోయిందని అన్నారు. ముబారక్ అనుకూల మద్దతుదారుల ఓట్లతో మోర్సికి షఫిఖ్ తీవ్రమైన పోటీ ఇచ్చారు. హోరాహోరీగా సాగిన ఈ ఎన్నికల్లో మోర్సి స్వల్ప ఆధిక్యంతో గెలిచారు. మోర్సికి 1,32,30,131 ఓట్లు రాగా, షఫిఖ్‌కు 1,23,47,380 ఓట్లు వచ్చాయి. ఈజిప్ట్ తొలి అధ్యక్షుడుగా మోర్సి ఎన్నికయ్యారు. మోర్సి గెలిచినట్లు అధికారికంగా ప్రకటించగానే కైరోలోని తెహ్రీర్ స్క్వేర్‌లో ఆనందాలు మిన్నంటాయి. ప్రజలు సంబరాలు చేసుకున్నారు.

ఈజిప్ట్ అధ్యక్షుడిగా బాధ్యతలు స్వీకరించనున్న మోర్సి ముందు ఈజిప్ట్‌ను ప్రజాస్వామ్య పద్ధతిలో నడిపించే బాధ్యత ఉంది. ముందుగా ప్రజలలో మూడు దశాబ్దాలుగా ఉన్న ముబారక్ నిరంకుశ పాలన తాలూకు గాయలను మాన్పించే ప్రయత్నం చేయాలి. ప్రజలకు ప్రజాస్వామ్య పాలన అందించగలనన్న విశ్వాసం కలగజేయాలి. సామ్రాజ్యవాద అమెరికా అండదండలతో ఇన్నాళ్లు సాగిన పాలనకు చరమగీతం పాడిన పౌరులకు అదే అమెరికా సామ్రాజ్యవాద నీడ పడకుండా కాపాడాలి. ఇతర అరబ్ దేశాలతో సఖ్యత సంబంధాలు నెలకొల్పేలా మలగాలి. బ్రెజిల్, రష్యా, ఇండియా, చైనా, దక్షిణ ఆఫ్రికా (బ్రిక్స్) దేశాలతో సంబంధాలను నెరపడానికి ముస్లిం బ్రదర్‌హుడ్ ప్రభుత్వం తన అనుకూలతను వ్యక్తం చేసింది.

ఈజిప్ట్ ప్రజలు ఎన్నో ఆశలతో ప్రజాస్వామ్య పాలన ఆశిస్తూ ముస్లిం బ్రదర్‌హుడ్‌కు అధికారాన్ని ఇచ్చారు. వారికి అలాంటి పాలన రాకుంటే తెహ్రీర్ స్క్వేర్‌ను మరోసారి అగ్గిరాజేయడానికి వెనుకాడరు.

*(రచయిత పాత్రికేయులు)* వీ

ప్రయాణించినా రాజకీయ బలం లేని కారణంగా భౌతికవాదులు మనదేశంలో నిలదొక్కుకోలేక పోయారు. గౌతమ బుద్ధుడి తదనంతరం భౌతికవాద మూలాలు పూర్తిగా ఇంకిపోయా యని చరిత్ర ఘోషిస్తోంది. తర్వాత బ్రిటిషు వారు మనదేశం అడుగు పెట్టేవరకు భౌతికవాద తాత్వికతకు దేశం దూరంగానే ఉంది. బ్రిటిషువారు తమ అవసరాలకు అనుగుణంగానే విద్య విధానాలను రూపొందించారు గానీ మనల్ని ఉద్ధరించడానికి కాదు. అయితే వేదకాల జ్ఞానాన్ని లేదా బ్రిటిషువారు వదిలివెళ్లిన విద్యా వారసత్వాన్ని ఆచరణలో పెడుతున్నాం లేదా విద్యలో సాంకేతిక అంశాలకు ప్రాముఖ్యతనిస్తూ అదే శాస్త్రీయత అనే భ్రమలో మగ్గుతున్నాం.

మనదేశంలో భౌతికవాదులకు సమాజం మీద ప్రభావం వేసే సాంస్కృతిక, రాజకీయ పలుకుబడిలేదు. శాస్త్రాన్ని అధ్యయనం చేసి రూపొందించిన ఏ విషయానికైనా మన దేశంలో ఆదరణ కరువు.

శాస్త్రం మౌలికమైన మార్పు కోరుతుంది. మౌలికమైన మార్పును అంగీకరించే మానసిక చైతన్యంలేని సమాజం మనది. మౌలికమైన మార్పు, మానసిక చైతన్యం పరస్పర పూరకాలు. మనదేశంలో శ్రమ విభజన కులంగా రూపుదిద్దు కున్నాదన్న విషయంలో ఎవరి భేదాభిప్రాయం లేదు. (కుల చట్రాన్ని కాపాడాలనుకొనే వారికి తప్ప!) కులం చట్రం మైనారిటిగా ఉన్న అగ్రవర్ణాలకు బలాన్నీ, మెజారిటీగా ఉన్న వెనుకబడిన ప్రజలకు న్యూనతను కట్టబెట్టింది. చదువు కొందరి గుత్తసొత్తుగా మారిపోతే చాలామందికి అందుబాటులో లేకుండా పోయింది.

వెలికితీత, సిద్ధాంతం, వివరణ, నిరూపణ, అనేది శాస్త్రీయతకు శరీరాంగాలైతే ప్రశ్న దాని ఆత్మ! ప్రశ్నించిడం దగ్గర మొదలయ్యే దాని ప్రయాణం పరిష్కారం దగ్గర ఆగుతుంది. శాస్త్రీయత మూలాల నుండి కదలికలు సృష్టించి ఉపరితలాన్ని మార్చివేస్తుంది. తార్కిక హేతుబద్ధ జీవన విధానికి శాస్త్రీయత పునాదులను ఏర్పాటు చేస్తుంది. చాతుర్వర్ణ వ్యవస్థను కాపాడుకోకపోతే దోపిడీ కలకాలం కొనసాగదు. దోపిడీకి చట్టబద్ధత కల్పించే సాంస్కృతిక వాతావరణాన్ని సృష్టించేందుకు విద్యను ఒక పావుగా వాడుకుంటున్నారు. దోడిపి లోగుట్టును అర్థం చేసుకోలేని విధంగా జనాలను మభ్యపెట్టే సాధనమే 'కర్మ' సిద్ధాంతం. ఈ సిద్ధాంతాన్ని విద్య నుండి దూరం చేయకుండా ఎటువంటి సామాజిక మార్పును తీసుకురాలేం! శాస్త్రీయత భారతీయ ఆత్మలా ఉన్న ఈ సిద్ధాంత మూలాల్నే ప్రశ్నిస్తుంది.

'వేదాల్లోనే అన్నీ ఉన్నాయ్' అనే అశాస్త్రీయమైన నినాదాన్ని తారకమంత్రంలా జపిస్తున్న మన సమాజంలో వేల సంవత్సరాల క్రితం రూపుదిద్దుకున్న వేదజ్ఞానాన్ని ఉచితంగా పంచి పెట్టే సంఘాలు శాస్త్రీయతను తొక్కి పెడుతూనే ఉన్నాయి. దశాంక మానాన్ని మనమే కనుక్కున్నామనీ, శస్త్ర చికిత్స మనమే మొదట ఆరంభించామనీ జబ్బలు చరుచుకొని తృప్తి పడుతుంటాం లేదా అలా తృప్తి పడేలా విద్యార్థులని మభ్య పెడుతుంటాం. వేదజ్ఞానమే పవిత్రమైందంటూ, అదే అంతిమమైనదంటూ కొత్తగా కనుగొనాల్సిన సిద్ధాంతాలు గానీ, విజ్ఞానం ఏమీ లేదంటూ పిల్లకాయల మెదళ్లను మొద్దుబార్చేస్తున్నాం. వారిలో ఉత్సాహాన్ని, జిజ్ఞాసనూ చంపెస్తున్నాం. ఇదంతా వేల సంవత్సరాలుగా దోపిడీని మనదేశంలో చెలామణిలో ఉంచడానికి బ్రాహ్మణ భావజాలం చేస్తున్న ప్రయత్నాల్లో భాగమే!

దశంక మానం మనం కనుక్కున్నాం! సరే-దశంకమానం దగ్గరే గణితశాస్త్రం ఆగిపోలేదు. అంతకు ముందు గణితం ఉంది తర్వాత గణితం ఉంది. అది ఇప్పటికీ నూతనత్వం పొందుతూనే ఉంది. వాస్తవానికి శాస్త్రం భౌతిక వాస్తవికతపై ఆధార పడుతుంది. దాని పురోగాభివృద్ధి భౌతిక మార్పుల పైనే ఆధారపడి ఉంటుంది. ఆర్కిమెడిస్ సూత్రం మీద పడవ నడపగలుగుతున్నాం. సముద్ర యానాన్ని నిషేధించిన మన పూర్వీకులకు ఆర్కిమెడిస్ సూత్రం అర్థం చేసుకొని దానికి తగినట్లు జీవన విధానాన్ని మార్చుకునే అవకాశమే లేదు. సముద్రయానం ఆరంభమయ్యాక ప్రపంచ చరిత్రలో జరిగిన మార్పులను గురించి ప్రత్యేకంగా చెప్పనవసరం లేదు. అసలు న్యూటన్ భౌతిక సూత్రాల నిరూపణ కోసం తనే స్వయంగా గణిత శాస్త్రాన్ని అభివృద్ధి పరచడం ఎంత గొప్ప విషయం. ఆ సూత్రాల రూపకల్పన మీదనే మన ఇస్రో ఉపగ్రహాలను పంపిస్తూ మన జీవనాన్ని సరళతరం చేస్తున్న విషయాన్ని ఎట్లా మరిచిపోతాం?

దృగ్గోచరంగా ఉన్న ప్రకృతిలో (ప్రకృతిలో భాగంగా ఉంటూనే) అప్పటికే ఉన్న విషయాలను కనుగొంటున్నాం. అంతే గాని మనమే ప్రకృతిని నిర్మించలేం. ప్రాకృతిక చలన సూత్రాలపై మన ప్రభావం వేయలేం. నాశనం చేయలేం. ఎవరు ఎప్పుడు ఎలా ఏ సిద్ధాంతానికి రూపకల్పన చేశారన్నది అప్రస్తుతం. అది అంతిమంగా మానవ కళ్యాణానికి ఉపయోగపడిందా లేదా అన్నది ముఖ్యం. నిష్ప్రయోజనమైనా వాటిని తృణీకరించి ప్రయోజనం ఉన్న వాటిని తయారు చేసుకోవడమే శాస్త్రీయతకు మూలం. అలా చూసుకుంటూ పోతే మన విద్యా ప్రణాళిక మూలాలతో పాటు సామాజిక మూలాలనీ మార్చాల్సి ఉంటుంది. అది ప్రతి విద్యాధికుడి ప్రథమ కర్తవ్యం కావాలి.

తన చుట్టూ మారుతున్న ప్రపంచాన్ని తనకు తానుగా విశ్లేషించుకునే చైతన్యాన్ని విద్యార్థిలో నింపేదే శాస్త్రీయమైన విద్య. రోజువారి భౌతిక జీవితంలో విద్యార్థి పొందుతున్న అనుభవాలను అనందంగా స్వీకరించి అనుభవసారాన్ని ఆచరణలో పెట్టే విధంగా విద్యాప్రణాళిక తయారు చేయాలి. ఒక్క మాటలో చెప్పాలంటే విద్యార్థి చేత నేల విడిచి సాము చేయించకూడదు.

విద్యార్థి మానసిక స్థితిని మసకబార్చే లేదా గందరగోళపరిచే విధంగా మన విద్యావిధాన రూపకల్పన జరిగుతుంది. తెలుగు పాఠంలో భూమి వయస్సుకూ, భూగోళ శాస్త్రంలో భూమి వయస్సుకూ పొంతనే ఉండదు. అట్లాగే భూమి సౌర కుటుంబంలో ఒక గ్రహమని అది అంతరిక్షంలో సూర్యుని చుట్టూ తిరుగుతుందని సైన్సులో బోధిస్తే, భూమిని ఆదిశేషుడు భుజం పైన మోస్తున్నాడని తెలుగు భాషలో బోధిస్తారు.

చరిత్ర పాఠ్యపుస్తకాల గురించి ఎంత తక్కువ మాట్లాడుకుంటే అంత మంచిది. ప్రత్యేకంగా కొన్ని వర్గాల మనోభావాలను దెబ్బతీసే పాఠ్యభాగాలు అనేకం ఉన్నాయి. చరిత్ర బోధన విషయంలో ముస్లిం చరిత్ర వక్రీకరణలు ఆగడమే లేదు. భారతదేశ నిర్మాణంలో అసువులు బాసిన ఎందరో ముస్లిం త్యాగధనుల చరిత్ర పక్కన పెట్టేశారు. ముస్లిం లీగు వ్యవస్థాపకుడు జిన్నా గురించి రాసి అబుల్ కలాం ఆజాద్ గురించి కనీసం పదిలైన్ల స్థలం కూడా హైస్కూల్ పాఠ్యపుస్తకాల్లో కేటాయించలేదు. ఆయన పేరు మీద ఉన్న విశ్వవిద్యాలయ విద్యార్థులకు కూడా ఆయన చరిత్ర తెలసో తెలియదో అనుమానమే! ఇటీవలి కాలం సయ్యద్ నసీర్ అహమ్మద్ ముస్లిం త్యాగమూర్తుల గురించి పుంఖాలు పుంఖాలాగా రాస్తున్నా ఆ పుస్తకాలను మన విద్యా ప్రణాళిక నిర్మాతలు పట్టించుకోవడం లేదు. నూతనంగా వెలికి వస్తున్న చారిత్రక వాస్తవాలపై ఎవరూ చూపు

సారించడం లేదు. పదవ తరగతి చరిత్ర పాఠ్యపుస్తకంలోని ప్రపంచ చరిత్ర భాగంలో నెపోలియన్, ముస్సోలిని, హిట్లర్ వంటి అరాచక వాదుల గురించి ఎక్కువ రాసి, మార్క్స్, లెనిన్, మావోల గురించి రెండు పేరాలలో ముగించేశారు. జపాన్ సామ్రాజ్యవాదానికి ఎక్కువ ప్రాముఖ్యతనిచ్చి అమెరికా సామ్రాజ్యవాదాన్ని చూసిచూడనట్టూ వదిలేశారు. వియత్నాం మీద అమెరికా దాడి చేసిన సంఘటనను పూర్తిగా విస్మరించారు. రెండో ప్రపంచ యుద్ధానంతరం ప్రపంచంలో జరిగిన అతి ముఖ్య రాజకీయ పరిణామం ఇజ్రాయల్ దేశ నిర్మాణం. అది మొత్తం పశ్చిమాసియా దేశాలను యుద్ధక్షేత్రాలుగా మార్చేసిన సంఘటనే కాక దాని వెనుక అమెరికా సామ్రాజ్యవాదం ఉన్నదన్న అవగాహన నుంచి పదవ తరగతి విద్యార్థులకు దూరం చేసినట్టే. దాని గురించి అస్సలు ఎక్కడా ప్రస్తావించబడలేదు. ఆ దేశం ఏర్పాటయ్యాక పాలస్తీనా ప్రజలు అనుభవిస్తున్న హింస గురించి ఎక్కడా ప్రస్తావన లేదు.

ఇవన్నీ లోతుగా పరిశీలిస్తే అమెరికా సామ్రాజ్యవాద ప్రపంచీకరణ దుష్ఫలితాలను పిల్లలు అర్థం చేసుకుంటారనీ, తద్వారా వారిలో రాజకీయ చైతన్యం పెరుగుతుందనీ మన పాలకులు భయపడుతున్నట్టున్నారు. అమెరికా కనుసన్నల్లో కొనసాగుతున్న మన ప్రభుత్వాలు అమెరికాను విమర్శించే ధైర్యం చేయలేవు. అది మన విద్యావిధానం మీద నేరుగా ప్రభావం చూపుతున్నది. విద్యార్థి వాస్తవ చరిత్రను అర్థం చేసుకునే అవకాశం లేకుండా మన విద్యావిధాన నిర్మాతలు జాగ్రత్త పడుతున్నట్టు అర్థం అవుతుంది.

మన విప్లవవీరుడు భగత్‌సింగ్ చరిత్రకు కూడా చాలా తక్కువ చోటు కేటాయించడం ఒక అంశమైతే గాంధీ అహింసా దృక్పథాన్ని విద్యార్థుల నరం నరం నింపుతూ భగత్‌సింగ్ తన జీవితకాలంలో ఆచరించిన విప్లవ దృక్పథం గురించి కొంచెం కూడా ప్రస్తావించ లేదు. అంబేద్కర్‌ను కేవలం రాజ్యాంగ నిర్మాతగా కుదించి దళితుల ఆత్మాభిమా నానికి ప్రతీకగా చూపకుండా ఆ ఖ్యాతిని గాంధీకి అంటగట్టారు. వాస్తవానికి హైస్కూల్ స్థాయి నుంచే ఈ అంశాలన్నీ భాగం కావాలి. కానీ సామాజిక శాస్త్రాలకు ప్రాముఖ్యత తగ్గంచడానికి చంద్రబాబు నాయుడు మొదలు పెట్టిన సంస్కరణలు ఇప్పుడు ఫలితం ఇస్తున్నట్టున్నాయి.

భారతచరిత్రలో పక్కన పెట్టకూడని అతిముఖ్య రాజకీయ పోరాటాలైన నక్సల్బరీ, తెలంగాణ పోరాటాల వూసే లేకుండా చేశారు.

ఇక ఆంగ్ల భాష విషయానికి వస్తే, మొత్తం భారతావనిని ఆంగ్ల భాషకు తాకట్టు పెట్టాడానికన్నట్టు ఆ భాషను ఒక పాశ్చత్య భాషగా కాకుండా స్థానిక, మాతృ భాషలకంటే ఎక్కువ స్థానాన్ని ఇస్తున్నారు. మరే ఇతర విషయానికి ఇవ్వనంత ప్రాముఖ్యత ఆంగ్లానికిస్తూ, పాఠాలన్నీ కూడా దాదాపు ఆంగ్ల భాషా వాతావరణం ఉన్నవాటినే ఎన్నుకున్నారు. ఆంగ్లభాషలో రచనలు చేసిన మన భారతీయులు అనేకమంది ఉన్నారు. ఆర్కే నారాయణ్, ముల్క్‌రాజ్ ఆనంద్, అరుంధతీరాయ్ లాంటి అంతర్జాతీయ ఖ్యాతినార్జించిన రచయితల రచనలు పక్కన పెట్టేశారు. ఇదెంత అశాస్త్రీయమైన అంశమో పదవ తరగతి పిల్లల పాట్లు చూస్తుంటే అర్థమౌతుంది. వారి నిత్యజీవిత అనుభావాల నుంచి కాకుండా వారికి తెలియని వాతావరణానికి సంబంధించిన అంశాల ద్వారా పిల్లలు భాషనెట్లా అర్థం చేసుకోగలుగుతారు? అమెరికా నల్ల జాతీయుడైన మార్టిన్ లూథర్ కింగ్ ఉపన్యాసాన్ని పాఠంగా పెట్టారు. ఆ ఉపన్యాసాన్ని ఉన్నదున్నట్లు కాకుండా కుదించి ఇచ్చారు. ఒక పేరాకు ఇంకో పేరాకు సంబంధం లేకుండా ఉండడమే కాకుండా అ పాఠ్యాంశం ఉపాధ్యాయులకే అర్థం కాకుండా ఉంది. స్క్రాబుల్డ్ సెంటెన్సెస్ ఇస్తున్నారు. ఇవి ఉపాధ్యాయులు కూడా అర్థం చేసుకోలేనంత కఠినంగా ఉంటున్నాయి. ఈ పద్ధతిలో విద్యార్థులకు ఆంగ్ల భాషపై పట్టు ఎలా వస్తుందో ఆ పాఠ్యపుస్తకాలు తయారుచేస్తున్న వారికి తెలియాలి.

ఈ సంవత్సరమే పదవ తరగతి ప్రభుత్వ ప్రీ ఫైనల్ ఆంగ్ల పరీక్ష పత్రంలో ప్రజాపోరాటాలనూ, విద్యార్థి ఉద్యమాలను అపహాస్యం చేసేలా ఒక దుర్మార్గమైన ప్రశ్న అడిగారు. తెలంగాణ ఉద్యమ నేపథ్యంలో ఉస్మానియా విశ్వవిద్యాలయంలో విద్యార్థులకు, పోలీసులకు మధ్య జరిగిన ఘర్షణ గురించి విద్యార్థి అభిప్రాయాన్ని అడుగుతూ ప్రశ్న అడిగారు. 'మనం ఇలాంటి సంఘటనల వల్ల ఏం కోల్పోతున్నాం' అనే అర్థం వచ్చేలా ఉందా ప్రశ్న. ఇది నిర్దిష్టంగా తెలంగాణ రాష్ట్ర ఏర్పాటును వ్యతిరేకిస్తున్న వాళ్ల కుట్రగా అర్థం చేసుకోవచ్చు. ఇలాంటి విషయాలను గమనించినప్పుడు, రాజ్యం, దాని అంగాల ప్రాబల్యాన్ని తప్పొప్పులతో నిమిత్తం లేకుండా ప్రజల చేత ముఖ్యంగా బాలబాలికల చేత ఒప్పించడానికి ఇలాంటి కుట్రలు పన్నుతున్నారన్న విషయం అర్థం అవుతుంది. విద్యార్థుల మెదళ్లను కలుషితం చేయడానికి తప్ప ఆంగ్ల భాషకూ ఇలాంటి ప్రశ్నకూ సంబంధం ఏమిటో అర్థం కాకుండా ఉంది.

ఇక తెలుగు మీడియం చదువుతున్న విద్యార్థుల సంగతి చెప్పనలవి కాదు. కోతి చేతికి అద్దం దొరికినట్టు తెలుగు భాష సంప్రదాయవాదుల చేతికి చిక్కింది. అరవ తరగతి నుండి మొదలుకొని పదవతరగతి వరకూ పద్య గద్య భాగాలుగా విభజించి ఏ మాత్రం వైవిధ్యం లేని పాఠ్యాంశాలను ఇస్తున్నారు. ఏడవ తరగతి పాఠ్య పుస్తకంలో సాంతం గ్రాంథిక భాషలో ఉండే కట్టమంచి రామలింగారెడ్డి గారి రచన ఇచ్చారు. పోనీ అందులో ప్రత్యేకత ఏమన్నా ఉందా అంటే హైదరాబాద్ నగర విశిష్టత అందులోని అంశం. వ్యవహారికమే అన్నిచోట్లా తెలుగుగా ప్రచారంలో ఉన్నప్పుడు గ్రాంథికంలో ఉన్న విషయం బోధించడం ద్వారా విద్యార్థి గందరగోళ పడే ప్రమాదం లేదా? ఇది అంతిమంగా తెలుగు భాష పట్ల విద్యార్థి విముఖత చూపడానికి కారణమౌతుంది. గురజాడ ఎంత గొప్ప రచయితో మనకందరికీ తెలిసిందే. కాకపోతే పూర్ణమ్మ లాంటి కాలం చెల్లిన రచన ఇవ్వడం ద్వారా గురజాడ ఔన్నత్యాన్ని ఎలా చాటి చెబుతారు. సమకాలీనత కలిగిన అనేక రచనలు గురజాడ చేసి ఉన్నారు. కన్యాశుల్కం అనే కాలం చెల్లిన మూఢనమ్మకం కంటే వరకట్నం, భ్రూణహత్యలకు సంబంధించిన పాఠ్యాంశాలు ఇవ్వడం ద్వారా విద్యార్థికి మేలు కలుగుతుంది. తెలుగు సాహిత్యరంగంలో వస్తున్న మార్పులకు సంబంధించిన అవగాహన కలిగేలా పాఠ్యాంశాల రూపకల్పన జరగాలి. మాండలీకాల చర్చ కొద్దిగా అయినా ఉండాలి. కాలానుగుణంగా భాషలో వచ్చిన మార్పులను విద్యార్థి అర్థం చేసుకోగలగాలి. ఈ విషయాల పట్ల అవగాహన హైస్కూలు స్థాయిలోనే విద్యార్థికి కలిగితే ఉన్నత విద్యకు వెళ్లే సమయానికి అది ఉపయుక్తంగా ఉంటుంది.

ఘోరమైన విషయం ఏంటంటే, ఆంగ్లంలో ముందు ముద్రించిన పుస్తకాలను తర్జుమాచేసి తెలుగు మీడియం పాఠ్య పుస్తకాలుగా తయారు చేస్తున్నారు. ఈ అనువాదాలలో ఉన్న మన 'మాతృ' భాష చూసి విద్యార్థులు జడుసుకొని దీని కంటే ఆ ఇంగ్లిష్ మీడియం నయం అనుకొని అటుగా వెళ్లిపోతున్నారు. వ్యాకరణ దోషాలు మొదలుకొని గ్రాంథీకం, వ్యవహారికం కలగలిసిన కొత్త తెలుగు దర్శనమిస్తుంది హైస్కూలు పాఠ్యపుస్తకాలలో. ఆధునిక కాలానికి తగినట్టు భాషలో తీసుకురావాలిసిన

మార్పులు ఎప్పుడూ తీసుకు వస్తారో అర్థం కావడం లేదు.

హైస్కూలు సిలబస్ మొత్తం ఇంజనీరింగ్, మెడిసిన్‌లకు మాత్రమే ఉపయోగపడేలా కుదించిపడేశారు. శాస్త్రీయత కంటే సాంకేతికతకే ఎక్కువ ప్రాధాన్యతను ఇస్తుంటే శాస్త్రీయత అనే పదానికి నిజమైన అర్థం ఏమిటో తెలియని పాక్షిక జ్ఞానమే విద్యార్థికి అందుతుంది. సాంకేతికత మిషన్లను నడిపే అవగాహన కల్పిస్తే శాస్త్రీయత మిషన్లను తయారుచేసే అవగాహన కల్పిస్తుంది. ఈ రెండింటి మధ్య తేడాను చెరిపేయడానికి ప్రయత్నాలు జరుగుతున్నట్టుంది. ప్రపంచం అంతా ఇప్పుడు యంత్రాల మయం అయిపోయింది. పెట్టుబడిదారీ విధానంలో యంత్రాలకున్న విలువ మానవమాత్రులకు ఉండదు. యంత్రాలను నడిపే యాంత్రికులను తయారు చేసుకోవడంలో భాగంగానే విద్య విషయాలు తయారు చేయబడుతున్నాయి. ప్రొఫెషన్, ప్రొఫెషనలిజం అనే పదాలు అందుకే ఇప్పుడు బాగా వాడుకలో ఉన్నాయి. ఇంజనీరింగ్, మెడిసిన్‌లకు శాస్త్రీయమైన సామాజిక మూలాలు ఉన్నాయి. వాటి పుట్టుకలో ఉన్న మానవీయ కోణాన్ని అపహాస్యం చేస్తూ వాటిని కార్పొరేట్ వ్యాపారం స్థాయికి దిగజార్చారు. మెడిసిన్ చదవడానికి వెళ్లే వైద్య విద్యార్థికి విద్యను ముక్కలుగా చేసి అందించడమే కాకుండా దాని సామాజిక బాధ్యతను విద్యార్థి విస్మరించేలా చేస్తున్నారు. కాలంతోపాటు పెరుగుతున్న రోగాలకు సరియైన మందులు ఇవ్వడం అటుంచి రోగ నిర్ధారణ దగ్గరే మూడు, నాలుగు స్పెషలిస్టు వైద్యుల వద్దకు పోయే పరిస్థితి రోగికి కలుగుతున్నది.

సమాజ అవసరాల స్థానంలో కార్పొరేట్ రంగ లాభాలు ఆక్రమించడం ఈ శతాబ్దపు విషాదం. అందుకే ప్రకృతి వనరులు మొదలుకొని శాస్త్రీయ వెలికితీతల వరకు ప్రతిదీ పెట్టుబడి చుట్టూ ప్రదక్షిణం చేస్తోంది. ప్రజాసంక్షేమం కోసం పుట్టిందని పుస్తకాల నిండా పరుచుకున్న పార్లమెంటరీ ప్రజాస్వామ్య పాలసీ కాకుండా పోయింది. ప్రొలటేరియట్ పొలిటీషియన్ చేతిలో మోసపోతూనే ఉన్నాడు.

పదవ తరగతి చేరిన ప్రతి విద్యార్థికి పాఠశాలలు ఐఐటి, ఐఐఎం లాంటి కోర్సుల గురించి ఊదరగొడుతున్నాయి. పదవ తరగతితో పాటు ఐఐటి ఫౌండేషన్ ఇస్తామని కార్పొరేట్ పాఠశాలలు ప్రచారం చేస్తున్నాయి. అప్పటికే ఉన్న సిలబస్‌తో పాటు ఐఐటి వంటి సంక్లిష్టమైన కోర్సులను అర్థం చేసుకునే మానసిక స్థాయి పదవ తరగతి విద్యార్థికి ఉంటుందా? పట్టుమని పదిహేను సంవత్సరాల వయస్సు ఉన్న విద్యార్థి మీద అదనపు భారం వేయడం లేదా? ఈ ఒత్తిడి అంతిమంగా విద్యార్థిని మానసిక వికలాంగుడిగా మార్చి వేయడానికి ఉపయోగపడుతుంది తప్ప దీనితో ఇంకో ఉపయోగం లేదు. ఇలాంటి అంశాలను పరిగణనలోకి తీసుకోకుండా కేవలం సాంకేతిక విద్యకే ప్రాధాన్యత ఎందుకిస్తున్నట్టు? సామ్రాజ్యవాద ప్రపంచీకరణ మన దేశంలో సెజ్‌ల రూపకల్పన వరకూ కూరుకు పోయాక ఇక శాస్త్రీయ విద్యకంటే సాంకేతిక విద్యకే ప్రాధాన్యత కల్పించే పనిలో ప్రభుత్వాలు తలమునకలై ఉన్నాయి. దేశంలో రోజు రోజుకూ పెరిగిపోతున్న బహుళజాతి కంపెనీల ప్రాబల్యం మొదట విద్యా రంగం మీదనే పడుతోంది. బహుళజాతి కంపెనీల అవసరాలకు తగినట్టు ప్రొఫెషనల్స్ తయారు చేయాలనే దూ(క్రూ)ర దృష్టి ప్రదర్శిస్తోంది మన విద్యా విధానం. అందుకే సాంకేతిక విద్యకింత ప్రాముఖ్యతనిస్తున్నారు.

ఇలాంటి ప్రచారాల మాయలో పడ్డ తల్లిదండ్రులు వేలకు వేలు ఫీజులు చెల్లించి మరీ పిల్లలను ఆ పాఠశాలల్లో చేర్పిస్తున్నారు. మన విద్యా విధానంలో కొన్నైనా సంస్కరణలు తీసుకురాకపోతే మన ముందు తరాల భవిష్యత్తు అంధకారమే.

విద్యా విధానంలో వెంటనే అమలు పరచవలసిన సంస్కరణలు

1. సాంకేతిక అంశాల స్థానంలో శాస్త్రీయ అంశాలకు ప్రాముఖ్యతనివ్వడం.

2. భౌతిక శాస్త్ర సూత్రాల మూలాలు తెలియజేయడం. అవి ఏ చారిత్రక దశలో ఉద్భవించాయో విద్యార్థికి అర్థమయ్యేలా పాఠ్యాంశాలు రూపొందించడం.

3. చరిత్రకు సంబంధించిన నిర్దిష్ట ఆధారాలు ఉన్నవాటికి ప్రాముఖ్యతనివ్వడం. సంచలనాత్మక పాఠ్యాంశాలను దూరంగా ఉంచడం.

4. పాఠ్యాంశాల ఎన్నిక విషయంలో అప్ టు డేట్‌గా ఉండడం.

5. విద్యార్థి సంపూర్ణ మూర్తిమత్వాన్ని వికాసానికి ఉపయోగపడే పాఠ్యాంశ భాగాలను ఎన్నుకోవడం.

6. మారుతున్న కాలానికి తగినట్టు విద్యా విషయాలను రూపొందించడం.

7. డాటాల విషయంలో కచ్చితత్వాన్ని పాటించడం. (పదవ తరగతి పాఠ్య గ్రంథాల్లో చాలా పాత డాటాను చూపిస్తున్నారు.)

8. పాఠ్యాంశ భాగాలు సరళత నుండి సంక్లిష్టతకు చేరుకునేలా తయారు చేయడం.

9. ప్రజాస్వామ్య ఆకాంక్షలు విద్యార్థిలో పాదుకొలిపేలా చేయడం.

10. ఆంగ్ల భాష, మాతృ భాషలను సమన్వయ పరిచేలా పాఠ్యాంశాలను రూపొందించడం.

11. ప్రైవేట్, ప్రభుత్వ పాఠశాలలకు ఒకే విధమైన విద్యా విధానాలను రూపొందించడం.

12. ప్రైవేట్ పాఠశాలలను ప్రభుత్వ అజమాయిషిలోకి తీసుకు రావడం.

13. మార్కుల విధానానికి పూర్తిగా స్వస్తిపలికి విద్యార్థుల్లో పోటీతత్వాన్ని నివారించడం.

14. శిక్షణ ప్రక్రియ మాధ్యమంగా ఆంగ్ల భాషను స్వీకరించాలా, మాతృ భాషను స్వీకరించాలా అన్న విషయంలో ఉన్న గందరగోళానికి స్వస్తి చెప్పి ఒకవేళ ఆంగ్ల భాష పట్ల రోజు రోజుకూ పెరుగుతున్న మోజును దృష్టిలో పెట్టుకొని ఆ భాష వైపే మొగ్గు చూపిన పక్షంలో మాతృభాషలో చదువుతున్న విద్యార్థులకు కూడా ఆంగ్ల భాషలో చదువుతున్న విద్యార్థులతో సమానంగా విద్యా ఉద్యోగ రంగాల్లో అవకాశాలు వచ్చేలా విధానాలు రూపొందించాలి. మాతృభాషలో చదువుతున్న విద్యార్థులు చిన్నచూపు చూపబడుతున్నారన్నది అందరికీ తెలిసిందే. జపాన్, చైనా దేశాలలో మాతృభాషను పక్కనబెట్టి పరాయి భాషల వెనుక పడకపోయినా అమెరికాతో సమానంగా అభివృద్ధి చెందుతున్న నేపథ్యాన్ని విస్మరించకూడదు.

15. విద్యార్థుల్లో విభిన్న విషయాల మధ్య తులనాత్మక పరిశీలన పెరిగేలా పాఠ్యాంశాలు రూపొందించడం.

ఈ వ్యాసం పూర్తి అయ్యే సమయానికి పశ్చిమ బెంగాల్ ముఖ్యమంత్రి ఓ నిర్ణయం తీసుకున్నారు. మార్క్స్, ఏంగెల్స్‌ల గురించి పాఠాలు ఆ రాష్ట్రం పాఠ్యపుస్తకాల్లోంచి తీసివేయడానికి పూనుకున్నారు. వామపక్షాలపై కోపం ఇలా కమ్యూనిజం నిర్మాతలపై చూపి తన కార్పొరేట్ ఆలోచనలను ఎంత వేగంగా ఆమె అమలు చేయబోతున్నదో దేశానికి అర్థమయ్యేలా చేశారు. ఇక దేశంలో శాస్త్రీయ విద్య అమలయ్యేనా?

*(రచయిత ఉపాధ్యాయులు)* వీ

# ఏ 'కిసాన్' ఉద్ధరణకు ఈ కిసాన్ సెజ్?

***భూములు పోయి బతుకును కోల్పోయిన రాచర్లపాడు రైతుల దీనగాథను చెబుతూ, ప్రాజెక్టుల పేరిట, సెజ్‌ల పేరిట తీసుకున్న వ్యవసాయ భూముల్ని రైతులకు తిరిగి ఇవ్వాలని అంటున్నారు* డా. చొప్పర శ్రీనివాసరావు**

ఇటీవల రాష్ట్రంలో జరిగిన ఉప ఎన్నికల నేపథ్యంలో నెల్లూరు జిల్లా రాచర్లపాడు గ్రామం మరోసారి వార్తల్లో ప్రముఖంగా నిలిచింది. తోటి రైతన్నల ప్రయోజనాల కొరకు అయిష్టంగానైనా తమ జీవనాధారమైన సంవత్సరానికి రెండు సంటలు పండే భూమిని నాడు వదులుకొని వార్తల్లోకి ఎక్కిన రాచర్లపాడు రైతన్నలు నేడు అవే భూములు తిరిగి తమకు అప్పగించాలంటూ ఉప ఎన్నికలను బహిష్కరించి వార్తల్లోకి ఎక్కారు. నాడు అధికారులు, పాలకులు వల్లించిన కల్లబొల్లి కబుర్లు నమ్మిన రాచర్లపాడు, రేగడిచెలిక గ్రామాల ప్రజలు తమ జీవితాలు, తోటి రైతన్నల జీవితాలు మెరుగుపడతాయని నమ్మారు. ఇంటికో ఉద్యోగం, అందరికీ ఉచిత విద్య, వైద్య సదుపాయం, పారిశ్రామిక శిక్షణాలయం (ఐ.టి.ఐ), శిక్షణ పూర్తయిన వెంటనే ఉద్యోగం, గ్రామాభివృద్ధికి ప్రత్యేక చర్యలు, గ్రంథాలయం, రోడ్లనిర్మాణం చేయడం, రాచర్లపాడు, రేగడిచెలిక గ్రామాలను దత్తతు గ్రామాలుగా ప్రకటించడం ఆ గ్రామ ప్రజలకు నాడు ఆనందానికి అవధులు లేవు. అయితే మరో వైపు తమ జీవనాధారం కోల్పోతున్నామనే దానితో నాడు కొంత మంది రైతులు తమ నిరసన తెలిపినప్పటికీ ఏమీ చేయలేని నిస్సహాయత వెరసి పంట భూమి 2776 ఎకరాలు ఇఫ్కో ఎరువుల కర్మాగాం కోసం 1994లో కేంద్ర ప్రభుత్వం రైతుల నుండి స్వాధీనం చేసుకుంది. 2008లో నాటి ముఖ్యమంత్రి కిసాన్ సెజ్‌గా నామకరణం చేసి దేశంలోనే ప్రప్రథమమైన రైతు ఉద్ధారిత ప్రత్యేక ఆర్థిక మండలిగా ప్రకటించారు.

నెల్లూరు జిల్లా కొడవలూరు మండలం రాచర్లపాడు గ్రామం జాతీయ రహదారికి, రైల్వే లైనుకు మధ్యలో ఉన్న రవాణాకు అత్యంత అనువైన గ్రామం. పచ్చని పంట పొలాలతో సంవత్సరానికి రెండు పంటలతో నాడు కొడవలూరు మండలానికే ధాన్యాగారంగా ప్రసిద్ధికెక్కింది. రైతు వారి పట్టా భూమి తో పాటు పెద్ద మొత్తంలో అసైన్డ్ భూమి, పేదలు రెండు, మూడు తరాలనుండి సాగు చేసుకుంటున్న ఎండోమెంట్ భూమి ఎక్కువగా గల గ్రామం రాచర్లపాడు. 78 ఎకరాల విస్తీర్ణంలో 850 ఎకరాల ఆయకట్టు గల రెండు పంటలకు సాగు నీరు గ్రామానికి తాగు నీరు అందించే పంట చెరువు (సోమశిల ప్రాజెక్టు నుండి ఫీడింగ్ కలదు) ఉంది. ఇవన్నీ నాడు ఆ గ్రామానికి కలసివచ్చిన అంశాలు కాగా ,నేడు అవే ఆ గ్రామానికి శాపంగా మారి కలవాళ్ల కనిపించని కుట్రలకు గ్రామం బలైంది. ఒకప్పుడు పాడిపంటలు, పిల్లాపాపలతో కళకళలాడిన ఆ గ్రామం ఇప్పుడు బీడువారింది.

ప్రధానంగా భూసంస్కరణలలో భాగంగా పేద ప్రజలకు ఎస్.సి, ఎస్.టి లకు పంపిణీ చేసిన భూమి (అసైన్డ్ భూమి) హెచ్చు మోతాదులో ఒకేచోట ఉంది. సన్న చిన్నకారు రైతులు, పేదలు సాగు చేసుకుంటున్న దేవాదాయ భూమి కూడా వందల ఎకరాలు ఉంది. కొన్ని తరాలనుండి సాగు చేసుకుంటున్నారు. అసైన్డ్ భూమి నుండి ఫలాలను అప్పుడప్పుడే పొందుతున్న రోజులవి. మరో వైపు శ్రీహరికోట షార్ నిర్మాణ సందర్భంలో అక్కడ నిర్వాసితులైన వారిలో కొందరికి ఈ గ్రామ పరిధిలో 300 ఎకరాలు ఇచ్చారు. ఈ భూములన్నింటినీ ఇఫ్కో స్వాధీనం చేసుకుంది. రైతు వారీ సట్టా భూమి 229.78 ఎకరాలు, అసైన్డ్ భూమి 1129.82 ఎకరాలు, దేవాదాయ భూమి 1009.81 ఎకరాలు, పోరంబోకు భూమి 406.82 ఎకరాలు వెరసి 2776.23 ఎకరాలు పోను ఇంకా గ్రామ పరిధిలో చెరువు పొరుదల భూమి 217 ఎకరాలు మిగిలింది. ఈ మిగులు భూమికి నీరు పొందే హక్కును కల్పిస్తూ నాటి జిల్లా కలెక్టరు రైతులతో ఒప్పందం చేసారు. కానీ అది కూడా అమలు కావడం లేదు. ఫలితంగా ఆ మిగులు భూమి కూడా బీడు పెట్టాల్సిన పరిస్థితి. కాగా 2008 మార్చి 31న నాటి ముఖ్యమంత్రి దీనిని ఇఫ్కో కిసాన్‌సెజ్ గా మార్చి దేశంలోనే అతి పెద్ద వ్యవసాయాధారిత బహుళ ప్రత్యేక ఆర్థిక మండలిగా ప్రకటించారు. వెంటనే అభివృద్ధి చేస్తామని, రెండు సంవత్సరాలలో నిర్మాణం పూర్తిచేసి 15,000 మందికి ప్రత్యక్షంగా, 50,000 మందికి పరోక్షంగా ఉపాధి కల్పిస్తామని ప్రకటించి తమ నైజాన్ని ప్రదర్శించగా మరోసారి మోసపోవడం ప్రజల వంతు అయ్యింది.

1994 నుండి నేటి వరకు అంటే 18 సంవత్సరాలుగా అక్కడ ఎలాంటి నిర్మాణం జరగలేదు. అధికారులు, నేతలు వాగ్దానాలన్నీ నీటి మీద రాతలయ్యాయి. ఇప్పుడు ఈ భూమిలో అంతర్గత రోడ్ల నిర్మాణం చేపట్టారు. అయితే అందులో జరిగే ఏ చిన్న పనికి కూడా స్థానిక ప్రజలను ఉపయోగించడం లేదు. అలానే 35 మంది సెక్యూరిటీ గార్డ్స్ నియామకం జరిగితే స్థానికులను ఒక్కరిని కూడా నియమించలేదు. గుంటూరు, విశాఖ జిల్లాల నుండి వచ్చిన వారిని రు.6000 నెల జీతానికి నియమించారు. మరోవైపు 2010లో 2776 ఎకరాల చుట్టూ అంటే 28 కి.మి. చుట్టూ కొలతతో, 40 కోట్ల రూపాయలతో, 10 అడుగుల ఎత్తుతో, ముళ్ల కంచతో ప్రహరీ నిర్మాణం మాత్రం జరిగింది. నివాస ప్రాంతమైన ఇళ్లు ఉన్న భూమిని వదిలి ఊరు చుట్టూ ప్రహరీ నిర్మించారు. నేడు అది ఊరు మధ్యనే ఉన్న ఒక విదేశీ భూ భాగంగా మారిపోయింది. చివరికి గ్రామ శ్మశానం 5 ఎకరాలను కూడా వదలలేదు. అయితే గ్రామస్తులు అడ్డం తిరగడంతో అందులో 30 సెంట్లు అంటే ఎకరాలో మూడవ వంతు కంటే తక్కువ వదిలి ప్రహరీ నిర్మాణం చేసారు. ఒక శవం పై మరో శవం పూడ్చాల్సిన దారుణ పరిస్థితి నేడు రాచర్లపాడు గ్రామ ప్రజలది. గ్రామ దేవుడు రాచర్లయ్యను ఒక పెద్ద మాను(చెట్టు)తో పూజిస్తూ అన్ని శుభ కార్యాలకు అక్కడ పూజలు చేయడం, మొక్కులు తీర్చుకోవడం తరతరాలుగా వస్తున్న ఆచారం. ఆ మాను ప్రహరీ లోపల ఉండడంతో ప్రస్తుతం గ్రామ ప్రజలకు ప్రవేశం రద్దు అయ్యింది. ప్రహరీ నిర్మాణానికి ముందు అనధికారికం గానే అక్కడికి వారు వస్తూ పోతూ ఉండేవారు. గ్రామ ప్రజలు ప్రహరీని తొలగించారు. వారు తిరిగి నిర్మిస్తున్నారు. ఈ క్రమంలో గ్రామ ప్రజలపై 5 కేసులలో మొత్తం 80 మందిని ఇరికించారు. నేటికీ కొంతమంది

కోర్టుకు వాయిదాలకు తిరుగుతున్నారు. ప్రహరీ నిర్మాణం వల్ల గ్రామస్తులు వంటచెరకు, పశువుల మేతల కోసం 5 కి.మి. పోవలసి ఉంది.

నాడు రైతు వారి పట్టా భూమికి మెట్టకు 9 వేల నుండి 15 వేలు, మాగాణికి 30వేల నుండి 45 వేల వరకు మొత్తం 1276 మందికి 3.35 కోట్ల రూపాయల పరిహారం అందించారు. ఈ పరిహారం పంపిణీలో కొందరు చేతివాటం ప్రదర్శించి లక్షలు నొక్కేశారని రైతులు విమర్శిస్తున్నారు. అప్పటి లెక్కల ప్రకారమే 1256 ఎకరాలకి ఇంకా 1.2 కోట్ల రూపాయలు పరిహారం చెల్లించాల్సి ఉంది. అది నేటికీ అందలేదు. అసైన్డ్ భూమి పోగొట్టుకున్న ఎస్.సి, ఎస్.టి.లు, పేదలు కనీసం నష్టపరిహారానికి కూడా నోచుకోలేని దుస్థితి. మరోవైపు నష్టపరిహారం ఫలహారంలాగా కరిగిపోగా నేడు వారంతా భిక్షాటన చేస్తున్నారు.

నేడు రాచర్లపాడు రైతన్న పరిస్థితి – 'ఒక నాటి రైతు నేడు దినసరి కూలి' అన్నట్లుంది. ప్రధానంగా రాచర్లపాడు గ్రామం జాతీయ రహదారిపై ఉండడం, గ్రామంలో ప్రతి కుటుంబానికీ ఎంతో కొంత సాగు భూమి ఉండడంతో ఆ గ్రామం వారితో వియ్యం అందుకోవడానికి చుట్టుపక్కల వారు చాలా ఇష్టపడేవారు. ఇక్కడ పెళ్లి చేస్తే కాపురంలో ఏ లోటురాదనే నానుడి ఉండేదని గ్రామ పెద్ద లింగారెడ్డి తెలిపారు. అదంతా ఒకప్పటి ముచ్చట. గ్రామంలో పరిస్థితి పూర్తిగా మారి పోయింది. పూలమ్మిన చోటే కట్టెలమ్మాల్సిన పరిస్థితి నెలకొంది. కుంటుంబ ఆర్థిక పరిస్థితి పిల్లల చదువులపై పడింది. ఉన్నత చదువులు చదవాల్సిన పిల్లలు తమ పెద్దలు పడుతున్న కష్టాలను చూసి వారికి భారం కాకూడదని అర్ధాంతరంగా చదువులు మానేసి కూలి పనులలో చేరిపోయారు. కనీసం పెళ్లీడుకు వచ్చిన పిల్లలను పెళ్లిళ్లు చేసుకోవడానికి కూడా ఎవరూ ముందుకు రావడంలేదు. నేడు గ్రామంలో దాదాపు 40 మంది ఆడ పిల్లలకు పెళ్లీడు వచ్చినా ఆ శుభ ఘడియలు మాత్రం వారికి రావడంలేదు. అలా 30 మందికి పైగా యువకులు కూడా ఉన్నారు. మేము వియ్యమందుకోవడానికి మీకు జీవనాధారం ఏమిటో చూపించండని అంటున్నారు. మా పిల్ల/పిల్లవాడు మీలాగా రోడ్డు పట్టుకుని ఇటు సూళ్లూరుపేట(125 కి.మీ) అటు చిలకలూరిపేట(130 కి.మీ) దాకా పని ఎతుక్కుంటూ పోలేరని అంటున్నారని ఆ గ్రామ ప్రజలు వాపోతున్నారు. కష్టపడి పని చేయగలిగే స్వభావం ఉండి చేతిలో పని లేక ఖాళీగా ఉండడం వల్ల రోడ్డు పనులకు ఎక్కువగా వీరినే ఉపయోగిస్తున్నారు. రోడ్డు పనులకు దూరప్రాంతాలకు వెళ్లవచ్చే క్రమంలో ఈ 18 సంవత్సరాలలో ప్రమాదాల వలన 35 మంది కాలం చేసారంటే పరిస్థితి ఎంత దయనీయంగా ఉందో అర్థం చేసుకోవచ్చు.

ఏమి చేయడానికీ దిక్కు తోచని రాచర్లపాడు రైతన్నలు హైకోర్టుకు తమ గోడు వెళ్లబోసుకున్నారు. 18 సంవత్సరాలైనా ఆ భూమిలో ఎలాంటి నిర్మాణం జరగలేదు. కరతుమ్మ చెట్లు పెంచారు తప్ప, 2 సంవత్సరాల్లో నిర్మాణం పూర్తి చేసి ఉపాధి కల్పిస్తామన్న వాళ్లు పత్తా లేరు. నేడు మా పరిస్థితి ఒడ్డున పడ్డ చేపపిల్లలా ఉంది. కాబట్టి మా భూమిని మాకు ఇవ్వాలని, 18 సంవత్సరాల కాలానికి పంట నష్టపరిహారం చెల్లించాలని, అవసరం అయితే నాడు మాకు చెల్లించిన అరకొర చిల్లర తిరిగి ఇచ్చేస్తామని, మాకు న్యాయం చేయాలంటూ కోర్టును ఆశ్రయించారు. హైకోర్టు సానుకూలంగా స్పందించి విచారణకు స్వీకరించి ఇంటెరిం డైరెక్షన్ ఇచ్చింది. ఇప్పటి వరకు అధికారులకు, రాజకీయ నాయకులకు, కనపడిన వారందరికీ విజ్ఞప్తి చేసాం. అయినా పట్టించుకున్న నాథుడు లేడు. నేడు కోర్టు అయినా మా గోడు ఆలకించిందని ఇద్దరు రైతులు చెబుతూ కన్నీరు పెట్టుకోవడం నన్ను కలచివేసింది. దానిపై ప్రభుత్వం, ఇఫ్కో వారు గత నెల 24 లోపు తమ వాదనలు కోర్టుకు తెలపవలసి ఉండగా నేటికీ వారు స్పందించలేదు. ఈ మొద్దు నిద్రను వదలించాలనే దానితో రాచర్లపాడు, రేగడిచెలిక గ్రామస్తులు మొన్న జరిగిన ఉప ఎన్నికలను బహిష్కరించారు. తమ సంఘటిత శక్తిని నిరూపించారు. ఈసారి అధికారుల మాటలను నమ్మదలుచుకోలేదు. రాజకీయ నాయకుల ప్రలోభాలకు లొంగలేదు. తమ భూములను తిరిగి తమకు స్వాధీనం చేయాలని వారు కోరుతున్నారు. మిగిలిన సెజ్ బాధితులకు ఆదర్శంగా నిలిచారు.

ఇది ఒక్క రాచర్లపాడు, రేగడిచెలిక గ్రామ పరిస్థితి అనుకుంటే పొరపాటు. సెజ్‌ల పేరుతో 2005 నుండి 2011 వరకు దేశంలో ప్రత్యేకంగా ఆంధ్ర రాష్ట్రంలో జరిగినదీ, జరుగుతున్నదీ ఇదే. ఒక్క నెల్లూరు జిల్లాలోనే 6 సెజ్‌లను నోటిఫై చేయగా అందులో ఒకటి మాత్రమే పని చేస్తుండగా మిగిలిన 5 ఎలాంటి నిర్మాణం జరగక పోగా, పంట భూములన్నీ నిరుపయోగంగా పడి ఉన్నాయి. జిల్లాలో దాదాపు 36 వేల ఎకరాలు సెజ్‌లకు కేటాయించారు. 75,120 మందికి ప్రత్యక్షంగా ఉపాధి కల్పిస్తామని చెప్పి వేల మంది రైతులను, వ్యవసాయ కూలీలను నిరాశ్రయులను చేయగా నేటి వరకు ఆరువేల ఉద్యోగాలను మాత్రమే కల్పించడం జరిగింది. సెజ్‌ల లోనూ, వాటి చుట్టు పక్కల ప్రాంతాలలోనూ భూముల రేట్లను పెంచి రియల్‌ఎస్టేట్ వ్యాపారం చేస్తున్నారు. మేనకూరు సెజ్‌లో ప్లాట్లు అమ్మకానికి పెట్టగా చిల్లకూరులోని మాస్ ఫ్యాబ్రిక్ పార్క్ సెజ్ రైతుల నుండి ఎకరా 3లక్షలకు సేకరించి నూజివీడు సీడ్స్ కంపెనీకి ఎకరా 80 లక్షలకు పైగానే విక్రయించినట్లు రైతులు ఆరోపిస్తున్నారు. అసైన్డ్ భూములు ప్రభుత్వానివే అన్నట్లు జిల్లాలో సెజ్‌లకు సేకరించిన భూములలోని అసైన్డ్ భూములకు నష్టపరిహారం చెల్లించక పోవడం చూస్తుంటే, కాకులను కొట్టి గద్దలకు పెట్టిన చందంగా ఉంది. నెల్లూరు జిల్లాలో సెజ్‌లకు సేకరించిన భూముల్లో 69 శాతం అసైన్డ్ భూములని ఒక సర్వే తెలియజేస్తుంది. అంటే భూ సంస్కరణల ఫలితంగా అరకొరగా పంపిణీ చేసిన భూములన్నీ ప్రజోపయోగం పేరుతో తిరిగి దొడ్డి దారిన కేంద్రీకరించబడ్డాయి. అలానే జిల్లాలో సెజ్‌కు కేటాయించిన భూముల్లో 96 శాతం నేటికీ ఉపయోగంలో లేవని ఆ సర్వే వెల్లడిస్తోంది.

ఇది వాస్తవ పరిస్థితి. అభివృద్ధి పేరుతో ప్రభుత్వం చేస్తున్న బలవంతపు పారిశ్రామికీకరణలో జరగేది భూమిని అసలైన సొంతదారుల నుండి పెట్టుబడిదారుల, బహుళజాతి కంపెనీల చేతుల్లోకి బదలాయించడమే. ఇవి చట్టబద్ధమైన భూ కబ్జాలు. ప్రత్యేక ఆర్థికమండలి అన్న బోర్డు తగిలిస్తే చాలు అన్నది వాస్తవం. మౌలికంగా సెజ్ చట్టం, దానిని వాడుతున్న తీరు ప్రజల జీవించే హక్కును హరించివేస్తుంది. వాళ్లను తమ వృత్తి నుండి, పని నుండి, శ్రమ నుండి, సంపద నుండి, సమస్త జీవనావకాశాల నుండి దూరం చేసేదిగా ఉంది. అందుకే అభివృద్ధి ఎవరికోసం? ఏ రైతన్నల కోసం ఈ సెజ్‌లు? ఎవరి ఉద్ధరణ ఇందులో ఉంది అని నేడు రాచర్లపాడు రైతాంగం ప్రశ్నిస్తోంది. వారికి మనం అండగా నిలవాలి. కాకినాడ సెజ్ భూములను రైతులు దున్నగా, వాన్‌పిక్ భూములను స్వయానా రాష్ట్రమంత్రి వర్యులు దున్ని ఏరువాక ప్రారంభించారు. ఇది కొంత మంచి పరిణామమే. సెజ్‌ల పేరుతో రాష్ట్రంలో సేకరించిన భూములన్నింటినీ తిరిగి ఆయా రైతులకు స్వాధీనపరచాలి. ఆ కాలానికి పంట నష్టపరిహారం చెల్లించాలి. వ్యవసాయ భూములను వ్యవసాయేతర అవసరాలకు వినియోగించ కుండా చట్టాన్ని అమలు పరచాలి. అసైన్డ్ భూములను పట్టా భూములుగా పరిగణించాలి.

*(రచయిత కావలి జవహర్ భారతిలో కామర్స్ లెక్చరర్)* వీ

# దామాషా ఎన్నికలు

***ఇజ్రాయిల్ తరహా దామాషా ఎన్నికలతో మన దగ్గర కూడా ఎన్నికల్లో చోటు చేసుకుంటున్న అనేక అక్రమాలను నిలువరించవచ్చని అంటున్నారు* జాస్తి జవహర్‌లాల్**

లోక్‌సత్తా ప్రణాళికలో ఎన్నికలపద్ధతిని ప్రక్షాళన చెయ్యడం ఒక ముఖ్యమైన అంశం. హజారే చెప్పింది ఎన్నికైన సభ్యుడిని వెనక్కిపిలవడం (రీకాల్) వరకే. అది చెప్పడానికి బాగానే ఉంటుంది గాని ఆచరణలో ప్రమాదకరమయింది. ఆ ప్రమాదాలేమిటో ఊహించడం కష్టం కాదు.

ఇప్పుడున్న వ్యవస్థలో ఎన్నికలు సరిగా జరగక పోవడానికి కారణం చట్టాలలోను, నియమాలలోను ఉన్న తప్పులు, లోట్లు. ఈతప్పుల ప్రభావం ప్రత్యక్షంగా కొట్టవచ్చినట్లు కనపడుతున్నా వాటిని సవరించాలన్న కోరిక ప్రభుత్వానికి కాదుగదా, ఏపార్టీకీ లేదు. ఎవరికి వారు దాని నుంచి లాభించాలనే చూస్తున్నారుగాని సవరించాలని అనుకోవడం లేదు. అందుకే లోక్‌పాల్ వంటిబిల్లులు ఎప్పుడూ బయటికిరావు. ఇటువంటి లోపాలు ఎన్నికలచట్టాలలోనే కాదు. చాలా చట్టాలలో కనిపిస్తాయి.

రాజకీయ పార్టీలకు చేసే ధనసహాయాన్ని ధార్మికచర్యగా పరిగణించి పన్నుల నుంచి మినహాయింపు కల్పించారు. రాజకీయ పార్టీలు ధార్మిక సంస్థలా? రాజ్యాంగంలో స్థానంలేని అధికార సాధనాన్ని ధర్మ సంస్థగా గుర్తించి మనలను మనమే మోసం చేసుకుంటున్నాం. టాటాలు, బిర్లాలు ధర్మ సంస్థలు స్థాపించి వాటిద్వారా రాజకీయపార్టీలకు ధనసహాయం చేస్తుంటారు. రాజకీయం ధర్మకార్యమా? రాజకీయపార్టీలు ఏవిధమైన పన్నులూ చెల్లించవు. వారికున్న ఒకేఒక్క నియమం సంవత్సరానికొకసారి లెక్కలు ఆడిట్ చేయించి ప్రకటించడం. ఆలెక్కల ప్రకారం 2009 - 2010 కాంగ్రెసుపార్టీ ఆదాయం 525.97 కోట్ల రూపాయిలు. భారతీయ జనతాపార్టీ ఆదాయం 251.74 కోట్ల రూపాయిలు. ఇవి నమ్మదగ్గ లెక్కలేనా? పార్టీలకిచ్చేవాళ్ళు తెల్లధనంలో నుంచి ఇస్తే పన్నురాయితీలు పొందవచ్చు. కాని రాయితీలకోసం ఆశించి ఎవరూ నల్లధనాన్ని బయటపెట్టరు. అదిలెక్కలో పడకుండానే ఖర్చవుతుంది. పార్టీకోసం ఇతరులెవరూ ఖర్చుపెట్టగూడదన్న నియమం లేదు. ఆవిధంగా పార్టీకోసం, పోటీదారుల కోసం కోట్లధనం ఖర్చవుతున్నది. అది పార్టీలెక్కలోకి రాదు. ఎన్నికల కమిషన్ నియమాలప్రకారం ఒక్కొక్క అసెంబ్లీ స్థానానికి ఒక్కొక్క అభ్యర్థి రు.25 లక్షల వరకు ఖర్చు చెయ్యవచ్చు. అనధికార అంచనాల ప్రకారం అది రు.2.5 - 5.0 కోట్లమధ్య ఉంటున్నది. ఒక్కొక్క పార్లమెంటు స్థానానికి ఒక్కొక్క అభ్యర్థి రు. 40 లక్షల వరకు అధికారికంగా ఖర్చు చెయ్యవచ్చు. అనధికారిక అంచనాల ప్రకారం అది రు. 5 నుంచి 20 కోట్లవరకు ఉంటున్నది. ఇవన్నీ ఎన్నికల కమిషన్ కి తెలుసు. కాని ఎన్నిజాగ్రత్తలు తీసుకున్నా ఆపడం వారితరం కావడం లేదు. ఎన్నికలైన తరువాత కమిషన్‌కి సమర్పించే లెక్కల ప్రకారం ఖర్చు అధికార పరిమితిలోనే ఉంటుంది. ఎన్నికలలో పోటీపడేవారు ఒకరినొకరు తిట్టుకోవడం మాని ఎదుటివారి ఖర్చులకు ఆధారాలు వెదికితే అది పరిమితి దాటిందని నిరూపించడం కష్టం కాదు. దానితో ఆ అభ్యర్థి అనర్హుడు కావడం తథ్యం. గతంలో వందేమాతరం రామచంద్రరావు ఈ ఆయుధాన్ని వి.బి.రాజు పైన ప్రయోగించినట్లు వినికిడి. అటువంటి కార్యదక్షులు ఇప్పుడులేరు. పోటీదారులందరూ ఖర్చులో పోటీ పడుతున్నారు తప్ప నియమాలు పాటించడంలోకాదు. కనీసం లోక్‌సత్తా ఐనా ఈ పద్ధతినను సరించి పార్టీల ఖర్చులను నిరూపించే ప్రయత్నం చేసి ఎన్నికల కమిషన్‌కి చూపితే చాలా మేలుచేసిన వారవుతారు. ఆహద్దులను దాటే అవకాశం లోక్‌సత్తా పార్టీకి ఎలాగూ లేదు. ఉన్నా అది పార్టీ పద్ధతికి విరుద్ధం.

ఈవిధమైన ఖర్చు పెరగడానికి ముఖ్యకారణాలు రెండు. ఎన్నికలు పార్టీపేరుతో నడిచినా అది అభ్యర్థి వ్యక్తిగత బాధ్యత అయింది. పోటీ నియోజకవర్గానికి పరిమితం కావడం రెండవకారణం. అన్నిపార్టీలను మించిన ధనబలంగల కాంగ్రెసు అభ్యర్థులు ఎక్కువగా ఖర్చు చేస్తుంటారు. ఐనా ఈసారి మధ్యంతర ఎన్నికలలో ప్రతివారూ ఖర్చుకారణంగా వెనుకంజ వేస్తున్నట్లు వినవస్తున్నది. అంటే ఖర్చు వారి అంచనాలను కూడా దాటిపోయిందన్న మాట! నియమాలనతిక్రమించడంలో ఉన్న ఆనందం హద్దులు దాటింది.

పది సంవత్సరాలకొకసారి జనాభాలెక్కలు సేకరించి నియోజకవర్గాల పరిధిని మార్చుతుంటారు. లోక్ సభలోను, అసెంబ్లీలలోను స్థానాలను నిర్ణయించారు. కాని జనాభా పెరుగుతుంటుంది. ఒక్కొక్క నియోజకవర్గంలోని ప్రజలసంఖ్య గూడా పెరగాలి. అందుకోసం నియోజకవర్గ పరిధులను పునర్నిర్మించడం అవసరం అవుతున్నది. ఈమార్పు జరిగేటప్పుడు తమ ఆధిపత్యం ఎక్కువగా ఉన్నగ్రామాలు తమ నియోజకవర్గంలో ఉండేటట్లు ప్రతివారూ ప్రయత్నిస్తారు. ఆకారణంగా ఒక్కోసారి నియోజకవర్గాల రూపురేఖలు చిత్రంగా మారుతుంటాయి. అలాకాక ఎన్నికలు దేశం మొత్తం ఒకే వర్గంగా జరిగితే ఈగొడవ ఉండదు. ఇటువంటి వ్యక్తిగతప్రమేయం లేకుండా, నిజంగా పార్టీల పరంగా ఎన్నికలు జరగాలంటే దామాషా ఎన్నికలే మార్గం. వ్యక్తులపేర్లు పార్టీలిష్టులో ఉన్నా, ఓట్లు ఒకనియోజకవర్గానికి పరిమితం కావు.

ఉదాహరణకి ఇప్పుడు ఇజ్రాయిల్ ఎన్నికలు దామాషా ప్రకారమే జరుగుతవి. పోటీచేసే పార్టీలన్నీ తమతమ అభ్యర్థులపేర్లు ఒక లిస్టులో ప్రకటిస్తాయి. ప్రతిపార్టీకి ఒకప్రణాళిక (మానిఫెస్టో) ఉండాలి. దానినిబట్టి ప్రజలు ఓటువెయ్యాలి. దేశం మొత్తం మీద వచ్చిన ఓట్ల దామాషానుబట్టి పార్లమెంటులో స్థానాలు దక్కుతాయి. ఇజ్రాయిల్ పార్లమెంటు పేరు నెస్సెట్. అందులో 120 స్థానాలుంటాయి. పార్టీలకి ఎంతశాతం ఓట్లు వస్తే వారికి ఆ దామాషాలో స్థానాలు కేటాయిస్తారు. ఉదాహరణకి ఒకపార్టీకి 30 శాతం ఓట్లు వస్తే వారికి నెస్సెట్ లో 36 స్థానాలు

# అణు వ్యవస్థల భద్రత

*అణు విజ్ఞాన శాస్త్రం పట్ల సామాన్య ప్రజలకు ఆసక్తి కన్నా భయాలే ఎక్కువ ఉన్నాయనీ, దీనికి లాభాపేక్షతో కూడిన ప్రభుత్వ నిర్లక్ష్య విధానాలే కారణమనీ అంటున్నారు* **డా. కొడవటిగంటి రోహిణీప్రసాద్**

తొలిదశలలో కేవలం భౌతికశాస్త్రపరిశోధనలకే పరిమితమై ఉండిన అణు విజ్ఞాన విశేషాలకు ప్రస్తుతం అణువిద్యుత్తు వగైరాల కారణంగా పారిశ్రామిక స్థాయిలో గుర్తింపు లభిస్తోంది. యురేనియం, ప్లూటోనియం వంటి పదార్థాలు అణుఇంధనాలుగా వాడకంలోకి వచ్చాక అవి లోనయే వివిధ ప్రక్రియలను (న్యూక్లియర్ ఫ్యూయెల్ సైకిల్) అణుఇంధనఆవృత్తిగా పరిగణిస్తున్నారు. ఇందులో గనులనుంచి ఇంధనాన్ని ఖనిజరూపంలో తవ్వితీయడం, దాన్ని ఉపయోగించదగిన రూపంలోకి మార్చడం, ఇంధనంగా వాడడం, ఖర్చయిన ఇంధనపు వ్యర్థాలను శుద్ధిచేసి, వీలైన సందర్భాల్లో పనికొచ్చే పదార్థాలను వాటినుంచి వేరుచెయ్యడం, తీవ్రమైన రేడియోధార్మికత కలిగిన వ్యర్థాలను సురక్షితంగా పాతిపెట్టడం వగైరాలుంటాయి.

సామాన్య ప్రజలకు అణువిజ్ఞానవిశేషాలపట్ల ఉండే ఆసక్తికన్నా, వాటివల్ల కలగగలిగిన అనర్థాల గురించిన ఆందోళనే ఎక్కువగా ఉంటుంది. రేడియోధార్మికత మితిమీరితే హాని కలుగుతుందనే మాట నిరాకరించలేని నిజమే అయినప్పటికీ, అనవసరభయాలకు లోనవడం సరికాదు. ఉదాహరణకు ఎక్స్‌రేలు కనిపెట్టిన కొత్తలో సైంటిస్టులు తమను వివస్త్రలుగా వీక్షిస్తారనే భయంకొద్దీ విక్టోరియన్ కాలపు మహిళలు కొందరు బట్టలు విప్పకుండా స్నానాలు చేసేవారట. ఇలాంటి అపోహలు తగ్గడానికి కొంత సమయం పట్టింది. మనదేశంలో ఆంధ్రప్రాంతంతోసహా కొత్తగా యురేనియం గనుల తవ్వకం మొదలవనున్న దశలో అందుకు వ్యతిరేకంగా ఆందోళనలు చేస్తున్నారు. ప్రస్తుతం మన ప్రభుత్వాల వైఖరి చూస్తే, డబ్బు కోసమని ప్రైవేట్ కాంట్రాక్టర్లకు ప్రజల సంక్షేమాన్ని బలిపెట్టడానికి వెనకాడని పరిస్థితి కనిపిస్తోంది. కనక ఆందోళన చేసేవారిని తప్పుపట్టికూడా లాభంలేదు. కనక ఇందులోని ప్రమాదాల గురించి స్థూలంగా తెలుసుకోవడం బాగుంటుంది.

కొన్నిదేశాలు ఇంధనాన్ని రియాక్టర్లలో ఒకసారి వాడుకున్న తరవాత తిన్నగా వ్యర్థాల రూపంలో దాచిపెడతాయి. ఇతరదేశాలు ఒకసారి ఉపయోగించిన యురేనియంనుంచి ప్లూటోనియంను వేరుచేసి మళ్లీ

---

దక్కుతాయి. ఆపార్టీ ఇచ్చిన లిస్టులో పైన ఉన్న 36 మంది నెసెట్ సభ్యులౌతారు. 2 శాతం ఓట్లు వచ్చిన పార్టీకి ఒకస్థానం దక్కుతుంది. అంతకంటే తక్కువ వచ్చిన వారిని విస్మరించడం జరుగుతుంది. లిస్టులో మొదటిస్థానంలో ఉన్నవ్యక్తి ప్రధాని అవుతాడు. కాని ఎక్కువశాతం వచ్చినా ఆ పార్టీ అధికారంలోకి రాకపోవచ్చు. ఉదాహరణకి ఒక పార్టీకి 35 శాతం, ఇంకొకపార్టీకి 40శాతం ఓట్లు వచ్చినయ్యనుకోండి. మిగిలినవారిలో 16 శాతం ఓట్లు వచ్చినపార్టీ 35 శాతం వచ్చిన వారితో కలిస్తే వారే అధికారంలోకి వస్తారు. సంకీర్ణ ప్రభుత్వం ఏర్పడుతుంది. ఆ విధంగా ఇజ్రాయిల్‌లో చాలాసార్లు జరిగింది. ఇప్పుడున్నదిగూడా సంకీర్ణ ప్రభుత్వమే.

పార్టీలిస్టులో ఎవరిపేర్లు ఉండాలనేది పార్టీనిర్ణయిస్తుంది. వారు ఏప్రాంతానికి ప్రాతినిధ్యం వహిస్తున్నారన్న ప్రశ్నరాదు. దానితో ప్రాంతీయ తత్వం కొంతవరకు తగ్గుతుంది. నియోజకవర్గం ప్రకారం ఎన్నిక జరిగినప్పుడు, ఓడిపోయిన అభ్యర్థికి వచ్చిన ఓట్లు వృథా అయినట్లు భావిస్తారు. కాని దామాషా ఎన్నికలలో ఆప్రమాదం లేదు. దేశంలో ఎక్కడ ఉన్నా వారి ఓటు కావాలనుకున్న పార్టీకి పడుతుంది. దామాషాను బట్టి స్థానాలు దక్కుతాయి. ఓడిపోయిన పార్టీలు ఒక్కొక్కసారి కొద్దిలో ఓడిపోయామనీ, ఏదో ఒకపార్టి పోటీ చెయ్యకపోతే గెలిచేవారమని అనుకోవడం కద్దు. 2004 లో అమెరికాలో జరిగిన అధ్యక్ష ఎన్నికలలో అల్‌గోర్ ఓడిపోవడానికి రాల్ఫ్ నాడర్ పార్టీ కారణమని అభిశంసించారు. ఆపార్టీ పోటీ చెయ్యకపోతే, వారికి వచ్చిన ఓట్లలో కొన్నయినా తమకు వచ్చేవనీ, దానితో ఫ్లోరిడా రాష్ట్రం ఓట్లు తమకు వచ్చి గెలిచేవారమని డెమోక్రాట్లు వాపోయారు. అలాగే కిందటి ఎన్నికలలో చాలా స్థానాలను తెలుగుదేశం పార్టీ పోగొట్టుకోవడానికి కారణం ఇతరపార్టీలని దిగులు పడ్డారు. ఎన్నికలలో పోటీ చెయ్యవద్దని ఎవరినీ ఆపలేరుగదా!

ఇజ్రాయిల్ లోనూ రెండవతరగతి పౌరులున్నారు – అరబ్బులు. వారికి మొదట ఓటుహక్కు లేదు. తరువాత కొన్ని నియమాలతో ఓటు హక్కు కల్పించారు. నియోజకవర్గం ప్రకారమైతే వారికి నెస్సెట్‌లో స్థానం ఉండేదికాదు. దామాషా ప్రకారం ఎన్నికలు జరగడం వల్ల వారికి గూడా స్థానం దొరుకుతున్నది. ఇక్కడ బహుజన సంస్థల నాయకులు అప్పుడప్పుడు జనాభా లెక్కల ప్రకారం వారు అధిక సంఖ్యలో ఉన్నా వారికి అధికారం అందడంలేదని విమర్శిస్తుంటారు. దానికి అసలు కారణం ఎవరూ అడ్డుపడడంకాదు. అది వ్యవస్థలో ఉన్నలోపమే. ఎన్నికల పద్ధతిని సవరిస్తే దామాషా ప్రకారం వారికి రావలసిన స్థానాలు వస్తాయి. కాని బహుజనుల్లో శాఖలుంటే తిరిగి అదేపరిస్థితి వస్తుంది.

ఇజ్రాయిల్ చిన్నదేశం గనుక వారికి రాష్ట్రాల గొడవలేదు. మనది పెద్దదేశం కనుక రాష్ట్రాలుగా విభజన జరిగింది. ఐనా పద్ధతి ప్రకారం నడుచుకుంటే దామాషా ఎన్నికలు కష్టంకాదు. రాష్ట్రాలవరకైనా అమలు చెయ్యవచ్చు. కాని ఇది సర్వరోగనివారిణికాదు. మన వ్యవస్థకున్నరోగాలు అంత తేలికగా పోయేవికావు. అందుకు ఇంకా కొన్ని చర్యలవసరం. అన్నిటికన్నా చిత్తశుద్ధిముఖ్యం.

*(రచయిత రిటైర్డ్ చార్టర్డ్ అకౌంటెంట్)* వీ

ఉపయోగించడం, అలాగే పునరుపయోగానికి పనికొచ్చే యురేనియంను శుద్ధిచేసి వేరుచెయ్యడం, వీటి రెండిటినీ విడిగానో, కలిసికట్టుగానో ఇంధనంగా మళ్లీ ఉపయోగించడం వగైరా కార్యకలాపాలు చేపడతాయి. యురేనియం గనుల తవ్వకం పనులైనా, ఇలా వాడేసిన ఇంధనంతో మళ్లీ ప్రమేయం పెట్టుకోవడమైనా పర్యావరణానికీ, సిబ్బంది ఆరోగ్య సంక్షేమాలకూ కొన్ని సమస్యలు కలిగించగలవు. వీటిలో రేడియం, పొలోనియం, రేడాన్ వాయువూ మొదలైనవి ఉంటాయి.

గనులలో దొరికే యురేనియంను ఖనిజంగా ఆక్సైడ్ రూపంలో తీస్తారు. ఈ బృహదణువుల్లో మూడు యురేనియం అణువులూ, 8 ఆక్సిజన్ అణువులూ ఉంటాయి. దీన్ని మరపట్టి, రేణువులుగా చేసి, యురేనియం హెక్సాఫ్లోరైడ్ వాయువుగా మారుస్తారు. ఆ తరవాత ఒక యురేనియం అణువూ, 2 ఆక్సిజన్ అణువులూ కలిగిన యురేనియం డయాక్సైడ్‌గా రియాక్టర్లలో ఉపయోగిస్తారు. ఈ ప్రక్రియలు పారిశ్రామిక స్థాయిలో జరుపుతున్నప్పుడు కొంత రేడియోధార్మికత పర్యావరణంలో ప్రవేశిస్తుంది. ముడియురేనియం ఖనిజాన్ని తవ్వి, తీసి, సన్నని రేణువులుగా మార్చాక అందులోని విలువైన లోహాన్ని వేరుచేస్తారు. ఆ తరవాత మిగిలిన మట్టివంటి వ్యర్థపదార్థాన్ని యురేనియం టెయిలింగ్స్ అంటారు. ఇందులో ఎక్కువభాగం రాళ్లవంటి నిరపాయమైనదే అయినా దానితోపాటుగా థోరియం-230, రేడియం-226, రేడాన్-222, అవి క్షీణిస్తున్నప్పుడు రూపొందే పొలోనియం-210 మొదలైన రేడియోధార్మికపదార్థాలుంటాయి. వీటిని గనక పైకి తెచ్చి మడుగుల్లో ఆరబెట్టినట్టయితే అందులో కొంతైనా గాలిలో కలిసి దూరప్రాంతాలకు వ్యాపించి, ప్రకృతిలోని ఆహారపదార్థశ్రేణిని కలుషితం చేసే ప్రమాదం ఉంటుంది. 1983లో అమెరికాలో జరిపిన ఒక పరిశీలనలో ఇది కనీసం 500 మందికి ఊపిరితిత్తుల కేన్సర్ కలిగించిందని తేలిందట. మొత్తంమీద గనుల కార్యకలాపాల్లోనూ, మర పట్టినప్పుడూ, టెయిలింగ్స్ వల్లనూ ధూళి విడుదల అవడం, ద్రవాలు స్రవించడం మొదలైన ప్రమాదాలు కలగవచ్చు. నేల కోతపడడం, రేడాన్‌వంటి వాయువులు హానికలిగించడం జరగవచ్చు. ఇంధనం తయారీ, యురేనియం-235 మోతాదు పెంచడం వగైరాలవల్ల కాలుష్యపరమైన ప్రమాదమేమీ తలెత్తదు.

కాస్మిక్ కిరణాలూ, భూమిలోని పదార్థాలూ వగైరాలవల్ల ప్రకృతిలో సహజంగా కనబడే వికిరణం స్థాయి గంటకు 5 నుంచి 40 మైక్రో రెమ్‌లను మించదు. సామాన్యప్రజలను గంటకు 100 మైక్రోరెమ్‌లకు మించిన రేడియోధార్మికతకు గురిచెయ్యరాదనే నిబంధన ఉంది కనక ఇదెంత తక్కువో అర్థమవుతుంది. అణుసంస్థలన్నీ ఇవే నిబంధనలకు లోబడి పనిచెయ్యాలి. చెర్నోబిల్ దుర్ఘటన తరవాత మనదేశంలోని అణువిద్యుత్కేంద్రాలన్నిటిలోనూకూడా ఈ విషయంలో గమనిక పెరిగింది. కొత్త రియాక్టర్ నిర్మించే ముందుగానే అక్కడి సహజ రేడియోధార్మికతను నిత్యమూ కొలుస్తూఉండే పరికరాలను ఏర్పాటు చేస్తారు. వీటిలో కొన్నిటిని రియాక్టర్‌చుట్టూతా ఒక మైలు దూరాన అమరుస్తారు. రియాక్టర్ పనిచేస్తున్నప్పుడు అక్కడేదైనా ప్రమాదం జరిగిన వెంటనే దూరంగా ఉన్న జనవాసాలకు రేడియేషన్ తాకిడి పెరిగినట్టుగా తెలిసిపోవడంతో ప్రజలను ఖాళీచేసి తరలించడం మొదలైన చర్యలు చేపట్టడం వీలవుతుంది. ఇటువంటివి కొన్ని పరికరాల రూపకల్పనలో ఈ వ్యాసరచయితకూడా పాల్గొనడం జరిగింది.

రియాక్టర్‌లో ఇంధనం ఖర్చయిపోయాక దాని రేడియోధార్మికత ఎంతో తీవ్రంగా ఉండడమే కాక, అది లక్షల ఏళ్లపాటు కొనసాగగలదు. అందుచేత దాని విసర్జన విషయంలో చాలా జాగ్రత్తలు అవసర మవుతాయి. ఇలాంటి ప్రమాదకరవ్యర్థాలు మనకన్నా అమెరికావంటి దేశాల్లో ఎక్కువగా పోగుపడుతున్నాయి కనక వాటిని యుక్కా పర్వతప్రాంతాల్లో పాతిపెట్టాలనే ప్రతిపాదనలూ, చంద్రమండలం వంటి నిర్జన ప్రదేశాలకు చేరవెయ్యాలనే సలహాలూ ఇలా రకరకాల అభిప్రాయా లున్నాయి. ఇవన్నీ సామాన్యప్రజల భద్రత దృష్ట్యా వ్యక్తమౌతున్నవే.

మనదేశపు రియాక్టర్లలో సహజయురేనియం ఇంధనంగా ఉపయోగించేవే ఎక్కువ. ఇవి పని చేస్తున్నప్పుడు ఏ కారణంచేతైనా చల్లబరిచే నీటిఒత్తిడి తగ్గడమో, నీటి సరఫరాయే నిలిచిపోవడమో జరిగితే ఇంధనం విపరీతంగా వేడెక్కి పెనుప్రమాదం జరగవచ్చు. లాస్ ఆఫ్ కూలంట్ ఏక్సిడెంట్ (Loss Of Coolant Accident or LOCA) అనే ఇటువంటి విపత్కరపరిస్థితిలోకూడా కనీసం అరగంటసేపు ప్రమాద సంకేతాలను అందించే భద్రతావ్యవస్థలన్నీ పనిచేసే ఏర్పాట్లకోసం అనేక జాగ్రత్తలు తీసుకుంటారు. ఇవికాక రియాక్టర్ భవనాల లోపల ఘన, ద్రవ, వాయురూపాల్లో వ్యర్థాలు ప్రమాదవశాత్తూ బైటికి వచ్చినప్పుడు తక్షణం కనిపెట్టి, స్పందించే పరికరాలుంటాయి. గట్టిగా మోగి హెచ్చరించడం, అవసరమైనచోట్ల వెంటనే ప్రక్రియలన్నిటినీ కట్టడిచేసి మూసివేసే ఏర్పాట్లూ ఉంటాయి. ఒక్క రేడియోధార్మికతను కనిపెట్టడం మినహా ఇవన్నీ తక్కిన పరిశ్రమల్లోని భద్రతల ఏర్పాట్లవంటివే. స్థూలంగా చెప్పాలంటే మన అణుపరిశ్రమలో ప్రభుత్వసంస్థలు స్వయంగా చేపట్టని ఏర్పాట్లలో ప్రైవేట్ కంట్రాక్టర్ల అధీనంలో జరిగే ఏర్పాట్లూ, అసంఘటిత కార్మికుల కార్యకలాపాల్లో అవలంబించే నిర్లక్ష్యవైఖరీ ప్రమాదాలకు దారితీసే అవకాశాలు ఎక్కువగా ఉంటాయి. అప్పుడప్పుడూ విపత్కరపరిస్థితుల కోసమని సామాన్యప్రజలు పాల్గొనే నకిలీతంతులు నిర్వహించడమూ కద్దు.

అణువ్యవస్థల భద్రత విషయంలోని మరొక అంశం అక్కడి ఇంధనాన్ని తస్కరించడం గురించినది. మనుషులు ప్రవేశించి, నిష్క్రమించే ద్వారాల్లో వారికి తెలిసేట్టుగానో, తెలియకుండానో వారిని వికిరణపరంగా పరిశీలించే పరికరాలను ఆ ద్వారాల చట్రాల్లో అమరుస్తారు. ఇటువంటివే అణుపరిశ్రమలో పనిచేసేవారికి సోకే రేడియోధార్మిక మాలిన్యాలను కనిపెట్టడానికికూడా ఉపయోగిస్తారు. రోజూ లోపలికి వెళ్లొచ్చే కార్మికులకు ఈ తనిఖీల నిమిత్తం ఎక్కువ సమయాన్ని వెచ్చించడం నచ్చదుకనక వారు నడిచివెళ్లే వేగాన్ని తగ్గించకుండా ఇటువంటి పరిశీలనలు జరుపుతారు. హెచ్చరించే అలారం మోగినప్పుడు మాత్రం వారు మరింత దర్యాప్తుకు లోనవడం, మాలిన్యం పోయేదాకా శరీరభాగాలను కడుక్కోవడం చేస్తారు. అలాగే ప్రతినెలా కార్మికుల మూత్రాన్ని పరీక్షించడంవంటివి జరుగుతాయి. ఇలా అనేక జాగ్రత్తలు తీసుకుంటే సకాలంలో ప్రమాద నివారణ వీలవుతుంది.

*(రచయిత అణుధార్మిక శాస్త్రవేత్త)* వీ

# ఆలోచనల గూటికి పుల్లా పుడకా

సమాజంలోనూ, పుస్తకాలలోనూ, పత్రికలలోనూ, ఇతర ప్రచార సాధనాలలోనూ ఎన్నెన్నో తెలుసుకోవలసిన, ఆలోచించవలసిన విషయాలు ఉన్నప్పటికీ, వెలువడుతున్నప్పటికీ ప్రత్యేకంగా ఎత్తిచూపక పోవడం వల్ల వెలుగులోకి రాకుండా, ఆలోచనాపరుల దృష్టికి రాకుండా పోతున్నాయి. అటువంటి తెలుసుకోవలసిన విషయాలను మా దృష్టికి వచ్చినంతవరకు సేకరించి అందించడం ఈ శీర్షిక లక్ష్యం. ప్రజల అవగాహనల గూడును సుస్థిరంగా నిర్మించడానికే ఈ పుల్లా పుడకా.

## నిరుద్యోగం

ప్రపంచవ్యాప్తంగా యువతరంలో నిరుద్యోగం విపరీతంగా పెరిగిపోతున్నదని, గతంలో ఎన్నడూ లేని స్థాయికి చేరుతున్నదని ఐక్యరాజ్యసమితికి అనుబంధంగా పనిచేసే అంతర్జాతీయ కార్మిక సంస్థ (ఐ ఎల్ ఒ) తాజా నివేదిక 'గ్లోబల్ ఎంప్లాయిమెంట్ ట్రెండ్స్ ఫర్ యూత్ 2012' ప్రకటించింది. ప్రపంచ దేశాలన్నిటిలో కలిపి 2012లో ఏడున్నర కోట్ల మంది యువకులు నిరుద్యోగులుగా ఉన్నారని, 15 నుంచి 24 ఏళ్ల వయసు ఉన్న, పనిచేయగల యువతరంలో 12.4 శాతం మందికి పని లేదని ఆ 55 పేజీల నివేదిక తెలియజేసింది. ఈ నిరుద్యోగం ఇంకా పెరిగి 18 శాతానికి చేరవచ్చునని, 2016 దాకా ఈ నిరుద్యోగం పెరుగుదల తగ్గుముఖం పట్టే అవకాశాలు కనబడడం లేదని కూడ ఆ సంస్థ అంది. 2007 గణాంకాలతో పోలిస్తే 40 లక్షల మంది నిరుద్యోగులు పెరిగారని, నిజానికి మరొక 64 లక్షల మంది నిరుద్యోగులు ఉద్యోగాన్వేషణ మానుకుని, చదువులు కొనసాగించాలని నిర్ణయించుకున్నారని, ఆ అంకెలు కూడ కలిస్తే నిరుద్యోగ సమస్య మరింత జటిలమవుతుందని ఐఎల్ఒ నివేదిక చెప్పింది. ఈ నివేదికకు, గణాంకాలకు ఒక వయో బృందాన్ని మాత్రమే పరిగణనలోకి తీసుకోవడం, ఆయాదేశాల ప్రభుత్వాలు తప్పుడు గణాంకాలు సమర్పించడం, ఉద్యోగం, నిరుద్యోగం అనే మాటల నిర్వచనాలు వంటి ఎన్నో పరిమితులున్నాయి. అందువల్ల ఈ గణాంకాలకు కనీసం రెండు మూడు రెట్ల నిరుద్యోగం వాస్తవికంగా ఉందని ఊహించవచ్చు. తాను ప్రకటించిన నిరుద్యోగపు అంకెలే ప్రమాదకర స్థితిలో ఉన్నాయని, ఆ స్థాయి నిరుద్యోగం వల్ల సామాజిక భద్రతకు భంగం వాటిల్లుతుందని ఐఎల్ఒ హెచ్చరించిందంటే, వాస్తవ స్థితి మరెంత తీవ్రమైనదో అంచనా వేయవచ్చు. భారత యువతలో నిరుద్యోగం గురించి ఈ నివేదిక ప్రత్యేకంగా వివరాలు ఇవ్వలేదు. కాని మొత్తంగా భారతదేశంలో నిరుద్యోగం గురించి కచ్చితమైన గణాంకాలు దొరకవని అర్థశాస్త్రవేత్తలు అంటారు. భారతదేశంలో నిరుద్యోగం అదృశ్యంగా ఉంటుందని, కోట్లాది మంది నిరుద్యోగులు వ్యవసాయ రంగంలో సగం పనితోనో, పని లేకుండానో, సేవారంగంలో అరకొర పనులు చేస్తూనో పొట్టపోసుకుంటూ పనిలో ఉన్నట్టు నమోదవుతారు. కేంద్ర ప్రభుత్వ కార్మిక, ఉద్యోగ మంత్రిత్వ శాఖ 2009 నుంచి జరుపుతున్న త్రైమాసిక ఉద్యోగ, నిరుద్యోగ సర్వే ప్రకారం దేశంలో నిరుద్యోగ రేటు 9.4 శాతం అని తెలుస్తోంది గాని ఇది ఎంత విశ్వసనీయమైనదో చెప్పలేం.

## పేదరికం అంచనాలు

ఆరు దశాబ్దాలుగా రాజకీయార్థిక వ్యవస్థను నిర్వహిస్తున్న పాలకులకు ఈ దేశంలో అత్యంత ప్రధాన సమస్య అయిన పేదరికం అంటే ఏమిటో, పేదరికం అనుభవిస్తున్న జనాభా ఎంతో కనిపెట్టడం కూడ సాధ్యం కాలేదు. ఇంతకాలం అధికారంలో ఉండి, దశాబ్దాలకొద్దీ పేదరికం నిర్మూలన, తగ్గింపు కార్యక్రమాలు అమలు చేసి, లక్షల కోట్ల రూపాయల నిధులు వెచ్చించి ఏం సాధించారు అని ఎవరయినా అడిగితే జవాబు చెప్పడానికి ఎప్పటికప్పుడు పేదరికం నిర్వచనాలు మార్చుకుంటూ వచ్చారు. దారిద్ర్యరేఖ నిర్వచనాన్ని మారుస్తూ, దారిద్ర్యరేఖకు దిగువన ఉన్న జనాభా తగ్గిపోతున్నదని బుకాయిస్తూ వచ్చారు. ప్రణాళికా సంఘం తాజాగా మార్చ్ లో విడుదల చేసిన గణాంకాల ప్రకారం పట్టణ ప్రాంతాలలో రోజుకు రు. 28.65, గ్రామీణ ప్రాంతాలలో రోజుకు రు. 22.42 ఖర్చు పెట్టగలిగిన వారందరూ దారిద్ర్యరేఖకు ఎగువన ఉన్నట్టేనన్నారు. అంటే పేదలు కారని ప్రకటించారు. ఈ అంచనాల ప్రకారం 2009-10లో దేశవ్యాప్తంగా పట్టణ పేదరికం 20.9 శాతం అని, గ్రామీణ పేదరికం 33.8 శాతం అని, దేశంలో మొత్తం పేదరికం 29.8 శాతం మాత్రమేనని ప్రకటించారు. యుపిఎ పాలన మొదలయిన సంవత్సరం, 2004-05లో పట్టణ పేదరికం 25.5 శాతం, గ్రామీణ పేదరికం 42 శాతం, మొత్తం పేదరికం 37.2 శాతం ఉండేదని, ఐదు సంవత్సరాలలో పేదరికాన్ని గణనీయంగా తగ్గించామని ప్రగల్భాలు పలికారు. దారిద్ర్యరేఖను ఇలా కిందికి లాగుతూపోతే పేదరికం తగ్గిపోయినట్టు కనబడుతుందని పెద్ద ఎత్తున విమర్శలు చెలరేగాయి. ఆ విమర్శల నేపథ్యంలో ఇటీవల రిజర్వ్ బ్యాంక్ మాజీ గవర్నర్ సి రంగరాజన్ నేతృత్వంలో పేదరికం అంచనాల కోసం మరొక కమిటీ వేశారు. ఈ పని కోసం గత ఆరు దశాబ్దాలలో పదో పదిహేనో కమిటీలు, అధ్యయన బృందాలు ఏర్పాటయ్యాయి. ఇది మరొకటి. పైగా ప్రపంచీకరణను సామ్రాజ్యవాదులకంటె ఎక్కువగా కోరుకునే రంగరాజన్ కచ్చితంగా ప్రపంచీకరణ వల్ల పేదరికం తగ్గిపోయిందని నివేదిక ఇప్పటికే రాసి ఉంటాడు. ఆయన ఆ నివేదికను తొమ్మిది నెలల తర్వాత కేంద్ర ప్రభుత్వానికి, ప్రణాళికా సంఘానికి సమర్పించవలసి ఉంటుంది. సరిగ్గా ఈ పేదరిక కమిటీని నియమించిన పది రోజులకే మహాఘనత వహించిన మాంటెక్ సింగ్ అహ్లువాలియా నాయకత్వంలోని ప్రణాళికా సంఘం కార్యాలయంలో రెండు మరుగుదొడ్ల మరమ్మత్తుకు అక్షరాలా రు. 35 లక్షలు ఖర్చు పెట్టారని బయటపడింది. దేశంలో పేదరికం లేదని తాము చెపుతున్న మాటను వారు అలా మరుగుదొడ్ల మీద రు. 35 లక్షలు ఖర్చుపెట్టి నిరూపించారన్నమాట. కాగా దాదాపు 1200 మంది పనిచేసే ఈ ప్రణాళికా సంఘపు భవనంలో కేవలం 60 మందికి మాత్రమే ఈ మరుగుదొడ్లకు వెళ్లే అనుమతి ఉంది. ఆ అరవై మంది మాత్రమే

ఎలక్ట్రానిక్ ఉపకరణాల ద్వారా ఆ మరుగుదొడ్లకు వెళ్లగలరు. చుట్టూరా భయానకమైన పేదరికం మధ్య బ్రిటిష్ వలసవాదులు ఇటువంటి విలాసాలనే తమకోసం ఏర్పాటు చేసుకుని, తమ మరుగుదొడ్ల మీద 'తెల్లవారికి, కుక్కలకు మాత్రమే' అని రాయించేవారు. ఇప్పుడు ఆ బోర్డులు మాత్రమే లేవు.

## సిఇవోల జీతాలు, శతకోటీశ్వరుల ఆస్తులు

ఒకవైపు నిరుద్యోగం, పేదరికం స్థితి అలా ఉండగా ఇన్ఫర్మేషన్ టెక్నాలజీ, బిజినెస్ ప్రాసెస్ ఔట్ సోర్సింగ్ (బిపిఒ) రంగంలో బహుళజాతి కంపెనీల, దేశంలోని బడా కంపెనీల ఉన్నతోద్యోగుల జీతభత్యాలు అసహ్యకరంగా పెరిగిపోతున్నాయి. ముఖ్య కార్య నిర్వహణాధికారి (చీఫ్ ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్ – సిఇఒ) అనే పదవి కార్పొరేట్ సంస్థలలో అత్యున్నతమైనది, కీలకమైనది. ఆ పదవిలో ఉండేవారికి తమ కంపెనీ ఏ సరుకులను తయారు చేస్తున్నదో, సేవలను అందిస్తున్నదో తెలియనక్కరలేదు. తన కింద పనిచేసే వందలాది, వేలాది సిబ్బంది తయారు చేసే సరుకులను, సేవలను అమ్మడం వస్తే చాలు. దేన్నయినా వ్యాపారం చేయగల సామర్థ్యం ఉంటే చాలు. వ్యాపార నిర్వహణ తెలిస్తే చాలు, వ్యాపార దక్షత, అంటే పోటీదారులను అణగదొక్కడం, సామదానభేదదండోపాయాలు ఉపయోగించి వ్యాపారం వృద్ధి చేయడం వస్తే చాలు. ఆ సిఇఒల జీతభత్యాల గురించి ది ఎకనమిక్ టైమ్స్ ఇటీవల ఒక నివేదిక ప్రచురించింది. దాని ప్రకారం జెన్‌పాక్ట్ సిఇఒ ఎన్‌వి టైగర్ త్యాగరాజన్ వార్షిక జీతం రు. 49 కోట్లు, ఇఎక్స్ఎల్ సర్వీస్ సిఇఒ రోహిత్‌కపూర్ జీతం రు. 14.3 కోట్లు, టాటా కన్సల్టెన్సీ సర్వీసెస్ సిఇఒ చంద్రశేఖరన్ జీతం రు. 8 కోట్లు, ఎచ్‌సిఎల్ టెక్నాలజీస్ సిఇఒ వినీత్ నాయర్ జీతం రు. 7.6 కోట్లు. ఏ పనికి, ఎంత చెమట ఓడిస్తే అంత జీతం ముడుతోంది? అయినా జీవితాంతం కష్టపడినా ఈ జీతాలలో లక్షో వంతు కూడ దక్కని కోట్లాది ప్రజల దుర్భర దారిద్ర్య సముద్రంలో ఈ అంగరంగ వైభోగాల ద్వీపాలు ఎంతకాలం మనగలుగుతాయి? మరొకపక్క అంతర్జాతీయ వాణిజ్య పత్రిక ఫోర్బ్స్ ప్రతి సంవత్సరం ప్రకటించే అగ్రశ్రేణి సంపన్నుల డాలర్ శత కోటీశ్వరుల జాబితాలో ఈ సారి 1226 మంది ఉండగా అందులో 48 మంది భారతీయులు ఉన్నారు. ఆ 48 మంది ఆస్తుల విలువ 194.6 బిలియన్ డాలర్లు (అంటే పది లక్షల డెబ్బై వేల కోట్ల రూపాయల పైన). ఇది దేశ జాతీయోత్పత్తిలో దాదాపు తొమ్మిది శాతం. దేశ సంపదలో పది శాతం యాభై మంది దగ్గర, మరొక నలభై యాభై శాతం మరికొన్ని వందల మంది దగ్గర ఉండి, వంద కోట్ల జనానికి ఇరవై శాతం కూడ దక్కని చోట సామాజిక భద్రతకు అర్థం ఏమిటి?

## భారత్‌లో అమెరికా సైనిక జోక్యం

భారతదేశంలో తమ సైనిక జోక్యం ఉన్నదని, తీవ్రవాద వ్యతిరేక చర్యలలో తాము భారత ప్రభుత్వానికి సహాయం చేస్తున్నామని స్వయంగా అమెరికా అత్యున్నత సైనికాధికారి అన్నాడు. దక్షిణాసియాలో భారత్ తో సహా ఐదు దేశాలలో అమెరికా ప్రత్యేక బలగాలు ఉన్నాయని ఒక అమెరికన్ కాంగ్రెస్ విచారణలో పసిఫిక్ కమాండర్ అడ్మిరల్ రాబర్ట్ విల్లార్డ్ అన్నాడు. అలా బైటికి చెప్పడం పొరపాటు అని గ్రహించి, నాలిక కరుచుకుని, తానలా అనలేదని, పత్రికలు పొరపాటుగా రాశాయని వివరణ ఇచ్చుకున్నాడు.

## సిపిఎం రాజకీయాలు

దేశంలో తానే నిజమైన, పెద్ద వామపక్ష పార్టీనని చెప్పుకునే భారత కమ్యూనిస్టు పార్టీ (మార్క్సిస్టు) లో ఇటీవలి అంతర్గత సమస్యలు దాని నిర్మాణ, రాజకీయ, సైద్ధాంతిక బలహీనతలకు అద్దం పడుతున్నాయి. ఈ నిర్మాణ, రాజకీయ, సైద్ధాంతిక బలహీనతలు ఆ పార్టీ ప్రజాసంఘాల సభ్యులనుంచో, పార్టీలోని సాధారణ శ్రేణులనుంచో కాక అగ్రనాయకత్వం నుంచీ, పార్టీ అధికార ప్రతినిధి వంటి అగ్రశ్రేణి మేధావి నుంచీ రావడం గమనార్హం.

ఢిల్లీ జవహర్‌లాల్ నెహ్రూ విశ్వవిద్యాలయంలో అర్థశాస్త్ర ప్రొఫెసర్‌గా పనిచేసిన ప్రభాత్ పట్నాయక్ నాలుగు దశాబ్దాలుగా సిపిఎం మేధావిగా సుప్రసిద్ధుడు. ఆయన ఇటీవల కేరళలోని కాలికట్‌లో ఒక స్మారకోపన్యాసం ఇవ్వవలసి ఉండింది. కొన్ని నెలల కింద సిపిఎం కార్యకర్తలు అక్కడ ఒక మాజీ సిపిఎం నాయకుడిని హత్య చేశారు. ఆ హత్య విషయం ప్రస్తావిస్తూ, అటువంటి 'హంతక పార్టీ' సదస్సుకు రావడం న్యాయమేనా అని పట్నాయక్ కు కొట్టాయం మహాత్మా గాంధీ విశ్వవిద్యాలయంలో సామాజికశాస్త్రవేత్త కె టి రాంమోహన్ ఒక బహిరంగలేఖ రాశారు. దానికి జవాబుగా పట్నాయక్ 'ఇవాళ దేశంలో కమ్యూనిజం రెండు సవాళ్లను ఎదుర్కొంటోంది. ఒకటి బూర్జువా ఉదారవాదానిది పైచేయి కావడం, రెండు భూస్వామిక స్టాలినిజానికి బలి అయిపోవడం... ప్రత్యామ్నాయంగా స్టాలిన్ ను తొలగించిన (డిస్టాలినైజ్డ్) మార్క్సిజాన్ని ఆచరించవలసి ఉంది' అని రాశారు. ఈ వివాదం మీద హిందూ దినపత్రిక అడిగిన ప్రశ్నకు జవాబిస్తూ 'కేరళ సమాజం మౌలికంగా భూస్వామ్య సమాజం. పార్టీలోని ధోరణులు సమాజంలోని ధోరణులకు ప్రతిఫలనంగానే ఉంటాయి, వేరుగా ఉండవు' అన్నారు. స్టాలినిజం అనే నిందాపూర్వక మాటను, దేశంలో, అందులోనూ కేరళలో భూస్వామ్యం ఉందని ఒప్పుకోని సిపిఎం ఏమంటుందో చూడాలి.

ఆ వివాదం సమసిపోకముందే ఆ పార్టీ కేంద్రస్థాయిలో ఏర్పాటు చేసిన పరిశోధనా కేంద్రానికి కన్వీనర్, పార్టీలో జూనియర్ కరత్‌గా పేరు తెచ్చుకున్న మేధావి, మావోయిజం – ఎ క్రిటిక్ ఫ్రం ది లెఫ్ట్ పుస్తకం సంపాదకుడు ప్రసేన్‌జిత్ బోస్ పార్టీకి రాజీనామా చేశారు. రాష్ట్రపతి అభ్యర్థిగా ప్రణబ్ ముఖర్జీని సమర్థించడాన్ని తప్పు పడుతూ, ఆ చర్య పార్టీ కార్యక్రమాన్ని ఎలా ఉల్లంఘిస్తున్నదో చెపుతూ సుదీర్ఘ బహిరంగ లేఖ రాశారు. అందులో పశ్చిమ బెంగాల్‌లో బలవంతపు భూసేకరణలు, నందిగ్రాంలో పోలీసు కాల్పులు వంటి పొరపాట్లను కూడ ప్రస్తావించారు. పార్టీలో తన ప్రాథమిక సభ్యత్వానికి రాజీనామా చేశారు. పార్టీ ఆయన లేవనెత్తిన సమస్యలకు జవాబు ఇవ్వకుండా రాజీనామాను తిరస్కరిస్తూ, ఆయనను బహిష్కరించింది.

ఆ తర్వాత రెండురోజులకు పార్టీ ప్రధాన కార్యదర్శి ప్రకాశ్ కరత్ తాము ప్రణబ్ ముఖర్జీని ఎందుకు సమర్థిస్తున్నామో వివరిస్తూ ఒక వ్యాసం రశారు. అందులో 'కనీసం సిపిఐ, ఆర్ ఎస్ పి వంటి వామపక్ష పార్టీలలాగ రాష్ట్రపతి ఎన్నికలో వోటు వేయకుండా ఉండే నిర్ణయమైనా తీసుకోవచ్చు గదా' అని ప్రసేన్ జిత్ బోస్ అడిగిన ప్రశ్నకు జవాబుగా 'మమతా బెనర్జీ ఏ అభ్యర్థికీ వోటు వేయవద్దని నిర్ణయం తీసుకున్నారు గనుక, అటువంటి నిర్ణయం తీసుకుంటే ఆమెతో కలిసిపోయినట్టు అవుతుంది గనుక, భిన్నమైన నిర్ణయం తీసుకున్నామ'ని కరత్ వివరించారు. బహుశా మమతా బెనర్జీ సూర్యుడు తూర్పున ఉదయిస్తాడని అంటే, ఆమెతో కలిసిపోకుండా ఉండడానికి సిపిఎం సూర్యుడి దిశ మారుస్తుందేమో! వీ

## స్వీడన్‌కు అసాంజే అప్పగింత

వికీలీక్స్ అధినేత జూలియన్ అసాంజేను స్వీడన్‌కు అప్పగించేందుకు బ్రిటన్ సుప్రీంకోర్టు అనుమతినిచ్చింది. దీంతో తనను స్కాండినేవియాకు పంపాలని అసాంజే రెండు సంవత్సరాలుగా చేస్తున్న న్యాయపోరాటం విఫలమైంది.

## కెనడాలో నిరసనగళం

విద్యార్థుల సమ్మెలు, ఆందోళనలను నిషేధించేందుకు వచ్చిన 78వ నంబర్ బిల్లును రద్దు చేయాలంటూ కెనడాలోని మాంట్రియల్‌లో వందలాది మంది మే 30న నిరసన ప్రదర్శన చేపట్టారు. ఈ ప్రదర్శనలో దాదాపు ఏడు వందల మంది విద్యార్థులు, న్యాయవాదులు, నోటరీలు, న్యాయరంగ నిపుణులు పాల్గొన్నారు. మాంట్రియల్ కోర్టు హౌస్ నుండి ప్రారంభమైన ఈ ప్రదర్శన ప్లేస్ ఎమిలి గమెలిన్ పార్క్ వరకు కొనసాగింది. ఈ చట్టంలో అనేక పదాలకు అస్పష్ట నిర్వచనాలున్నాయని, ఇది పోలీసులకు అసాధారణ అధికారాలను కట్టబెడుతుందని నిరసనకారులు ఆందోళన వ్యక్తం చేశారు. ఈ 78వ నంబర్ బిల్లుతో పాటు ట్యూషన్ ఫీజుల పెంపుదలకు సంబంధించిన బిల్లుపై కూడా నిరసన తెలిపారు.

## బ్రిటన్ రాణి వజ్రోత్సవాలు

బ్రిటన్ రాణి రెండో ఎలిజబెత్ పాలనకు అరవై ఏళ్లు పూర్తయిన సందర్భంగా జూన్ 3న లండన్‌లోని చారిత్రక థేమ్స్ నదిలో వజ్రోత్సవాల వేడుకలు నిర్వహించారు. వెయ్యి పడవలతో నిర్వహించిన ఈ కార్యక్రమంలో ఆమె భర్త ఫిలిప్, ఇతర కుటుంబ సభ్యులతో కలిసి రాజనౌకలో విహరించారు.

## లైబీరియా మాజీ అధ్యక్షుడికి జైలు శిక్ష

లైబీరియా మాజీ అధ్యక్షుడు చార్లెస్ టేలర్‌కు యాభైఏళ్ల జైలు శిక్ష పడింది. సియెర్రా లియోన్‌లో 1991-2001 మధ్య జరిగిన అంతర్యుద్ధంలో తిరుగుబాటుదారులకు ఆయుధాలు అందించడంతో పాటు, వారిని అమానుషకాండకు పురిగొల్పారన్న అభియోగాలపై ఐక్య రాజ్యసమితి ఆధ్వర్యంలోని కోర్టు మే 30న తీర్పు ఇచ్చింది. సియెర్రా లియోన్ అంతర్యుద్ధంలో ఒక లక్షా ఇరవై వేల మంది మరణించారు. తిరుగుబాటు దారులకు ఆయుధాలు అందించినందుకు గాను వారి నుంచి బ్లడ్ డైమండ్స్ (యుద్ధ ప్రాంతంలో తవ్వితీసిన వజ్రాలు)ను ముడుపులుగా తీసుకున్నారని, వారు ఈ క్రమంలో బానిసలపై హత్యలు, అత్యాచారాలకు పాల్పడడంతోపాటు అవయవాలను నరికేయడం, పిల్లల చేత బలవంతంగా పోరాటాలు చేయించడం వంటి దారుణాలకు పాల్పడ్డారని కోర్టు పేర్కొంది.

## నైజీరియాలో విమాన ప్రమాదం

నైజీరియాలో ఆదివారం జూన్ 3న ఘోర విమాన ప్రమాదం సంభవించింది. 193 మంది ప్రయాణికులతో ప్రయాణిస్తున్న విమానం ఒక రెండంతస్తుల భవనంలోకి దూసుకెళ్లడంతో ఈ ప్రమాదం చోటు చేసుకుంది. ఈ ప్రమాదంలో 193 మంది మరణించారు. వారితో పాటు భవనంలోని వారు కూడా మరణించి ఉంటారని కొంత మంది భావిస్తున్నారు.

## లెనిన్‌కు అంత్యక్రియలు!

లెనిన్ మరణించి 88 ఏళ్లు అయింది. కాని ఆయన మృతదేహాన్ని ఇంకా ఖననం చేయలేదు. ఆ మృతదేహం ప్రస్తుతం మాస్కోలోని రెడ్‌స్క్వేర్‌లో ఉన్న ఒక భవనంలో భద్రపరిచారు. లెనిన్ 53 ఏళ్ల వయస్సులో 1924లో మరణించారు. నాటి సోవియట్ నేత స్టాలిన్ ఉత్తర్వుల మేరకు లెనిన్ మృతదేహాన్ని రసాయనాలతో భద్రపరిచారు. ప్రజల కోసం ప్రదర్శన కోసం ఉంచారు. ఇప్పుడు లెనిన్ దేహాన్ని సెయింట్ పీటర్స్‌బర్గ్‌లో ఉన్న తల్లి సమాధి పక్కనే సమాధి చేయనున్నారు.

## ఈజిప్టులో మహిళల ర్యాలీపై దాడి

గత ఏడాది ముబారక్‌కు వ్యతిరేకంగా జరిగిన ఉద్యమంలో కీలకపాత్ర పోషించిన మహిళలకు ముబారక్ ప్రభుత్వ పతనానంతరం సైతం ఇప్పటికీ వివక్షత, అవమానాలు, వేధింపులు, ఎదురవుతున్నాయంటూ మహిళలు భారీ సంఖ్యలో జూన్ 9న కైరో నగరంలో తెహ్రీర్ స్క్వేర్‌లో తలపెట్టిన ర్యాలీపై కొందరు దుండగలు, ముబారక్ అనుచరులు దాడిచేసి, అమానుషంగా వేధించారు. ఈ దాడి మహిళ ఉద్యమస్ఫూర్తికే అవమానమని కొంతమంది వక్తలు వ్యాఖ్యానించారు.

## ఇటలీలో భూకంపం

ఇటలీని భూకంపం మరోసారి మే 29న కుదిపేసి 15 మందిని బలి తీసుకుంది. భారత కాలమానం ప్రకారం సాయంత్రం 4.26 నుంచి 4.31 గంటల మధ్య ప్రకంపనలు చోటుచేసుకున్నాయి. రిక్టర్‌స్కేల్‌పై వీటి తీవ్రత 5.1 నుంచి 5.3 మధ్య నమోదయ్యాయి.

## బాగ్దాద్‌లో ఆత్మాహుతి దాడి

ఇరాక్ రాజధాని బాగ్దాద్‌లో మళ్లీ నెత్తురు చిందింది. జూన్ 4న నగరం నడి వీధిలో జరిగిన ఆత్మాహుతి దాడిలో 25 మంది మృతి చెందగా 65 మందికి పైగా గాయపడ్డారు.

## పాక్‌లో బాంబుపేలి 26 మంది మృతి

పాకిస్తాన్‌లోని వాయవ్య ప్రాంతంలో జూన్ 16న బాంబుపేలుడులో 26 మంది మరణించారు. ఈ ఘటనలో 65 మంది గాయపడ్డారు. లండీ కొటల్ పట్టణంలోని మార్కెట్‌లో ప్రయాణికులను చేరవేసే ట్రక్కులో ఉంచిన బాంబు పేలడంతో ఈ ఘటన జరిగింది.

## గ్రీస్ ప్రధానిగా సమరస్

గ్రీస్ రాజకీయ సంక్షోభ ముడి వీడింది. పార్లమెంటు ఎన్నికల్లో విజయం సాధించిన సంప్రదాయ పార్టీ న్యూ డెమోక్రసీ అధ్యక్షుడు ఆంటోనిస్ సమరస్ (61) జూన్ 20న ప్రధానిగా ప్రమాణం స్వీకారం చేశారు.

## పాకిస్తాన్ ప్రధాని అష్రాఫ్

పాకిస్తాన్ ప్రధాని ఎన్నికపై అనిశ్చితి తొలగి, అధికార పక్షమైన పాకిస్తాన్ పీపుల్స్ పార్టీ (పిపిపి) అభ్యర్థి రజా పర్వేజ్ అష్రాఫ్ కొత్త ప్రధానిగా ఎన్నికయ్యారు. ఆ దేశ అధ్యక్షుడు అసిఫ్ అలీ జర్దారీ అష్రాఫ్ తో జూన్ 21న ప్రమాణ స్వీకారం చేయించారు.

## ఉక్కు కంపెనీ జాతీయీకరణ

వెనిజులాలోని అతిపెద్ద ఉక్కు కంపెనీ సిడెరర్జికా డెల్ టర్బియో ఎస్ఏను జాతీయకరణ ప్రక్రియకు ఆ దేశ అధ్యక్షుడు హ్యుగో చావెజ్ ఆమోద ముద్ర వేశారు. ఈ కంపెనీ కోసం 2.1 కోట్ల డాలర్ల జాతీయ అభివృద్ధి నిధులను, ప్రభుత్వ బ్యాంకుల ద్వారా 29.8 కోట్ల బొలివర్లను విడుదల చేస్తున్నారు. ఇప్పుడు జాతీయం చేసిన ఈ కంపెనీ దేశ గృహనిర్మాణ, మౌలికవసతుల, రోడ్ల నిర్మాణ రంగాలకు అవసరమైన ఉక్కును సరఫరా చేస్తుంది.

## సిరియాలో వరసగా దాడులు

తిరుగుబాటుతో అట్టుడుకుతున్న సిరియాలో జూన్ 6న దారుణ హింసాకాండ జరిగింది. అధ్యక్షుడు అసద్ అనుకూల వర్గం వారు కొందరు సాయుధులు అల్ కుబీర్ అనే గ్రామంపై దాడికి పాల్పడి వంద మందిని ఊచకోత కోశారు. ఈ దాడిలో మహిళలు, చిన్నారులు కూడా ఉన్నారు. అలాగే జూన్ 21న వివిధ ప్రాంతాల్లో ఒకే రోజు జరిగిన దాడిలో 170 మంది మరణించారు. ఈ ఘటనలో 104 మంది పౌరులు, 54 మంది సైనికులు, 10 మందికి పైగా నిరసనకారులు మరణించారు. వీ

## భారత్ బంద్

పెట్రోలు ధర అధిక మొత్తంలో పెంచడానికి నిరసనగా మే 31న ప్రతిపక్షాలు ఎన్.డి.ఎ, వామపక్షాలు దేశవ్యాప్త బంద్ పాటించాయి. అధికార కాంగ్రెస్‌పార్టీ మినహా అన్నీ పార్టీలు బంద్‌కు సహకరించాయి. ఢిల్లీ, కర్ణాటక, మహారాష్ట్ర, బెంగాల్, పంజాబ్, గుజరాత్‌లలో బంద్ ప్రభావం ఎక్కువగా ఉంది. ముంబైలో నిరసన కారులు జరిపిన దాడుల్లో 42 బస్సులు ధ్వంసమయ్యాయి. ఆందోళన కారులు పలుచోట్ల రహదారుల రాకపోకలను అడ్డుకున్నారు. కొన్ని చోట్ల రైల్వే ట్రాకులపై బైఠాయించి రైళ్ల రాకపోకలను అడ్డుకున్నారు. బి.జె.పి పాలిత రాష్ట్రాల్లో బంద్ ప్రభావం అధికంగా ఉంది.

## మళ్లీ మొదలైన ఖలిస్థాన్ ఉద్యమం

పంజాబ్‌లోని స్వర్ణదేవాలయంలో మళ్లీ ప్రత్యేక ఖలిస్థాన్‌ను ఏర్పాటు చేయాలన్న నినాదాలు చేశారు. స్వర్ణదేవాలయంలో పంజాబ్ మిలిటెంట్లపై 'ఆపరేషన్ బ్లూ స్టార్' సైనిక చర్యకు 28 ఏళ్లు పూర్తి అయిన సందర్భంగా సంస్మరణ కార్యక్రమం జరిగింది. 1984లో జరిగిన సైనిక 'ఆపరేషన్ బ్లూ స్టార్' చర్యలో ఖలిస్థాన్ నాయకుడు బింద్రన్‌వాలే, ఆయన అనుచరులు మరణించారు. వారి స్మారక స్థూపం నిర్మించాలని ఆ సమావేశం నిర్ణయించింది. పంజాబ్ ప్రభుత్వం అటువంటి కార్యక్రమాలను అనుమతించడాన్ని వివిధ రాజకీయ పార్టీలు వ్యతిరేకించాయి.

## నూతన ఎన్నికల కమిషనర్

కేంద్ర ఎన్నికల ప్రధాన అధికారిగా ప్రభుత్వం వీరవల్లి సుందరం సంపత్(63)ను నియమించింది. ఎస్.వై ఖురేషి స్థానంలో ఆయన జూన్ 10న 18వ ప్రధాన ఎన్నికల కమిషనర్‌గా పదవీ బాధ్యతలు చేపట్టారు. ఆంధ్రప్రదేశ్ క్యాడర్‌కు చెందిన 1973 బ్యాచ్ ఐ.ఎ.ఎస్ అధికారి. ఆయన ప్రకాశం జిల్లా కలెక్టర్‌గా, జాతీయ గ్రామీణాభివృద్ధి సంస్థ (ఎన్ఐఆర్‌డి) డైరెక్టర్ జనరల్‌గా చేశారు. 2009లో ఎన్నికల కమిషనర్‌గా ఎంపికయ్యారు. నేర చరిత్ర గల వారిని ఎన్నికల్లో పోటీ చేయకుండా నియంత్రించాల్సి ఉందని ఆయన అన్నారు.

## జర్నలిస్ట్ తరుణ్ సెహ్రావత్ మృతి

తరుణ్ సెహ్రావత్ (22) ఫోటో జర్నలిస్ట్ గుర్గావ్‌లోని మెదంటా హాస్పిటల్‌లో చికిత్స పొందుతూ 40 రోజులకు పైగా అనారోగ్యంతో కోమాలోకి వెళ్లిపోయి జూన్ 15న మరణించారు. ఆయన 2007 నుంచి తెహల్కా పత్రికలో పనిచేస్తున్నారు. ఛత్తీస్‌గఢ్‌లోని మావోయిస్టుల ప్రాబల్యం ఉన్న అబూజ్‌మాడ్ ఆదివాసీ ప్రాంతానికి పనిలో భాగంగా తరుణ్, అతనితో పాటు సహ ఉద్యోగి తెహల్కా రిపోర్టర్ తుషా మిట్టల్‌లు కలిసి వెళ్లారు. వారం రోజులు ఆ ప్రాంతంలో ఉన్నారు. ఆ క్రమంలో ఆయన సెరెబ్రల్ మలేరియా, టైఫాయిడ్, జాండిస్‌ల బారిన పడ్డారు. సహ ఉద్యోగి జర్నలిస్టు కూడా అనారోగ్యం పాలై చికిత్స పొందుతున్నారు.

## ఆర్థిక సంక్షోభంలో భారత్

దేశ ఆర్థిక ప్రగతి రోజు రోజుకు దిగజారుతోంది. ఈ విషయాన్ని దేశ ప్రధాని మన్‌మోహన్ సింగ్ కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ సమావేశంలో చెప్పారు. 2011-2012 ఆర్థిక సంవత్సర చివరలో జి.డి.పి. రేటు తొమ్మిదేళ్లనాటి 5.3 శాతం కనిష్ట స్థాయికి పడిపోయిన నేపథ్యంలో ప్రధాని ఈ విషయాలు వెల్లడించారు. నిత్యవసరాల ధరలు రోజు రోజుకి పెరుగుతున్నాయి. ఆర్థిక ప్రగతికి ప్రమాణాలైన సూచికలు పడిపోతున్నాయి.

## భారత్‌లో పెరుగుతున్న అసహజ మరణాలు

భారత దేశంలో జరుగుతున్న మరణాలపై రిజిస్ట్రార్ జనరల్ ఆఫ్ ఇండియా సర్వే నిర్వహించింది. ఈ పరిశోధన ఆధారంగా లండన్ సంస్థ అంచనాలు వేసింది. ఈ ఆత్మహత్యలు ఉత్తరాది రాష్ట్రాలకన్నా దక్షిణాది రాష్ట్రాల్లో 10 రెట్లు ఎక్కువగా ఉన్నట్లు వెల్లడించింది. భారత్‌లో 15-29ఏళ్ల మధ్య యువకులు 14 శాతం మంది యాక్సిడెంట్‌ల కారణంగా మరణిస్తే, 13 శాతం మంది ఆత్మహత్యల వల్ల మరణిస్తున్నారు. ఇదే వయసున్న యువతులు 16 శాతం మంది గర్భస్థ సమస్యల కారణంగా మరణిస్తున్నారు. 14 శాతం మంది యువతులు ఆత్మహత్యలు చేసుకొని మరణిస్తున్నారు. ఆత్మహత్యలు చేసుకున్న వాళ్లలో ఎక్కువ మంది విద్యావంతులేనని తేలింది

## డాక్టర్ల సమ్మె

కేంద్ర ప్రభుత్వం అనుసరిస్తున్న విధానాలకు వ్యతిరేకంగా ఇండియన్ మెడికల్ అసోసియేషన్ (ఐఎంఎ) ఆధ్వర్యంలో జూన్ 25న దేశ వ్యాప్తంగా డాక్టర్లు సమ్మెలో పాల్గొన్నారు. కార్పొరేట్ ఆస్పత్రులు మినహా అన్ని ప్రభుత్వ, ప్రైవేట్ ఆస్పత్రుల్లోని డాక్టర్లు సమ్మెలో పాల్గొన్నారు. ఆస్పత్రుల్లో సాధారణ సేవలను బహిష్కరిస్తూ, అత్యవసర సేవలను కొనసాగించారు. వైద్యరంగ వ్యతిరేక విధానాలను అవలంబిస్తున్న కేంద్ర వైద్యమంత్రి గులాం నబీ ఆజాద్ తన పదవికి రాజీనామా చేయాలని ఐఎంఎ జాతీయ ఫోరం అధ్యక్షుడు డా. ఎన్ అప్పారావు ఈ సందర్భంగా తెలిపారు.

## విషాదం మిగిల్చిన బస్సు ప్రమాదం

శ్రీ కాళేశ్వరి ట్రావెల్స్ ఆంధ్రప్రదేశ్‌కు చెందిన బస్సు జూన్ 16న హైదరాబాద్ నుంచి షిరిడీకి బయలుదేరింది. బస్సు మహారాష్ట్రలోని హుస్నాబాద్ పరిసర ఉమర్గా వద్ద రాత్రి వంతెనపై నుంచి పడి ప్రమాదానికి గురైంది. ఈ కారణంగా 32 మంది చనిపోయారు. గాయపడిన వారిని ఉస్మానాబాద్, షోలాపూర్‌లోని ఆస్పత్రులకు తరలించారు. బస్సు ప్రమాదానికి కారణం రాత్రి 2.40 గంటలకు వేగంగా వెళుతున్న బస్సుకు ఎదురుగా డిసిఎం వ్యాన్ రావడం అక్కడే ఇరుకైన వంతెన ఉండడంతో బస్సు అదుపు తప్పి వంతెనపై నుండి 25 అడుగుల లోపలికి పడిపోయి ఈ ప్రమాదానికి కారణమైంది.

## ఐదోసారి చెస్ చాంపియన్‌గా ఆనంద్

మాస్కోలో జరిగిన ప్రపంచ చెస్ పోటీల్లో భారత గ్రాండ్ మాస్టర్ విశ్వనాథన్ ఆనంద్ వరుసగా నాలుగోసారి, మొత్తంగా ఐదోసార్లు ప్రపంచ చెస్ చాంపియన్ షిప్‌ను గెలుచుకున్నారు. ఇజ్రాయిల్ ఆటగాడు బోరిస్ గెల్ఫాండ్‌తో ఆడి టై బ్రేకర్ మ్యాచ్‌లో 2.5-1.5 పాయింట్లతో గెలిచి టైటిల్‌ను నిలబెట్టుకున్నారు.

## కొనసాగుతున్న పైలట్ల సమ్మె

ఎయిర్ ఇండియా పైలట్ల సమ్మె జూన్ 26కి 49 రోజులకు చేరింది. పైలెట్లు సమ్మె విరమించి విధుల్లోకి చేరాలని పౌర విమానయానశాఖ మంత్రి అజిత్‌సింగ్ జూన్ 25న కోరారు. పైలట్లు అజిత్‌సింగ్ ప్రతిపాదనను తిరస్కరిస్తూ ప్రధాని జోక్యం చేసుకోవాలని డిమాండ్ చేశారు. ఆందోళనలో భాగంగా పదకొండు మంది పైలట్లు జంతర్‌మంతర్ వద్ద జూన్ 26న 48 గంటల నిరాహారదీక్షను ప్రారంభించారు. తొలగించిన 101 మంది పైలెట్లను విధుల్లోకి తీసుకోవాలని డిమాండ్ చేశారు. సమ్మెపై తమ వైఖరిని వచ్చే జూలై 13లోగా తెలపాలని కేంద్రం, ఎయిర్ ఇండియాలకు ఢిల్లీ హైకోర్టు నోటీసులిచ్చింది. వీ

## టాయిలెట్లకు రు. 35 లక్షలు

ప్లానింగ్ కమిషన్ కార్యాలయంలోని రెండు టాయ్‌లెట్లను ఆధునికీకరించడానికి రు. 35 లక్షల ఖర్చు చేశారు. ఈ విషయాన్ని సమాచార హక్కు కార్యకర్త సుభాష్ అగర్వాల్ వెలుగులోకి తెచ్చారు. రెండు టాయ్‌లెట్లకు రు. 35 లక్షలతో మరమ్మతులు చేయించడమే కాకుండా, సీనియర్ అధికారులనే అందులోకి అనుమతించేలా రు.5 లక్షలతో స్మార్ట్ కార్డు వ్యవస్థను ఏర్పాటుచేశారు. గ్రామీణ ప్రాంతాల్లో రోజుకు రు.28, పట్టణాల్లో రోజుకు రు. 32 ఖర్చు చేసేవారు పేదలు కారని నిర్వచించిన ప్రణాళికా సంఘం, రెండు టాయ్‌లెట్ల మరమ్మతులకు రు. 35 లక్షలు ఖర్చుచేసింది. ప్రణాళికా సంఘం ఉపాధ్యక్షుడు మాంటెక్ సింగ్ అహ్లువాలియా గత ఏడాది విదేశాలకు వెళ్లినప్పుడు ఆయన ఒక రోజు ఖర్చు రు. 2 లక్షలు. ప్రణాళికా సంఘానికి దేశ ప్రధాని నేతృత్వం వహిస్తున్నారు. ఒక వైపు అవినీతి అక్రమాలు చేస్తూ మరో వైపు ప్రజాధనాన్ని పాలకులు ఇలాంటి విలాసాలకు వినియోగిస్తున్నారు. దేశంలో ఎంతో మందికి నిలువ నీడ లేక ఫుట్ పాత్‌లపై జీవిస్తున్న పరిస్థితి ఉంది. మన పాలకులు ప్రజలు సృష్టించిన సంపదతో ఇలాంటి విలాసాలు అనుభవిస్తూ, ఇదేంటని ప్రశ్నించిన వారిని అణచివేతకు గురిచేస్తున్నారు. ఈ అరవై ఏళ్లూ తమ అధికారాన్ని నిలుపుకోవడానికి ఏమి చేస్తే బాగుంటుందో అదే చేశారు పాలకులు. ప్రజల జీవితాల్లో మౌలికమైన మార్పు తేలేకపోయారు. గ్రామీణాభివృద్ధి శాఖ మంత్రి జైరాం రమేశ్ మన దేశం అంతరిక్షంలోకి అగ్ని క్షిపణులను వదులుతోంది కానీ, మహిళలు ఇప్పటికీ మల మూత్రాల విసర్జనకు బహిరంగ ప్రదేశాల్లోనే వెళ్లాల్సిన దుస్థితి ఉందని వాపోయారు!

## రణ్‌వీర్ సేన హింసా సంస్కృతి

రణ్‌వీర్ సేన వ్యవస్థాపకుడు బ్రహ్మేశ్వర్ సింగ్‌ను గుర్తుతెలియని వ్యక్తులు జూన్ 1 ఉదయం కాల్చి చంపారు. బీహార్‌లోని భోజ్‌పూర్ జిల్లా కతిర మొహల్లాలో ఈ ఘటన జరిగింది. బ్రహేమశ్వర సింగ్ 22 హత్య కేసుల్లో విచారణను ఎదుర్కొని గత ఏప్రిల్‌లో నిర్దోషిగా జైలు నుంచి విడుదలయ్యారు. 1976లో ప్రైవేట్ సేనల సంస్కృతి (లైట్‌సేన, బ్రహ్మర్షిసేన, సవర్ణ విముక్తిసేన, కువార్‌సేన, గంగాసేన, కిసాన్‌సేన) నేపథ్యంలో 1994లో రణ్‌వీర్ సేన ఆవిర్భవించింది. నక్సలైట్ ఉద్యమాన్ని ఎదుర్కొనేందుకు భోజ్‌పూర్ ప్రాంతంలోని బ్రాహ్మణ భూస్వాములు సాయుధంగా సంఘటితమై రణ్‌వీర్ సేనను ఏర్పాటుచేసుకున్నారు. 1996లో రణ్‌వీర్ సేన లక్ష్మాపూర్ బాథే గ్రామాన్ని చుట్టుముట్టి దళిత వాడపై దాడిచేసి 61 మందిని ఊచకోత కోసింది. 19వ శతాబ్దంలో భూమిహార్ల(భూస్వాముల) హక్కుల కోసం రాజ్‌పుట్‌లతో పోరాడిన సిపాయి రణ్‌వీర్ బాబా పేరు మీద ఈ సేన ఏర్పరచారు. కుల వ్యవస్థ బలంగా ఉన్న బీహార్‌లో ప్రైవేట్ సాయుధ బృందాలదే రాజ్యం. ప్రజలను కులాలుగా, మతాలుగా విభజించి తమ పాలన కోసం వీరిని పావులుగా వాడుకుంటున్న పరిస్థితి చరిత్ర పొడవునా కొనసాగుతూనే ఉంది. అది అగ్రకుల ఆధిపత్యం కొనసాగుతున్న ఏ ప్రాంతంలోనైనా దళితులను ఊచకోతకు గురిచేయడం కావచ్చు, జాతీయ భావన పేరుతో హిందూత్వ శక్తులు గుజరాత్, కొంధమాల్‌లలో ముస్లిం, క్రిస్టియన్ ప్రజలపై జరిపిన హత్యాకాండ కావచ్చు. ఈ క్రమం అంతటిలో హిందూత్వ శక్తులు దళితులను, ఆదివాసీలను పావులుగా వాడుకుంటున్నాయి. బీహార్‌లో అగ్రకుల ఆధిపత్యంతో నలిగిపోతున్న దళితులకు అండగా నిలిచినందుకు నక్సలైట్లనూ, మేము మనుషులమే అని తలెత్తుకున్నందుకు దళితులనూ వెంటాడి రణ్‌వీర్ సేన హత్యలకు పాల్పడింది. ఈ దురాగతాలకు కారణమై, భూస్వాములకు అండగా ఉన్న రణ్‌వీర్ సేన నాయకున్ని రాజ్యం ఏమీచేయలేదు.

## ధాన్యపు రాశులు ఒకవైపు ఆకలి చావులు మరోవైపు

ప్రభుత్వం నిర్లక్ష్యం కారణంగా వందల టన్నుల ఆహార ధాన్యాలు ముక్కిపోతున్నాయి. ఈ మధ్య రాజస్థాన్‌లో కురిసిన వర్షాలకు అక్కడి కోట జిల్లాలోని భారత ఆహార సంస్థ (ఎఫ్.సి.ఐ) గోదాముల్లో రు. 2 కోట్ల విలువయిన ఆహార ధాన్యాలు తడిసి కుళ్లిపోయాయి. దీంతో రైతులు ఆగ్రహించి ఎఫ్.సి.ఐ అధికారులపై కేసు పెట్టారు. ధాన్యాన్ని నిల్వచేయడానికి సరైన వసతులు ఏర్పాటు చేయలేదని, వారి నిర్లక్ష్యం కారణంగానే ధాన్యం కుళ్లిపోయిందని చెప్పారు. ఈ మధ్యనే పంజాబ్, హర్యానా రాష్ట్రాల్లో కూడా పెద్ద ఎత్తున ఆహార ధాన్యాలు తడిసి పాడైపోయాయి. రైతులు కష్టపడి పండించిన ఆహార ధాన్యాలను నిల్వచేయడం కూడా ప్రభుత్వానికి చాతకావడం లేదు. వాటిని నిల్వ చేయడానికి సరిపడా గోదాములు లేక 80 లక్షల టన్నుల ఆహార ధాన్యాలను విడుదల చేయాలని నిర్ణయించింది. రాష్ట్రాలు ప్రజా పంపిణీ వ్యవస్థ కింద ఆరు నెలలకు సరిపోయేలా నిల్వలను ముందుగానే తీసుకోవాలని కేంద్రం ఆదేశించింది. ఎఫ్.సి.ఐ.పై ఒత్తిడి తగ్గించేందుకు రాష్ట్రాల్లో గోడౌన్లను నిర్మించాలని కేంద్రం కోరింది. జూన్ 20న చెన్నైలో జరిగిన 'ఆహార భద్రత – ప్రమాణాలు' అన్న అంశంపై భారత ప్రమాణాల సంస్థ నిర్వహించిన సదస్సులో కేంద్ర ఆహారశాఖ మంత్రి కె.వి. థామస్ మాట్లాడారు. ప్రస్తుత నిల్వల సామర్థ్యం 6.4 కోట్ల టన్నులనీ, జూన్ మొదటి వారానికి ఈ నిల్వలు 8.2 కోట్ల టన్నులకు చేరాయని తెలిపారు. గతంలో గోడౌన్లలో మత్తు పానీయాల సీసాలు క్షేమంగా ఉంటే, బయట బియ్యం బస్తాలు తడిసి ముద్దయ్యాయి. అయినా మన ప్రభుత్వాలకు చీమ కుట్టినట్లయినా లేదు. గోదాముల్లో కుళ్లిపోయిన ధాన్యం బియ్యంగా ప్రజా పంపిణీ వ్యవస్థ ద్వారా ప్రజలకు చేరితే, తినలేక పశువులకు దాణాగా పెడుతున్న పరిస్థితి ఉంది. దేశంలో ఆహార ధాన్యాల నిల్వలు ఉన్నా ఆకలి బాధతో పొట్టచేత పట్టుకొని పేద ప్రజానీకం వలసలుపోయి, ఎంతో మంది అకాల మరణాలపాలవుతున్నారు. ఎంతో మంది పిల్లలు పోషకాహార లేమి కారణంగా అనారోగ్యానికి గురవుతున్నారు. రైతులు మట్టిలో మట్టై కష్టపడి పండించిన ధాన్యానికి నీడ కల్పించలేని అధికార యంత్రాంగం, పాలకులు ప్రజల సొమ్మును అక్రమంగా కొల్లగొట్టి తమ స్వంత భవనాలను మాత్రం ఆకాశమే హద్దుగా నిర్మిస్తున్నారు.

వార్త – వ్యాఖ్య : వై. రామచంద్రం

# అసహజ మరణాల సూచి

సంకలనం : రాంకి, వై. రామచంద్రం

మరణం ఎప్పుడయినా విషాద సూచకమే. మృతుల బంధువులకూ, మిత్రులకూ విచారకరమే కాని అందులోనూ మరణించిన మనిషి నిండు జీవితం గడిపి వయోభారంతోనే మరణిస్తే దాన్ని సహజ మరణంగా అంగీకరించి ఊరట పడవచ్చు. సగటు ఆయు ప్రమాణంలో సగం కూడా అనుభవించక ముందే మరణిస్తున్నారు. ఈ అసహజ మరణాలకు లెక్కలేనన్ని ఆర్థిక, సామాజిక, రాజకీయ కారణాలున్నాయి. మన పక్కనే మనతోనే ఉండే మనుషులు అర్థాంతరంగా అసహజంగా అకాలంగా అదృశ్యమైపోతున్నారు. ఇటువంటి అసహజ మరణాలు ఇటీవలి కాలంలో విపరీతంగా పెరిగిపోతున్నాయి. ఇవి సామాజిక సంక్షోభానికి, సమాజం దిగజారుడుకు ఒక చిహ్నం. మన రాష్ట్రంలో సాలీనా ఈ రకంగా చనిపోతున్న వారి సంఖ్య వేలల్లోనే ఉంటుందని అంచనా. నిజానికి అసహజ మరణాలన్నీ అసహజ మరణాలుగా నమోదు కావడం లేదు గనుక ఈ సంఖ్య వాస్తవంలో ఒక భాగం మాత్రమే కావచ్చు. పత్రికలలో అచ్చయిన ఇటువంటి ఘటనలన్నిటినీ ఒక్కచోట నమోదు చేయాలని భావిస్తున్నాం. ఈ శీర్షిక ప్రతి నెల ఉంటుంది. అయితే రాష్ట్రంలో ప్రతి గ్రామంలో జరుగుతున్న సంఘటనలన్నీ ఇక్కడ రిపోర్ట్ కాకపోవచ్చు. కొన్నయినా మనల్ని ఆలోచింపజేస్తే, మనం మనచుట్టూ ఉన్న మనుషులకోసం ఇంకాస్త బాధ్యతగాను, జాగ్రత్తగాను వ్యవహరిస్తూ మొత్తంగా పరిష్కారాలవైపు వెళ్లడానికి ఏమయినా తోడ్పడితే ఈ శీర్షిక విజయవంతమైనట్లే.

**(1 మే నుండి 31 మే 2012 వరకు 22 జిల్లాలలో అసహజ మరణాల పాలైన వారి సంఖ్య – 2366)**

| జిల్లా | ఆకలి | ఆత్మహత్యలు | | | | చికిత్స అందక, అనారోగ్యం | | | గుర్తు తెలియని | | హత్యలు | | ప్రమాదాలు | | | | పోలీసు కాల్పుల్లో | | పోలీసులు, సైన్యం | మిస్సింగ్/ లాకప్ మరణాలు | ప్రకృతి వైపరీత్యాలు |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | | వ్యవసాయ రంగం | చేనేత రంగం | ఇతరాలు స్త్రీ | ఇతరాలు పు. | స్త్రీ | పు. | పి. | స్త్రీ | పు. | స్త్రీ | పు. | పనిచేసే స్థలంలో | కరెంట్ | రహదారి | ఇతరాలు | ఉద్యమ కారులు | ఇతరులు | | | |
| (1) | (2) | (3) | (4) | (5) | (6) | (7) | (8) | (9) | (10) | (11) | (12) | (13) | (14) | (15) | (16) | (17) | (18) | (19) | (20) | (21) | (22) |
| ఆదిలాబాద్ | – | 2 | – | 24 | 23 | 5 | 4 | 3 | 2 | 2 | 3 | 4 | 2 | 4 | 19 | 27 | – | – | – | 2 | 4 |
| హైదరాబాద్ | – | – | – | 8 | 8 | 1 | – | – | 2 | 3 | 4 | 3 | – | – | 31 | 11 | – | – | – | 7 | – |
| కరీంనగర్ | 2 | 8 | 2 | 18 | 28 | 5 | 19 | 4 | – | 7 | 2 | 10 | 1 | 12 | 36 | 24 | – | – | – | – | 49 |
| ఖమ్మం | – | – | – | 12 | 9 | 5 | 10 | – | 1 | 3 | 6 | 10 | 4 | 7 | 27 | 7 | – | 2 | – | – | 54 |
| మహబూబ్‌నగర్ | – | 8 | – | 24 | 25 | 3 | 5 | 4 | 4 | 10 | 8 | 8 | 14 | 13 | 58 | 11 | – | – | – | – | 3 |
| మెదక్ | – | 5 | – | 8 | 9 | 3 | 5 | – | – | 3 | 3 | 5 | 2 | 8 | 46 | 10 | – | – | – | – | 7 |
| నల్గొండ | – | 1 | 1 | 12 | 20 | – | – | 2 | 2 | 5 | 1 | 3 | 1 | 9 | 61 | 18 | – | – | – | 6 | 99 |
| నిజామాబాద్ | – | – | – | 6 | 15 | 5 | – | – | – | 2 | 4 | – | 3 | 3 | 30 | 27 | – | – | – | – | 7 |
| రంగారెడ్డి | – | 7 | – | 15 | 20 | 11 | 15 | 4 | 3 | 12 | 6 | 7 | 4 | 10 | 45 | 9 | – | – | – | – | 9 |
| వరంగల్ | – | 6 | – | 9 | 8 | 13 | 9 | 4 | – | 2 | – | – | 1 | 7 | 14 | 9 | – | – | – | – | 4 |
| చిత్తూరు | – | – | – | – | – | 2 | 6 | – | – | – | 4 | 4 | 9 | 4 | 32 | – | – | – | – | – | 2 |
| అనంతపూర్ | – | 3 | – | 7 | 11 | 1 | 1 | 1 | 1 | 2 | 2 | 8 | 4 | 4 | 23 | 6 | – | – | – | – | – |
| కర్నూలు | – | 4 | – | 11 | 8 | 3 | 5 | 4 | 7 | 9 | 3 | 4 | 6 | 4 | 25 | 29 | – | – | – | – | 3 |
| తూర్పు గోదావరి | – | 3 | – | 5 | 4 | 4 | 5 | – | – | – | 2 | 6 | 2 | 3 | 44 | 2 | – | – | – | – | 20 |
| పశ్చిమ గోదావరి | 1 | – | – | 10 | 11 | 4 | 10 | 1 | – | – | 4 | – | – | 2 | 29 | 7 | – | – | – | – | 5 |
| క్రిష్ణా | 1 | – | – | 1 | 6 | – | 2 | – | 1 | 1 | 5 | 3 | 1 | 6 | 17 | 7 | – | – | – | – | 15 |
| పశ్చిమ గోదావరి | 1 | – | – | 10 | 11 | 4 | 10 | 1 | – | – | 4 | – | – | 2 | 29 | 7 | – | – | – | – | 5 |
| గుంటూరు | – | – | – | 4 | 4 | 3 | 3 | 1 | – | – | 6 | 7 | 2 | 4 | 20 | 7 | – | – | – | – | 5 |
| కడప | – | – | 1 | 5 | 2 | 1 | 2 | 1 | – | – | 7 | 6 | – | 3 | 37 | 5 | – | – | – | – | 1 |
| నెల్లూరు | – | – | – | – | 1 | – | – | – | 1 | 2 | – | – | – | 2 | 28 | 8 | – | – | – | – | – |
| విశాఖపట్నం | – | – | – | 9 | 10 | – | 2 | – | 1 | 4 | 1 | 1 | 8 | 15 | 16 | 28 | 2 | – | – | 2 | – |
| విజయనగరం | – | – | – | 4 | 5 | 1 | 3 | 2 | 4 | 3 | 1 | 2 | – | – | 25 | 10 | – | – | – | – | 2 |
| **మొత్తం** | **4** | **47** | **4** | **195** | **219** | **71** | **109** | **31** | **29** | **70** | **72** | **91** | **65** | **123** | **682** | **267** | **21** | **2** | **–** | **17** | **294** |

# వీక్షణంకు చేయూతనివ్వండి...

మీ ఆదరాభిమానాలతో పదో సంవత్సరంలో అడుగుపెట్టిన వీక్షణం మీరు మరింత సహాయం అందించకపోతే ఎక్కువకాలం నడవడం కష్టం...

ఔను, వీక్షణం నష్టాలతో నడుస్తున్నదని, ఉత్పత్తి వ్యయం కూడ తిరిగి రావడం లేదని, ఆర్థిక పరిస్థితి నానాటికీ క్షీణిస్తున్నదని గత కొంతకాలంగా చెపుతూనే ఉన్నాం. అది ఇంకా విషమించింది. వీక్షణం నాలుగు కాలాల పాటు సజావుగా నడవడానికి ఇప్పటికే వందలాది మంది అభిమానులు తమ శాయశక్తులా ప్రయత్నిస్తున్నప్పటికీ, ఆ సహాయం చాలడం లేదు. సహాయం ఇతోధికంగా పెరగకపోతే వీక్షణం ఎక్కువకాలం మనగలగడం కష్టం.

వీక్షణం మీ పత్రిక. ప్రజల పత్రిక. ప్రజలకు అవసరమైన పత్రిక. ఇది ఆగిపోకుండా కాపాడండి.

❖ ప్రతి పాఠకుడూ/పాఠకురాలూ కనీసం మరొకరికి వీక్షణాన్ని పరిచయం చేయండి.

❖ ప్రతి చందాదారూ కనీసం మరొకరిని చందాదారుగా చేర్పించండి.

❖ మీకు తెలిసిన కళాశాలలు, కార్యాలయాలు, గ్రంథాలయాలు, ప్రజా సంస్థలు వీక్షణంను తెప్పించేలా చూడండి.

❖ మీ గ్రామంలో, పట్టణంలో న్యూస్ ఏజెంట్ దగ్గర వీక్షణం అమ్మేలా చూడండి

**ఇవన్నీ వీక్షణం ప్రచురిస్తున్న భావాలు ప్రచారం చేయడానికి. కాని వీక్షణం ఆర్థిక పరిపుష్టికి అవి మాత్రమే సరిపోవు. విరాళాలు, వ్యాపార, ప్రచార ప్రకటనలు వంటి ఆర్థిక సహాయం లేకుండా పత్రికలేవీ మనుగడ సాగించలేవు. వీక్షణంకు మీకు తెలిసిన వ్యక్తులనుంచీ, సంస్థల నుంచీ విరాళాలూ, ప్రకటనలూ సంపాదించండి. కళాశాలలు, వైద్యశాలలు, ఆస్పత్రులు, దుకాణాలు, వ్యాపార, పారిశ్రామిక సంస్థలు, గ్రామ స్థాయి నుంచి రాష్ట్ర స్థాయి దాకా పాలక సంస్థలు, దాతలు... సంస్థల బాధ్యులు, వ్యక్తులు ఎవరి నుంచి ఐనా సరే...**

❖ జీవిత చందాలు, కానుకగా చందాలు, విరాళాలు సేకరించండి.

❖ ప్రకటనలు సేకరించండి.

**ప్రతినెలా కనీసం మూడు పేజీల ప్రకటనలు ఉంటేనే వీక్షణం ఆర్థిక స్థితి ఏ నెలకానెల అన్నట్టు సాగుతుంది. తెలుగు సమాజం తనతో తాను జరుపుకుంటున్న సంభాషణ ఆగిపోకుండా మీ వంతు సాయం చేయండి.**

మీ సహకారం అందించాల్సిన చిరునామా :


**వీక్షణం**

మైత్రి రెసిడెన్సీ, 3-6-394, స్ట్రీట్ నెం. 3 హిమాయత్‌నగర్

హైదరాబాద్ - 500 029. ఫాక్స్, ఫోన్ : 040-66843495

ఇమెయిల్ : veekshanam2003@gmail.com, www.veekshanam.wordpress.com

VEEKSHANAM Telugu Monthly Journal of Political Economy and Society - 132 - July 2012 • ISSN 2231-6892
• RNI Regn.No.APTEL/2003/11482 • Published on 27/06/2012 • Postal Regn. No. L II/RNP/HD/1100/2011-13

# అందరికీ ఆహ్వానం!

## వీక్షణం దశాబ్ది ప్రత్యేక సంచిక రూపకల్పనలో పాలుపంచుకోండి

*2012 డిసెంబర్ సంచికతో వీక్షణం పది సంవత్సరాలు పూర్తి చేసుకుంటుంది. తెలుగునాట ఇంతకాలం నిరాటంకంగా, నవనవోన్మేషంగా నడిచిన ప్రజాపక్ష రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక మరొకటి లేదు. ఈ పదికాలాల వీక్షణం సఫలజీవనం సంపూర్ణంగా పాఠకుల, అభిమానుల, రచయితల, శ్రేయోభిలాషుల ఆదరణవల్లనే సాధ్యమయింది. పదికాలాలపాటు సజావుగా నడిచిన వీక్షణంను మరొక పదికాలాలపాటు నిలవడానికి, మరింత ప్రజా ప్రయోజనకరంగా నడపడానికి దిశానిర్దేశం చేసుకుని పునరంకితం కావలసిన సమయం ఆసన్నమవుతోంది. ఈ సమయంలో వెలువడే రెండో దశాబ్ది ప్రారంభ సంచిక, 2013 జనవరి సంచికను చిరకాలం దాచి ఉంచుకోదగిన ప్రత్యేక సంచికగా రూపొందించాలని ఆలోచిస్తున్నాం. వీక్షణం పాఠకులు, అభిమానులు, రచయితల నుంచి మా ఆలోచనలను పరిపుష్టం చేసే సలహాలు, సూచనలు కోరుతున్నాం. ప్రత్యేకంగా ఈ సంచిక తయారీ కోసమే ఏర్పాటవుతున్న కీలకమైన రచయితల, పాఠకుల సమావేశానికి వీక్షణం పాఠకులు, రచయితలు, అభిమానులు అందరినీ ఆహ్వానిస్తున్నాం.*

*ఇప్పటిదాకా వీక్షణం అభివృద్ధిలో ప్రతి అడుగులోనూ మీ సహాయ సహకారాలు ఉన్నాయి. ఇకముందు కూడ అలాగే మీ ఇతోధిక సహాయ సహకారాలు ఉంటాయని ఆశిస్తున్నాం.*

*స్థలం : **ఎమెస్కో సమావేశ మందిరం,** సాధురాం కంటి ఆసుపత్రి పక్కన, లిబర్టీ చౌరస్తా, దోమల్‌గూడ, హైదరాబాద్.*

*సమయం : జూలై 8, 2012, ఆదివారం, ఉదయం 10 గంటల నుంచి (భోజనం ఏర్పాటు ఉంది)*

**- సంపాదకవర్గం**

*వివరాలకు : 040 66843495 (ఉదయం 10 నుంచి సాయంత్రం 5 వరకు)*
Email : veekshanam2003@gmail.com

Edited, printed, published and owned by N. Venugopal Rao, Printed at Deccan Press for Charitha Impressions, Azamabad, Hyderabad - 500 020 and Published at 3-6-394, Mythri Residency, Street No. 3, Himayatnagar, Hyderabad 500 029. Editor : N. Venugopal Rao